# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

సంపుటి : 9 సంచిక : 3 హైదరాబాద్ 116 మార్చ్ 2011 పేజీలు : 68 రు. 15

* ఫోకస్ : అరబ్ ప్రజా ఉద్యమాల వెల్లువ
* మహిళా దినోత్సవం - మూడు వ్యాసాలు
* ధ్వంసమవుతున్న కరీంనగర్ గుట్టలు
* ఫీజు రీయింబర్స్‌మెంట్ విద్యార్థుల కోసమా?
* తెలంగాణలో సహాయ నిరాకరణ
* కన్నీరొలుకుతున్న సముద్ర తీరం
* జ్యోతిష్యం శాస్త్ర విజ్ఞానమట!

# వీక్షణం రచయితల సమావేశం, 30 జనవరి 2011



| | | | |
|---|---|---|---|
| ఎడమ నుండి కుడి | మొదటి వరుస | : | వి. హనుమంతరావు, వకుళాభరణం రామకృష్ణ, ఎ. నర్సింహారెడ్డి, ఘంటా చక్రపాణి, పి. శివలక్ష్మి |
| | రెండవ వరస | : | కాకరాల, ఎం. రాఘవాచారి, చిమ్మె జాన్ బర్నబాస్, చలసాని శ్రీనివాస్, బి. అంజమ్మ |
| | మూడవ వరస | : | వై. వేణుగోపాల్ రెడ్డి, పి. ప్రసాద్, మొహమ్మద్ ఇక్బాల్, ఎనిశెట్టి శంకర్, ఎస్. సరళావందనం |
| | నాల్గవ వరస | : | కె. లక్ష్మీనారాయణ, వి. వంశీచరణ్, వి. చలపతిరావు, ఎం. విద్యాభూషణ్, ఎస్. నీలాదేవి |
| | ఐదవ వరస | : | టి. రమేష్, కె. రాంరెడ్డి, ఎం. సురేష్, డి. వెంకట్‌రావు, కె. కనకయ్య |
| | ఆరవ వరస | : | ఎన్. భగవాన్ రెడ్డి, ఎ. కుమార్, జి. వెంకటేశ్వర్లు, సి.ఎచ్. శ్రీమన్నారాయణ, డి.విజయభాస్కర్ |

116

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

సమతా పబ్లికేషన్స్, సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రిసర్చ్ అండ్ కమ్యూనికేషన్ ప్రచురణ

మార్చ్ 2011
సంపుటి : 9
సంచిక : 3

గౌరవ సంపాదకులు : వి. హనుమంతరావు
సంపాదకులు : ఎన్. వేణుగోపాల్
సహాయ సంపాదకులు : డి.వి.రామకృష్ణారావు
కరస్పాండెంట్ / సర్క్యులేషన్ మేనేజర్ : వై. రామచంద్రం
కరస్పాండెంట్/సబ్ఎడిటర్ : సి. రాజశేఖర్
ఆఫీస్ అసిస్టెంట్ : ఎస్. వెంకటేష్

## లోపలి పేజీల్లో...



'వీక్షణం'లో అచ్చవుతున్న రచనలలో వ్యక్తమైన అభిప్రాయాలన్నిటితో సంపాదకులకు ఏకీభావం ఉండనవసరం లేదు. 'వీక్షణం'ను నిజమైన ప్రజాపక్ష రాజకీయార్థిక, సామాజిక విశ్లేషణా వేదికగా తీర్చిదిద్దడంలో అన్నిరకాల అభిప్రాయాలకు, భిన్నాభిప్రాయాల ఛాయలకు స్థానం కల్పించాలని సంపాదక వర్గం భావిస్తోంది.

ప్రింటర్స్
డక్కన్ ప్రెస్ / చరితా ఇంప్రెషన్స్
ఆజామాబాద్, హైదరాబాద్
ఫోన్ : 040 - 27678411

డిస్ట్రిబ్యూటర్స్
ఆనంద్ ఏజన్సీస్
హైదరాబాద్
ఫోన్ : 98484 28516
92468 26191

'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు, చెక్కులు, డి.డి లు పంపాల్సిన చిరునామా
వీక్షణం
మైత్రి రెసిడెన్సీ, 3-6-394,
స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029.
ఫాక్స్, ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

**వీక్షణం చందా వివరాలు**

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు | విద్యార్థులకు |
|---|---|---|---|
| విడి ప్రతి | రు. 15 | రు. 15 | రు. 15 |
| సంవత్సరం | రు. 180 | రు. 150 | రు. 120 |
| మూడు సంవత్సరాలు | రు. 500 | రు. 400 | రు. 350 |
| ఐదు సంవత్సరాలు | రు. 800 | రు. 650 | - |
| పది సంవత్సరాలు | రు. 1500 | రు. 1300 | - |

వీక్షణం అకౌంట్ నెంబర్ - **013911011002175**
ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్

వీక్షణం రచయితల సమావేశానికి రాలేకపోయినందుకు చింతిస్తున్నాను. బాగా జరిగిందని అనుకుంటా. పత్రికను నిబద్ధతతో ప్రయోజనకరంగా నిర్వహిస్తున్నందుకు అభినందనలు.

**– కొండుభట్ల రామచంద్రమూర్తి**
ప్రధాన సంపాదకులు – ఎచ్.ఎం.టి.వి., సికింద్రాబాద్

వీక్షణం జనవరి 2011లో వచ్చిన 'వనరులు, ప్రజలు...' వ్యాసం ప్రపంచీకరణ పేరుతో జరుగుతున్న మోసం గురించి ఆలోచించవలసిన అవసరాన్ని మరోసారి గుర్తు చేసింది. ప్రపంచ ఆహార, వ్యవసాయ సంస్థ (ఫుడ్ అండ్ అగ్రికల్చర్ ఆర్గనైజేషన్) అంచనాల ప్రకారం (హంగర్ ఆన్ ది రైజ్, 2008) భారతదేశంలో 1992–2007 నడుమ రెండు కోట్ల మంది చాలినంత తిండిలేని వారి జాబితాలో కొత్తగా చేరారు. అలాగే 2003–08 నడుమ రిజర్వ్ బ్యాంక్ అంచనాల ప్రకారం స్థూల జాతీయ ఉత్పత్తి 8.8 శాతం పెరిగింది. అంటే మార్కెట్ విధానాల ఎదుగుదలకు – సామాన్య ప్రజల అవసరాలకు పొంతన లేదన్నది స్పష్టం. సప్లై – డిమాండ్‌లను కలిపే మార్కెట్ అదృశ్యహస్తం కొనుగోలు శక్తి ఉన్న డిమాండ్ (ఎఫెక్టివ్ డిమాండ్) అవసరాలు తీర్చగలదేమోగాని, కొనుగోలు శక్తి లేని డిమాండ్‌ను తీర్చదు. అందుకనే దేశంలో తిండి, చదువు, ఉద్యోగం, ఉపాధి, మౌలిక సదుపాయాల (తాగునీరు, మరుగుదొడ్లు, రోడ్లు వంటివి) కొరకు ఎంత 'డిమాండ్' ఉన్నా, వాటి వెనుక 'కొనుగోలు శక్తి' లేకపోతే ఉనికిలో లేనట్లే. దేశంలో అందరికీ చదువు, రక్షిత నీళ్లు అందించే 'మార్కెట్' లేదుగాని, ఒక్కొక్కటి రు. 60–70 లక్షలు ఖరీదు చేసే కార్ల మార్కెట్ మాత్రం ఉంది. విద్య, వైద్యం ఇప్పటికే మార్కెట్ చేతిలోకి వెళ్లాయి. ఇక వ్యవసాయం కూడా మూడు, నాలుగు గుత్త సంస్థల చేతుల్లో ఉన్న మార్కెట్‌కు వదిలేస్తే, రైతుల దివాళా, ఆహార ధాన్యాల కొరత ఎలా ఉంటుందో తెలుసుకోవాలంటే మొక్కజొన్న పండించే మెక్సికో, వరి పండించే ఫిలిప్పీన్స్ దేశాల అనుభవాలు చూస్తే చాలు. భారతదేశం వంటి దేశాల్లో విద్యావంతులు కలగజేసుకుంటే గాని సమస్యలు గుర్తింపులోకి రావు. దూరంలోలేని ప్రమాదాన్ని గుర్తించి ఉద్యమించవలసిన అవసరం మన ముందు ఎంతైనా ఉంది.

**– కె. నరేంద్రమోహన్**
మెల్బోర్న్, ఆస్ట్రేలియా

వీక్షణం ఫిబ్రవరి సంచికలో శ్రీకృష్ణ కమిటీ నివేదికకు సంబంధించి ఐదు వ్యాసాలు వివిధ కోణాలలో ప్రచురించబడ్డాయి. మాడభూషి శ్రీధర్ అన్నట్లు అది దుగ్గల్ కమిటే. అందరి దృష్టిలో రాష్ట్రం అంటే మూడు ప్రాంతాలు. అవి కోస్తా ఆంధ్ర, తెలంగాణ, రాయలసీమ. దశాబ్దాల తరబడిన వెనుకబాటుతనంతో వలసలు పోతున్న ఉత్తరాంధ్ర గురించి ఎవరు మాట్లాడరు. ఉత్తరాంధ్ర రాష్ట్రీయ సమితి సుదీర్ఘ నివేదికతో పాటు 15 సంఘాలు తమ నివేదికలు శ్రీకృష్ణ కమిటీకి అందజేసిన వాళ్ల డాక్యుమెంట్‌లో రికార్డు చేసారు, గానీ ఏరకమైన సూచనలు చేయలేదు. ఆరు సూచనలలో ఉత్తరాంధ్ర ప్రసక్తి లేదు. వ్యాసకర్తలూ విస్మరించారు. 'మనువాద రాజ్యస్థాపనే హిందుత్వ ఉగ్రవాదం' వ్యాసంతో పాటు మిగిలిన వ్యాసాలు బాగున్నాయి.

**– తుంపాల శ్రీరామమూర్తి**
గాజువాక, విశాఖపట్నం

వీక్షణం వీక్షిస్తోంది. సమాజంలో అన్ని వర్గాల జీవన చిత్రికలను, సామాజిక, రాజకీయ, ఆర్థిక చైతన్య కదలికలను వీక్షిస్తోంది. దాంతోపాటు అక్షర రూపంలో తన ప్రియి పాఠకులకు అందిస్తోంది. చరిత్ర, నడుస్తున్న చరిత్ర, వర్తమానంపై చరిత్ర ప్రభావం, ఇలా నాలుగు గోడల మధ్య ఉన్న సామాన్య పాఠకునికి, ప్రపంచ గమనాన్ని, ఆ గమనానికి కారణమయిన కారణాలను అక్షర రూపంలో కళ్లకు కడుతోంది. గత సంచికలో ప్రచురితమైన ప్రతి వ్యాసం, ప్రతి అక్షరం అమూల్యం. అన్ని వర్గాల మేళవింపుతో ఆడంబరమైన చిత్రాలతో అసలు విషయాన్నే మరచిన నేటి బ్లాక్ జర్నలిజంలో, వీక్షణం అరుదైన పత్రిక. ఈ వీక్షణానికి ప్రజాదరణే నేత్రాలు కాబట్టి ఈ విలువైన వీక్షణాన్ని కాపాడుకొందాం.

**– పసునూరి మధూకర్**
సూర్యాపేట్, నల్లగొండ

నేను మైసూరు జైలు నుండి ఈ పత్రం రాస్తున్నాను. ఈ మాదరి ఇక్కడ ఫ్రెండ్ జి.ఎం. కృష్ణ అనేవారికి మీ వీక్షణం పత్రిక వచ్చింది. మా అందరికీ రాజకీయంగా చాలా అనుకూలంగా అయింది. మేం జైలుకి వచ్చిన తరువాత తెలుగు చదవడం నేర్చుకున్నాం. మీ వీక్షణం కూడా దాంట్లో చాలా హెల్ప్ అయింది. ఇప్పుడు జైలులో వీక్షణం చదివేవాళ్లు 5–6 మంది ఉన్నాం. మా జైలు అడ్రస్‌కు ఒక కాపీ పంపిస్తే చాలా అనుకూలంగా ఉంటుంది. మీరు పంపిస్తారనే ఆశయంతో పత్రం ముగిస్తాను.

**– దేవేంద్ర**
కేంద్ర కారాగారం, మైసూరు

'కుల సమస్య సారాంశంలో వర్గ సమస్యే' వ్యాసం బాగుంది. స్పష్టతను ఇచ్చింది. రచయితకు అభినందనలు.

**– గీతాంజలి**
హైదరాబాద్

సివిల్స్ వంటి పోటీ పరీక్షలకు సన్నద్ధమవుతున్న నేను సమకాలీన అంశాలపై పట్టు సాధించేందుకు, సరియైన దృక్పథాన్ని అలవర్చుకునేందుకు చాలా శ్రమించాను. ఆ లోటులన్నింటినీ వీక్షణం తీర్చిందని తెలియజేయడానికి ఆనందిస్తున్నాను. విలువైన ఆర్టికల్స్‌ని అందిస్తూ మిగతా మాస పత్రికలకు భిన్నంగా అందరికీ ఉపయోగపడేలా ముందుకు సాగాలని ఆశిస్తున్నాను.

**– పగుడాల సుభాష్ యాదవ్**
చిన్నారెడ్డిగూడ, మంచాల, రంగారెడ్డి

వీక్షణం ఫిబ్రవరి సంచికలో 'నిజమైన ప్రజల మనిషి కన్నబిరాన్' గురించి రాసిన వ్యాసంలో మనిషి కోసం, మనిషి హక్కుల కోసం కన్నబిరాన్ తపనను, వారిలోని మానవీయ కోణాన్ని, విలువల్ని సవివరంగా అందించారు. అభినందనలు. 'బినాయక్ సేన్‌కు శిక్ష దేనికి సంకేతం?'లో బర్నబాస్ న్యాయవ్యవస్థలోని అవినీతి కోణాల్ని ఎత్తిచూపారు. డా. సేన్ లక్షల మంది అనాథలకు ఆరోగ్య ప్రదాతగా, మరోవైపు పౌరహక్కుల సంస్థకు జాతీయ స్థాయిలో సేవలందిస్తూ నిరుపమానమైన సేవలందించారు. ఫైజ్ అహ్మద్ ఫైజ్ కవితలోని వాక్యాలన్ని స్ఫూర్తిదాయకంగా ఉన్నాయి. ప్రముఖ ఆర్థికవేత్త నోబెల్ బహుమతి గ్రహీత అమర్త్యసేన్‌తో పాటు 40 మంది నోబెల్ బహుమతి విజేతలు సేన్‌కు బెయిల్‌పై విడుదల చేయమని ప్రభుత్వాన్ని రాతపూర్వకంగా విన్నవించినప్పటికీ ఇంకా డా. సేన్ బెయిల్‌పై విడుదల కాకపోవడం శోచనీయం. ప్రభుత్వ చర్య అప్రజాస్వామికమే కాదు అమానుషం కూడా. ఇప్పటికైనా ప్రభుత్వం తన తప్పును తెలుసుకొని డా. సేన్‌కు వెంటనే విడుదల చేయాలని మనమందరం కలిసికట్టుగా మాట్లాడుదాం.

**– పి. నారాయణరెడ్డి**
నాగార్జునసాగర్

ఫిబ్రవరి 2011 వీక్షణంలో కన్నబిరాన్ గురించి అనేక విషయాలను తెల్సుకోవడం జరిగింది. రాజ్యాంగం పౌరులకు కల్పించిన హక్కులను, రాజ్యం కాలరాసినప్పుడు న్యాయస్థానాల ద్వారా అట్టి హక్కులను నిలబెట్టిన పౌరహక్కుల నేత కన్నబిరాన్. రాజ్యహింసను వ్యతిరేకిస్తూ నిరంతరం రాజ్యంలో ప్రజల తరఫున పోరాడిన వ్యక్తిగా కన్నబిరాన్‌ను చూడవచ్చును. పేదలకు న్యాయ సహాయం అందించడంలో ఆయన సల్పిన కృషి పలువురు న్యాయవాదులకు మార్గదర్శకం కాగలదు. ఆయన ఆశయాలను ముందుకు తీసుకుపోవడమే తక్షణం మన ముందున్న కర్తవ్యంగా భావించాలి. కన్నబిరాన్ బాల్యం, విద్యాభ్యాసం, పౌరహక్కుల ఉద్యమంలో ఆయన అందించిన సేవలు తదితర అనేక విషయాలు వీక్షణం ద్వారా తెలిశాయి. అభినందనలు

**– ఎన్. భీమార్జున్ రెడ్డి**
ఇండియన్ అసోసియేషన్ ఆఫ్ లాయర్స్ జిల్లా కార్యదర్శి, నల్లగొండ

ప్రజాహితం కోరేవారు చాలామంది ఉన్నా వీక్షణానికి ప్రచారం తక్కువగా ఉందని నా భావన. ముఖ్యంగా డిగ్రీ, పి.జి., వృత్తివిద్యా కళాశాలలో దీనిని విస్తరించగలరని నా సూచన. ఇందులో ఛాయాచిత్రాలు ఉంచగలరని నా మనవి. ఆరోగ్యరంగంపై వ్యాసాలు రావాలి. ముఖ్యంగా ప్రభుత్వ ఆస్పత్రులలో ప్రజలు చాలామంది ఇబ్బంది పడుతున్నారు. అంతేకాదు అవినీతి, బాబాలను నమ్మడం లాంటి విషయాలపై విస్తృతమైన వ్యాసాలు రావాలి.

**– ముత్తన్నగారి రాజేందర్**
భూంపల్లి, మెదక్

వీక్షణం ఫిబ్రవరి 2011 సంచికలో 'పుస్తకంపై ఆసక్తి తగ్గలేదు' వ్యాసం చదివాను. నిజమే. పుస్తకాలపై ఆసక్తి తగ్గలేదు. కాని భక్తి, యోగధ్యాన, జ్యోతిష్యం, వివిధ పార్టీల కూటములు, దళితులు, స్త్రీలపై దాడులు పెచ్చు పెరిగినపుడు – అనివార్యంగా ప్రజల్లోంచి వచ్చే నిరసన, పోరాట వెల్లువను నీరుగార్చేందుకు పాలకవర్గాలు వారి కొమ్ముకాసే కుహనా శాస్త్రవేత్తలు, మేధావులు ఇలాగే చేస్తారు. ప్రపంచంలోని ఏ దేశంలో చూసినా ఈ నిజం కనిపిస్తుంది. తలిదండ్రులు, ఉన్నత విద్యావంతులై ఉండీ, ప్రశాంత జీవనానికి యోగా, ధ్యాన, జ్యోతిష్య–నమ్మకాలతో పెనుగులాడుతారు. 2001 తరువాత పెరిగిన విదేశీ చిత్రానువాదాలు, తెలుగు ప్రేమ – ప్రేమే ఎంతో పవిత్రం అంటూ – నేరుగా వ్యక్తిగత ఆస్తిగా స్త్రీని చూపించే చిత్రాలు, సంగీత, సినిమా క్విజ్, పాటల పోటీలేకాదు, బాలల కార్యక్రమాలు అన్నీ – మార్క్స్ చెప్పినట్లు, తలకిందులుగా మానసిక దోపిడీ చేస్తున్నాయి. అయితే 40 ఏళ్ల లోపున్న కొన్ని విద్యార్థి, యువజన, మహిళా సంఘాల కార్యకర్తలు ఈ విషయాన్ని బాగా గుర్తించారు. వీక్షణం వంటి పత్రికలకూ, ప్రచురణలకే కాక, విప్లవ సాహిత్యాన్ని కూడా కొని చదువుతున్నారు. సినీ – రాజకీయ స్టంట్‌ను అర్థం చేసుకుంటున్నారు. ప్రజాస్వామ్య, ప్రగతిశీల, విప్లవ భావ ప్రచారానికి నడుంకట్టి – ఆ ఆలోచనా విధానానికి ముమ్మర ప్రచారం చెయ్యడానికి వీక్షణం, మిత్రబృందం – ప్రచురణలు అవసరం.

**– డా. మానేపల్లి**
యలమంచిలి, విశాఖపట్నం

ఫిబ్రవరి 2011 సంచికలో వి. హనుమంతరావు 'శ్రీకృష్ణ కమిటీ నివేదిక – ఒక పరిశీలన' వ్యాసంలో వ్యక్తం చేసిన అభిప్రాయాలు తెలంగాణ ప్రజల మనోభావాలను గాయపరిచేవిగా ఉన్నాయి. కమిటీ నివేదికలోని అంకెలే తప్పుల తడకలు అయితే వాటిపై ఆధారపడి విశ్లేషణ చేయడం ఇంకా అహేతుకం. వ్యాసంలో బెదిరింపు ధోరణిలో విద్యార్థులపై వ్యాఖ్యలు అన్యాయం. సీనియర్ పాత్రికేయులుగా ప్రజల వైపు నుంచి సమస్యను చూడడంలో, ప్రాంతీయ ఆకాంక్షలను అర్థం చేసుకోవడంలో హనుమంతరావు విఫలమయ్యారు. ఇలాంటి రచనలు చేయకపోతేనే మేలు.

**– కె. అనిత**
హైదరాబాద్

ఫిబ్రవరి 2011 సంచికలో 'పుస్తకానికి ఆదరణ తగ్గలేదు' వ్యాస రచయితల పేర్లు పొరపాటున అచ్చు కాలేదు. వీక్షణం బృందం (వై. రామచంద్రం, సి. రాజశేఖర్, ఎ. మల్లేష్, వై. నర్సింహ) అని చదువుకోగలరు. – సం.

వీక్షణం

# ఇన్ని సమస్యలతో రాష్ట్ర పయనం ఎటు?

ఆంధ్రప్రదేశ్ సమస్యల ప్రదేశ్‌గా అట్టుడికిపోతున్నది. దాదాపు అన్ని వర్గాల ప్రజలు, ప్రజాసంఘాలు, రాజకీయ పక్షాలు ఏదో ఒక సమస్యపై ఏదో ఒక స్థాయిలో తమ అసంతృప్తిని, ఆగ్రహాన్ని ప్రదర్శిస్తున్నాయి. ప్రభుత్వం వైపు నుంచి, అధికారవర్గాల వైపు నుంచి మాత్రం ఈ సమస్యలను పరిష్కరించడానికి వీసమెత్తు ప్రయత్నం కనబడడం లేదు. ప్రజాసమస్యలను సామరస్యపూర్వకంగా, శాంతియుతంగా, ప్రజాస్వామికంగా, చట్టబద్ధంగా పరిష్కరించే ఆలోచనే కనబడడం లేదు. పైగా, ఆ సమస్యల ప్రకటనలను, వ్యక్తీకరణలను, ప్రజా ఆకాంక్షలను పశుబలంతో అణచివేయగలమని పాలకులు పగటికలలు కంటున్నారు. సమస్య పెద్దదైనా, చిన్నదైనా పోలీసు, పారామిలిటరీ బలగాలను విపరీతంగా మోహరించడం, ప్రజల ప్రశ్నలను లాఠీలతో, రబ్బర్ బులెట్లతో, తుపాకి తూటాలతో, అక్రమ కేసులతో ఎదుర్కోవడం పాలకులకు తెలిసిన ఏకైక విద్య అయింది. నిజానికి ఈ ప్రజాసమస్యలన్నీ పాలకులు కల్పించినవే. పాలకవిధానాల వల్ల ఏర్పడినవే. వీటిలో పాలకుల అలక్ష్యం వల్ల సుదీర్ఘ కాలంగా నానుతున్న సమస్యలూ ఉన్నాయి, ఏరోజుకారోజు పాలకులు అమలు చేస్తున్న చర్యలవల్ల తలెత్తుతున్న సమస్యలూ ఉన్నాయి. తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర ఆకాంక్షల విషయంలో కేంద్ర ప్రభుత్వమే 2009 డిసెంబర్ 9న చేసిన ప్రకటననుంచి వెనక్కి వెళ్లినందువల్ల ఏడాదికి పైగా సాగుతున్న ఆందోళనలు 2011 జనవరి 6న శ్రీకృష్ణ కమిటీ నివేదిక వెలువడిన తర్వాత మరింత వేడెక్కాయి. రాష్ట్ర ప్రభుత్వం ఆర్భాటంగా ప్రకటించిన రచ్చబండ కార్యక్రమం తెలంగాణలో రసాభాసగా మారింది. ప్రజాసమస్యల పరిష్కారవేదికగా చెప్పుకున్న రచ్చబండ కొత్త సమస్యలకు దారి తీసింది. ఎన్నో చోట్ల పాలకపార్టీ శాసనసభ్యులు, మంత్రులు, ముఖ్యమంత్రి కూడ పలాయనం చిత్తగించవలసి వచ్చింది. ఈలోగానే తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు బిల్లు ఈ పార్లమెంటు సమావేశాలలోనే ప్రవేశపెట్టాలని కోరుతూ సహాయనిరాకరణ కార్యక్రమం మొదలయింది. తెలంగాణ అంతటా ప్రభుత్వం స్తంభించింది. అందులో భాగంగా సాగిన రెండురోజుల బంద్ విజయవంతమయింది. బడ్జెట్ సమావేశాలను ప్రారంభించిన పాలకపక్షం శృంగభంగాన్ని ఎదుర్కోవలసి వచ్చింది. ఆనవాయితీ ప్రకారం ఉభయసభలను ఉద్దేశించి గవర్నర్ చేసే ప్రసంగాన్ని తెలంగాణ రాష్ట్ర సమితి శాసనసభ్యులు, కొందరు తెలుగుదేశం పార్టీ శాసనసభ్యులు అడ్డుకున్నారు. సభాగౌరవానికి భంగంగా చెపుతున్న ఆ ఘటన ఏడాదిగా జరుగుతున్న ప్రభుత్వ సాచివేత ధోరణికి ప్రతిఘటనగా, నిరసనగా, ప్రతిచర్యగా కూడ కనబడుతున్నది. శాసనసభ చరిత్రలో ఎన్నడూ లేనివిధంగా గవర్నర్ కుర్చీని, పోడియంను పడదోసి, మైకులు లాగేస్తే, మార్షల్స్ రక్షణ మధ్య, అక్కడక్కడా కొన్ని పేజీలు గబగబా చదివేసి గవర్నర్ ప్రసంగం అయిపోయిందని అనిపించవలసి వచ్చింది. సుదీర్ఘకాలంగా రగులుతున్న తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు ఆకాంక్ష రాజ్యాంగబద్ధమైన, న్యాయబద్ధమైన పరిష్కారానికి వీలయినదే. కేంద్రం అంగీకరించి కూడ మాట తప్పినదే. ప్రజల ఆకాంక్ష ఇంత పెద్ద ఎత్తున, ఇన్ని రూపాలలో, ఇంతకాలంపాటు వ్యక్తమయిన తర్వాత కూడ ఆ సమస్యను బలప్రయోగంతో అణచివేయగలమని అనుకోవడం మన పాలకుల తెలివిలేనితనానికో, మూర్ఖత్వానికో నిదర్శనం. ఇంతగా మనసులు విడిపోయిన తర్వాత బలవంతాన కలిపి ఉంచినా ఆ కలయిక ఎంతటి ఘర్షణకు, వైమనస్యానికి, నిరంతర సమస్యలకు దారితీస్తుందో ఎవరయినా ఊహించగలరు. అయితే తెలంగాణ ఏర్పాటు వల్ల తాము నష్టపోతామని భావించే, విడిపోవడం మంచిది కాదని భావించే వ్యక్తులు, ప్రజాసమూహాలు ఉన్నమాట నిజమే. అటువంటి వారితో కూడ సామరస్యపూర్వకంగా చర్చించి, ఒప్పించి, వారి ఫిర్యాదులను పరిష్కరించవలసిన బాధ్యత కూడ ప్రభుత్వం మీదనే ఉంటుంది. ఇంజనీరింగ్, మెడికల్ తదితర ఉన్నత విద్యల విద్యార్థులకు ప్రభుత్వ ఫీజు రియింబర్స్‌మెంట్ పథకాన్ని అవకతవకలతో అమలుచేయడాన్ని నిరసిస్తూ కళాశాలల యాజమాన్యాలు ఆందోళన ప్రారంభించాయి. కళాశాలలు మూసివేస్తామని హెచ్చరించాయి. ఒక విద్యార్థిని ఆత్మహత్యతో ఈ సమస్య మరింత జటిలమయింది. కొత్త ప్రతిపక్షంగా మారిన మాజీ కాంగ్రెస్ ఎంపి నిరాహారదీక్షకు పూనుకున్నారు. ఈ సమస్యను సృష్టించుకున్నది పూర్తిగా ప్రభుత్వమే. ఇవాళ వెనుకబడిన వర్గాల విద్యార్థుల ప్రయోజనాలు కూడ అందులో ఇమిడి ఉన్నాయి గనుక, వారిని రెచ్చగొట్టడానికి ఎవరికైనా అవకాశం వస్తున్నదేమో గాని అసలు ఆ పథకం తయారయినది విద్యార్థుల కోసం కాదు, కేవలం కార్పొరేట్ కాలేజీల యాజమాన్యాల కోసం. వారికి రక్షిత నిధుల సరఫరా పథకంగా ఈ రియింబర్స్‌మెంట్‌ను ప్రభుత్వం ప్రవేశపెట్టింది. సరిగ్గా ఆరోగ్యశ్రీ కూడ ఇలాగే కార్పొరేట్ ఆస్పత్రుల కోసం తయారయింది. ప్రధాన లబ్ధిదార్లు పెట్టుబడిదారులే అయినా ఈ పథకాల వల్ల విద్యార్థులకు, ప్రజలకు కూడ ఎంతో కొంత మేలు జరుగుతూ ఉండిందని భావిస్తే, ఆ మాత్రం మేలును కూడ ఎగరగొట్టడానికి ఇప్పుడు ప్రభుత్వం ప్రయత్నిస్తున్నది. అడిగినవారిమీద నిర్బంధాన్ని ప్రయోగిస్తున్నది. ఉత్తరాంధ్రలో పెట్టుబడిదారుల, ఆశ్రితుల ప్రయోజనాల కోసం, వారికి భూమి కట్టబెట్టడం కోసం ప్రారంభమైన విద్యుదుత్పత్తి ప్రాజెక్టులను అక్కడి ప్రజలు ఎప్పటినుంచో వ్యతిరేకిస్తున్నారు. ఆ పరిణామం కొద్దినెలల కింద సోంపేటలో పోలీసు కాల్పులకు దారి తీయగా, ఫిబ్రవరి చివరి వారంలో కాకరాపల్లి విద్యుత్ కేంద్రానికి వ్యతిరేకంగా సాగిన ఆందోళనలో వడ్డితాండ్రలో కాల్పులు జరిగాయి. ప్రజలు తమ చేతికర్రలు తిరగేసి సాయుధపోలీసులను తరిమిన దృశ్యం కూడ కనబడింది. సోంపేట కాల్పుల తర్వాత, అక్కడ విద్యుత్ కేంద్రపు ఆలోచనను వదులుకుంటున్నామని ఆ యాజమాన్యం ప్రకటించిన తర్వాత అయినా మిగిలిన ప్రాజెక్టుల గురించి ప్రభుత్వం పునరాలోచించవలసింది. కాని నెత్తురుటేర్లు పారించి అయినా సరే తన ఆశ్రితుల ప్రయోజనాలు కాపాడతానని పాలకులు ప్రతిజ్ఞ పూనినట్టున్నారు. ఇటువంటి పనులే చేసిన బెన్ అలీలు, హోస్ని ముబారక్‌లు ఏమైపోయారో కళ్లముందరి చరిత్ర మన పాలకులకు మాత్రం కనబడుతున్నట్టులేదు. వీ

## దొంగల రాజ్యంలో మరొక స్పెక్ట్రమ్ కుంభకోణం

కంట్రోలర్ అండ్ ఆడిటర్ జనరల్ (కాగ్) నివేదిక వల్ల బయటపడి, విచారణ కోసం సంయుక్త పార్లమెంటరీ సంఘం వేయాలనే డిమాండ్‌తో లోకసభ సమావేశాలు జరగని స్థితిని తెచ్చిన 2జి స్పెక్ట్రం అమ్మకాల కుంభకోణం సృష్టించిన ప్రకంపనాలు ఇంకా పూర్తిగా సమసిపోలేదు. అంతకన్న పెద్ద కుంభకోణం మరొకటి బయటపడుతున్నది. దేశం బందిపోటు దొంగల పాలనలో ఉన్నదని మరొక రుజువు వెల్లడవుతున్నది. 3జి స్పెక్ట్రం వేలం అమ్మకాల ధరలను ప్రమాణంగా తీసుకుని 2జి స్పెక్ట్రం అమ్మకాలలో జరిగిన అక్రమాలను లెక్కిస్తే ఒక లక్షా డెబ్బై ఆరు వేల కోట్ల రూపాయలు ప్రభుత్వ ఖజానాకు నష్టం జరిగిందని కాగ్ అంచనా వేసింది. ఇప్పుడు కొత్తగా బయటపడిన ఎస్ బాండ్ కేటాయింపులో ఆ నష్టం రెండు లక్షల కోట్ల రూపాయల పైనే అని ప్రాథమిక అంచనాలు వెలువడుతున్నాయి. మొదటి కుంభకోణంలో టెలికాం మంత్రిత్వశాఖ పాత్ర, మంత్రి రాజా పాత్ర ఉండగా, ఈ కొత్త కుంభకోణం జరిగినది స్వయంగా ప్రధానమంత్రి బాధ్యత వహించే అంతరిక్ష శాఖకు చెందిన భారత అంతరిక్ష పరిశోధనా సంస్థ (ఇస్రో)లో. ఆ కుంభకోణం ఆయనకు తెలిసి జరిగిందా తెలియకుండా జరిగిందా అనేది కేవలం సాంకేతికమైన ప్రశ్న. ప్రధానిగానో, తాను ప్రత్యక్షంగా పర్యవేక్షించే మంత్రిత్వశాఖ తరఫుననో ఈ కుంభకోణానికి పూర్తి బాధ్యత వహించవలసినది మన్మోహన్ సింగ్ మాత్రమే. ఎస్ బాండ్ లో ఉన్న 190 మెగాహెర్ట్జ్ స్పెక్ట్రం లోనుంచి 150 మెగాహెర్ట్జ్ ను మొబైల్, బ్రాడ్ కాస్ట్ ప్రసారాల సేవల కోసం అంతరిక్ష మంత్రిత్వశాఖకు కేటాయించారు. దేశ రక్షణ అవసరాల కోసం, సామాజిక అవసరాల కోసం ఈ మంత్రిత్వశాఖకు ఈ కేటాయింపు ఉచితంగానే జరిగింది. మరొకపక్క భారత సంచార్ నిగమ్ లిమిటెడ్ (బిఎస్ఎన్ఎల్), మహానగర్ టెలిఫోన్ నిగమ్ లిమిటెడ్ (ఎంటిఎన్ఎల్) వంటి ప్రజోపయోగ సంస్థలకు 20 మెగాహెర్ట్జ్ స్పెక్ట్రంను రు. 12,847 కోట్లకు అమ్మారు. దీన్ని బట్టే ఈ ఎస్ బాండ్ స్పెక్ట్రం ఎంత ఖరీదయినదో అర్థమవుతుంది. కాని ఇస్రో తనకు కేటాయించిన 150 మెగా హెర్ట్జ్ లోనుంచి 70 మెగాహెర్ట్జ్ స్పెక్ట్రంను దేవాస్ మల్టీమీడియా అనే వ్యాపార సంస్థకు 20 సంవత్సరాల కోసం వాడుకోవడానికి వెయ్యి కోట్ల రూపాయలు మాత్రమే తీసుకుని అప్పజెప్పింది. పైగా ఆ స్పెక్ట్రంను దేవాస్ మల్టీమీడియా మరెవరికయినా అద్దెకు ఇచ్చుకోవచ్చుననీ, అందుకు ఎవరి అనుమతీ తీసుకోనక్కరలేదనీ రాసిచ్చేశారు. ఈ ఒప్పందం ప్రకారం ఇస్రోకు చెందిన రెండు ఉపగ్రహాల నమూనాలను, ఉపగ్రహాలను తయారు చేసి కక్ష్యలో ప్రవేశపెట్టే పని దేవాస్ ది. ఆ ఉపగ్రహాల సేవలను ఇటు ఇస్రో, అటు దేవాస్ కలిసి వాడుకోవచ్చు. ఈ ఒప్పందం ఇస్రోకు చెందిన వ్యాపార వ్యవహారాలు చూసే ఆంట్రిక్స్ కార్పొరేషన్‌కు, దేవాస్ మల్టీమీడియాకు మధ్య 2005లో కుదిరింది. దేవాస్ మల్టీమీడియా వెనుక ఒక మాజీ ఇస్రో శాస్త్రవేత్త ఉన్నాడు. ఆ కంపెనీ యాజమాన్యంలో అమెరికాకు చెందిన మాజీ ప్రభుత్వాధికారులు, అమెరికన్ చాంబర్ ఆఫ్ కామర్స్ ప్రతినిధులు కూడ ఉన్నారు. ఆ కంపెనీ 2008లో తన యాజమాన్యంలో స్వల్పమైన వాటాను డాయిష్ టెలికాం కంపెనీకి రు. 317 కోట్లకు అమ్మేసింది. ఈ ఒప్పందం నష్టదాయకమైనదని, రద్దు చేసుకోవాలని న్యాయ మంత్రిత్వశాఖ 2009లో సలహా ఇచ్చింది. అంతరిక్ష మంత్రిత్వశాఖ కూడ 2010 జూలైలో అదేమాట చెప్పింది. అయినా కొనసాగిన వ్యవహారం బయటపడిన తర్వాత మాత్రం తప్పుకోవడానికి, అబద్ధాలు చెప్పడానికి, తమకు సంబంధం లేదని చెప్పడానికి ప్రధాన మంత్రి, ఇస్రో అధికారులు ప్రయత్నించారు. రెండు వారాలు చర్చ జరిగాక ఫిబ్రవరి రెండవవారంలో ఒప్పందాన్ని రద్దు చేస్తున్నట్టు కేంద్ర ప్రభుత్వం ప్రకటించింది. కాని జరిగిన బందిపోటు దొంగతనం, బైటపడి ఉండకపోతే అమలయి ఉండే దొంగతనం ఎలాజరిగిందో మాత్రం ఇంతవరకూ వివరణ లేదు. ఈ దొంగ పాలకులను ఇంకా నమ్ముతున్నామంటే, గౌరవిస్తున్నామంటే మన సహనం ఎంత గొప్పదై ఉండాలి?!

## ఈజిప్ట్, సిరియా, బహ్రెయిన్, లిబియా...

ఇవాళ అరబ్ దేశాల ప్రజలు గొప్ప ఆశను రేకెత్తిస్తున్నారు. ఈ యుగస్వభావాన్ని విశ్లేషిస్తూ 1970లలో 'దేశాలు స్వాతంత్ర్యాన్ని కోరుతున్నాయి, జాతులు విముక్తిని కోరుతున్నాయి, ప్రజలు విప్లవాన్ని కోరుతున్నారు' అన్నాడు మావో సే టుంగ్. ఆ దశాబ్దం తిరగకుండానే ఆయన మరణించాడు. ఆ దశాబ్దం చివరనే ఆయన మాటలు నిజం కావేమోననిపించే పరిణామాలు మొదలయ్యాయి. దేశాల స్వాతంత్ర్యాన్ని భగ్నం చేసే బహుళజాతిసంస్థల వ్యూహం ప్రపంచ బ్యాంకు–అంతర్జాతీయ ద్రవ్యనిధి సంస్థల వ్యవస్థాత్మక సంస్కరణల రూపంలో అన్ని ప్రభుత్వాలనూ లోబరచుకుంది. 1975లో గెలిచిన వియత్నాం జాతీయ విముక్తి పోరాటం నాలుగేళ్ళు తిరగకుండానే పొరుగున సోషలిస్టు ప్రయోగాలు చేస్తున్న కంపూచియా మీద దురాక్రమణ జరిపి జాతీయ విముక్తి పోరాటాల విప్లవ స్వభావాన్ని అపహాస్యం చేసింది. స్వయంగా మావో నాయకత్వం వహించిన విప్లవం విద్రోహానికి గురయింది. మరొక దశాబ్దం తిరిగేసరికి తూర్పు యూరప్ ప్రభుత్వాలు, సోవియట్ యూనియన్ పతనం జరిగి, ప్రపంచానికి పెట్టుబడిదారీ విధానం తప్ప 'మరొక గత్యంతరం లేదు'అని మార్గరెట్ థాచర్ బహిరంగంగా ప్రకటించే స్థితి వచ్చింది. భూగోళం మీదికి, స్వాతంత్ర్యాన్ని కోరే దేశాల మీదికి, విముక్తిని కోరే జాతుల మీదికి, విప్లవాన్ని కోరే మనుషుల మీదికి ప్రపంచీకరణ మహమ్మారి ముంచుకు వచ్చింది. ఆ తర్వాత రెండు దశాబ్దాలు అక్కడక్కడా ఆశ మిణుకుమంటున్నా, నెగళ్లు రాజుకుంటున్నా, మిణుగురు పురుగుల సంగీతం వినిపిస్తున్నా ప్రగతిశీల శక్తుల నిర్వేదం కూడ కొట్టవచ్చినట్టు కనబడుతూనే ఉంది. ఆ నిర్వేదాన్ని బద్దలు చేసినందుకు ఉత్తర ఆఫ్రికా, పశ్చిమాసియా ప్రజలకు జేజేలు చెప్పాలి. యుగ స్వభావం ధిక్కారం అని వాళ్లు ప్రకటిస్తున్నారు. యుగస్వభావం మార్పును కోరుకోవడం అని వాళ్లు చూపుతున్నారు. నిజానికి యుగం అనేది ఒక దశాబ్దంలోనో, రెండు దశాబ్దాలలోనో తేలిపోయేది కాదు. చరిత్ర పొడవునా ప్రతి దశకూ కొన్ని వందల సంవత్సరాలు, ఒక్కొక్కసారి వేల సంవత్సరాలు పట్టిన అనుభవం ఉంది. కనుక 1970లలో యుగస్వభావం గురించి చేసిన సూత్రీకరణ అతిశయోక్తి కాదని, అక్షరాలా సత్యమని ఇవాళ కనీసం పది దేశాలలో ప్రజలు రుజువు చేస్తున్నారు. వాళ్లు కోరుకుంటున్నది దేశాల స్వాతంత్ర్యం కాకపోవచ్చు, జాతుల విముక్తి కాకపోవచ్చు, ప్రజల విప్లవం కాకపోవచ్చు. అక్కడక్కడా ఆ ఆకాంక్షలు కూడ ఉండవచ్చు. కాని ప్రధానమైన అంశం వాళ్లు ఇంకెంతమాత్రమూ యథాస్థితిని అంగీకరించడం లేదు. యథాస్థితిని కూలదోయడం తప్ప గత్యంతరం లేదని ప్రకటిస్తున్నారు. వేలాదిగా, లక్షలాదిగా వీధుల్లోకి వచ్చి తమ ఆకాంక్షలను వ్యక్తం చేస్తున్నారు. మరీముఖ్యంగా ఇవాళ ప్రజాగ్రహం వెల్లివిరుస్తున్న అన్ని దేశాలలోనూ గత రెండు దశాబ్దాలకు పైగా ప్రపంచీకరణ విధానాలు అమలవుతున్నాయి గనుక, ఇవాళ్టి నిరసన, ప్రతిఘటన ప్రదర్శనలు ఆ విధానాల పట్ల వ్యతిరేకతలే. ఆ విధానాలను రద్దు చేయాలని ప్రజలు నినదిస్తున్నారు. సియాటిల్ ప్రదర్శనల నాటినుంచీ మేధో బృందాలలో, కార్యకర్తలలో, కొన్ని రాజకీయ పక్షాలలో ఉన్న ప్రపంచీకరణ వ్యతిరేకత ఇవాళ అట్టడుగు ప్రజలు తమ మాటలలో, చేతలలో వ్యక్తీకరిస్తున్నారు. అలా యుగస్వభావాన్ని మళ్లీ ఒకసారి వ్యక్తీకరిస్తున్నందుకూ సామ్రాజ్యవాద రాజకీయార్థిక విధానాలనూ, వారికి దళారీలుగా మారిన స్థానిక భూస్వామ్య, మతఛాందస, పెట్టుబడిదారీ వర్గాలనూ ధిక్కరిస్తున్నందుకూ ఈ ప్రజాగ్రహ ప్రకటనలను సాదరంగా ఆహ్వానించవలసి ఉంది. ఈ ప్రజావెల్లువను పైకెత్తి పట్టి దాని స్ఫూర్తిని దశదిశలా ప్రచారం చేయవలసి ఉంది. ప్రపంచవ్యాప్తంగా ప్రజాశక్తులన్నీ ఈ అవకాశాన్ని తీసుకుని తమ పాలకులనూ, వారికి వత్తాసుగా నిలిచే సామ్రాజ్యవాద శక్తులనూ కూలదోయడానికి పూనుకోవలసి ఉంది. వీ








- **కథా వార్షిక 2009** – సంపాదకులు : వి.ఆర్. రాసాని, మధురాంతకం నరేంద్ర – మధురాంతకం రాజారాం సాహిత్య సంస్థ ప్రచురణ – 109 పేజీలు, 1/8 డెమీ, సాదా ప్రతి : రు. 60, లైబ్రరీ ప్రతి : రు. 100, ప్రతులకు : డా. వి.ఆర్. రాసాని, 16/ఇ/17, బాలాజి రెసిడెన్సీ, మునిరెడ్డి నగర్, తిరుపతి వెస్ట్ – 517 502; డా. ఎం. నరేంద్ర, 15–541/1, శ్రీ పద్మావతి నగర్, తిరుపతి – 2; విశాలాంధ్ర బుక్‌హౌస్ అన్ని బ్రాంచీలు
- **వర్ణమాల** (నాటికలు) – డా. వి. వీరాచారి – సంపాదకులు: వి. సత్యవతి, జనజీవన ప్రచురణలు – 195 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, 4–1–435, విజ్ఞాన్ భవన్, బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాద్ – 500 001; విజయవాడ, అనంతపురం, విశాఖపట్నం, హనుమకొండ, కరీంనగర్, గుంటూరు, తిరుపతి, కాకినాడ బ్రాంచీలు; నవోదయ బుక్ హౌస్, సుల్తాన్ బజార్, హైదరాబాద్–27
- **ఆటవెలదిలో భౌతిక శాస్త్రం** (శంకరన్న శతకము) కవితల్లో ఫిజిక్స్ – డా. మార్క శంకర్ నారాయణ – ఝాన్సీ పబ్లికేషన్స్ – 74 పేజీలు, 1/8 డెమీ, రు. 50, ప్రతులకు : డా. మార్క శంకర్ నారాయణ, 3–14–700/3, హనుమాన్‌నగర్, కె.యు.సి. రోడ్, హనుమకొండ – 506 009; ఫోన్ : 9908416664, ఇమెయిల్ : marka_snarayana@yahoo.com; విశాలాంధ్ర బుక్‌హౌస్, ప్రజాశక్తి బుక్‌హౌస్, నవోదయ బుక్ హౌస్, నవయుగ బుక్‌హౌస్
- **గమనం** – కథల సంపుటి – సత్యభాస్కర్ – జనమిత్ర ప్రచురణలు – 127 పేజీలు, 1/8 డెమీ, రు. 75, ప్రతులకు : జనమిత్ర ప్రచురణలు, 3–8–7, ఫ్లాట్ నెం. 101, రాధాదేవి అపార్ట్‌మెంట్స్, ఫేజ్ – 1, రామంతాపూర్, హైదరాబాద్ – 500 013; సెల్ : 9848391638; అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలలో
- **రాజ్యము – పౌరసమాజము** (రాజనీతి సిద్ధాంత అన్వేషణలు) – నీరా చంధోక్ – తెలుగు అనువాదం : రావెల సాంబశివరావు – లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్ ప్రచురణ – 92 పేజీలు, 1/8 డెమీ, రు. 35, ప్రతులకు : లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్, డి. రాధాకృష్ణమూర్తి, ఇ.నెం. 5–85–4/బి, పందరీపురం, 1వ లైన్, గుంటూరు – 522 002; సెల్ : 9848877596; విశాలాంధ్ర బుక్‌హౌస్, ప్రజాశక్తి బుక్ హౌస్, మైత్రి, దిశ, సహచర, నవయుగ, మణి బుక్‌స్టాల్
- **శబ్ద బ్రహ్మ శ్రీశ్రీ** – రోణంకి అప్పలస్వామి – శ్రీశ్రీ సాహిత్య నిధి, 31 పేజీలు, 1/8 డెమీ, రు.20, ప్రతులకు : శ్రీశ్రీ సాహిత్య నిధి, 305, ప్రగతి టవర్స్, వీరయ్య స్ట్రీట్, మారుతినగర్, విజయవాడ – 520004; ఫోన్ : 0866–6640595, ఫ్యాక్స్ : 0866–6697375, సెల్ : 9848504649, 9246277375; ఇ–మెయిల్ : srisri_sahityanidhi@yahoo.com
- **ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమం దాని పరిణామం** – చంద్ర పుల్లారెడ్డి, మానికొండ సుబ్బారావు – సి.పి.ఐ. (ఎం.ఎల్.) న్యూ డెమోక్రసి ప్రచురణ – 487 పేజీలు, 1/8 డెమీ, రు. 250
- **సామ్రాజ్యవాదం పెట్టుబడిదారీ విధానం అత్యున్నత దశ** – స్థూల పరిచయం – సి.పి.ఐ. (ఎం.ఎల్.) న్యూ డెమోక్రసి ప్రచురణ – 54 పేజీలు, 1/8 డెమీ, రు. 10

పై రెండు ప్రతులకు : ప్రజాపంథా, మార్ఫ్ భవన్, 658, విద్యానగర్, 7వ లైన్, హైదరాబాద్ – 500 044; సహచర బుక్ హౌస్, దిశ బుక్ హౌస్, నవోదయ బుక్ హౌస్, మైత్రీ బుక్ స్టాల్, విశాలాంధ్ర, ప్రజాశక్తి అన్ని బ్రాంచీలలో

- **పోరుగడ్డ** – మూడు కథలు, ఏడు వ్యాసాలు – పెద్దింటి అశోక్‌కుమార్ – తెలంగాణ రచయితల వేదిక ప్రచురణ–80 పేజీలు, 1/8 డెమీ, రు.45
- **అదే ఆకాశం** – అనేక దేశాల అనువాద కవితలు – ముకుంద రామారావు – అడుగుజాడలు పబ్లికేషన్స్ – 108 పేజీలు, 1/8 డెమీ, రు. 60

పై రెండు ప్రతులకు : జూలూరు గౌరీశంకర్, ఇ.నెం. 1–8–702/33/20ఎ, పద్మాకాలనీ, నల్లకుంట, హైదరాబాద్ – 500 044; రాష్ట్రంలోని అన్ని పెద్ద పుస్తకాల షాపుల్లో









## బి.సి. రిజర్వేషన్‌లు పెంచాలి

రాష్ట్రంలో వెనుకబడిన కులాల రిజర్వేషన్ శాతాన్ని 25 నుంచి 50 శాతానికి పెంచాలని బి.సి. సంఘాలు డిమాండ్ చేశాయి. తమిళనాడు తరహాలో రాష్ట్రంలో కూడా జనాభా ప్రాతిపదికన బి.సి.ల రిజర్వేషన్ శాతాన్ని పెంచాలని కోరుతూ వివిధ బి.సి. సంఘాల నేతలు బి.సి. కమిషన్ ఛైర్మన్ దాళ్వ సుబ్రహ్మణ్యంకు జనవరి 20న వినతి పత్రం అందజేశారు. 1986లో బి.సి. రిజర్వేషన్‌లను రాష్ట్రంలో 44 శాతంకు పెంచారనీ, జనాభా లెక్కలు సరిగా లేవని అప్పట్లో హైకోర్టు కొట్టివేసిందనీ వారు తెలిపారు. ఇటీవలి బి.సి. జాబితాలో 27 కొత్త కులాలను కలిపినందున రిజర్వేషన్ శాతాన్ని పెంచాల్సిన అవసరం ఉందని వారు తెలియజేశారు.

## జన్యు మార్పిడి పంటలు ప్రమాదకరం

జన్యు మార్పిడి పంటలు చాలా ప్రమాదకరమనీ, వాటివల్ల జీవమనుగడ కూడా ప్రశ్నార్థకంగా మారుతుందనీ సౌత్ ఆక్షన్ ఆన్ జెనిటిక్ ఇంజనీరింగ్ జాతీయ కన్వీనర్ పి.వి. సతీష్ అన్నారు. 'వ్యవసాయం, ఆహార పదార్థాలు, ఆరోగ్యంపై జన్యుమార్పిడి ప్రభావం' అనే అంశంపై దక్కన్ డెవలప్‌మెంట్ సొసైటీ ఫిబ్రవరి 4న హైదరాబాద్ లోని సోమాజిగూడ ప్రెస్‌క్లబ్‌లో విలేకరుల సమావేశం ఏర్పాటు చేసింది. ఈ సమావేశంలో పలువురు శాస్త్రవేత్తలు, రైతు సంఘాల నాయకులు తమ పరిశీలనలనూ, అనుభవాలనూ, పొంచి ఉన్న ప్రమాదాలనూ పంచుకున్నారు.

## పదోతరగతి పరీక్షలకు 13 లక్షల మంది

మార్చ్ 24 నుంచి జరుగనున్న పదో తరగతి పబ్లిక్ పరీక్షల కోసం రాష్ట్రవ్యాప్తంగా పదమూడు లక్షల మంది విద్యార్థులు హాజరు కానున్నారు. వీరిలో 10 లక్షల 59 వేల మంది రెగ్యులర్ విద్యార్థులు కాగా, 2 లక్షల 41 వేల మంది ప్రైవేట్ విద్యార్థులు ఉన్నారు.

## మెట్రో రైల్ ప్రాజెక్ట్‌పై హైకోర్టులో పిటిషన్

మెట్రోరైల్ ప్రాజెక్ట్‌పై మానవ హక్కుల వేదిక అధ్యక్షులు జీవన్ కుమార్ ఫిబ్రవరి 4న హైకోర్టులో పిటిషన్ వేశారు. అధికారాలు లేకున్నా, ప్రభుత్వం తన పరిధిని దాటి మెట్రోరైల్ ప్రాజెక్ట్‌ను చేపట్టిందని ఆ పిటిషన్‌లో తెలిపారు. మెట్రో రైల్ కోసం ఎల్. అండ్ టి. సంస్థతో చేసుకున్న ఒప్పందాలు చెల్లవంటూ ఆదేశాలు జారీచేయాలని న్యాయస్థానాన్ని అభ్యర్థించారు.

## 'ప్రజారాజ్యం' కోసం విలీనం...?

ప్రజారాజ్యం పార్టీని కాంగ్రెస్‌లో విలీనం చేస్తున్నట్లు ఆ పార్టీ అధ్యక్షుడు చిరంజీవి ఫిబ్రవరి 6న ప్రకటించారు. 26 ఆగస్ట్ 2008న తిరుపతిలో ఆవిర్భవించిన ప్రజారాజ్యం పార్టీ దాదాపు రెండున్నర ఏళ్లకు కాంగ్రెస్‌లో విలీనం అయింది. 'కాంగ్రెస్‌లో పి.ఆర్.పి.ని విలీనం చేయాలని నిర్ణయించుకున్నాం' అని చిరంజీవి, 'చిరంజీవి ఈ క్షణం నుంచి కాంగ్రెస్‌లో సభ్యుడు' అని వీరప్ప మొయిలీ సంయుక్తంగా మీడియా సమావేశంలో ప్రకటించారు.

## రచ్చయిన రచ్చబండ

జనవరి 24 నుంచి ప్రారంభమయిన (ఫిబ్రవరి 13 వరకు) రచ్చబండ కార్యక్రమం ప్రజల నిరసనల మధ్య ముగిసింది. ప్రజా సమస్యలను పరిష్కరించే లక్ష్యంతో ప్రారంభించిన రచ్చబండ కార్యక్రమం ప్రజల నిరసనలు, ఘెరావ్‌లు, విధ్వంసాలు, బంద్‌లు, ఆందోళనలు, లాఠీఛార్జ్‌లు, అరెస్టులతో ముందుకు సాగింది. తెలంగాణ జిల్లాల్లో టి.ఆర్.ఎస్., బి.జె.పి. శ్రేణులు, ప్రజలు రచ్చబండను బహిష్కరించగా, రాయలసీమ, కోస్తాంధ్ర ప్రజలు కూడా రకరకాల అసంతృప్తులతో నాయకులను, అధికారులను నిలదీసారు.

## సహాయ నిరాకరణ

ప్రత్యేక తెలంగాణ సాధనకు తెలంగాణ పొలిటికల్ జె.ఎ.సి., ఉద్యోగాల జె.ఎ.సి.ల ఫిబ్రవరి 17 నుంచి సహాయ నిరాకరణకు పిలుపునిచ్చాయి. సహాయ నిరాకరణలో ఉద్యోగ, ఉపాధ్యాయ, కార్మిక సంఘాలు, ప్రజలు స్వచ్ఛందంగా పాల్గొన్నారు. ఫిబ్రవరి 21న విద్యార్థులు 'ఛలో అసెంబ్లీ' కార్యక్రమాన్ని నిర్వహించారు. అదే రోజు న్యాయవాదులు 'ఛలో రాజ్‌భవన్' కార్యక్రమాన్ని నిర్వహించారు. ఫిబ్రవరి 22, 23 తేదీలలో 48 గంటల పాటు తెలంగాణ జిల్లాల్లో బంద్ పాటించారు. బంద్‌కు అన్ని వర్గాల నుంచి పూర్తి మద్దతు లభించింది.

## వనం ఝాన్సీ మృతి

బి.జె.పి. నాయకురాలు వనం ఝాన్సీ (42) శ్రీశైలం-హైదరాబాద్ ప్రధాన రహదారిపై మహబూబ్‌నగర్ జిల్లా అమన్‌గల్ మండలం కడ్తాల గ్రామ సమీపంలో ఫిబ్రవరి 19న రోడ్డు ప్రమాదంలో మరణించారు. విద్యార్థి దశ నుంచి రాజకీయాలలో పాల్గొంటూ రాష్ట్ర బి.జె.పి. ఉపాధ్యక్షురాలిగా కూడా పనిచేశారు. తెలంగాణ ఉద్యమంలో చురుగ్గా పనిచేశారు.

## మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి మృతి

ప్రముఖ తెలుగు సినీ నటులు మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి (94) ఫిబ్రవరి 22న విజయవాడలో చనిపోయారు. స్వాతంత్రోద్యమంలో పాల్గొన్నారు. రాష్ట్రంలోని కమ్యూనిస్టు ఉద్యమం సంస్థాపకుల్లో ఒకరు. 'మా భూమి' నాటకంలో నటిస్తూ మంచి పేరు తెచ్చుకొని సినిమా రంగంలోకి వచ్చారు. తెలుగు ప్రజలు చిరస్థాయిగా గుర్తుపెట్టుకునే వైవిధ్యమైన పాత్రలను పోషించారు.

## ముళ్లపూడి వెంకటరమణ మృతి

ప్రముఖ రచయిత, సీనియర్ పాత్రికేయుడు ముళ్లపూడి వెంకట రమణ (80) ఫిబ్రవరి 24న ఫ్లూ జ్వరంతో మద్రాస్‌లో ఆయన స్వగృహంలో చనిపోయారు. 1954లో ఆంధ్రపత్రికలో సబ్ ఎడిటర్‌గా పనిచేశారు. తర్వాతి కాలంలో సినిమా రంగంలో వెళ్లి ముప్ఫై తొమ్మిది సినిమాలకు కథా, స్క్రీన్‌ప్లే, డైలాగులు అందించారు. ఆయన బాపూ దర్శకత్వంలోనే ఎక్కువ సినిమాలు తీశారు. 'బుడుగు', 'కోతికొమ్మచ్చి' తో సహా ఆయన కథలూ, సాహిత్యం ఎంతో ప్రసిద్ధి చెందాయి. వీ

*టునీషియాతో మొదలై అరబ్ దేశాలు వరుసగా పోరుబాట పట్టాయనీ, ఈ తిరుగుబాట్లతో ప్రజాస్వామ్య సాధన జరిగి, అమెరికా గుత్తాధిపత్యానికి గండి పడుతుందో లేదో చూడాలనీ అంటున్నారు* **ఎ. నరసింహారెడ్డి**

# అరబ్ ప్రపంచంలో ప్రజా ఉద్యమాలు

ప్రపంచ చరిత్రలోకి అరబ్ ప్రపంచం నూతన పరిణామాలు తీసుకువచ్చింది. ప్రత్యామ్నాయం లేదనుకున్న ప్రపంచీకరణకు ప్రజా ప్రతిఘటన ప్రారంభమైంది. అరబ్ ప్రపంచంలో, ఆఫ్రికా ఖండంలో నియంతృత్వ ప్రభుత్వాలకు వ్యతిరేకంగా ప్రజాగ్రహం మిన్నంటుకుంది. అధిక ధరలు, నిరుద్యోగం తీవ్రత, ఆహార అభద్రత, అవినీతి, అధికార దుర్వినియోగంతో విసిగి వేసారిన ప్రజలు ఇన్నేళ్లుగా దాచుకున్న అసంతృప్తి ఒక్కసారిగా నిరసనలు, ఆగ్రహజ్వాలల రూపంలో వెల్లువెత్తింది. తిరుగులేదనుకున్న నియంతలు దేశం వదిలి పారిపోవల్సి వచ్చింది. ప్రజా బలం ముందు నియంతలు మట్టిగరువక తప్పదని రుజువైంది. టునీషియా నియంత జైన్ ఎల్ అబిదిన్ బెన్ అలీ దేశం విడిచి సౌదీ అరేబియాకు పారిపోయాడు. ఈజిప్ట్ నియంత హోస్నీ ముబారక్ గద్దె దిగి అజ్ఞాతంలోకి వెళ్లిపోయాడు. జోర్డాన్ రాజు ప్రభుత్వాన్ని రద్దు చేసి నూతన ప్రభుత్వానికి శ్రీకారం చుట్టాడు.

ఇరాన్, బహరైన్, లెబనాన్, సుడాన్, యెమెన్, జోర్డాన్, అల్జీరియాల్లో ప్రభుత్వాలకు వ్యతిరేకంగా ప్రజలు వీధుల్లోకి వస్తున్నారు. ఈ నిరసనల ప్రతిధ్వనులు నిరంకుశ పాలనలో మగ్గుతున్న అనేక ఇతర అరబ్ దేశాలలోకి విస్తరిస్తున్నాయి. ప్రజాస్వామ్యం, మానవ హక్కులు వంటి మాటలు చెబుతున్న అమెరికా అరబ్ ప్రపంచంలో చమురు నిల్వలపై కన్నేసింది. అరబ్ దేశాల్లో ప్రపంచంలోని ముడిచమురు నిక్షేపాల్లో మూడింట రెండు వంతులు కేంద్రీకృతమై ఉన్నాయి. అందుకే ఆ దేశాలపై అమెరికా, పాశ్చాత్య దేశాలు అంత ఆసక్తి కనబరుస్తాయి. అమెరికా అండదండలతో, దశాబ్దాలుగా చమురు సంపదను స్వంతం చేసుకొని దోచుకుంటున్న వారి గుండెల్లో ఈ ప్రజా నిరసనలు గుబులు పుట్టిస్తున్నాయి. సౌదీ అరేబియా, టునీషియా, ఈజిప్ట్ లాంటి అనేక అరబ్ దేశాలలో ప్రజాస్వామ్యం లేదు, ఎన్నికలు లేవు. నియంతలు రాజ్యమేలుతున్నారు. వారందరికీ అండగా అమెరికా కొనసాగుతుంది. అందువల్లనే నేడు ఆ ప్రాంతంలో జరుగుతున్న పరిణామాలు అమెరికాకు వెన్నులో చలి పుట్టిస్తున్నాయి. చమురు, సహజ వాయువుకు నిలయమైన మొత్తం అరబ్ ప్రపంచాన్నీ, ఉత్తరాఫ్రికాను కుదిపేస్తున్న ప్రజా వెల్లువ రానున్న రోజుల్లో ఎటువంటి మలుపులు తిరుగుతుందో వేచి చూడాలి. ఇవి ఇప్పటికే ప్రజాస్వామ్యం, స్వేచ్ఛ ముసుగు తగిలించుకొని నియంతృత్వ పాలకుల కొమ్ముకాస్తున్న అమెరికా, యూరోపియన్ దేశాల అసలు నైజాన్ని ప్రపంచ ప్రజల ముందు బహిరంగపరిచాయి. అయినప్పటికీ ప్రజా ఆగ్రహ జ్వాలల్ని చల్లార్చడానికి, లేదంటే మళ్లీ తన తొత్తులనే అధికారంలోకి తెచ్చి తన పట్టు నిలుపుకోవడానికి, తన దోపిడీని కొనసాగించడానికి అమెరికా నానా తంటాలు పడుతోంది. దాని ప్రయత్నాలు ఫలించినా, ఫలించక పోయినా ప్రపంచం మాత్రం 'అమెరికాకు నిన్నటిలా రేపు ఇంకెంతమాత్రం' ఉండబోదు. ఈ సందర్భంగా మీడియా, ఇంటర్‌నెట్ ప్రజల మధ్య సమన్వయకర్తగా వ్యవహరించడం విశేషం. అరబ్ ప్రాంతంలో మీడియా మీద నియంత్రణ లున్నప్పటికి స్వతంత్ర మీడియా సంస్థగా పనిచేస్తున్న అల్‌జజీరా టి.వి. ఛానెల్ ఈ తిరుగుబాట్లలో కీలకపాత్ర పోషించింది. ప్రజల్లో వెల్లువెత్తుతున్న అసంతృప్తిని సంఘటిత మార్గంలో పెట్టేందుకు ఈ ఛానెల్ కృషి చేసింది.

### టునీషియాలో జన విజయం

ఉత్తర ఆఫ్రికాలో మధ్యధరా సముద్రం పశ్చిమ తీరాన ఉన్న చిన్న దేశం టునీషియాలో 2010 డిసెంబర్ 17 నుండి మొదలైన ప్రభుత్వ పోలీసు వ్యతిరేకత ప్రజా వెల్లువగా పెల్లుబికింది. ఈ వెల్లువ ధాటికి నియంత అబిదిన్ బెన్ అలీ 23 ఏళ్ల పాలనకు స్వస్తి చెప్పి 2011 జనవరి 14 అర్ధరాత్రి విమానంలో దేశం వదిలి పారిపోయాడు. తలదాచుకునే చోటుకోసం వెదకుతూ ఆ విమానంలో గంటల కొలదీ మధ్యధరా సముద్రంపై ఎగురుతూ గడిపాడు. అతనికి ఆశ్రయ మిచ్చేందుకు ఫ్రాన్సు నిరాకరించింది. చివరికి సౌదీ అరేబియా ఆశ్రయ మిచ్చింది. ఇలాంటి నిరంకుశ పాలకులు సాధారణంగా మొదట చేరేదక్కడికే. బెన్‌అలీ ప్రభుత్వాన్ని కూలదోసిన ఘటనల క్రమం ఇలా సాగింది.

2010 డిసెంబర్ 17న 26 ఏళ్ల నిరుద్యోగి మహమ్మద్ బొవజిజీని అనుమతి లేకుండా రోడ్డు ప్రక్కన పండ్లు, కూరగాయలు అమ్ముతున్న నేరానికి పోలీసులు అవమానించి కొట్టారు. దీనికి నిరసనగా తన స్వస్థలమైన సిదీ బౌజిద్‌లోని పోలీస్‌స్టేషన్ ముందు ఆత్మాహుతి చేసుకున్నాడు. ఆ మరుసటిరోజు మరో యువకుడు 'నిరుద్యోగం పోవాలి', 'దారిద్ర్యం పోవాలి' అని నినాదాలిస్తూ విద్యుత్ తీగలు పట్టుకొని ఆత్మహత్య చేసుకున్నాడు. దీనితో వరుస 2 ఆత్మహత్యలు సాగాయి. ఫలితంగా ప్రజాగ్రహం కట్టలు తెగి వెల్లువలా పైకెగిసింది. దాదాపు రెండున్నర దశాబ్దాలుగా రాజకీయ స్వేచ్ఛ అనేది లేని ప్రజల్లో అంతర్గతంగా పేరుకుపోయిన అసంతృప్తి ఈ రకంగా వెల్లడైంది. ఈ ప్రజా ఉద్యమం 2011 జనవరి 8-9 తేదీల నాటికి దేశ రాజధాని టునిస్‌కు విస్తరించింది. నిరసనకారులపై పోలీసులు జరిపిన కాల్పుల్లో 100 పైగా ఉద్యమకారులు మృతి చెందారు. ఈ ప్రజల తిరుగుబాటును 'జాస్మిన్ విప్లవం'గా పిలుస్తున్నారు.

ప్రభుత్వం అత్యయిక పరిస్థితినీ, కర్ఫ్యూనూ విధించింది. 23 ఏళ్ల నిరంకుశ పాలనతో విసిగిపోయిన జనం వెనక్కి తగ్గలేదు. కార్మికులు, విద్యార్థులు, యువకులు, మహిళలు, ఉపాధ్యాయులు, లాయర్లు, పత్రికా రచయితలూ ప్రజా ప్రతిఘటనలో పాల్గొన్నారు. ప్రజల ఆగ్రహమూ, నిరసన అనేక రూపాలలో సాగింది. వారు ప్రభుత్వ భవనాల మీదా, బెన్ అలీ పార్టీ కార్యాలయాల మీదా దాడులు చేశారు. బెన్‌అలీకి, అతని భార్యకు చెందిన వ్యాపారాలనూ, ఆస్తులనూ లక్ష్యంగా పెట్టుకొని దాడులు చేశారు. బెన్ అలీ అల్లుడి భవనాలనూ, వాణిజ్య సముదాయాలనూ, అతని కుటుంబీకుల కార్లనూ తగులబెట్టారు. బెన్ అలీ మేనల్లుడిని చావగొట్టారు. అనేకచోట్ల పోలీసులతో ఘర్షణ పడ్డారు.

ప్రజా వెల్లువ సాయుధ బలగాల్లో సంక్షోభం తెచ్చింది. ప్రజలపై కాల్పులు జరిపేందుకు సైన్యం నిరాకరించడంతో సంయుక్త దళాధిపతి జనరల్ రషీద్ అమర్‌ను బెన్‌అలీ పదవి నుండి తొలగించాడు. నిరసనకారులను 'ముసుగులు ధరించిన గూండాలు, అతివాదానికీ టెర్రరిజానికీ ఆత్మలు తాకట్టు పెట్టిన, విదేశాలకు అమ్ముడుపోయిన అసాంఘిక శక్తులు' అని బెన్ అలీ మొదట నిందించాడు. అయితే తన పాలన మూలస్తంభాలు కదిలిపోతున్నాయని గుర్తించగానే అంతరంగిక వ్యవహారాల శాఖా మంత్రిని తొలగించడం, అవినీతిపై విచారణకు కమిటీ నియామకం వంటి చర్యలు తీసుకున్నాడు. 2011 జనవరి 13న ప్రజలకు ఎక్కువ స్వేచ్ఛను ఇస్తానని, సంస్కరణలు తెస్తాననీ, 2014లో జరుగనున్న ఎన్నికల్లో మళ్లీ పదవికి తాను పోటీ చేయకుండా దిగిపోతాననీ వాగ్దానాలు చేశాడు. అయినా ప్రజానీకం వీటిని పట్టించుకోలేదు. 'బెన్ అలీ దిగిపో' అని ముక్తకంఠంతో నినదించారు. జనవరి 14న బెన్ అలీ దేశం వదిలి పారిపోయాడు. కొద్ది గంటల్లోనే పార్లమెంటరీ స్పీకర్ ఫౌద్ మెబజా తనను తాను తాత్కాలిక అధ్యక్షుడిగా ప్రకటించుకున్నాడు. బెన్ అలీ ప్రభుత్వాన్నీ, పార్లమెంటునూ రద్దు చేసి, మధ్యంతర 'జాతీయ ఐక్యతా' ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయనున్నట్లు ప్రకటించాడు. దేశ ప్రధానమంత్రి మహమ్మద్ ఘనౌచీని తాత్కాలిక జాతీయ ఐక్య ప్రభుత్వం ఏర్పాటు చెయ్యమని ఆహ్వానించాడు. నూతన జాతీయ ఐక్య ప్రభుత్వంలో పాత అధికార పార్టీలోని కీలక మంత్రు లందరికీ స్థానం కల్పించడం ద్వారా ఘనౌచీ ప్రజల్ని మళ్లీ తీవ్రంగా ఆగ్రహపరిచారు.

1980లలో అంతర్జాతీయ ద్రవ్యనిధి టునీషియాపై సంస్థాగత సర్దుబాట్ల కార్యక్రమాన్ని రుద్దింది. ప్రజలకిస్తున్న అన్ని రకాల సబ్సిడీలను దిగకోయమని ఆదేశించింది. 1984 జనవరిలో ప్రభుత్వం ఆహార సబ్సిడీ తగ్గింపులో భాగంగా రొట్టె ధరను రెట్టింపు చేసింది. దీనితో ఆగ్రహించిన ప్రజలు నిరసన ప్రదర్శనలు చేశారు. రాజధాని టునిస్‌లో సాగిన ప్రజాందోళనపై పోలీసు కాల్పులు సాగి 50 మంది మరణించారు. ఈ ఘటన జరిగిన పది నిమిషాల్లోనే అధ్యక్షుడు బౌర్‌జీబా అంతరంగిక శాఖా మంత్రిని తొలగించినట్టూ, రొట్టె ధరను పాతస్థాయికి తగ్గించినట్టూ ప్రకటించాడు. అమెరికా రుద్దుతున్న ఆర్థిక కార్యక్రమాన్ని అమలు జరిపేది లేదని స్పష్టం చేసాడు. దీనితో ప్రజాందోళన సద్దుమణిగింది.

టునీషియా రాజకీయ రంగంలో వ్యక్తమైన జాతీయవాద ధోరణులను అమెరికా సహించలేకపోయింది. ఫ్రాన్స్ ప్రభావాన్ని తగ్గించి తన ఆధీనంలోకి తెచ్చుకునేందుకు పూనుకుంది. ఆర్థిక వ్యవస్థ ఎదుర్కొన్న సంక్షోభంతో పెరిగిన నిరుద్యోగం, ద్రవ్యోల్బణాలను చూపి, బౌర్‌జీబాను 'అసమర్థ పాలకుడి'గా ముద్రవేసి 1987లో అమెరికా సైనిక తిరుగుబాటు చేయించింది. సైన్యాధిపతి బెన్ అలీని అధ్యక్షుడిని చేసింది. ఫ్రాన్స్‌ను పక్కన బెట్టి బెన్ అలీ అమెరికా సామ్రాజ్యవాదుల బంటుగా మారాడు. నవంబర్‌లో సైనిక తిరుగుబాటు జరగ్గా డిసెంబర్‌లో ఐ.ఎం.ఎఫ్.తో ఒప్పందం చేసుకున్నాడు. జనవరిలో యూరోపియన్ యూనియన్‌తో ఒప్పందం చేసుకున్నాడు. వీటి ప్రకారం ప్రభుత్వ రంగ సంస్థలను ప్రైవేటీకరణ పేరిట విదేశీ కంపెనీల పరం చేశాడు. స్వేచ్ఛా వాణిజ్య కేంద్రాలను తెరచి అక్కడ కార్మికుల వేతనాలను 75 సెంట్లగా నిర్ణయించాడు. పశ్చిమ యూరప్ దేశాలకు కారుచౌక శ్రమశక్తిని సమకూర్చాడు. 23 ఏళ్ల పాలనలో బెన్ అలీ ప్రపంచ బ్యాంకు ఆదేశాలను తు.చ. తప్పక పాటించాడు. ప్రజలకిచ్చిన సబ్సిడీలన్నీ తగ్గించి, ఆహార సరకుల ధరల నియంత్రణ మానివేశాడు. ప్రభుత్వ రంగ కార్మికులను పని నుండి తొలగించాడు. టునీషియన్లు పొట్ట చేత పట్టుకొని విదేశాలకు వెళ్లారు. ఆరున్నర లక్షల మంది విదేశాల్లో శ్రమిస్తూ 2010లో వారు వెనక్కు పంపిన ధనం 196 వేల కోట్ల డాలర్లు. దీనితో విదేశీ అప్పులు, వాటి వడ్డీలు కట్టుకున్నాడు తప్ప ఈ విదేశీ మారక ద్రవ్యాన్ని దేశాభివృద్ధికి వినియోగించలేదు.

ఈ విధానాల ఫలితంగా టునీషియా ఆర్థిక, రాజకీయ సంక్షోభంలో చిక్కుకుంది. 15-24 ఏళ్ల వయస్సులోని యువతలో సగం మంది నిరుద్యోగులు. నిత్యావసరాల ధరలు ఆకాశాన్నంటాయి. ప్రైవేటీకరణతో ఉద్యోగ అవకాశాలు సన్నగిల్లాయి. ప్రజల జీవితాలు దుర్భరమయ్యాయి. అవినీతితోనూ, ప్రభుత్వ ఆస్తులు కొల్లగొడుతూనూ కొద్దిమంది సంపదను పోగేసుకుంటుండగా, శ్రామికవర్గాలూ, మధ్య తరగతి ప్రజలూ ఆకలి దారిద్ర్యంలో కూరుకుపోయారు. అవినీతి, అక్రమార్జనలకు అడ్డూ అదుపు లేకుండా పోయింది. బెన్ అలీ, అతని భార్య వారి బంధుగణం దేశ సంపదలో 50 శాతాన్ని కైవసం చేసుకున్నారు.

సామ్రాజ్యవాదుల అండతో బెన్ అలీ నిరంకుశ పాలన సాగించాడు. ప్రతిపక్షాలను నిర్దాక్షిణ్యంగా అణచివేశాడు. ఛాందసవాద ప్రమాదాన్ని తప్పించటమన్న సాకుతో ఉదార బూర్జువా మతవాద ధోరణులున్న ప్రధాన ప్రతిపక్షపార్టీపై 1990లో దాడి సాగించాడు. ఆ తర్వాత జాతీయవాదులు, వామపక్ష శక్తులు, ఉదారవాదులు, విద్యార్థి నాయకులపై విరుచుకుపడ్డారు. ట్రేడ్ యూనియన్లనూ, మానవ హక్కులనూ, సాంస్కృతిక, సామాజిక సంస్థలనూ, చివరకు క్రీడా సంస్థలనూ కూడా బెన్ అలీ ప్రభుత్వం అనుమతించలేదు. అటువంటి నిరంకుశ పాలనలో ప్రజలకు ఊపిరాడని స్థితి ఏర్పడింది. పండ్లు, కూరగాయలు అమ్ముకుంటున్న నిరుద్యోగిపై సాగిన దురంతం దీనికి ఆజ్యం పోసింది. ప్రజాగ్రహం పెను ఉప్పెనగా జ్వలించింది.

బెన్ అలీ ప్రభుత్వం కూలిపోయేముందు టునీషియాలోని దోపిడీ పాలకవర్గాలూ, వారి సామ్రాజ్యవాద యజమానులూ ప్రజా వెల్లువపై బురద జల్లేందుకూ, అణచి వేసేందుకూ అన్నిరకాల పద్ధతులనూ ప్రయోగించారు. అయినా ప్రజా వెల్లువ ఆగకపోవడంతో ఆరోజే కనుగొన్నట్లు బెన్ అలీ అత్యంత నిరంకుశ పాలకుడనీ, అతనే ఈ సంక్షోభానికి కారకుడనీ, అతన్ని పదవీచ్యుతున్ని చేస్తే సమస్య తీరిపోతుందని సామ్రాజ్యవాదులు మాట్లాడడం మొదలుపెట్టారు. సామ్రాజ్యవాద పత్రికలన్నీ ఈ పాటే పాడాయి. తమకు సేవ చేసిన నమ్మిన బంటును దేశం దాటించి చెత్తబుట్టలో పడేశాయి. జాతీయ ఐక్యతా మధ్యంతర ప్రభుత్వమన్నది ఈ ప్రయత్నాలలో భాగంగా ఏర్పడిందే. ప్రజా వెల్లువకు నాయకత్వం వహించిన జనరల్ యూనియన్ ఆఫ్ టునీషియన్ వర్కర్స్ (యుజిటిటి) ప్రతినిధులు ముగ్గురిని మాత్రమే ఈ ప్రభుత్వంలో మంత్రులుగా చేర్చుకున్నారు. మరుసటి రోజే జనరల్

యూనియన్ ఆఫ్ టునీషియన్ వర్కర్స్ పార్టీకి చెందిన ముగ్గురు మంత్రులు రాజీనామాలు చేశారు. బెన్ అలీని గద్దె దింపడంతో ఉద్యమకారులకు సాయపడి కీలకపాత్ర పోషించినది ఈ పార్టీనే. రక్షణ– విదేశీ వ్యవహారాలు, ఆర్థికం, అంతరంగిక వ్యవహారాలు వంటి కీలక మంత్రిత్వ శాఖలన్నీ బెన్ అలీ అనుయాయులతో నింపారు.

మంత్రివర్గంలో కొన్ని ప్రతిపక్షాలకు చోటు లభించినా, అందులో కీలక శాఖలేదు. నిరసనకారులకు మళ్లీ ప్రభుత్వం పనితీరుపై అనుమానాలు రేకెత్తుతున్నాయి. ఈ మధ్యంతర ప్రభుత్వం కొత్త సీసాలో పాత సారా అయింది.

అయితే ప్రజలీ ప్రభుత్వాన్ని గుర్తించేందుకు నిరాకరిస్తున్నారు. కొత్త ప్రభుత్వంలో మంత్రివర్గం నుండి ఆర్‌సిడి నాయకులను తొలగించాలన్నది నిరసనకారుల నినాదమైంది. జాతీయ ఐక్యత ప్రభుత్వం ఒకవైపు అణచివేత చర్యలు తీసుకుంటూనే, మరోవైపు పాత ప్రభుత్వం నుండి 'పూర్తి తెగతెంపులు' చేసుకుంటానని వాగ్దానం చేస్తున్నది. అయితే 'పూర్తి తెగతెంపులు' సామ్రాజ్యవాద ద్రవ్య సంస్థలు రుద్దిన నయా ఉదారవాద సంస్కరణల నుండి తెగతెంపులుగా ఉంటాయని మాత్రం చెప్పడం లేదు.

ప్రజా వెల్లువను తమకనుకూలంగా మలుచుకొని తమ దోపిడీ పాలనను కొనసాగించేందుకు దోపిడీవర్గాలు సకల ప్రయత్నాలూ చేస్తాయి. తమకు సేవలందించి అప్రదిష్టపాలైన పాలకుడిని పక్కనపెట్టి, మరో సేవక పాలకుడిని ప్రజా ఆమోదంతో నిలిపేందుకు పూనుకుంటాయి. ఒకవేళ ప్రజాశక్తులు పైచేయి కలిగిన ప్రభుత్వమేర్పరచ గలిగినా, అనేక బూటకపు నినాదాలతో దానిని తనకనువుగా మలుచుకునేందుకూ ప్రయత్నాలు చేస్తాయి. ఫిలిప్పైన్సులో ప్రజా వెల్లువ అగ్రభాగాన నిలిచిన ఆక్వినో సారథ్యంలోని ప్రభుత్వాన్ని ఆర్థిక మీటలతో తమకనువుగా మలుచుకున్న వైనం మన అనుభవంలో ఉంది. ప్రజా వెల్లువ విజయవంతమై ప్రజానుకూల ప్రభుత్వం ఏర్పడి కొనసాగాలన్నా, సామాజిక వ్యవస్థ మార్పుకు అది దారి తీయాలన్నా, పీడిత వర్గ ప్రయోజనాలే పరమావధిగా గల రాజకీయ శక్తులూ, నిర్మాణమూ ప్రజా వెల్లువకు నాయకత్వం వహించి నడిపించాల్సి ఉంటుంది. అది మాత్రమే ప్రజల ఆకాంక్షలను నెరవేర్చగలదు.

**ఈజిప్టులో ముబారక్ నిష్క్రమణ**

అరబ్ ప్రపంచంలో ప్రజా ఉద్యమాలు లావాలా ఉబికి వస్తున్నాయి. టునీషియా బాటలో జనవరి 25న ఈజిప్టు ప్రజానీకం కూడా ముప్పై ఏళ్లుగా పరిపాలిస్తున్న హోస్నీ ముబారక్ పదవి నుంచి వైదొలగాలని యాభై వేల మంది నిరసనకారులు కైరో నగర వీథుల్లో నిరసన ప్రదర్శన చేశారు. పోలీసులు, పారా మిలటరీ బలగాల మోహరింపును కూడా లెక్క చేయకుండా ఈ ప్రదర్శనలో పాల్గొన్నారు. సమాంతరంగా ఈజిప్టు వ్యాప్తంగా వివిధ పట్టణాల్లో వేలాదిమంది ప్రజలు ముబారక్‌కు వ్యతిరేకంగా ర్యాలీలు, బహిరంగ సభలు నిర్వహించారు. అరబ్ సమాజం సహజంగా మతపరమైన తిరుగుబాట్లకు, సైనిక కుట్రలకు, విదేశీ సైనిక జోక్యానికి ఆలవాలమన్న అపవాదును టునీషియా, ఈజిప్టు ప్రజా ఉద్యమాలు పూర్వపక్షం చేశాయి. అణచివేతకు గురవుతున్న ప్రపంచ ప్రజానీకానికి అవి స్ఫూర్తిదాయకంగా నిలిచాయి.

అత్యంత పురాతనమైన నైలు నాగరికతకు, పిరమిడ్లకు పేరుగాంచిన ఈజిప్టు సమకాలీన భౌగోళిక రాజకీయ యవనికలో ఆఫ్రికా ఖండం, మధ్యధరా సముద్ర ప్రాంతం, ఇస్లామిక్ ప్రపంచంలో కీలకమైన శక్తిగా, అమెరికా ఏజెంట్‌గా వ్యవహరిస్తోంది. మూడు దశాబ్దాలుగా ముబారక్ పదవిని పట్టుకొని వేలాడుతూ, ప్రజల సొమ్ముతో పండుగ చేసుకుంటూ, కోట్లకు పడగలెత్తుతూ, తాము మాత్రం విలాసాలు అనుభవిస్తూ, ప్రజల్ని కష్టాల్లో ముంచెత్తిన ఈజిప్టు నియంత అవినీతిపై ప్రజాగ్రహం బద్దలవుతోంది. అణచివేత తిరుగుబాటుగా ప్రజ్వరిల్లింది. అభివృద్ధి చెందిన దేశాలలో ఒకటైన ఈజిప్టులో బొగ్గు, ఆయిల్, గ్యాస్, వ్యవసాయం, పరిశ్రమ, సేవా రంగాలు సమతుల్యంగా అభివృద్ధి చెందాయి. టూరిజంలో, సూయజ్ కాలువ నిర్వహణలో గణనీయమైన ఆదాయాన్ని గడిస్తోంది.

ఒక గొప్ప ప్రజాస్వామిక దేశం కంటే ఒక సమర్థుడైన నియంత పాలనలోని దేశంతో సంబంధాలు కొనసాగించడం లాభదాయకమన్న దౌత్యనీతి నేపథ్యంలో ముబారక్ ప్రభుత్వంతో అమెరికాకు సన్నిహిత సంబంధాలు దశాబ్దాలుగా కొనసాగాయి. అరబ్ ప్రపంచంలో అమెరికా జోక్యానికి, దౌత్యానికి ఈజిప్టు పావుగా మారింది. 1977లో కూడా ఇలాగే ఆకలి దాడులు ఈజిప్టును కుదిపేశాయి. వాటి పర్యవసానంగా 1981లో హోస్నీ ముబారక్ అధ్యక్షుడిగా అధికారాన్ని చేపట్టారు. ప్రకృతి సంపదలైన చమురు, సహజ వాయువు నిక్షేపాలు అరబ్ సమాజానికి శాపంగా మారాయి. ఆ దేశాలు అమెరికా, యూరోపియన్ వలస దేశాల భౌగోళిక రాజకీయాల చదరంగంలో పావులుగా, సమిధలుగా మారి పోయాయి. దాంతో ఆయా సమాజాల్లో సాధారణ ప్రజాస్వామిక ప్రక్రియ దెబ్బతిన్నది. మతం, అధికార ముఠాలు, రాజుల, నియంతల పాలనలో వాటి ప్రగతి ఛిద్రమైంది.

'ఆహారం, స్వేచ్ఛ' నినాదాలతో నిరసనకారులు ఈజిప్టు పట్టణాలను హోరెత్తించారు. ముబారక్ వారసుడిగా ప్రచారంలో ఉన్న ఆయన కుమారుడు భయపడి కుటుంబంతో సహా లండన్‌కు పారిపోయాడు. అధికార పార్టీ ప్రధాన కార్యాలయాన్ని వేలాదిమంది ప్రజలు చుట్టుముట్టారు. ఒక విధమైన అంతర్యుద్ధ వాతావరణం సర్వత్రా నెలకొంది. అయిదుగురు యువకులు ఆత్మాహుతి చేసుకున్నారు. ఈజిప్టు ప్రతిపక్షం ఉద్యమకారుల చర్యలను ఆరంభంలో నిరసించింది. ఈజిప్టులో టునీషియా సంఘటన పునరావృతం కాకుండా ఉండేందుకు ఉద్యమాన్ని నీరుగార్చే చర్యల్లో భాగంగా అన్ని పార్టీలతో కూడిన 'ప్రత్యామ్నాయ పార్లమెంట్ వేదిక' ప్రముఖ ప్రతిపక్ష నాయకుడు మహమ్మద్ ఎల్ బరాదీ సారథ్యంలో ఏర్పడింది. ముబారక్ పార్టీతో (నేషనల్ డెమొక్రటిక్ పార్టీ) సహా ముస్లిం బ్రదర్‌హుడ్, ఎస్సెమ్ ఎల్ ఎరియన్, నేషనల్ ప్రోగ్రెసివ్ యూనియన్ పార్టీ, జనరల్ యూనియన్ ఆఫ్ అగ్రికల్చరల్ వర్కర్స్ అనే ట్రేడ్ యూనియన్‌తో సహా ప్రతిపక్ష పార్టీలు, ప్రజా సంఘాలన్నీ ఇందులో భాగమయ్యాయి. ప్రతిపక్ష పార్టీలు, ట్రేడ్ యూనియన్‌లు 'మార్పు కోసం వేదిక' అన్న నినాదంతో ప్రజా ప్రదర్శనలను వ్యతిరేకించాయి. తమ సభ్యులను ఆ ఉద్యమాలలో పాల్గొనకుండా కట్టడి చేయడమే కాకుండా పాల్గొన్న వారిపై బహిష్కరణ వేటు వేశాయి.

అమెరికా, ఈయూ దేశాల కబంధ హస్తాల్లో ఇరుక్కుపోయిన ఉత్తర ఆఫ్రికా, పశ్చిమ ఆసియా దేశాల అరబ్ వాణిజ్య, పారిశ్రామిక వేత్తలు, పాలకవర్గాల ఆశ్రిత పెట్టుబడిదారీ విధానాలకు వ్యతిరేకంగా ప్రజా ఉద్యమాలు ఈజిప్టులో ముందుకొచ్చాయి. ఈ ఉద్యమాలను అణచి వేసేందుకు మొదట అమెరికా పావులు కదిపింది. ప్రజా ఉద్యమం తీవ్రరూపం దాల్చడంతో వేల కోట్ల డాలర్ల భారీ మిలటరీ సహాయం

అందుకున్న ఈజిప్టుతో  ఆచితూచి అడుగులు వేసింది. టునీషియాలో ఫ్రాన్స్ తొత్తు బెన్ అలీని సమర్థించని అమెరికా ఈజిప్టులో మాత్రం ముబారక్‌కు తన సంపూర్ణ సహకారం అందించింది. అమెరికా ఎత్తులు, జిత్తులను గుర్తించి, ప్రత్యామ్నాయ రాజకీయాలతో ఈ ప్రజా ఉద్యమాలను సంఘటితం చేయగలిగే రాజకీయ శక్తి నాయకత్వం వహిస్తేనే ఈజిప్టు  ప్రజలకు నిజమైన విముక్తి సాధ్యమవుతుంది.

ముప్పై ఏళ్ల పాటు ఈజిప్టును ఏకఛత్రాధిపత్యంగా పాలించిన ముబారక్‌కు వ్యతిరేకత అన్నివర్గాల ప్రజల నుండి బాహాటంగా వ్యక్తమయింది.  బలీయమైన ఈజిప్టు సైన్యం కూడా ప్రజా తిరుగుబాటుకు నివ్వెరపోయింది. అమెరికాకు నమ్మకమైన వ్యక్తి నియంత ముబారక్. అమెరికా, ప్రపంచ బ్యాంకు తలపెట్టిన నూతన ఆర్థిక సంస్కరణలకు ఈజిప్టు దేశ ప్రజల జీవన ప్రమాణాలు దిగజారిపోవడం, ఉపాధి అవకాశాలు లభించకపోవడం, అన్నింటికన్నా మించి ప్రజాస్వామ్య ప్రాథమిక హక్కులు లేకపోవడం, ప్రజాగ్రహానికి ప్రధాన కారణాలయ్యాయి. ప్రజా ఉద్యమం ఊపందుకున్న తరువాత మంత్రివర్గాన్ని రద్దు చేసి సంస్కరణ బాట పడతానని ప్రకటించిన కొద్ది గంటల్లోనే అధ్యక్షుడు ముబారక్ తన సన్నిహిత ఇంటెలిజెన్స్ అధికారి ఒమర్ సులేమాన్‌ను దేశ ఉపాధ్యక్షునిగా,  పౌర విమానయాన మంత్రి అహ్మద్ షఫీక్‌ను కొత్త ప్రధానిగా చేసినా ప్రయోజనం చేకూరలేదు.

'మార్చి ఆఫ్ ఎ మిలియన్'  ప్రదర్శకులతో కైరోలోని తహ్రీర్ స్క్వేర్ కిటకిటలాడిపోయింది. ఈ జనసంద్రం, కర్ఫ్యూను ధిక్కరించి సమీపంలోనే ఉన్న సైనిక దళాలను, వారి ట్యాంకులను లెక్కచేయకుండా మున్ముందుకే సాగిపోయింది. ముబారక్ గద్దె దిగాలని,  ప్రజల జీవన స్థితిగతులను మెరుగుపరిచే ప్రజాస్వామ్య సంస్కరణలను ఉనికిలోకి తీసుకురావాలని నినదించారు. ఫిబ్రవరి 11న రాజ్యాంగాన్ని, పార్లమెంట్‌ను రద్దుచేసి సైనిక మండలికి అధికారాన్ని అప్పగించి ముబారక్ రహస్య స్థలానికి వెళ్లాడు. ఈ సైనిక మండలి ప్రజాస్వామిక ఉద్యమం ముందుకు తెచ్చిన డిమాండ్లను ఏ మేరకు పరిష్కరిస్తుందో చూడాలి. ఈజిప్టుకు రక్షణ మంత్రిగా ఉండిన వ్యక్తి ఇప్పుడు సైనిక మండలి తాత్కాలిక దేశాధినేత. ముబారక్ నియమించిన వ్యక్తి ఇప్పటికీ ప్రధానిగానే ఉన్నాడు. దశాబ్దాలుగా అమెరికా ఆయుధ కౌగిలిలో పరవశించిన సైన్యం చేతిలో ఈజిప్టు భవితవ్యం చిక్కుకొని ఉంది. ఆ దేశాధికారి మాత్రం రెండు మాసాల్లో నూతన రాజ్యాంగం రచన జరిగిపోతుందని ప్రజలకు హామీ ఇచ్చాడు. అలాగే అంతర్జాతీయ ఒప్పందాలను గౌరవిస్తానంటూ ఇజ్రాయిల్‌కు హామీలు ఇవ్వడం గమనార్హం.

### అరబ్ దేశాలలో ప్రజా ప్రభంజనం

అరబ్ ప్రజల మద్దతు పాలస్తీనా ప్రజలకున్నా, పాలకులు మాత్రం ఇజ్రాయిల్‌కు వ్యతిరేకంగా ప్రజలంతా ఒకటి గాకుండా ఆపగలుగుతున్నారు. అమెరికా అనేక అరబ్బు దేశాలలో సైనిక స్థావరాలను ఏర్పాటు చేసింది. సాధారణ ఇస్లామిక్ సంస్థల నుంచి మొదలుకొని అల్‌ఖైదా వంటి మిలిటెంట్ సంస్థల వరకు దేనికైనా సరే తమ ప్రయోజనాలకు అవసరమైనపుడు ప్రోత్సహించి అవసరం తీరాక అణచివేతకు గురిచేయడం అమెరికా రాజనీతి. ఇదంతా ఒక ఎత్తయితే, ప్రపంచ దేశాలన్నిట  ప్రజాస్వామ్యం నెలకొనాలని ప్రవచించే అమెరికాకు,  వారి నాటో మిత్రులకు  మాత్రం అరబ్ దేశాలలో మాత్రం ప్రజాస్వామ్యం మాట గుర్తుకు రాకపోవడం మరొక ఎత్తు.  తమకు నచ్చిన అనుకూలురైన నియంతలుంటే ప్రజాస్వామ్యం అణచివేతకు గురవుతున్నా పన్నెత్తి మాట్లాడరు. నచ్చనిచోట మాత్రం ప్రజాస్వామ్యం లేదంటూ గగ్గోలు పెడతారు.

అరబ్ ప్రపంచంలో, ఆఫ్రికా ఖండంలో నియంతృత్వ ప్రభుత్వాలకు వ్యతిరేకంగా ప్రజాగ్రహం మిన్నంటుతున్నది. టునీషియా, ఈజిప్టు, బహ్రెయిన్, అల్జీరియా, జోర్డాన్, సూడాన్, యెమెన్ దేశాలలో ప్రజా వెల్లువతో పాశ్చాత్య దేశాలు కలవరపడుతున్నాయి. అధిక ధరలు, నిరుద్యోగం తీవ్రత, యువతను పీడిస్తున్నాయి. వీధి పోరాటాలు, సమ్మెలు, నిరసనలు, ప్రజా ప్రతిఘటనలతో ప్రభుత్వాధినేతలు ఖంగుతింటున్నారు.

అల్జీరియా నుండి ఒమన్ వరకు, సూడాన్ నుండి జోర్డాన్ వరకు వెల్లువెత్తిన ప్రజాఉద్యమాలు ప్రపంచ దేశాలలోని ప్రజాతంత్ర ఉద్యమకారులకు స్ఫూర్తి నిస్తాయనడంలో సందేహంలేదు. అరబ్ దేశాల్లోని బహ్రెయిన్, కువైట్, మొరాకో, యెమెన్, ఖతర్, సౌదీ అరేబియా, యుఎఇల్లో ఇప్పటికీ రాచరిక వ్యవస్థే కొనసాగుతోంది. మిగతా దేశాలు పేరుకు మాత్రమే రిపబ్లిక్ దేశాలు. పాలకుల నిరంకుశత్వం, అవినీతి, హక్కుల అణచివేతలు సర్వసామాన్యం. అరబ్ దేశాలలో ప్రారంభమైన పౌర ఉద్యమం ప్రభావాన్ని చూస్తే అమెరికా విషమ పరిస్థితినే ఎదుర్కొంటున్నట్లు కనిపిస్తోంది. అరబ్ ప్రపంచం ఎంతో కాలంగా మతపరమైన తీవ్రవాదం, నియంతృత్వంతో నలిగిపోతోంది. ఈ ఉద్యమాల వల్ల అమెరికా దన్ను ఉన్న నియంతలు అంతర్ధానం కావాలని, మతఛాందసవాదం స్థానంలో లౌకిక ప్రజాస్వామిక విలువలు పరిఢవిల్లాలని ఆశిద్దాం. అరబ్ ప్రపంచం మరింత ప్రజాస్వామ్య స్ఫూర్తితో ఇతర ప్రపంచంతో మమేకమవుతుందని,  తద్వారా సామ్రాజ్యవాదుల దోపిడీ పీడనలకు చరమగీతం పాడుతుందని భావిద్దాం.

*(రచయిత ఉపాధ్యాయ ఉద్యమ నాయకులు)* వీ


Statement about ownership and other particulars of periodical **VEEKSHANAM** as required to be published in the first issue of every year after the last day of February

**Form IV (See Rule 8)**

| | | |
|---|---|---|
| 1. | Place of publication | : Hyderabad |
| 2. | Periodicity of its publication | : Monthly |
| 3. | Printer's name | : N. Venugopal Rao |
| | Whether citizen of India | : Indian |
| | Address | : Mythri Residency<br>3-6-394, Street No. 3<br>Himayatnagar,<br>Hyderabad - 500 029. |
| 4. | Publisher's name | : N. Venugopal Rao |
| | Whether citizen of India | : Indian |
| | Address | : Mythri Residency<br>3-6-394, Street No. 3<br>Himayatnagar,<br>Hyderabad - 500 029. |
| 5. | Editor's name | : N. Venugopal Rao |
| | Whether citizen of India | : Indian |
| | Address | : Mythri Residency<br>3-6-394, Street No. 3<br>Himayatnagar,<br>Hyderabad - 500 029. |
| 6. | Name and addresses of individuals who own the newspaper | : N. Venugopal Rao |

I, N. Venugopal Rao, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

*Sd/-*

*(N. Venugopal Rao)*

Date : 1st March, 2011 — Signature of the Publisher

ఈజిప్ట్‌లో నివురుగప్పినట్లు ఉన్న ప్రజా అసంతృప్తి ఏ క్రమంలో పెరిగిందో ఆ క్రమాన్ని అరబ్ చారిత్రక పరిణామాల నేపథ్యంలో విశ్లేషిస్తున్నారు **ఎరిక్ రుడర్**

# నాసర్ నుంచి ముబారక్ వరకు

గాజాపై అమెరికా, ఇజ్రాయిల్ విధించిన వ్యాపార దిగ్బంధాన్ని అమలు చెయ్యడానికి 2009 చివరిలో ఈజిప్ట్ చేపట్టిన సిగ్గుమాలిన పనులతో ప్రపంచం అవాక్కయింది. దీంట్లో మొదటి చర్య భూగర్భంలో ఉక్కు రేకులతో ఆరుమైళ్ల గోడ కట్టడానికి ఈజిప్ట్ పూనుకోవడం. గాజా ప్రజలు 2006లో హమాస్ నాయకులను తమ పాలకులుగా ఎన్నుకున్న నాటి నుంచి ఇజ్రాయిల్ తన వ్యాపార దిగ్బంధాన్ని మరింత తీవ్రతరం చేయసాగింది. ఈ కాలంలో భూగర్భ సొరంగాలు గాజా ఆర్థిక స్థితికి దన్నుగా నిలిచాయి. ఈ సొరంగాలకు అడ్డం పడడమే ఈజిప్ట్ తలపెట్టిన భూగర్భ గోడల లక్ష్యం. అమెరికా సైన్యానికి చెందిన ఇంజనీర్ల సహాయంతో కడుతున్న ఈ గోడ కొన్ని ప్రదేశాలలో 80 మైళ్ల లోతు వరకు వెళుతుంది. ఈ గోడను కత్తిరించడం గానీ, కరిగించడం గానీ అసాధ్యం. ఈ గోడలోని గొట్టాల ద్వారా సముద్రపు నీరు తోడి పొయ్యాలని ఈజిప్ట్ అధికారులు తలపోస్తున్నారు. ఈ గోడ కింద నుంచి సొరంగం తవ్వాలని గాజా ప్రజలు ప్రయత్నిస్తే వారికి అది మృత్యుపాశమే అవుతుంది. అంతేకాదు, సముద్రపు నీరు నింపడం వల్ల వ్యవసాయానికి, తాగునీటికి భూగర్భ జలాలపై ఆధారపడిన సమీప ప్రాంత గాజా ప్రజల జీవితం దుర్భరమవుతుంది.

ఇక రెండవ చర్య – రఫా సరిహద్దు ద్వారా గాజాలోకి వెళ్లడానికి పూనుకున్న మద్దతుదారులను విభజించడానికి, వారి ప్రయత్నాలను అడ్డుకోవడానికి ఈజిప్ట్ ప్రభుత్వం చెయ్యని పని అంటూ లేదు. గాజాపై ఇజ్రాయిల్ మిలటరీ దాడిలో చనిపోయిన 1400 మంది పాలస్తీనీయన్లు, గాయపడిన, నిరాశ్రయులైన వేలాది మందికి సంఘీభావంగా ఆ ఘటన జరిగిన ప్రథమ వార్షికోత్సవం నాటికి గాజా స్వేచ్ఛా పాదయాత్ర (ఫ్రీడం మార్చ్) చేపట్టారు. కైరో నుంచి రఫాకి వెళ్లకుండా పాదయాత్రికులను ఈజిప్ట్ అధికారులు అడ్డుకోవడమే కాకుండా తమ యాత్రను అడ్డుకున్నందుకు నిరసనలను తెలుపుతున్న అంతర్జాతీయ కార్యకర్తలపై సాయుధ దళాలు దాడులకు, వేధింపులకు పూనుకున్నాయి. మానవతా సహాయాన్ని అందించడానికి వెళుతున్న వివా పాలస్తీనా బృందాల్ని ఈజిప్ట్ ఇబ్బందిపాలు చేసిన విధానం సిగ్గుమాలినదిగా ఉంది. ఎల్ అరిష్ రేవుకి చేరుకుంటే సరిహద్దు దాటనిస్తామని చెప్పి తీరా ఐదువందల మంది అక్కడికి చేరుకున్న తరువాత లాఠీలతో విరుచుకుపడ్డారు. వారిలో యాభై మంది (కొందరు తీవ్రంగా) గాయపడ్డారు. పాదయాత్రికులను చిట్ట చివరకు గాజాలోకి వెళ్లనిచ్చారు. కానీ చాలా కొంచెం సమయమే వారికిచ్చారు.

ఈ చర్యలు ఒక అనివార్య ప్రశ్నను లేవనెత్తుతాయి. ఒకప్పుడు ప్రగతిశీల అరబ్బు జాతీయతావాదానికి నేతగానూ, పాలస్తీనియా జాతి ప్రజల హక్కుల సంరక్షకురాలిగానూ గుర్తింపబడిన ఈజిప్ట్ అంతర్జాతీయ చట్టాన్ని, తోటి అరబ్బు దేశానికి న్యాయాన్ని తిరస్కరించే విధంగా దిగ్బంధాన్ని అమలు చేయడంలో అమెరికా, ఇజ్రాయిల్‌కు బహిరంగంగా సహకరించేలా ఎలా మారింది? అమెరికాకి కారుచౌకగా అమ్ముడుపోయి ఈ విధంగా సహకరించడంతో ఈజిప్ట్‌ని అసహ్యించుకుంటున్నారు.

అయితే ఈజిప్ట్ కేవలం బయటి ఒత్తిడి ఫలితంగా మాత్రమే దిగ్బంధనానికి సహకరించడంలేదు. పాలకుల స్వప్రయోజనాలు కూడా ఇందులో ఉన్నాయి.

దిగ్బంధాన్ని సమర్థించడంలో ఈజిప్ట్ అంతర్గత కారణాలను విస్మరించకూడదు. సాయుధ మిలిటెంట్ ఇస్లామిక్ బృందమైన హమాస్ పట్ల ఈజిప్ట్ ప్రభుత్వానికి అపనమ్మకం ఉంది. ఇరాన్ తొత్తుగానే కాక ఈజిప్ట్‌లో అతిపెద్ద ప్రతిపక్షమైన ముస్లిం బ్రదర్‌హుడ్ మద్దతుదారుగా హమాస్‌ని చూస్తుంది.

పాలస్తీనియా ఉద్యమానికి దూరమవుతూ ఇజ్రాయిల్‌కి భద్రతా సహకారాన్ని అందించడమనే దశాబ్దకాల ప్రక్రియ హమాస్ ఎన్నికతో కీలక మలుపు తిరిగి చరమాంకంగా భూగర్భ గోడ నిర్మాణం జరిగింది. గల్ఫ్ ప్రాంతం (మధ్య ప్రాచ్యం)లో అమెరికా సామ్రాజ్య వాదాన్ని బహిరంగంగా ఎదుర్కోవడం నుంచి 'వ్యూహాత్మక భాగస్వామి'గా ఈజిప్ట్ మారిన 'దశాబ్దాల ప్రక్రియ'ను, పాలస్తీనా విముక్తి పోరాటంపై దీని ప్రభావాన్ని ఈ వ్యాసం పరిశీలిస్తుంది.

**నాసరిజం**

గల్ఫ్ ప్రాంతంలో మధ్యన కీలక స్థానంలో ఈజిప్ట్ ఉండడం, 1869లో సూయజ్ కాలువ తవ్వడంతో నలుదిశలా విస్తరించిన వలస ప్రాంతాలపై, ప్రత్యేకించి ఇండియాపై తన నియంత్రణను కొనసాగించడంలో తన చెప్పుచేతల్లో ఉండే ఈజిప్ట్ కీలకమని బ్రిటిష్ సామ్రాజ్యం భావించింది. ఒక తిరుగుబాటును అణచివేసే సాకుతో 1882లో సూయజ్ ప్రాంతాన్ని బ్రిటిష్ ఆక్రమించుకుంది. న్యూయార్క్ టైమ్స్‌కి గల్ఫ్ ప్రతినిధిగా పనిచేసిన కెన్నెట్‌లవ్ మాటల్లో 'ఆ ప్రాంతం నుంచి ఉపసంహరించుకుంటాం అన్న బ్రిటిష్ సామ్రాజ్య వాగ్దానాన్ని కార్యరూపం దాల్చేలా చెయ్యడానికి ఈజిప్ట్ జాతీయతావాదులకు 72 సంవత్సరాలు పట్టింది.'

ప్రపంచ ఆర్థిక వ్యవస్థకి, గల్ఫ్ చమురు రవాణాకి సూయజ్ కాలువ ప్రాముఖ్యత పెరుగుతుండడంతో ఆ ప్రాంతంలోని అరబ్ పాలకులతో 'స్నేహపూర్వక సంబంధాలు' బలపరుచుకోవడంపై అమెరికా దృష్టి కేంద్రీకరించింది. అయితే 1948లో ఏర్పడిన ఇజ్రాయిల్‌కి

అమెరికా మద్దతునివ్వడం పరిస్థితులను కొంత సంక్లిష్టపరిచింది. వలస ప్రాంతాలు విముక్తమవుతున్న కాలంలో పాలస్తీనాను ఇజ్రాయిల్ వలస ప్రాంతంగా ఆక్రమించుకోవడాన్ని అమెరికా సమర్థించడం ఎవరూ జీర్ణించుకోలేక పోయారు.

ఈజిప్ట్‌లో 1952లో సైనిక తిరుగుబాటులో బ్రిటిష్ అనుకూల చక్రవర్తి ఫరూక్ దేశం విడిచిపోగా ఫ్రీ ఆఫీసర్స్ అన్న యువసైనిక బృందం అధికారంలోకి వచ్చింది. ఆ బృందంలో గమల్ అబ్దెల్ నాసర్ ఒకడు. ఆ ప్రాంతమంతటా పాశ్చాత్య శక్తులను వ్యతిరేకించే బృహద్ అరబ్ సంఘీభావాన్ని ఆకాంక్షిస్తూ పెల్లుబికిన జాతీయతా భావ వెల్లువలో నాసర్ పైకి ఎగబాకాడు. ఈ ఉద్యమం కోట్లాది ప్రజలను ప్రభావితం చేసింది. అటు అమెరికా నుంచి, ఇటు సోవియట్ యూనియన్ నుంచి స్వతంత్రతను కోరుకుంటున్న అరబ్బు ప్రపంచానికి ఈజిప్ట్ నాయకత్వ స్థానాన్ని పొందింది.

ఫరూక్ అనంతర ఈజిప్ట్‌లో తన అధికారాన్ని సుస్థిరం చేసుకునే క్రమంలో ఈజిప్ట్ సార్వభౌమత్వానికే మచ్చగా నిలిచిన బ్రిటిష్ సైనిక స్థావరాలను తొలగించడంలో సహకారం కోసం నాసర్ చూడసాగాడు. పెరుగుతున్న అమెరికా ప్రాబల్యాన్ని ఊతంగా చేసుకుని బ్రిటిష్ వాళ్లను వెళ్లగొట్టవచ్చని నాసర్ ఆశించాడు. ఆ పరిస్థితుల్లో ఈజిప్ట్‌కి కెర్మిట్ రూజ్‌వెల్ట్‌ను అమెరికా పంపించింది. 'పాశ్చాత్య దేశాలలో అధికారంలోకి వచ్చే అవకాశం ఉన్న వారిని తమకి అనుకూలంగా మలుచుకోడానికి యూరోపియన్లు పంపించినట్లే అమెరికా రూజ్‌వెల్ట్‌ను పంపించింది. ఆఫ్రికా, ఆసియాలలో వలస పాలన అనంతర నాయకులపై అమెరికా ప్రభావం ఉండేలా చూడడం ఇతడి పని. మొదట్లో నాసర్ మంచి విద్యార్థి గానే, ఎంతో ఉత్సాహం కనబరిచే విద్యార్థిగానే అనిపించాడు.'

అమెరికా నుంచి ఆశించిన స్థాయిలో ఆర్థిక సహాయం అందకపోవడం, ఆయుధాల బదిలీ నత్తనడకన సాగడంతో నాసర్ తీవ్ర అసహనానికి గురయ్యాడు. దాంతో ఈజిప్ట్, అమెరికాల మధ్య సహృద్భావ వాతావరణం అనతి కాలంలోనే ఆవిరైపోయింది. ఇజ్రాయిల్‌తో సంబంధాలు మరింత దెబ్బతినకుండా ఉండడానికి ఈజిప్ట్‌కి బహిరంగ మద్దతును అమెరికా ఉపసంహరించుకుంది.

మరో రెండు పరిణామాలు నాసర్‌ను పాశ్చాత్య దేశాలతో నేరుగా ఢీకొనేలా ప్రేరేపించాయి. మొదటిది – 1955లో 29 స్వతంత్ర ఆఫ్రికా, ఆసియా దేశాల బాండుంగ్ సమావేశంలో అలీన దేశాలుగా బలమైన శక్తిగా ఎదుగుతాయని భావించారు. దాని నాయకుడిగా నాసర్‌కి ఎంతో ప్రతిష్ట లభించింది. రెండవది – ఆ తరువాత కొద్ది నెలలకే సోవియట్ బ్లాక్‌తో ఆయుధాల ఒప్పందాన్ని నాసర్ కుదుర్చుకున్నాడు. దీంతో ఈజిప్ట్ సైనిక శక్తి పెరిగి అరబ్ ప్రపంచానికి నాయకత్వ స్థానం లభిస్తుందని ఆశించారు. చెక్‌స్లోవేకియాతో ఇరవై కోట్ల డాలర్ల ఒప్పందంలో భాగంగా 200 ఎం.ఐ.జి.–15 యుద్ధ విమానాలు, 275 టి–34 యుద్ధ ట్యాంకులు, ఇతర సామాగ్రి ఉన్నాయి.

ఈజిప్ట్ సంక్షుభిత ఆర్థిక వ్యవస్థ వల్ల కూడా అమెరికాతో దాని సహనం సన్నగిల్లింది. అమెరికా వ్యవసాయ సబ్సిడీల ఫలితంగా ప్రపంచ మార్కెట్లో అమెరికా రైతులు చౌక పత్తితో ముంచెత్తిన కారణంగా ఈజిప్ట్ వ్యవసాయ ఉత్పత్తుల్లో కీలకమైన పత్తి ఎగుమతులు 26 శాతం పడిపోయాయి. ఈ పత్తిని కొనడానికి చైనా, రష్యా ముందుకొచ్చాయి. అంతే కాకుండా డాలర్లు, పౌండ్లు నగదు రూపంలో చెల్లించనవసరం లేకుండా ఆయుధ ఒప్పందాలు కుదుర్చుకున్నాయి.

పాశ్చాత్య దేశాలతో సంబంధాలు ఈ విధంగా దెబ్బతినడంతో సూయజ్ కాలువను నాసర్ జాతీయీకరణ చేశాడు. దాని ఫలితంగా కాలువ, దాని నుంచి ప్రతి సంవత్సరం వచ్చే పది కోట్ల డాలర్ల ఆదాయం ప్రభుత్వం నియంత్రణలోకి వచ్చాయి. ఈ చర్య ఫలితంగా పాశ్చాత్య దేశాల ప్రభుత్వాల వెన్నులో దడ పుట్టించింది. తమ ప్రయోజనాలను దెబ్బతీసే చర్యకు పూనుకున్నందుకు గుణపాఠం చెప్పాలని ఈజిప్ట్‌పై దాడికి బ్రిటన్, ఫ్రాన్స్, ఇజ్రాయిల్ సైనిక ఒప్పందం కుదుర్చుకున్నాయి. ఈ ప్రాంతంలో ఆధిపత్యం సాధించాలనుకుంటున్న అమెరికా తన పోటీదారులు దానిని నేరుగా ఆక్రమించుకునే కొత్త యుగం ఆరంభ మవుతుందేమోనని భయపడింది. లక్ష్యం పూర్తిగా సాధించకముందే యుద్ధం నుంచి విరమించుకునేలా బ్రిటిష్, ఫ్రాన్స్‌లపై అమెరికా ఒత్తిడి తీసుకురాగలిగింది. సినాయ్ ద్వీపకల్పంలో ఆక్రమించుకున్న భూ భాగం నుంచి కొన్ని నెలల తరువాత ఇజ్రాయెల్ వెనక్కు మళ్లింది. దాంతో నాసర్ విజయుడుగా నిలిచాడు.

**ఈజిప్ట్‌లో ప్రభుత్వ ఆధ్వర్యంలో పెట్టుబడిదారీ విధానం**

ఏ ఒక్క రాజకీయ విధానానికో, ఆర్థిక విధానానికో నిబద్ధత కంటే అమెరికా, సోవియట్ యూనియన్ నుంచి మద్దతు పొందడంలో లౌకికానికి నాసర్ నేతృత్వంలోని ఈజిప్ట్ పెద్దపీట వేసింది. రాజకీయ, లేదా ఆర్థిక చర్య ఫలానా అరబ్బు ప్రపంచానికి తిరుగులేని నాయకుడుగా ఎదగడానికి దోహదపడుతుందా, లేదా అన్నది నాసర్‌కి ఏకైక కొలబద్దగా మారింది. సూయజ్ కాలువ జాతీయీకరణతో పాటు ఈజిప్ట్ ప్రతిష్టాత్మకంగా చేపట్టిన ఎత్తైన ఆనకట్టల నిర్మాణం, ఆర్థిక వ్యవస్థ జాతీయీకరణ దిశగా ఈజిప్ట్‌ను ప్రేరేపించింది. ఆపాటికే పారిశ్రామిక ప్రగతి సాధించిన పాశ్చాత్య దేశాల స్థాయిని చేరుకునేలా పారిశ్రామికీకరణ, ప్రాజెక్టుల నిర్మాణానికి అవసరమైన పెట్టుబడులను సమకూర్చుకోడానికి అనేక అభివృద్ధి చెందుతున్న దేశాలు ఈ పంథానే ఎంచుకున్నాయి.

అరబ్ గల్ఫ్ దేశాలతో పోలిస్తే ఈజిప్ట్ చమురు ఉత్పత్తి చారిత్రకంగా నామమాత్రమే. అయితే, ఈజిప్ట్ రాజకీయ నాయకత్వం వల్ల చమురు దండిగా ఉన్న అరబ్ దేశాలలో పెరుగుతున్న సంపద నుంచి అది లాభపడింది. రాజకీయ, ఆర్థిక రంగాలలో ఆధునిక శక్తిగా ఎదుగుతున్న అరబ్ దేశాలకు నాయకత్వ స్థానంలో ఈజిప్ట్ ఉందన్న భావనను ఇది బలోపేతం చేసింది. '1960ల మధ్య కాలం నాటికి అరబ్బు దేశాలలో అయిదు అతిపెద్ద చమురు ఉత్పత్తి దారులైన ఇరాక్, కువైట్, సౌదీ అరేబియా, లిబ్యా, అల్జీరియాల ప్రభుత్వ ఆదాయం సంవత్సరానికి 200 కోట్ల డాలర్లకు చేరుకుంది. ఈ ఆదాయంతో ఆధునిక సమాజానికి అవసరమైన మౌలిక సదుపాయాల నిర్మాణం, సామాజిక సేవల విస్తరణలకే కాకుండా వాటి పునాదులైన రక్షణ, భద్రత వ్యవస్థలనూ, పరిపాలనా వ్యవస్థనూ మరింతగా బలోపేతం చేశారు.'

ఈజిప్ట్‌లో ఆర్థిక అభివృద్ధి దిశను నిర్దేశించడానికి ప్రభుత్వాధీనం లోని పెట్టుబడిదారీ విధానాన్ని అనుసరించారన్నది నొక్కి వక్కాణించాలి. సోవియట్ యూనియన్‌తో మైత్రి, విప్లవపూరిత జాతీయతా భావాలతో నాసర్ ఉపన్యాసాల వల్ల ఆర్థిక విధానంలో ఈజిప్ట్ ప్రభుత్వ జోక్యాన్ని 'సోషలిస్టు'గా పేర్కొనడం పరిపాటి అయిపోయింది. అయితే వాస్తవ పరిస్థితులు ఇందుకు భిన్నంగా ఉన్నాయి.

ప్రభుత్వాధీనంలోని పెట్టుబడిదారీ పంథాను అనుసరించి ఆర్థిక వ్యవస్థలో మార్పులు జరిగాయి కానీ, పెట్టుబడిదారీ ఉత్పత్తి సంబంధాలలో

ఎటువంటి మార్పు జరగలేదు. సమానత వైపుకి సాగాలని ఎంతగా ఆశించినప్పటికీ, తొలి అడుగులు వేసినప్పటికీ ఒక సమగ్ర పథకం రూపొందించడంలో (రాజ్యాన్ని నియంత్రిస్తున్న అధికారుల) సామాజిక వర్గ చేతకానితనం వల్ల ముందుకు సాగడం చాలా సమస్యాత్మకమై పోయింది. ఒక విప్లవాత్మకశక్తిగా పనిచేస్తుందనుకున్న జాతీయతా భావం చివరికి సాంప్రదాయ వర్గాల, ప్రభుత్వ ఆధీనంలో రూపుదిద్దుకుంటున్న పెట్టుబడిదారీ వర్గాల సామాజిక - ఆర్థిక స్వభావాలను గుర్తించకుండా చెయ్యడంలో దోహదపడింది.

ఈజిప్ట్ సంపన్నవర్గం పాలనా పగ్గాలు చేపట్టడానికి అంతిమంగా నాసర్ జాతీయతావాదం దోహదం చేసింది. పెరుగుతున్న ఈజిప్ట్ శ్రామిక వర్గ కోరికలను అణచివెయ్యడానికి ఈ వర్గం జాతీయతావాద భావజాలాన్ని వాడుకుంది.

**ఈజిప్ట్, పాలస్తీనియన్లు, 1967 యుద్ధం**

ఈజిప్ట్ నేతృత్వంలో అరబ్బు దేశాల ఐక్యత సాధించాలన్న నాసర్ పథకం 1960ల ఆరంభంలోనే బీటలు వారింది. ముందుగా అరబ్బు దేశాలు రెండుగా చీలిపోయాయి. 'మొదటిది ప్రధానంగా నాసర్ పంథాలో వేగవంతమైన లేదా విప్లవాత్మక మార్పులకు కట్టుబడ్డ దేశాలు కాగా రెండవది, రాజకీయ సామాజిక మార్పులో జాగరూకత వహిస్తూ నాసర్ ప్రభావం విస్తరించడాన్ని వ్యతిరేకించే రాచరిక పాలనలో ఉన్న దేశాలు. అంతే కాకుండా తమ వ్యవహారాల నిర్వహణలో ఇరవై సంవత్సరాల పాటు స్వతంత్ర గొంతులేని పాలస్తీనియన్లకు 1964లో పాలస్తీనియా విముక్తి సంఘం (పి.ఎల్.ఒ.) ఏర్పడింది. పాలస్తీనియన్ జాతీయ హక్కుల కోసం ఇది ఇజ్రాయెల్‌లో చర్యలకు పూనుకుంది. 1948 యుద్ధం తర్వాత పాలస్తీనియా జాతి హక్కుల ముఖ్య ప్రతినిధిగా వ్యవహరించిన ఈజిప్ట్ ప్రభుత్వం ఆ తరువాత పాలస్తీనియా జాతీయ ఉద్యమంలో పట్టు సాధించడానికి ప్రయత్నిస్తున్న అనేక మందిలో ఒకటిగా మారింది.

1960ల మధ్యకాలం నాటికి పక్క దేశాలతో పోలిస్తే ఇజ్రాయిల్ బలమైన స్థానంలో ఉంది. సైనికపరంగా దీనిని నిరూపించుకునే అవకాశాన్ని స్వాగతించింది.

ఇజ్రాయిల్ జనాభా, ప్రధానంగా వలస ద్వారా పెరగసాగింది. 1967 నాటికి దీని జనాభా 23 లక్షలు, దీంట్లో అరబ్బులు సుమారుగా 13 శాతం. అమెరికా నుంచి సహాయం, ఇతర దేశాల యూదుల నుంచి విరాళాలు, పశ్చిమ జర్మనీ నుంచి చెల్లింపు ద్వారా ఆర్థికంగా అది పుంజుకుంది. సాయుధ దళాల, ప్రత్యేకించి వైమానిక దళాల బలాన్ని, నైపుణ్యాన్ని పెంచుకోసాగింది. పొరుగు అరబ్బు దేశాల కంటే సైనికపరంగా, రాజకీయంగా బలమైన స్థానంలో ఉందన్న సంగతి ఇజ్రాయిల్‌కి తెలుసు. పొరుగు దేశాల నుంచి వస్తున్న బెదిరింపుల నేపథ్యంలో తన బలాన్ని చూపడం ఉత్తమ మార్గమని అది భావించింది. తద్వారా మునుపటికన్న మరింత సుస్థిర ఒప్పందాన్ని కుదుర్చుకోవడమే కాకుండా మిగిలిన పాలస్తీనాను ఆక్రమించుకుని 1948 యుద్ధానికి పరిపూర్ణత సాధించాలని కూడా ఇజ్రాయిల్ భావించింది.

1967 జూన్ 6న ఆరు రోజుల యుద్ధంగా పేరుగాంచనున్న యుద్ధానికి ఇజ్రాయిల్ దిగింది. ఈజిప్ట్, సిరియా, జోర్డాన్లను మట్టికరిపించడమే కాకుండా మెరుపు వేగంతో వెస్ట్ బ్యాంక్, గాజా, సినాయ్ ద్వీపకల్పం, గోలాన్ హైట్లను ఆక్రమించుకుంది. ఈ యుద్ధం ద్వారా ఆ ప్రాంతంలో ఇజ్రాయిల్ తాను అనుకున్నది సాధించింది.

అరబ్ దేశాలు ఎన్ని కలిసినా వాటన్నిటికంటే సైనికపరంగా ఇజ్రాయిల్ బలమైన దేశమని స్పష్టమయింది. బయటి ప్రపంచంతో ఆయా దేశాల సంబంధాలను ఇది మార్చివేసింది. ఇజ్రాయిల్ మనుగడకు సహేతుకంగానో, నిర్హేతుకంగానో ముప్పు ఉందని భావించడంతో, రెండవ ప్రపంచ యుద్ధంలో యూదులపై జరిగిన దారుణాలు అమెరికా, యూరప్‌ల జ్ఞాపకాలలో సలుపుతుండడంతో వాటిల్లో సానుభూతి పోటెత్తింది. చిటికెలో యుద్ధ విజయం సాధించిన ఇజ్రాయిల్, అమెరికా దృష్టిలో కోరుకోదగ్గ నేస్తంగా చేసింది. అరబ్ దేశాలకు, ప్రత్యేకించి ఈజిప్ట్‌కి వాటి సైనిక, రాజకీయ పరిమితులను తెలియజేసిన దారుణ ఓటమి ఇది.

అంతేకాదు, 1963-69 మధ్య యెమెన్‌లోని రక్తసిక్త అంతర్యుద్ధంలో 'రిపబ్లికన్' పక్షానికి ఈజిప్ట్ మద్దతుగా నిలిచింది. ఒక దశలో యెమెన్‌లో డెబ్బై వేల ఈజిప్ట్ సైనికులు ఉన్నారు. వియత్నాంలో అమెరికా పరాభావం చెందినట్లు యెమెన్‌ను ఈజిప్ట్ పాలిట ఊబిగా అమెరికన్ దౌత్యవేత్తలు భావించారు. 1967 యుద్ధం తరువాత సినాయ్‌లో ఇజ్రాయిల్ సైనిక ఉనికితో నాసర్ రాజీ పడక తప్పలేదు. ఈజిప్ట్ సైనిక దళాలను బలోపేతం చెయ్యడానికి మరిన్ని ఆర్థిక వనరులు కేటాయించక తప్పలేదు. 1960లలోనే ఆర్థిక పరిస్థితి మందగించడం మొదలయింది. సైన్యంపై ఖర్చు వల్ల ఇది మరింతగా కుంటు పడింది. ఇజ్రాయిల్ ఉనికిని ఈజిప్ట్ గుర్తించక తప్పదన్న నిర్ధారణకు నాసర్ వచ్చాడు. దీంతో రోజర్స్ ప్రణాళిక, ఐక్యరాజ్య సమితి తీర్మానం 242లపై అతడు సంతకాలు చేశాడు. దీంతో 'శాంతి' కోసం ఇజ్రాయిల్ ఆక్రమించుకున్న ప్రాంతాన్ని వదులుకోక తప్పింది కాదు. మిగిలిన అరబ్బు దేశాల్లో నాసర్ తన ప్రతిష్టను కాపాడుకోగలిగాడు కానీ స్వదేశంలో అతడి ప్రభావం తగ్గసాగింది.

**ఇన్‌ఫితా**

1970ల ఆరంభం నాటికి ప్రభుత్వాధీనంలోని పెట్టుబడిదారీ విధానాలు దేశ ఆర్థిక పరిస్థితిని ముందుకు తీసుకెళ్లలేకపోయాయి. పెద్ద మొత్తంలో అప్పు, అధిక ద్రవ్యోల్బణం, అధిక చమురు ధరలతో అది సతమతం కాసాగింది. 1970లో నాసర్ చనిపోవడం, ఫ్రీ ఆఫీసర్లలో ఒకరైన అన్వర్ సాదత్ అధికారంలోకి రావడంతో ఈజిప్ట్ ఆర్థిక విధానాన్ని స్వేచ్ఛా వాణిజ్యానికి తలుపులు తెరిచే ప్రక్రియ 'ఇన్‌ఫితా' వేగాన్ని పుంజుకుంది. ఇన్‌ఫితా అంటే నయా ఉదారవాద ఆర్థిక విధానాన్ని అమలు చెయ్యడం. దీనిలో భాగంగానే కరెన్సీ నియంత్రణలను సడలించారు. పన్నులు ఏవీ లేని పెట్టుబడి ప్రాంతాలను ఏర్పాటు చేశారు. ప్రభుత్వరంగంలోని వివిధ పరిశ్రమలను ప్రైవేట్‌పరం చేశారు. (లేదా వాటిని మార్కెట్ ఒత్తిడులకు గురి చేశారు.)

ఈ ఉదారవాద విదానాల వల్ల రాజకీయ, ఆర్థిక విధానాలను మార్చుకోవలసి వచ్చింది. 'రాజకీయంగా అమెరికాతో సత్సంబంధాలు నెలకొల్పుకుంటే యుద్ధ స్థితి నుంచి ఈజిప్ట్ బయటపడడమే కాకుండా అరబ్ - ఇజ్రాయిల్ ఘర్షణకు సత్వర పరిష్కారం లభిస్తుందని భావించారు. ఆర్థిక పరంగా చూస్తే నాసర్ 'సోషలిజాని'కి స్వస్తిపలికి పెట్టుబడిదారీ అభివృద్ధి విధానాన్ని ఈజిప్ట్ చేపట్టాల్సి వచ్చింది. ఈజిప్ట్ ఆర్థిక పరిస్థితిలోకి విదేశీ పెట్టుబడులను ఆకర్షించి, కొత్త రక్తం నింపడానికి ఇది దోహదం చేస్తుందని భావించారు.'

1974లో స్వేచ్ఛా వాణిజ్య విధానాన్ని అధికారికంగా ప్రకటించడానికి ముందే పాశ్చాత్య దేశాలతో, ప్రత్యేకించి అమెరికాలో

స్నేహపూరిత సంబంధాలను ఏర్పర్చుకునే ప్రక్రియను ఈజిప్ట్ మొదలు పెట్టింది. అమెరికా మద్దతును నాసర్ కోరుకోవడమే కాకుండా ఇజ్రాయిల్ యుద్ధ మేఘాలు కమ్ముకుంటున్న నేపథ్యంలో 1972లో ఇరవై వేల సోవియట్ సైనిక సలహాదారులను ఈజిప్ట్ వెనక్కి పంపింది. అయినప్పటికీ 1973 అక్టోబర్‌లో యుద్ధం తప్పింది కాదు. ఇజ్రాయిల్ సైనిక ఆధిపత్యం తిరుగులేనిదిగా నిరూపితమైనప్పటికీ, గల్ఫ్ ప్రాంతంలో అమెరికా పెత్తనం పెరుగుతున్నప్పటికీ యుద్ధ ఫలితం తమకు అనుకూలంగా ఉందనే సాదత్ భావించాడు.

సైనిక విజయం కోసం 1973 యుద్ధానికి సాదత్ దిగలేదు. అగ్రరాజ్యాలకు అదురుపాటి కలిగించిన సంక్షోభం మరింత తీవ్రతరం కాకుండా, మరింత ప్రమాదకర యుద్ధం తలెత్తకుండా ఇజ్రాయిల్ – అరబ్బుల మధ్య ఒప్పందం కుదర్చడానికి అవి మధ్యవర్తి పాత్రను తీసుకునేలా చెయ్యడం అతడి ఉద్దేశం. సాదత్ అనుకున్నట్టే జరిగింది, కానీ అగ్రరాజ్యాలలో ఒకటైన అమెరికా జోక్యమూ, ప్రాబల్యమూ గణనీయంగా పెరిగాయి. ఇజ్రాయిల్‌కి అమెరికా ముందుగా ఆయుధాలు సరఫరా చేసి అది ఓడిపోకుండా కాపాడింది. తరువాత ఒప్పందానికి దోహదం చేసేలా వివిధ బలాల మధ్య సమతౌల్యాన్ని మార్చింది.

స్వేచ్ఛావాణిజ్య విధానంతో ఈజిప్ట్ తాను కోరుకున్న ఫలితాలను సాధించలేకపోయింది. ఈజిప్ట్ చేపట్టిన నయా ఉదారవాద 'సంస్కరణలు' ఆ దేశంలో పెట్టుబడులు పెట్టేలా విదేశీ మదుపుదారులను నమ్మించలేకపోయాయి. దిగజారుతూ ఉన్న మౌలిక సదుపాయాలు, నామమాత్రంగా ఉన్న రవాణా, టెలికమ్యూనికేషన్ వ్యవస్థ, జాతీయీకరణ భయం వంటి వాటివల్ల పాశ్చాత్య, అరబ్బు పెట్టుబడీదారులు తమ డబ్బును ఐరోపా, అమెరికన్ బ్యాంకులలో పెట్టడానికి సిద్ధమయ్యారు. ఇన్‌ఫితా పేరుతో దిగుమతి నియంత్రణలను సడలించిన ఫలితంగా సంపన్నులు కొనుక్కోడానికి విలాస వస్తువులు ఈజిప్ట్‌ను ముంచెత్తాయి.

విదేశీ పెట్టుబడి రాని పరిస్థితులలో ఇన్‌ఫితా వల్ల ఆర్థిక పరిస్థితి బలపడడానికి బదులు మరింత దిగజారిపోయింది. దేశ జనాభాలో అట్టడుగున ఉన్న 20 శాతం ప్రజలు 1960లో దేశ ఆదాయంలో 6.6 శాతం కలిగి ఉండగా 1965 నాటికి 7 శాతానికి పెరిగింది. అయితే 1970 చివరి నాటికి ఇది 5.1 శాతానికి పడిపోయింది. దీనితో పోలిస్తే అత్యంత సంపన్న 5 శాతం ప్రజల ఆదాయం 1960 నుంచి 1965 మధ్య 17.5 శాతం నుంచి 17.4కి స్వల్పంగా తగ్గి, సాదత్ విధానాల అమలు వల్ల 22 శాతానికి పెరిగింది. 1961 నుంచి 1981 నాటికి ఆహారం ఎగుమతి చేసే దశ నుంచి ఆహారం దిగుమతి పై తీవ్రంగా ఆధారపడిన దేశంగా ఈజిప్ట్ మారింది. దాదాపు యాభై శాతం ప్రజల కోసం ఆహార దిగుమతులపై ఆధారపడి ఉంది.

### క్యాంప్ డేవిడ్ నుంచి గల్ఫ్ యుద్ధాల 1, 2 వరకు

ఇజ్రాయిల్‌తో శాంతి ఒప్పందం కుదుర్చుకోవడానికి 1977లో జెరుసలెంకి సాదత్ వెళ్లి అరబ్ ప్రపంచాన్ని దిగ్భ్రాంతికి గురిచేశాడు. ఆ తరువాత సంవత్సరానికి అమెరికా మార్గదర్శనంతో క్యాంప్ డేవిడ్‌లో ఒప్పందంపై సంతకాలు జరిపాయి. ఇజ్రాయిల్‌తో పూర్తిస్థాయి ఆర్థిక, దౌత్య సంబంధాలను ఈజిప్ట్ ఏర్పర్చుకునే షరతుతో సినాయ్ ద్వీపకల్పాన్ని తిరిగి ఇవ్వడానికి ఇజ్రాయిల్ ఒప్పుకుంది. ఈ ఒప్పందం ప్రకారం వెస్ట్‌బ్యాంక్, గాజాలకు నిర్దుష్టంగా పేర్కొనని 'స్వయం ప్రతిపత్తి'ని ఇవ్వాల్సి ఉంది, అయితే దీనిని తర్వాత చర్చలకు వదిలేశారు. ఆక్రమిత ప్రాంతంలో ఇజ్రాయిల్ నివాస ప్రాంతాల నిర్మాణాలను కొనసాగించడానికీ, ఈ 'స్వయం ప్రతిపత్తి'కీ మధ్య ఎటువంటి వైరుధ్యమూ ఇజ్రాయిల్‌కి కనిపించడం ఆశ్చర్యం కలిగించదు.

అనతి కాలంలోనే అరబ్బు సంఘం నుంచి ఈజిప్ట్‌ను వెలివేశారు. దాని ముఖ్య కార్య స్థలాన్ని కైరో నుంచి టునీషియాకి మార్చారు. (ఈజిప్ట్‌ని బహిష్కరించిన దేశాలు కూడా అంతిమంగా సాదత్ ప్రతిపాదించిన రాజీ సూత్రాలనే కోరుకున్నాయి కానీ, ఇజ్రాయిల్‌తో సాదత్ ఏకపక్షంగా శాంతిని కోరుకోవడం పట్ల అసంతృప్తి మాత్రం అలాగే మిగిలిపోయింది.) పాశ్చాత్య కూటమిలో ఈజిప్ట్ పూర్తిగా చేరిపోయింది. సాదత్‌కి సంబంధించినంత వరకు అది సరైన సమయంలోనే జరిగింది. ఈజిప్ట్ ఆర్థిక పరిస్థితి పూర్తిగా కుదేలయింది. ఇజ్రాయిల్‌తో శాంతి ఒప్పందం ఫలితంగా ఈజిప్ట్‌ని ఏకాకిని చేసే ప్రయత్నం మానుకుని అమెరికా సహాయానికి దారి తీస్తుందని ఆశించారు. ఈజిప్ట్ అనుసరిస్తున్న పంథా పట్ల తీవ్ర అసంతృప్తికి గురైన ఇస్లామిక్ శక్తులు 1981లో సాదత్‌ని చంపేశాయి. అయితే, ఆనాడు వేసిన బాటలోనే ఇప్పటికీ ఈజిప్ట్ పయనిస్తోంది. ఉదాహరణకు, 1982లో లెబనాన్‌పై ఇజ్రాయిల్ దండెత్తినప్పుడు తనకంటే ముందు సాదత్ మాదిరిగానే (అధ్యక్షుడు హోస్నీ) ముబారక్ కూడా దౌత్య సంకేతాలకోసం అమెరికాను ఆశ్రయించాడు. దాడి జరిగిన రెండవ వారానికి అమెరికా సెక్రటరీ ఆఫ్ అలెగ్జాండర్ హేగ్ ప్రతిపాదించిన పంథాని తన పంథాగా ఈజిప్ట్ చెప్పుకుంది. ఇబ్బందికరమైన మిలిటెంట్ పి.ఎల్.ఒ.తో సంబంధం లేకుండా 'క్యాంప్ డేవిడ్ ప్రక్రియ'ను విస్తరింపచేయడం ద్వారా పాలస్తీనా సమస్యను పరిష్కరించే అవకాశాన్ని 'మధ్యే మార్గం' అరబ్బు దేశాలు ఉపయోగించుకోవాలని ఈజిప్ట్ భావించింది. అమెరికా ప్రయోజనాల కోసం ఈజిప్ట్ పాలకవర్గం చూపిన బానిస విశ్వాసానికి మంచి ఫలితాలనే పొందింది. 1991 గల్ఫ్ యుద్ధంలో కువైట్ నుంచి ఇరాక్‌ను వెళ్లగొట్టడానికి సైనిక ఒప్పందంలో భాగస్వాముల కోసం అమెరికా చూస్తున్న తరుణంలో ఈజిప్ట్ అధ్యక్షుడు ముబారక్ ఎటువంటి తటపటాయింపు లేకుండా అందులో చేరాడు. అందుకు ప్రతిఫలంగా రెండు వేల కోట్ల డాలర్ల రుణాన్ని అమెరికా, గల్ఫ్ దేశాలు, యూరప్ మాఫీ చేశాయి. అంతే మొత్తంలోని రుణాల చెల్లింపు కాలాన్ని వాయిదా వేశాయి.

2003లో జార్జి బుష్ తిరిగి ఇరాక్‌తో యుద్ధానికి దిగినప్పుడు ఈజిప్ట్ పూర్తి సమ్మతితో దాంట్లో భాగస్వామి అయింది. 2006లో యుద్ధం పతాక స్థాయిని చేరుకుంది. గల్ఫ్ ప్రాంతంలో ప్రజాస్వామ్యాన్ని కాపాడడానికి కంకణబద్ధులమని అమెరికా చెప్పుకుంటున్న దానికి విరుద్ధంగా ముబారక్ రాజకీయ ప్రత్యర్థులను కిరాతక రహస్య పోలీసులు చిత్రహింసల పాలు చేస్తున్నా ఈజిప్ట్‌కి అమెరికా సహాయాన్ని కొనసాగించడం ఎంతో కీలకమని అమెరికా స్టేట్ డిపార్ట్‌మెంట్ అధికారి ప్రకటించాడు. 'ఈజిప్ట్‌తో అమెరికా కీలక భాగస్వామ్యం గల్ఫ్ ప్రాంతంలో విదేశాంగ విధానానికి మూలస్తంభం వంటిది' అని డేవిడ్ వెల్చ్ (నియర్ ఈస్టర్న్ వ్యవహారాల అసిస్టెంట్ సెక్రటరీ ఆఫ్ స్టేట్) ప్రకటించారు. 2001–05 మధ్య ఈజిప్ట్ తన గగనతలంలో అమెరికా యుద్ధ విమానాలను 36,555 సార్లు అనుమతించింది. సూయజ్ కాలువలో ప్రయాణానికి అమెరికా నావికా దళ నౌకలకు ప్రాధాన్యతనిచ్చింది.

1970ల నుంచి అమెరికా నుండి ఈజిప్ట్ పొందిన సహాయం దిమ్మరగొడుతుంది. 1979 నుంచి ప్రతి సంవత్సరం ఈజిప్ట్‌కి అమెరికా 130 కోట్ల డాలర్ల సైనిక సహాయాన్ని అందజేసింది. సగటున 81.5 కోట్ల డాలర్ల ఆర్థిక సహాయం అందించింది. మొత్తం కలుపుకుని 1975 నుంచి అమెరికా ద్వారా ఐదు వేల కోట్ల డాలర్ల లబ్ధిని ఈజిప్ట్ పొందింది.

అవినీతి ద్వారా ఈజిప్ట్‌లో అల్ప సంఖ్యలో అత్యంత సంపన్న వర్గం ఒకటి ఏర్పడింది. దాంట్లో ముబారక్ కుటుంబం కోట్లాది డాలర్ల ఆస్తులతో అగ్రస్థానాన ఉండింది. మిగిలిన ఈజిప్ట్ వాసుల పరిస్థితి దారుణంగా ఉంది. ఎన్నో ఏళ్లుగా నిరుద్యోగం రెండంకెల స్థాయి నుంచి దిగడం లేదు. వార్షిక తలసరి ఆదాయం 6000 డాలర్ల కంటే తక్కువగా ఉంది. ఆహార సంక్షోభాలు క్రమం తప్పకుండా దేశాన్ని పీడిస్తున్నాయి.

అయినప్పటికీ ముబారక్ పాలనకు అమెరికా మద్దతు కొనసాగిస్తోంది. ప్రధాన స్రవంతి ప్రసార మాధ్యమాలలో అప్పుడప్పుడు వచ్చే పైపై వార్తలు, రిపబ్లికన్ రాజకీయ నాయకులు పరిస్థితి తద్భిన్నంగా ఉందని అప్పుడప్పుడు అంటున్నప్పటికీ విదేశాంగ నీతికి సంబంధించిన అమెరికా విభాగంలో ఈజిప్ట్‌కి ఎంతో విలువ, కీలకమైన స్థానం ఉన్నాయి.

వాస్తవానికి గల్ఫ్ ప్రాంతంలో అమెరికా ఆధిపత్యం ఇజ్రాయిల్, ఈజిప్ట్‌లలో మొదలై, ఎంతగానో విస్తరించింది. 1978లో క్యాంప్ డేవిడ్ ఒప్పందం తరువాత ఈజిప్ట్‌తో తన సంబంధాలను ఆధారంగా చేసుకుని ఇతర అరబ్బు రాజ్యాలను ఆ ప్రాంతంలో తన మద్దతు దారులుగా అమెరికా మలుచుకుంది. 2003లో ఇరాక్‌పై బుష్ దండెత్తినప్పుడు అమెరికా మిత్ర సంబంధాలను సమీక్షిస్తూ తారిక్ అలీ ఇలా రాశాడు–

అరబ్ ప్రజల అభిప్రాయానికి విరుద్ధంగా అమెరికా ప్రభు భక్తి పరాయణత ప్రదర్శించడానికి ఏ మిత్ర దేశమూ వెనకాడలేదు. అమెరికా యుద్ధ నౌకలు సూయజ్ కాలువగుండా ప్రయాణించడానికీ, గగనతలంలో అమెరికా వాయు దళానికి ఈజిప్ట్‌లో ముబారక్ అనుమతి నిచ్చాడు. ఇంకోవైపు వందలాది యుద్ధ నిరసనకారులపై ఈజిప్ట్ పోలీసులు లాఠీచార్జ్‌లు, అరెస్టులతో విరుచుకుపడ్డారు. తమ గగన తలంలో విహరించడానికి అమెరికా యుద్ధ విమానాలకు, తమ భూ భాగంలో అమెరికా కమాండ్ కేంద్రాలకు సౌదీ రాజు అనుమతించాడు. ఎంతోకాలంగా గల్ఫ్ దేశాలు వాషింగ్టన్‌కి సైనిక అనుబంధ కేంద్రాలుగా ఉన్నాయి. మొదటి గల్ఫ్ యుద్ధంలో దాదాపు తటస్థంగా నిలిచిన జోర్డాన్ ఈసారి తమ భూభాగం నుంచి సరిహద్దు ఇరాక్‌పై దాడి చెయ్యడానికి స్థావరాలను ఇవ్వడానికి ఉత్సాహం ప్రదర్శించింది. ఇరానియన్ ముల్లాలు తమ దేశంలో అణచివేతను ప్రదర్శిస్తూ, బయట మూర్ఖంగా వ్యవహరిస్తూ అఫ్ఘన్ శైలిలో సిఐఎ చర్యలకు సహకరించారు. అరబ్ లీగ్‌లోని పలు దేశాలు నేరుగా యుద్ధంలో పాల్గొంటూనే యుద్ధాన్ని ఖండిస్తూ ప్రకటన చేసి సామూహిక అవమానాన్ని మూటగట్టుకున్నాయి. (ఇస్లాంకి అత్యంత పవిత్రమైన మక్కాలో) కాబాకి ఎరుపు, తెలుపు, నీలం రంగులు పులుముతూ అది నల్లగా ఉందనగల సామర్థ్యం ఈ సంస్థకు ఉంది.

### ఈజిప్ట్, పాలస్తీనియన్లు

అమెరికా విస్తృత ప్రయోజనాలకు అనుగుణంగా ఉండడంలో భాగంగానే గాజాపై దిగ్బంధనం కొనసాగడంలో ఈజిప్ట్ సహకరిస్తోంది. పాలస్తీనియన్ ప్రజల జాతి హక్కులకు ఈజిప్ట్ ప్రజలలో విస్తృతస్థాయి సంఘీభావం ఉన్నప్పటికీ పాలస్తీనియా హక్కుల పట్ల పాలకులు మాత్రం ఎప్పుడూ ద్వైదీభావాన్నే వ్యక్తపరిచారు. ఈజిప్ట్‌కు చెందిన ఒక సోషలిస్టు మాటల్లో:

పాలస్తీనియా అంశాన్ని పాలకులు పరస్పర విరుద్ధ విధానాల్లో ఉపయోగించుకుంటున్నాయి. జాతీయ ఉద్వేగాలు రెచ్చగొట్టడానికి అది ఉండి ఉండి పాలస్తీనియా వ్యతిరేక, లెబనాన్ వ్యతిరేక భావాలను రెచ్చగొడుతూ ఉంటుంది. హమాస్, హెజ్‌బుల్లాలను సమర్థించే ముస్లిం బ్రదర్‌హుడ్‌కు పెరుగుతున్న ప్రభావాన్ని అదుపు చెయ్యడానికి ఆ రెండు సంస్థలపై విమర్శలు గుప్పిస్తూ ఉంటుంది.

ఉదాహరణకు – తన అధికారాన్ని సుస్థిర పరుచుకోవడానికి సాదత్ అరబ్ వ్యతిరేక ప్రచారానికి పూనుకుంటూ ఈజిప్ట్ గుర్తింపును 'ఫారో'తో ముడిపెట్టే ప్రయత్నం చేశాడు. ఈజిప్ట్ యుద్ధాలకూ, పేదరికానికీ పాలస్తీనియన్ల పై నేరం మోపుతూ, అరబిజం వ్యతిరేక ప్రచారాన్ని ప్రభుత్వ అధీనంలోని ప్రసార సాధనాలు చేపట్టడంతో ఇది ప్రజల భావాలలోకి జొరబడింది. రాజకీయంగా, సాంస్కృతికంగా తన స్థానాన్ని తిరిగి సాధించుకోవాలన్న బూర్జువాజీ లక్ష్యానికి ఇది సానుకూలంగా పరిణమించింది. జనాభాలో ఒక వర్గంలో ఈ వాదానికి మద్దతు లభించింది, అయితే ఇంకోవైపు అసంతృప్తి కూడా ఉంది.

1948 నుంచి 1979 క్యాంప్ డేవిడ్ వరకు పాలస్తీనియా కోసం ఈజిప్ట్ చేసిన త్యాగాలు ఇక చాలు అన్న అధికారిక వాదానికి కొంతమంది ఈజిప్షియన్లలో మద్దతు ఉంది. అయితే పాలస్తీనియన్లు చారిత్రక 'సోదర' స్థాయి నుంచి దాదాపు శత్రువులుగా మారడం పట్ల అన్ని రాజకీయ పార్టీలలో అసంతృప్తి ఉంది.

### మారిన దృక్కోణం

కొన్ని దశాబ్దాల క్రితమే ఈజిప్ట్ పాలకవర్గాలు అమెరికా, ఇజ్రాయిల్‌కు కట్టుబడిపోయాయి. పాలస్తీనియా హక్కుల కోసం పడికట్టు నిబద్ధత ప్రకటించినప్పటికీ దానిమీద నిలబడాలని ఏమీలేదు. ఈజిప్ట్ విదేశాంగ విధానాన్ని నిర్ణయించడంలో ఈ పడికట్టు వల్లింపుల పాత్ర ఏమీ ఉండదు. అయితే పాలస్తీనియన్ పోరాటాన్ని ఇజ్రాయిల్ సామ్రాజ్య వాదంపై పోరాటంగా భావించే పేదరికంలో మగ్గుతున్న ప్రజలను పాలించాలంటే అరబ్బు రాజ్యాల మాదిరిగానే ఈజిప్ట్ కూడా ఈ పడికట్టు పదజాలాన్ని ఉపయోగిస్తూ ఉండక తప్పదు.

అయితే తమ వర్గ ప్రయోజనాల పట్ల ఈజిప్ట్ పాలకవర్గాలకు స్పష్టత ఉంది. తమ సంపద, తమ అధికారం, కొనసాగే వైభోగం అంతా సామ్రాజ్యవాద స్నేహ ఫలితమేనని వాటికి తెలుసు. అలాకాక పాలస్తీనియా విముక్తి చెందితే, మొత్తం తలకిందులవుతుంది. గాజా దిగ్బంధానికి మద్దతు, తమ ప్రజల అణచివేతలను ఈజిప్ట్ పాలకవర్గాలు జమిలిగా అమలు చేస్తున్నాయి.

ఈజిప్ట్‌లో వర్గ పోరాటాలు ఊపందుకుంటున్న సంకేతాలు కనబడు తున్నాయి. వయసు పైబడి, రోగగ్రస్తుడైన ముబారక్ అధికారాన్ని తన కొడుకుకి కట్టబెట్టడానికి ప్రయత్నిస్తున్న నేపథ్యంలో అనిశ్చితి మేఘాలు దేశాన్ని కమ్ముకుంటున్నాయి. అయితే ఈజిప్ట్‌లోనే కాకుండా, ప్రపంచ వ్యాప్తంగా విప్లవ వామపక్షాలు బలంగా లేకపోవడం వల్ల గల్ఫ్ ప్రాంతంలో సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా విప్లవోద్యమం చెలరేగడానికి చాలా సంవత్సరాలే పట్టవచ్చు. ఇంకోవైపు కొన్ని ఆశాకిరణాలు కూడా లేకపోలేదు. గాజా స్వేచ్ఛా పాదయాత్ర (ఫ్రీడం మార్చ్) వివా పాలస్తీనా, ఇజ్రాయిల్‌కి వ్యతిరేకంగా బహిష్కరణ, పరిమితుల అంతర్జాతీయ ఉద్యమం వంటివి తమ జాతీయ హక్కుల కోసం పాలస్తీనియా ప్రజలు పోరాటాన్ని కొనసాగించడానికి ఎంతో కీలకం. అయితే నిజమైన విముక్తి సాధించాలంటే అంతిమంగా పాలస్తీనా పోరాటవీరులు, ఈజిప్ట్, ఇతర అరబ్బు దేశాల శ్రామిక ప్రజల మధ్య ఐకమత్యం తప్పనిసరి.

*(ఇంటర్నేషనల్ సోషలిస్ట్ రివ్యూ పత్రిక 2010 మార్చ్–ఏప్రిల్ సంచికలో పాత్రికేయుడు ఎరిక్ రుడర్ రాసిన వ్యాసానికి స్వేచ్ఛానువాదం : కె. సురేష్, 'మంచి పుస్తకం' నిర్వాహకులు)* వీ

*ఈజిప్ట్ విప్లవ సోషలిస్టుల (రెవల్యూషనరీ సోషలిస్ట్, ఈజిప్ట్) ప్రకటన పేరుతో ఈజిప్షియన్ ప్రజలకూ, నిరసన ప్రదర్శకులకూ అందిన పిలుపు*

# అమరులకు వందనం - విప్లవానిదే విజయం

ఇవాళ జరుగుతున్నది మనదేశ చరిత్రలోనూ, సమస్త అరబ్ ప్రపంచ చరిత్రలోనూ అతి పెద్ద ప్రజా విప్లవం. మన అమరవీరుల త్యాగమే ఈ విప్లవాన్ని నిర్మించింది. భయ సందేహాల అవరోధాలన్నిటినీ మనం బద్దలుకొట్టగలిగాం. కానీ, మన హంతక 'నాయకులు', వారి హంతక వ్యవస్థ సమూలంగా ధ్వంసం అయ్యేవరకు మనం విశ్రమించకూడదు.

**ముబారక్ పలాయనం మొదటి అడుగు మాత్రమే, విప్లవానికి చివరి అడుగు కాదు**

నియంతృత్వ అధికారాన్ని ఒమర్ సులేమాన్, అహ్మద్ షఫీక్ వంటి ముబారక్ బంట్లకు బదలాయించడం ఉన్న వ్యవస్థను కొనసాగించడం మాత్రమే అవుతుంది. ఒమర్ సులేమాన్ ఇజ్రాయిల్‌కూ, అమెరికాకూ మిత్రుడు. ఆయన ఎక్కువ కాలం వాషింగ్టన్‌కూ, తెల్ అవీవ్‌కూ మధ్య గడుపుతూ, వారి ప్రయోజనాలకు విధేయుడైన బానిసగానే ఉంటాడు. అహ్మద్ షఫీక్ ముబారక్‌కు సన్నిహిత మిత్రుడు. ఈజిప్షియన్ ప్రజల మీద ఆ పాలన రుద్దిన నిరంకుశత్వంలో, పీడనలో, బందిపోటులో ముబారక్‌కు సహచరుడు.

**దేశపు సంపద దేశ ప్రజలకు చెందిందే, అది వారికి తిరిగి రావాలి**

గత మూడు దశాబ్దాలలో ఈ నిరంకుశ పాలన దేశంలోని విశాల క్షేత్రాలన్నిటినీ అవినీతిమయం చేసి, పిడికెడు మంది వ్యాపారవేత్తలకూ, విదేశీ కంపెనీలకూ హస్తగతం చేసింది. ఇవాళ దేశపు సంపదలో 90 శాతం కేవలం వంద కుటుంబాల చేతుల్లో ఉంది. ఈజిప్షియన్ ప్రజల సంపదను ఈ నిరంకుశ పాలకులు ప్రైవేటీకరణ ద్వారా, అధికారాన్ని కొల్లగొట్టడం ద్వారా, బడాపెట్టుబడితో మిలాఖతు ద్వారా గుత్తాధిపత్యంతో సొంతం చేసుకున్నారు. అత్యధిక సంఖ్యాక ఈజిప్షయన్ ప్రజానీకాన్ని పేదరికంలో, భూమిహీనతలో, నిరుద్యోగంలో మిగిల్చారు.

**ధ్వంసం చేయబడిన, అతి చౌకగా అమ్మబడిన పరిశ్రమలన్నిటినీ ప్రజలకు తిరిగి ఇవ్వాలి**

ఈ ముఠా లూటీ చేసిన కంపెనీలన్నిటినీ, భూమి అంతటినీ, ఆస్తి అంతటినీ జాతీయీకరించాలని మేం కోరుతున్నాం. మన వనరులు ఈ ముఠా చేతులలో ఉన్నంతకాలం మనం ఈ వ్యవస్థ ఉచ్చునుంచి సంపూర్ణంగా బయటపడలేం. రాజకీయ నిరంకుశత్వం అనేది బొమ్మ అయితే ఆర్థిక బానిసత్వం దాని బొరుసు. ఈ ముఠా చేతినుంచి ప్రజల సంపదను లాక్కొని ప్రజలకు అందించకుండా మనం నిరుద్యోగ సమస్యను పరిష్కరించలేం. ప్రజలందరికీ కనీస న్యాయమైన వేతనంతో గౌరవప్రదమైన జీవనం ఇవ్వలేం.

**అమెరికాకో, ఇజ్రాయిల్‌కో కాపలా కుక్కలుగా ఉండదానికి మేం అంగీకరించం**

ఈ వ్యవస్థ దానికదిగా ఒంటరిగా నిలిచిలేదు. ముబారక్ మన మీద నియంతే అయినప్పటికీ అమెరికాకూ, ఇజ్రాయిల్‌కూ తొత్తుగా, బానిసగా వారి ప్రయోజనాల ప్రత్యక్ష పరిరక్షణకే ఉన్నాడు. ఈజిప్ట్ అమెరికాకు ఒక వలసగా మారిపోయింది. పాలస్తీనీయన్ ప్రజల మీద దురాక్రమణలో ప్రత్యక్షంగా భాగం పంచుకుంటోంది. మన స్యూయెజ్ కాలువ, మన ఈజిప్షియన్ గగనతలం అమెరికా యుద్ధ నౌకలకూ, యుద్ధ విమానాలకూ స్వేచ్ఛ వేదికగా మారిపోయి, మన సోదర ఇరాకీ ప్రజలను ధ్వంసం చేయడానికీ, ఊచకోత కోయడానికీ ఉపయోగ పడ్డాయి. మన సహజ వాయువును ఇజ్రాయిల్‌కు కారుచౌకగా అమ్మివేసారు. అదే సమయంలో ఈజిప్షియన్ ప్రజలు మాత్రం అధిక ధరలతో అలమటించి పోవలసి వచ్చింది. ఇవాళ సాగుతున్న ఈ విప్లవం ఈజిప్ట్ స్వాతంత్ర్యాన్ని, గౌరవాన్ని, ప్రాంతీయ నాయకత్వాన్ని పునరుద్ధరించాలి.

**ఈ విప్లవం నిజమైన ప్రజా విప్లవం**

ఇవాళ సాగుతున్న విప్లవం ఉన్నతవర్గాలో, రాజకీయపార్టీలో, మత బృందాలో నడుపుతున్నది కాదు. ఈజిప్ట్‌లోని యువకులు, విద్యార్థులు, కార్మికులు, పేద ప్రజలందరూ ఈ విప్లవాన్ని నిర్వహిస్తున్నారు. ఈ విప్లవం వారి సొంతం. ఈ విప్లవ వెల్లువ మీద స్వారీ చేయడానికి ఇటీవలి కాలంలో చాలామంది ఉన్నతవర్గాల వ్యక్తులు, రాజకీయ పార్టీలు, స్వేచ్ఛాచిహ్నాలు అనబడేవాళ్లు ప్రయత్నం చేస్తున్నారు. ఈ విప్లవపు నిజమైన సొంతదారుల నుంచి దాన్ని అపహరించడానికి ప్రయత్నిస్తున్నారు. కానీ, మన విప్లవపు అమర వీరులు మాత్రమే నిజమైన చిహ్నాలు. యుద్ధ క్షేత్రంలో, పట్టువదలకుండా, నిలబడిన యువజనులు మాత్రమే నిజమైన చిహ్నాలు. మరెవరూ తమను తాము చిహ్నాలుగా చెప్పుకోవడానికి వీలు లేదు. మన విప్లవాన్ని వాళ్లు హఠాత్తుగా వచ్చి అదుపు చేయడానికీ, మనకు వాళ్లే ప్రతినిధులని చెప్పుకోవడానికీ మనం అంగీకరించకూడదు. మనకు ప్రతినిధులుగా ఉండేది మనమే. లేదా ఒరిగిపోయిన మన అమరవీరులకు ప్రాతినిధ్యం వహించవలసింది మనమే. ఈ వ్యవస్థ నుంచి విముక్తి కోసం ఆ అమరవీరులు తమ నెత్తుటి మూల్యం చెల్లించారు.

**ప్రజాసైన్యం అంటే విప్లవాన్ని పరిరక్షించే సైన్యమే**

'సైన్యం ప్రజలతో ఉందా? వ్యతిరేకంగా ఉందా? అని ప్రతి ఒక్కరూ అడుగుతున్నారు. సైన్యం అంటే ఒకే ఒక ముద్ద కాదు. సైన్యంలోని సాధారణ సైనికుల, కిందిస్థాయి అధికారుల ప్రయోజనాలకూ, ప్రజా ప్రయోజనాలకూ తేడా లేదు. కాని, పైస్థాయి అధికారులు ముబారక్ మనుషులు. అవినీతి, సంపద, నిరంకుశత్వంతో నిండిపోయిన పాలనను కాపాడడానికి జాగ్రత్తగా ఎంపిక చేసుకున్న మనుషులు. ఆ సైనికాధికారులు ఈ వ్యవస్థలో అంతర్భాగం.

ఇవాళ ఉన్న సైన్యం ఎంత మాత్రమూ ప్రజాసైన్యం కాదు. 1973 అక్టోబర్‌లో జియోనిస్ట్ శత్రువును ఓడించిన సైన్యానికీ, దీనికీ సంబంధమే లేదు. ఈ సైన్యం అమెరికాతో, ఇజ్రాయిలతో సన్నిహిత సంబంధాలు

ఉన్న సైన్యం. దీని పాత్ర ఇజ్రాయిల్‌ను రక్షించడమే తప్ప, ప్రజలను రక్షించడం కాదు. నిజమే, మేం ఈ సైన్యంలోని అట్టడుగు సైనికులను విప్లవం వైపు ఆకర్షించదలచుకున్నాం. కానీ, 'సైన్యం మన పక్షాన్నే ఉంది' అనే నినాదాలతో మేం మోసపోదల్చుకోలేదు. సైన్యం ప్రజా ప్రదర్శకుల మీద నేరుగా దాడిచేసి అణచివేత సాగిస్తోంది. లేదా ఆ పాత్ర నిర్వహించడానికి పోలీసులను ఉపయోగించుకుంటోంది.

**తక్షణమే విప్లవ సమితులను స్థాపించండి**

ఈ విప్లవం మన అత్యున్నత ఊహలను కూడా అధిగమించి ముందుకు సాగుతుంది. ఇంత వేలాదిగా, లక్షలాదిగా ప్రజలు తరలి వస్తారని ఎవరూ ఊహించలేదు. పోలీసులను సవాలు చేస్తూ, ఎదుర్కొంటూ ఈజిప్షియన్‌లు ఇంత ధైర్య సాహసాలతో పోరాడగలరని ఎవరూ ఊహించ లేదు. నియంత పలాయనం చిత్తగించేంతగా మన బలప్రదర్శన సాగలేదని ఎవరూ అనలేరు. మిద్దాన్ ఎల్ తహరీర్‌లో ఒక అత్యద్భుతమైన పరివర్తన సాగలేదని ఎవరూ అనలేరు.

ఇవాళ ఈ క్షణాన మనం చేయవలసిందేమంటే మన మొత్తం డిమాండ్‌లలో భాగంగా సామాజిక, ఆర్థిక డిమాండ్‌లను ముందుకు తేవడం. అలా చేసినప్పుడు ఇప్పటికీ తమ తమ ఇళ్లలో కూర్చున్న వ్యక్తులకి మన పోరాటం వారి హక్కుల కోసమే అని అర్థమవుతుంది. మనం ఎక్కడికక్కడ ప్రజాసమితులుగా సంఘటితం కావాలి. ఆ ప్రజా సమితులు అంతకన్న పైస్థాయి సమితులను ప్రజాస్వామికంగా ఎన్నుకోవాలి. కింది నుంచి పైకి ఈ నిర్మాణాలు సాగాలి. ఈ సమితులన్నీ కలిసి దేశం మొత్తానికి ఒక అత్యున్నత ప్రజా మండలి ఏర్పడాలి. అందులో అన్ని అభిప్రాయాల ప్రతినిధులకు భాగస్వామ్యం ఉండాలి. నిజంగా మనకు ప్రాతినిధ్యం వహించే వ్యక్తులను, నిజంగా మనం నమ్మదగిన వ్యక్తులను ఈ అత్యున్నత మండలికి మనం ఎన్నుకోవాలి. మిద్దాన్ ఎల్ తహరీర్‌లోనూ, ఈజిప్ట్‌లోని అన్ని నగరాలలోనూ ఇటువంటి ప్రజా సమితుల స్థాపనే తక్షణ కర్తవ్యం అని మేం పిలుపునిస్తున్నాం.

**విప్లవ శ్రేణులలో చేరవలసిందిగా ఈజిప్షియన్ కార్మికులకు పిలుపు**

ఈ మన విప్లవాన్ని ముట్టించడంలో, ముందుకు కొనసాగించడంలో ప్రజా ప్రదర్శనలనూ, నిరసనలూ కీలక పాత్ర నిర్వహించాయి. ఇప్పుడిక ఇందులో కార్మికులు పాల్గొనవలసి ఉంది. వారు ఈ పాలన అంతానికి నాంది పలకగలరు. కేవలం ప్రదర్శనలలో పాల్గొనడం ద్వారా మాత్రమే కాదు, దేశంలోని అన్ని కీలక పరిశ్రమలలోనూ, భారీ కార్పొరేషన్‌లలోనూ సాధారణ సమ్మెను నిర్వహించడం ద్వారా కార్మికులు ఈ విప్లవంలో పాల్గొనాలి. మనం ధర్నాలకూ, ప్రదర్శనలకూ కూర్చుంటే, రోజుల తరబడి, వారాల తరబడి ఆ పనిచేస్తే పాలకులకు చీమకుట్టినట్టయినా ఉండదు. ఎంతకాలమైనా వారు వేచి చూడగలరు. కానీ, కార్మికులు సమ్మెలను ఒక ఆయుధంగా వాడి కొన్ని గంటలు నిర్వహించినా పాలకులకు బెదురు పుడుతుంది. రైల్వేలలో సమ్మె చేయండి. ప్రజా రవాణా వ్యవస్థలో సమ్మె చేయండి. విమానాశ్రయాలలో సమ్మె చేయండి. భారీ పారిశ్రామిక కార్ఖానాలలో సమ్మె చేయండి. ఈజిప్షియన్ కార్మికులారా మన దేశపు తిరుగుబాటు యువతరం పక్షాన, మన అమరువీరుల నెత్తుటి ధారపోత సాక్షిగా విప్లవ శ్రేణులలో భాగం కండి. మీ శక్తిని ఉపయోగించండి. విజయం మనదే! ✦

## వీక్షణం రచయితలకు సూచనలు

ఎనిమిది సంవత్సరాలలో, నూట పదమూడు సంచికలలో వీక్షణం దాదాపు పద్దెనిమిది వందల వ్యాసాలు, రచనలు ప్రచురించింది. వీటిలో నిడివిలోనూ, వస్తువులోనూ, చెప్పిన పద్ధతి లోనూ, సుబోధకత లోనూ చాల వైవిధ్యం ఉంది. ఈ వైవిధ్యాన్నంతా గౌరవిస్తూనే, పత్రికలో అచ్చయ్యే వ్యాసాలను ప్రామాణికం చేయడానికి రచయితలు ఈ కింది సూచనలు పాటిస్తే బాగుంటుందని భావిస్తున్నాం.

- రచన మరీ చిన్నది (ఒక పేజీ కన్న తక్కువ) కాకుండానూ, మరీ పెద్దది (ఐదు పేజీల పైన) కాకుండానూ ఉంటే బాగుంటుంది. రచన ఐదు పెజీలకు మించితే రెండు మూడు సంచికలలో వేయవలసి వస్తుంది గనుక రచయిత అభిప్రాయం పాఠకులకు అందడం కష్టమవుతుంది. మూడు–నాలుగు పేజీల రచన (1800 – 2500 పదాలు) వీక్షణం కు సరిగ్గా సరిపోతుంది.
- చేతిరాతతో పంపేవారయితే వీలయినంత కుదురుగా, చదవడానికి వీలుగా, పంక్తుల మధ్య ఖాళీ వదులుతూ, కాగితానికి ఒకవైపునే రాసి పంపాలి. కంపోజ్ చేసి పంపేవారయితే, డబుల్ లైన్ స్పేసింగ్ లో కాగితానికి ఒకవైపునే అచ్చువేసి పంపాలి. యూనికోడ్ లో గాని, పేజ్ మేకర్ లో గాని కంపోజ్ చేసేవారు సాఫ్ట్ కాపీ సి.డి. ద్వారాగాని, ఇ మెయిల్ లోగాని పంపితే మంచిది.
- రచయితలు తప్పనిసరిగా తమ రచన ఫొటో కాపీ తమ దగ్గర ఉంచుకోవాలి.
- రచనతో పాటు తప్పనిసరిగా రచయిత సంక్షిప్త పరిచయం, పూర్తి చిరునామా, ఫోన్ నంబర్లు, ఇమెయిల్ వగైరా వివరాలు పంపాలి.
- వీక్షణం కార్యాలయానికి రచన అందిన వెంటనే అందినట్టుగా రచయితలకు సమాచారం పంపుతాం. రెండువారాలలోగా ఆ రచనను ప్రచురణకు స్వీకరిస్తున్నదీ లేనిదీ తెలుపుతాం. తక్షణ ప్రాముఖ్యత ఉన్న అంశం మీద రచన అయితే రెండు–మూడు నెలల లోపు అచ్చువేస్తాం. సాధారణ రచనలు అచ్చువేయడానికి ఆరు నెలల వరకూ పట్టవచ్చు.
- మరొక పత్రికకు పంపిన, మరొక పత్రిక పరిశీలనలో ఉన్న, మరొక పత్రిక ప్రచురణకు ఆమోదించిన రచనను వీక్షణం కు పంపగూడదు.
- దీర్ఘకాలిక తాత్విక, రాజకీయార్థిక, సామాజిక అంశాల మీద మాత్రమే కాక, సమకాలీన రాజకీయార్థిక, సామాజిక పరిణామాలపైన కూడ రచనలు పంపాలని రచయితలకు విజ్ఞప్తి. ఆ విషయం మీదనే మరొకరు రాసినా, అన్ని దృక్పథాల రచనలు అచ్చు వేయడం వీక్షణం ఉద్దేశ్యం. క్షేత్ర పరిశోధనా నివేదికలు, విధానాల అమలు తీరుతెన్నులు, ప్రజాజీవితంలో మార్పులు, వివిధ దృక్కోణాలు, విభిన్న సామాజిక శాస్త్ర పరిశీలనాంశాలు వీక్షణంలో ప్రాధాన్య ప్రచురణాంశాలు. సాహిత్య రంగానికి సంబంధించిన రచనలకు వీక్షణంలో చోటు కల్పించడం సాధ్యం కాదు.
- రచయిత అభిప్రాయాలను మార్చడం ఎప్పుడూ జరగదు. కాని నిడివి దృష్ట్యాగాని, సాంకేతిక కారణాల దృష్ట్యాగాని రచనలు కుదించే, మార్చే పరిస్థితి రావచ్చు. ఇలా ఎడిట్ చేయడానికి రచయితలు ఆమోదించాలి.

ఈజిప్ట్‌లోని పరిణామాలను విశ్లేషిస్తూ, యూరప్ కార్మికుల వెల్లువ, అరబ్ ప్రజా వెల్లువలు అమెరికా, యూరప్ సామ్రాజ్యవాదులను బలహీనపరుస్తాయని అంటున్నారు **పి. ప్రసాద్**

# ప్రపంచ గమనానికి మలుపు - అరబ్బు ఉద్యమాలు

**యూ**రప్ దేశాల కార్మిక పోరాట వెల్లువలతో 2010 ముగిసింది. అరబ్ దేశాల ప్రజా పోరాట వెల్లువలతో 2011 ఆరంభమైంది. ఇంకా చెప్పాలంటే, 21వ శతాబ్దానికి చెందిన మొదటి దశాబ్దం యూరప్ కార్మిక వెల్లువలతో ముగిసింది. రెండవ దశాబ్దం అరబ్ ప్రజా వెల్లువలతో శుభారంభమైంది. ఈ రెండు రకాల పోరాట వెల్లువలు సాగిన భూ ఖండాలు ఒకటి కాదు. ఆయా దేశాల ఆర్థిక వ్యవస్థలు ఒకటి కాదు. ఈ రెండు రకాల పోరాట వెల్లువలలో పాల్గొన్న ప్రజల వృత్తి, ప్రవృత్తులు కూడా ఒకటి కాదు. కానీ ఈ రెండు రకాల ప్రజా పోరాట వెల్లువల మధ్య ఒక సారూప్యత ఉంది. అదే గొలుసుకట్టు (చెయిన్ సిస్టమ్) ఉద్యమ క్రమం. అంటే, ఒక దేశంలో జరిగే ఉద్యమాలు వెంటనే వేరే దేశాలకి విస్తరించడం. ఇది ఈ కాలంలో ఓ ప్రత్యేక అంశమే.

గత ఇరవై ఏండ్లుగా ప్రపంచీకరణ విధానాలు అమలు జరుగుతున్నాయి. ప్రపంచ పీడిత ప్రజలకి అత్యంత కష్ట కాలమిది. ప్రచ్ఛన్న యుద్ధానంతరం ఏర్పడిన ఇలాంటి కష్టకాలంలో గొలుసు కట్టు పోరాటాలకి అవకాశం లేకుండా పోయింది. 1991 నుంచి 2003లో ఇరాక్‌ను ప్రత్యక్ష దురాక్రమణ చేసేంత వరకూ నెత్తురోడుతున్న ఇరాక్‌కు తగినంత సంఘీభావం వ్యక్తం కాలేదు. ఆ కాలం ప్రపంచ రాజకీయ యవనిక మీద ఓ చీకటి అంకమే. 2003లో యుద్ధ వ్యతిరేక ప్రదర్శనలలో ఒకింత గొలుసు కట్టు స్వభావం ఉన్నా, అది ఓ రాజకీయ నిరసనకే పరిమితమైంది.

2010లో సాగిన పోరాటాలు అలాంటివి కావు. బెర్లుస్కోనీ (ఇటలీ), సర్కోజీ (ఫ్రాన్స్), కామెరూన్ (బ్రిటన్), ఎంజెల్స్ (జర్మనీ) తదితర ప్రభుత్వాలను గద్దె దిగిపోవాలంటూ రాజకీయ నినాదాలతో సాగాయి. పైగా అవి గొలుసు కట్టు కార్మిక వెల్లువలుగా కొనసాగాయి. ఇప్పుడు 2011లో బెన్ అలీ (టునీషియా), ముబారక్ (ఈజిప్ట్) వంటి నియంతలు ఇప్పటికే గద్దె దిగారు. వాటి అడుగుజాడల్లో మిగిలిన అరబ్ దేశాల ప్రజలు తమ తమ ప్రభుత్వాలపై మరింత వెల్లువెత్తు తున్నారు. గత ఇరవై ఏండ్ల ప్రపంచీకరణలో ఇది ఓ కొత్త ధోరణే.

టునీషియా, ఈజిప్ట్ దేశాలలో జరిగిన పోరాటాలను లోతుగా పరిశీలిస్తే, పాశ్చాత్య విద్యావంతులైన యువతరమే వాటిని తొలుత ప్రారంభించినట్లు అర్థమవుతుంది. ముఖ్యంగా కైరోలోని సైబర్ యూత్ పోషించిన పాత్ర కీలకమైంది. ట్విట్టర్, ఫేస్‌బుక్, యూ ట్యూబ్‌ల ద్వారా పోరాట సందేశాలు కొన్ని గంటల్లో లక్షలాది సైబర్ యూత్‌కు అందాయి. తద్వారా తొలి ప్రజా సమీకరణ జరిగింది. అందుకే దీనిని కొందరు 'ట్విట్టర్ రెవల్యూషన్'గా పిలుస్తున్నారు. అదే సమయంలో ఇంటర్నెట్ వ్యవస్థ వల్లనే ప్రజా వెల్లువ, చైతన్యాలు సాధ్యమైనాయంటూ పాశ్చాత్య మీడియా సాగిస్తున్న ప్రచారం నిజం కాదు. చైతన్యవంతులైన ప్రజలు ఆధునిక సాంకేతిక వ్యవస్థను అద్భుతంగా వినియోగించుకోగలిగారన్నది నిజం.

ఈ సైబర్ యూత్ పశ్చిమ దేశాల పాశ్చాత్య విద్య చేత ప్రభావిత మైంది. పశ్చిమ దేశాలలోని పార్లమెంటరీ ప్రజాస్వామ్యానికి కూడా ప్రభావితమైంది. తమ స్వంత దేశాలలోని రాజరిక, నియంతృత్వ వంశ పారంపర్య పరిపాలనల పట్ల విసుగు చెందింది. కిటికీలు కూడా మూసివేసిన దేశాలకు పార్లమెంటరీ ప్రజాస్వామ్యం ఒక కిటికీని తెరుస్తుంది. దానికోసం టునీషియా, ఈజిప్ట్‌లలోని సైబర్ యువతరం ఆరాటపడింది. పార్లమెంటరీ ప్రజాస్వామిక చైతన్యాన్ని పొందింది. తనను తాను సమీకరించుకోవడానికి అది పాశ్చాత్య సాంకేతిక వ్యవస్థను ఉపయోగించుకుంది. ఇంటర్నెట్ రోడ్డెక్కించలేదు. రోడ్డెక్కడానికి సంసిద్ధపడ్డ యువతరానికి ఇంటర్నెట్ ఒక ఉత్ప్రేరకంగా మారింది.

అమెరికన్ రిపబ్లిక్, ఫ్రెంచ్ రిపబ్లిక్‌లు తమకి ఆదర్శమని అరబ్ దేశాల సైబర్ యువతరం డిమాండ్ చేస్తున్నది. ఇక్కడొక వైరుధ్యం ఉంది. అరబ్ ప్రజలు నేడు తిరస్కరించే నియంతల నిరంకుశ పరిపాలనలకీ వారు నేడు ఆదర్శంగా కోరుకుంటున్న రిపబ్లిక్ రాజ్యాంగ వ్యవస్థలకీ మధ్య ఓ శత్రు వైరుధ్యం ఉంది. సోకాల్డ్ పశ్చిమ దేశాల ప్రజాస్వామిక వ్యవస్థలే అక్కడి రాజరిక నియంతృత్వ పాలనా వ్యవస్థలకి వెన్నుదన్నుగా నిలిచాయి. ఈ అంతఃస్సంబంధాన్ని సైబర్ యువతరం గ్రహించలేకపోతున్నది. అందుకే తమ నియంతలను తొలగించడానికి పశ్చిమ దేశాల సహకారాన్ని అర్థిస్తున్నది.

కైరో తెహ్రీర్ స్క్వేర్‌లో వెల్లువెత్తిన యువతరం సామ్రాజ్యవాద వ్యతిరేక నినాదాలనివ్వకపోవడం గమనార్హం. పైగా వారికి ప్రధాన వకాల్తాదారునిగా పేరొందిన అల్‌బరాదీ చేసిన ప్రసంగంలో అమెరికా, యూరప్ దేశాలు జోక్యం చేసుకొని, తమకి న్యాయం చేయాలని కోరడం గమనార్హం.

18వ శతాబ్దంలో స్థాపించబడ్డ అమెరికా, ఫ్రెంచ్ రిపబ్లిక్కులు, చారిత్రకంగా విప్లవకరమైనవి. ఆ తర్వాత కూడా మరో వందేండ్ల వరకూ అవి విప్లవ స్ఫూర్తినిచ్చాయి. కానీ 1871లో పారిస్ కమ్యూన్ అణచివేత తర్వాత అవి చారిత్రకంగా తిరోగమన పాత్రను పోషించసాగాయి. వర్తమాన ప్రపంచంలో పశ్చిమ దేశాల పార్లమెంటరీ ప్రజాస్వామ్యం, విప్లవకరమైనది కాదు. భారత దేశం అందుకొక నిదర్శనం. నేడు అరబ్బు ప్రజలు పోరాడుతున్న అధిక ధరలు, అవినీతి, నిరుద్యోగం, అణచివేత, వంశపారంపర్య పాలన వంటి సమస్యలన్నీ భారత్‌లో ఉన్నాయి.

ఇక్కడున్న పార్లమెంటరీ ప్రజాస్వామ్యం వాటికొక రక్షణ కవచంగా ఉంది.

పార్లమెంటరీ ప్రజాస్వామ్యానికి ప్రత్యామ్నాయమైన జనతా ప్రజాస్వామ్యాన్ని స్వీకరించగల రాజకీయ చైతన్యం పొందలేని అరబ్ ప్రజలకి అదొక తాత్కాలిక రాజకీయ ఉపశమనాన్ని అందిస్తుంది. అట్టి ఉపశమనంకై సాగే బూర్జువా ప్రజాతంత్ర పోరాటాలు అనివార్యంగా సామ్రాజ్యవాద ప్రయోజనాలతో సంఘర్షిస్తాయి. ఇప్పటికే ఈ పోకడలు తాజా అరబ్ ప్రజా ఉద్యమాలలో అంతర్లీనంగా సాగుతున్నాయి.

ఏడెనిమిది దశాబ్దాల చరిత్రగల 'ముస్లిం బ్రదర్‌హుడ్' సంస్థ ఈజిప్ట్ పౌర సమాజంలో బలంగా వేళ్లునుకున్నది. 1950వ దశాబ్దంలో అది స్పష్టమైన జాతీయ సార్వభౌమాధికార లక్ష్యాలను రూపొందించు కుంది. 1967 యుద్ధంలో తమ సినాయ్ ద్వీపకల్పాన్ని ఇజ్రాయెల్ దురాక్రమించాక అది సాయుధ విప్లవ పంథాను చేపట్టింది. ముఖ్యంగా క్యాంపు డేవిడ్ సంధి (1979) పై సంతకం చేసిన సాదత్‌ను హత్య చేశాక అది ఫాసిస్టు దమనకాండకి గురైనది. అందులో వేలాది మంది కార్యకర్తలను కోల్పోయింది. లక్షలాది మంది సానుభూతిపరులు చిత్రహింసలకు గురయ్యారు. నేటికీ నిషేధిత సంస్థే. అయినా సి.ఐ.ఎ. అంచనా ప్రకారమే అందులో ఐదు లక్షల మంది రహస్య సభ్యులున్నారు. వేల మంది అజ్ఞాత ఆర్గనైజర్లు ఉన్నారు. ముఖ్యంగా గ్రామీణ, పట్టణ పేద ప్రజల్లో బలమైన శాఖలను కలిగి ఉన్నది. స్థాపిత కాలం నాటి ఇస్లామిక్ షరియత్ లక్ష్యాలను క్రమంగా సడలించుకుంటూ వచ్చింది. ముఖ్యంగా ఆధునిక విద్యాధిక యువకులు సంస్థ సారథ్య బాధ్యతలు స్వీకరిస్తున్న క్రమంలో అది లౌకిక, ప్రజాతంత్ర సంస్థగా మారుతున్నది. ఓస్లో ఒప్పందం ద్వారా మితవాద సంస్థగా 'ఫతా' మారాక పాలస్తీనాలో ముందుకు వచ్చిన హమాస్ సంస్థకు ముస్లిం బ్రదర్‌హుడే స్ఫూర్తిదాత. ఇజ్రాయెల్ మూసివేసిన గాజా సరిహద్దులను బద్దలుగొట్టి, పాలస్తీనియన్లకు మేలుచేసిన చరిత్ర దీనికి ఉంది. అది తాజా ఈజిప్ట్ ప్రజా వెల్లువలో ప్రముఖ పాత్ర పోషించుతున్నది.

నిజానికి జనవరి 25న జీన్స్ బట్టలు ధరించిన కొన్ని వందల మంది యువతీ యువకులతో కైరోలో ప్రారంభ ప్రదర్శన జరిగింది. వీరికే 'ట్విట్టర్ విప్లవకారులు'గా పాశ్చాత్య మీడియా నామకరణ చేసింది. అయితే వెంటనే ముస్లిం బ్రదర్‌హుడ్ రంగంలోకి దిగింది. తన శాఖలన్నిటినీ ప్రజాసమీకరణకు పూనుకోవాలని అత్యవసర ఆదేశాలను ఇచ్చింది. జనవరి 27–28 కల్లా కైరో జన సముద్రం కాసాగింది. ఫిబ్రవరి 1న 'మిలియన్ మెన్ మార్చ్' లో కూడా ముస్లిం బ్రదర్‌హుడ్ చేసిన సమీకరణే ప్రధానమైనది. ఈ వాస్తవాలను పాశ్చాత్య మీడియా ఏదో రూపంలో చెప్పకనే చెప్పింది. ఈ ఉద్యమ నిర్వహణకై బ్రదర్‌హుడ్ చొరవతో ఐదు సంస్థలతో మార్పు కోసం జాతీయ సంకీర్ణ కూటమి (నేషనల్ కోయలేషన్ ఫర్ ఛేంజ్) అనే విశాల ఐక్య వేదిక ఏర్పడింది. ముప్పై ఏండ్ల పాటు నిషేధించబడ్డ ముస్లిం బ్రదర్‌హుడ్‌ను కలుపుకోవద్దని ట్విట్టర్ విప్లవకారులకి అమెరికా సూచించింది. స్థానికంగా భౌతిక పరిస్థితులు వేరేగా ఉన్నాయి. అందువల్ల దాన్ని కలుపుకోక తప్పలేదు. దాంతో అమెరికా – ఇజ్రాయెల్‌లు ఖంగుతిన్నాయి. అందుకే జనవరి 27 నుంచి 30 మధ్య రక్తసిక్త దమనకాండ సాగింది. మొదటివారంలో మూడు వందల మంది పోలీసు కాల్పుల్లో మరణించినట్లు యు.ఎన్.ఒ. పరిశీలకులే ఆలస్యంగా ధృవీకరించారు. ఈ సంఖ్య అనేక రెట్లు ఎక్కువే ఉంటుందనేది కొందరి అంచనా. కైరో, అలెగ్జాండ్రియా, పోర్ట్ సయ్యద్, అశ్వాన్, సూయజ్, ఇస్మాయిలా, మాన్సూరా తదితర నగరాలూ, పట్టణాలలో జరిగిన మరణాలు ఇవి. అయితే గాయపడ్డ వారి సంఖ్య వేల సంఖ్యలోనే ఉంది.

దీనిని బట్టి ఈజిప్ట్ ప్రజా పోరాటం ఎంతటి రక్తసిక్తంగా సాగిందో అర్థమవుతోంది. కానీ, పాశ్చాత్య మీడియా దీన్ని రక్తరహిత విప్లవంగా అభివర్ణిస్తోంది. అంతేకాకుండా, మార్టిన్ లూథర్ (జూనియర్), మహాత్మా గాంధీలు చేపట్టిన అహింసా పంథాలో సాగిందని కితాబు లిస్తోంది. ఇది ఒక కుట్రే. ఈజిప్ట్ ప్రజా పోరాట స్థాయినీ, వారి త్యాగాలనూ ప్రపంచానికి తగ్గించి చెప్పే కుతంత్రమిది. ముఖ్యంగా తమ సాటి అరబ్ దేశాల ప్రజలను అహింసాయుత పంథాను ఎంచుకోండని సందేశం ఇచ్చే పన్నాగం ఇది. మరోవైపు తమ తొత్తు అయిన ఈజిప్ట్ సర్కార్ సాగించిన రక్తసిక్త దమనకాండను ప్రపంచానికి తెలియనీయ కుండా దాచిపెట్టే అమెరికా పథకంలో భాగం ఇది.

జాగ్రత్తగా పరిశీలిస్తే ఈజిప్ట్ ప్రజా వెల్లువలో అంతర్లీనంగా కొన్ని సాహసోపేత ఘట్టాలు కనిపిస్తాయి. ఒకే రోజు ఒకే సమయంలో కైరోతో సహా అలెగ్జాండ్రియా, అశ్వాన్‌లు తదితర పట్టణాలలోని జైళ్ల మీద సామూహికంగా ప్రజలు సాయుధ దాడులకి దిగారు. పాశ్చాత్య మీడియా కథనాల ప్రకారమే ఆ ఒక్కరోజు సుమారు ఐదువేల మంది ఖైదీలను ఉద్యమకారులు విడుదల చేయించారు. పదిలక్షలకి పైగా రహస్య గూఢచారి పోలీసు బలగాలు గల దేశంలో కట్టుదిట్టమైన భద్రతా ఏర్పాట్లు ఉంటాయి. పైగా ఉద్యమకాలంలో అదనపు భద్రతా చర్యలుంటాయి. అయినా ఇంత అద్భుతమైన 'జైల్ బ్రేక్స్' ఎలా సాధ్యమయ్యాయి? పైగా ఆ ఒక్కరోజే 150 మంది కాల్పుల్లో మరణించినట్లు ఓ వార్త విడుదలైంది. ఉద్యమకారుల తిరుగుబాటులో జైలు అధికారులు కూడా మరణించారు. ఇది 'రక్తరహిత విప్లవం' అవుతుందా?

మిలియన్ మెన్ మార్చ్ జరిగిన మరునాడే ముబారక్ పార్టీ కార్యకర్తలు, యూనిఫార్మ్ లేని ఇంటెలిజెన్స్ సిబ్బంది తెహ్రీర్ స్క్వేర్ మీద సాయుధ దాడికి దిగారు. ఒంటెలు, గుర్రాలతో నాజీ పార్టీ లేదా రజాకార్ల తరహాలో ఈ ప్రైవేట్ ఆర్మీ పైశాచిక దాడికి దిగింది. అది ఫిబ్రవరి 2న సాయంత్రం వరకూ భయానకంగా సాగింది. తెహ్రీర్ స్క్వేర్‌ను ఉద్యమకారుల నుంచి స్వాధీనం చేసుకునే ప్రకటిత లక్ష్యంతో పాటు, స్క్వేర్‌లో గుమిగూడి బ్రదర్‌హుడ్ శక్తులను టెర్రర్ చేసే లక్ష్యం కూడా ఉంది. ఏకపక్ష దాడిగా కొనసాగుతుందన్న అంచనా తలకిందులైంది. ముఖాముఖి యుద్ధంగా మారింది. చేతి బాంబులను, పెట్రోలు బాంబులను, ఇతర రకాల చేతి ఆయుధాలను ఉభయపక్షాలు విస్తృతంగా రోజంతా ప్రయోగించాయి. పథకం ప్రకారం రాజ్యం అండదండలతో దాడిచేసిన ప్రైవేట్ మాఫియా బలగాలను తెహ్రీర్ స్క్వేర్‌లోని నిరాయుధ రక్తరహిత విప్లవకారులు (ట్విట్టర్ రెవల్యూషనరీస్) ఎలా ప్రతిఘటించగలిగారు? తెహ్రీర్ స్క్వేర్‌ను వదలకుండా ఎలా నిలబెట్టుకోగలిగారు? ఇదొక మిలియన్ డాలర్ ప్రశ్న.

పాశ్చాత్య మీడియా దాచేస్తే దాగని సత్యాలు తాజా ఈజిప్ట్ ప్రజా వెల్లువలో నిగూఢంగా ఉన్నాయి. పైన పేర్కొన్న ఫిబ్రవరి 2 దాడి ఆషామాషీ సంఘటన కాదు. అదొక ప్రతీఘాతుక కుట్ర. రష్యా ప్రథమ విప్లవంలో భాగంగా 9 జనవరి 1905న సంభవించిన 'రక్తసిక్త ఆదివారం' (బ్లడీ సండే) సంఘటనతో పోల్చదగినది. అయితే ఫలితాలు తద్విరుద్ధంగా వచ్చాయి. లెనిన్ నాయకత్వంలోని బోల్షివిక్కులు పదే పదే హెచ్చరిస్తున్నా, ఆనాటి రష్యన్ కార్మికవర్గం పట్టించుకోలేదు. జారు అనుకూల క్రిస్టియన్ మతాధిపతి గబన్ మీద భ్రమలతో వింటర్ ప్యాలెస్‌కు లక్షలాది కార్మికులు ర్యాలీగా వెళ్లారు. నిరాయుధులైన కార్మికులపై ప్యాలెస్ స్క్వేర్‌లో జారు సైనిక మూకలు దాడి చేశాయి.

వెయ్యి మందికి పైగా కార్మికులు అక్కడికక్కడే మరణించారు. అదే 'బ్లడీ సండే'గా చరిత్రకెక్కింది. యూనిఫారాలు విడిచిన ముబారక్ రహస్య పోలీసు వర్గాలు కూడా అదే తరహాలో నేడు గుర్రాలతో దాడికి దిగాయి. కానీ వింటర్ ప్యాలెస్ స్క్వేర్‌కు భిన్నంగా 'తెహ్రిర్ స్క్వేర్' సాయుధ ప్రతిఘటనకి దిగింది. ఈరోజు కాకపోయినా, మున్ముందు చరిత్రకారులు ఆ రోజు జరిగిన 'కైరో తెహ్రిర్ స్క్వేర్' సాయుధ ప్రతిఘటన ప్రత్యేక విశిష్టతను చరిత్రలో పేర్కొనాల్సి వస్తుంది. దాని చారిత్రక, రాజకీయ ప్రాధాన్యతను ప్రపంచ ప్రజలకి పాశ్చాత్య మీడియా ఎల్లకాలం దాచి పెట్టలేదు.

నిజానికి 'ఫిబ్రవరి – 2' నాటి ప్రతీఘాతుక సాయుధ దాడిని ఎదురొడ్డి 'ట్విట్టర్' విప్లవశక్తులు ఒక్క గంట కూడా నిలబడలేవు. అక్కడ జరిగేదంతా ట్విట్టర్ విప్లవంగానే పాశ్చాత్య మీడియా ప్రపంచానికి చిత్రించి చూపిస్తున్న సంగతి తెల్సిందే. పైగా నిరాయుధులు నడిపిస్తున్న శాంతియుత, రక్తరహిత విప్లవంగా ఫోకస్ చేస్తున్నది. అదే వాస్తవమైతే షాడో రాజ్యసైనిక సాయుధ బలగాలను ఎలా తరమగలిగారు? ఈ ప్రశ్నకు పాశ్చాత్య మీడియా ఏ జవాబివ్వగలదు?

తెహ్రిర్ స్క్వేర్‌లోని అశేష ప్రజారాశుల్లో సైబర్ యువతరం గణనీయ సంఖ్యలో ఉన్నమాట నిజమే. వారు నిజాయితీగా రాజరిక నియంతృత్వాలను వ్యతిరేకిస్తున్న మాట నిజమే. వాటి స్థానంలో అంతకంటే మెరుగైన పార్లమెంటరీ ప్రజాస్వామ్యంకై పరిమిత త్యాగాలకు సిద్ధపడిన మాట నిజమే. కానీ వారి యాదృచ్ఛిక చైతన్యం ఆనాటి ప్రతిఘాత రాజ్యకుట్రను తిప్పికొట్టడానికి ఏ మాత్రం సరిపోదు. దానిని ప్రతిఘటించి ఓడించగలిగిన ప్రత్యామ్నాయ సాయుధ శక్తి ఉంది. అదే ముస్లిం బ్రదర్ హుడ్ సంస్థ.

గత మూడు దశాబ్దాలుగా ఫాసిస్టు నిర్బంధాలు, నిషేధాల మధ్య కాకలుదీరిన యోధుల బలం ముస్లిం బ్రదర్ హుడ్‌కి ఉంది. పిస్తోళ్లు, చేతి బాంబులు, పెట్రోలు బాంబుల వంటి ఆయుధ ప్రయోగ విద్యలో ఆరితేరిన దిట్టలున్నారు. అలాంటి వేలాది మంది అజ్ఞాత యోధులను పల్లెల్లో బస్తీలలోని తమ గుడిసెల్లో దాచిపెట్టిన సమరశీల ప్రజల అండదండలున్నాయి. ఇవన్నీ ఒక ఎత్తుకాగా, అప్పటికి కేవలం వారం క్రితమే జైళ్లు పగలగొట్టి విడుదలైన వేలాది మంది ఉద్యమ నేతల కొత్త బలగం అదనంగా లభించింది. సుదీర్ఘ అజ్ఞాత అనుభవ దక్షతలుగల ముస్లిం బ్రదర్‌హుడ్ సంస్థ నాయకత్వం రాజ్యం నుంచి రానున్న ప్రమాదాన్ని అంచనా వేయగలదు. ఈ ముందస్తు వ్యూహంతోనే సాయుధ దాడిని సాయుధంగానే తిప్పికొట్టేందుకు సంసిద్ధమై ఉంటుంది. అందుకే 'తెహ్రిర్ స్క్వేర్'కి వచ్చే నాలుగు ప్రధాన వీధుల నుంచి రాకపోకలను మూసివేసి, దాడికి దిగినప్పటికినీ, గంటల తరబడి ప్రతిఘటించ గలిగి ఉంటారు. ఉద్యమకారులు నెత్తురోడుతున్న గాయాలతోనే పద్మవ్యూహంలో అభిమన్యుల వలె ప్రతిఘటించడం గమనార్హం.

ఆరోజు పగలంతా ముబారక్ పార్టీ బలగాలు దాడి చేస్తూనే ఉన్నాయనీ, అయినా తెహ్రిర్ స్క్వేర్‌ను అవి స్వాధీనం చేసుకోలేక పోయాయనీ, సర్కారు సైన్యాలు మౌన ప్రేక్షక పాత్రను పోషించాయనీ పాశ్చాత్య మీడియా ప్రచారం చేసింది. కానీ మరో చిన్న వార్తను కూడా అది వెల్లడించింది. ఆరోజు సాయంత్రం కల్లా కైరో నగరంలో ఉద్రిక్తత ఏర్పడిందనీ, ప్రభుత్వ వర్గాల జోక్యంతో ప్రైవేట్ సాయుధ బలగాలు సాయంకాలానికి వెనక్కి తరలి వెళ్లాయనీ అది వెల్లడించడం గమనార్హం. మనకి విశ్వసనీయ వార్తలు అందకపోయినా, ఆరోజు ఏం జరిగి ఉంటుందో ఊహించుకోవచ్చు.

ఆరోజు తమ ప్రతిఘటనకి కేవలం తెహ్రిర్ స్క్వేర్‌నే ఏకైక యుద్ధ క్షేత్రంగా ఉద్యమశక్తులు పరిమితం చేసుకొని ఉండకపోవచ్చు. ఒకవైపు దానినొక స్ఫూర్తిదాయకమైన ప్రతిఘటనా కేంద్రంగా ఎంచుకుంటూనే, మరోవైపు అంతకంటె మించిన వెన్నుదన్ను యుద్ధ క్షేత్రంగా కైరో నగర జనాభాను ఎంపిక చేసుకొని ఉంటాయి. కైరో చిన్ననగరం కాదు. ఢిల్లీ, కోలకతా, ముంబాయి, జకార్తాలను తలదన్నేది. దాదాపు కోటిన్నర జనాభాగల కైరోను ప్రతిఘటన ఉద్యమ కేంద్రంగా ఎంచుకొని ఉంటాయి. కైరో పేద ప్రజల నివాస బస్తీలు ఎప్పటి నుంచో బ్రదర్‌హుడ్ కంచుకోటలుగా ఉన్నాయి. దాని ప్రధాన నాయకులు ముందు జాగ్రత్తతో స్క్వేర్ సమ్మేళనాలలో పాల్గొనకుండా దూరంగా తలదాచుకొని ఉద్యమానికి దిశానిర్దేశం చేసి ఉండవచ్చు. 'మిలియన్ మెన్ మార్చ్'కి ఒకరోజు ముందే బ్రదర్ హుడ్ ప్రతినిధి చేసిన ఒక ప్రకటన అందుకు బలం చేకూరుస్తుంది. 'టునీషియాలో జరిగినంత తేలిగ్గా ఈజిప్ట్‌లో మార్పు జరగనివ్వకుండా ఒక పెద్ద ప్రమాదకర ఫాసిస్టు కుట్ర జరిగే అవకాశాలున్నాయంటూ' చేసిన వ్యాఖ్యానమది. అంతటి ముందస్తు అంచనాలు వేయగల నాయకత్వం ప్రమాదకర పద్మవ్యూహంలో చిక్కుకోదు. ప్రపంచ చరిత్రలో ఏ అజ్ఞాత పోరాట సంస్థలైనా అలాంటి మెలకువలను పాటించడం సహజమైనదే.

పై నేపథ్యంలో ఆరోజు జరిగిన ప్రతీఘాతక సాయుధ దాడిని ఎదుర్కొనేందుకు బ్రదర్‌హుడ్ నాయకత్వం క్షణాలలో మేల్కొని యావత్తు దేశ ప్రజలను సన్నద్ధం చేసేపనికి దిగి ఉంటుంది. ముఖ్యంగా మహా నగరమైన కైరో అశేష జనవాహినిని అప్రమత్తం చేసి ఉంటుంది. అలాంటి సార్వత్రిక సాయుధ ప్రతిఘటన తలెత్తే పరిస్థితులుంటే తప్ప ఆనాటి ప్రతిఘాతుక దాడి ఆగి ఉండేది కాకపోవచ్చు. పై సంక్షిప్త వార్త కూడా దీన్నే నిరూపిస్తున్నది. ఆరోజు ఏం జరిగి ఉంటుందో భౌతిక పరిస్థితుల ఆధారంగా ఈ అంచనాకి రావచ్చును. ఇంతకంటే మించిన సాక్ష్యాధారాలతో కూడిన సమాచారం చరిత్ర గర్భంలో దాగి ఉంటుంది. భవిష్యత్తులో అది ప్రపంచ ప్రజలకి అంది తీరుతుంది.

పశ్చిమాసియా (మధ్య ప్రాచ్యం), ఉత్తరాఫ్రికాలోనే మొత్తం 22 అరబ్బు దేశాలున్నాయి. ఇందులో ఒక్క పి.ఎల్.ఒ. మాత్రం రాజ్యరహిత దేశంగా యు.ఎన్.ఒ.లో గుర్తింపు పొందింది. ఆఫ్రికాలో పది దేశాలుంటే, ఆసియా ఖండంలో పి.ఎల్.ఒ.తో కలిపి పన్నెండు దేశాలున్నాయి. ఒక్క ఇరాన్ తప్ప గల్ఫ్ దేశాలన్నీ అరబ్బులవే. ప్రపంచ ఆయిల్ ఉత్పత్తుల్లో ఎనభై శాతం వరకూ ఈ మీనా (మిడల్ ఈస్ట్ అండ్ నార్త్ ఆఫ్రికా – ఎం.ఇ.ఎన్.ఎ.) ప్రాంతం నుంచే కొనసాగుతున్నాయి. అందుకే ఇవి ప్రపంచ రాజకీయ గమనాన్ని నిర్దేశిస్తున్నవి. ఈ మీనా ప్రాంతమంతా తాజా ప్రజాతంత్ర ఉద్యమ వెల్లువలు కొనసాగుతున్నాయి.

టునీషియాలో తక్కువ హింసతో బెన్ అలీ పలాయనం చిత్తగించాడు. కానీ అది చీకటి ఖండానికొక చిరు దీపమైనది. మధ్య ప్రాచ్యానికొక ఉత్ప్రేరకమైనది. అయితే అది వ్యాపించిన చోట్ల టునీషియా తరహాలో పాలకుల పలాయనం జరగదని తేలిపోయింది. తమ తొత్తు పాలకులను రక్షించుకోవడానికి వివిధ సామ్రాజ్యవాద దేశాలు రక్తసిక్త మారణ హోమాలకు సైతం వెనకాడబోవు. ఇప్పటికే ఈ చారిత్రక వాస్తవాన్ని ఈజిప్ట్ అనుభవం నిరూపించింది. టునీషియా పాఠంతో ఈజిప్ట్‌లో అప్రమత్తమయ్యాయి. ఈజిప్ట్ అనుభవంతో ఆల్జీరియా, యెమెన్, బహ్రెయిన్, లిబియాలు మరింత అప్రమత్తమయ్యాయి. ఈ నాలుగు దేశాల ప్రభుత్వాలు ప్రజాస్వామిక ఉద్యమకారులను స్క్వేర్‌లలోకే

అడుగు పెట్టనివ్వకుండా ముందే అప్రమత్తమయ్యాయి. ఆల్జీర్స్ టౌన్‌లోని (ఆల్జీరియా రాజధాని) మేడే స్క్వేర్, మనామా (బహ్రెయిన్ రాజధాని) లోని పెరల్ స్క్వేర్‌ల నుంచి ప్రదర్శకులను తరమడానికి రక్తసిక్త దమనకాండను అమలు జరిపాయి. సానా (యెమెన్), బెంఘాజీ (లిబియా) నగరాలను కూడ రక్తసిక్తం చేశాయి. ముఖ్యంగా అమెరికా పంచమ నౌకాదళ (ఫిఫ్త్ ఫ్లీట్) కేంద్రం గల బహ్రెయిన్ రాజధాని మనామా నేడు నెత్తురోడుతున్నది.

ఇంకా సిరియా, జోర్డాన్, కువాయిత్, యు.ఎ.ఇ., ఒమన్, కతార్, మొరాకో, సూడాన్ లకి కూడా 'ప్రజాతంత్ర ఉద్యమాలు విస్తరిస్తు'న్నాయి. 'పాలస్తీనా' ప్రజలు మరింత పదునెక్కుతున్నారు. మొత్తం అరబ్బు దేశాలలో సౌదీ అరేబియా నేటికీ ఒకింత స్థిరంగా ఉంది. అక్కడ కూడా బహ్రెయిన్ సరిహద్దులోని ప్రావిన్స్‌లో వేడి అంటుకుంటున్నది. ఇందులో కొన్ని ప్రభుత్వాలు ధరలు తగ్గించాయి. కొన్ని ప్రభుత్వాలు నిరుద్యోగ భృతిని కేటాయించాయి. మరికొన్ని ప్రభుత్వాలు ఏడాదిపాటు ప్రజలకి ఉచిత ఆహార వస్తువుల పంపిణీ పథకాన్ని ప్రకటించాయి. ఇంకొన్ని ప్రభుత్వాలు నగదు బహుమతులను కూడా ప్రకటించాయి. ఇవే కాకుండా, త్వరలో తాము గద్దె దిగిపోతామనో, లేదంటే త్వరలో ఎన్నికలను ప్రకటించుతామనో ప్రకటిస్తున్నాయి. అయినా స్వేచ్ఛ, ఆత్మగౌరవం, జాతీయ భావన వంటి అరబ్బు ప్రజల చిరకాల ఆకాంక్షలు తీరవు కదా! అందుకే ఉద్యమాలు ఆగడం లేదు.

ఈ అరబ్బు దేశాల భౌగోళిక, నైసర్గిక స్థితిగతులను, ప్రాధాన్యత లను అర్థం చేసుకోవాలి. అట్లాంటిక్ మహా సముద్రంలో మధ్య ధరా సముద్ర అనుసంధానం జరిగే జిబ్రాల్టర్ జలసంధి మొరాకోలో ఉంది. మధ్యధరా సముద్రం నుంచి ఎర్ర సముద్రాన్ని అనుసంధానించే సూయజ్ కాలువ ఈజిప్ట్‌లో ఉంది. ఉత్తరాఫ్రికాలో పడమర కొనలో మొరాకో ఉంటే తూర్పు కొనలో ఈజిప్ట్ ఉంది. ఎర్ర సముద్రం నుంచి హిందూ మహాసముద్రంలో ప్రవేశించే ఏడెన్ గల్ఫ్‌కు ఒకవైపు యెమెన్ ఉంటే, మరోవైపు సోమాలియా, జిబౌటీ దేశాలున్నాయి. ఇవన్నీ అరబ్ దేశాలే. ఇకపోతే కీలక అంతర్జాతీయ వాణిజ్య నౌకామార్గంలోని ఎర్ర సముద్రానికి ఒకవైపు సౌదీ అరేబియా, యెమెన్ దేశాలుంటే, మరోవైపు ఈజిప్ట్, సూడాన్, ఎరిట్రియా, జిబౌటీ దేశాలున్నాయి. ఇందులో ఎరిట్రియా తప్ప అన్నీ అరబ్ దేశాలే. అదే విధంగా మరో అంతర్జాతీయ ఆయిల్ మార్గమైన పర్షియా సింధు శాఖ తీరాన గల మొత్తం ఎనిమిది దేశాలలో ఒక్క ఇరాన్ తప్ప మిగిలినవన్నీ అరబ్బు దేశాలే. అంతకంటే కీలకమైన హోర్ముజ్ జలసంధి దగ్గర కూడా అరబ్ దేశాలే ఉన్నాయి. మధ్యధరా సముద్రంలో ఇటలీకి చెందిన సిసిలీ దీవులు ముందుకు చొచ్చుకొచ్చిన చోట ఇరుకు దారి ఉంది. అక్కడ టునీషియా ఉత్తరాగ్రం ఉంది. సబ్ సహారా ఆఫ్రికాతో అట్లాంటిక్ మహా సముద్రం కల్సిన ప్రాంతంలో మారిటేనియా సుదీర్ఘ తీరాన్ని కలిగి ఉంది. ఇది కూడా అరబ్ దేశమే. నేడు ఆయిల్, గ్యాస్ అవసరాలకి ఈ ప్రాంతాల ప్రాధాన్యత ఉంది. మున్ముందు యుద్ధ కాలంలో వ్యూహాత్మక యుద్ధ నౌకల నియంత్రణకి ఇవి అవసరమౌతాయి. అందుకే వీటి నియంత్రణకై అగ్రరాజ్యాలు చేయని కుట్రలు లేవు.

ఈజిప్ట్‌కు మరో భౌగోళిక, రాజకీయ ప్రత్యేకత ఉంది. ఈజిప్ట్ దేశాన్ని సూయజ్ కాలువ రెండు వేర్వేరు భూభాగాలుగా విడగొట్టింది. సూయజ్ కాలువకి తూర్పున సినాయ్ ద్వీపకల్పం ఉంది. మొత్తం ఈజిప్ట్ విస్తీర్ణంతో పోల్చితే చిన్న భూభాగమిది. కానీ అక్కడే ఆయిల్, గ్యాస్ వనరులున్నాయి. అంతకంటే మించి గాజాతో సరిహద్దును కలిగి ఉంది. ఈజిప్ట్ ప్రజలకి పాలస్తీనియన్ ప్రజలతో తరతరాల సమీప రక్త సంబంధాలున్నాయి. ఇజ్రాయెల్‌తో సరిహద్దులుండడం వల్ల పాలస్తీనీయుల గుండె చప్పుళ్ల ప్రతిధ్వనులు ఈజిప్ట్ ప్రజలను నిత్యం తాకుతుంటాయి. అలాంటి కీలకమైన సినాయ్ ద్వీపకల్పాన్ని 1967లో ఆరు రోజుల యుద్ధంలో ఇజ్రాయెల్ దురాక్రమించింది. ఆత్మగౌరవంతో సాధించుకోవడానికి బదులు అమెరికా ప్రభుత్వ దౌత్యంతో క్యాంప్ డేవిడ్ విద్రోహ ఒప్పందం ద్వారా సినాయ్‌ని ఇజ్రాయెల్ నుంచి రాబట్టుకుంది. అందుకు ప్రతిఫలంగా గత 32 ఏండ్లుగా సినాయ్ నుంచి చౌకధరకి ఇజ్రాయెల్ ఆయిల్, గ్యాస్ అవసరాలలో సగాన్ని సరఫరా చేస్తున్నది. తమ సాటి పాలస్తీనా ప్రజలను మారణహోమానికి గురిచేస్తున్న ఇజ్రాయెల్‌తో ముబారక్ సర్కారు అంటకాగుతున్నది. అది ఈజిప్ట్ ప్రజలను దహిస్తున్నది. అలాంటి రాజకీయ భౌగోళిక వ్యూహాత్మక ప్రాధాన్యతలు ఈజిప్ట్‌కి ఉన్నాయి.

మొత్తం ఉత్తరాఫ్రికా పశ్చిమాసియా దేశాలన్నీ కీలకమైన ప్రాంతంలోనివే. అయినా ఈజిప్ట్‌కొక ప్రత్యేకత ఉంది. అది చీకటి ఖండానికొక దీపస్తంభంవంటిది. మధ్య ప్రాచ్య చారిత్రక పురోగమన శకటానికి ఇంజన్ వంటిది. నైలు నదీ నాగరికత నేపథ్యంతో పాటు ఆధునిక యుగంలో అరబ్బు పునర్వికాసోద్యమ సారథ్యపాత్రను పోషించిన గత ఉజ్వల చరిత్ర ప్రత్యేకంగా ఈజిప్ట్‌కి ఉంది. నాజర్ నాయకత్వంలో సూయజ్ కాలువ జాతీయం చేసి అరబ్ జాతీయోద్య మానికి ఈజిప్ట్ నాయకత్వం వహించింది. మిగిలిన అరబ్బు దేశాలన్నింటి కంటే ఈజిప్ట్ ముందడుగు వేయడం అమెరికాకి చావుదెబ్బ. అందుకే సులేమాన్ వంటి తొత్తుతో 'ప్రభుత్వ మార్పిడి' అను నాటకంతో ఈజిప్ట్ ప్రజలను వంచించే అవకాశాలున్నాయి. రాజకీయ జీవాన్ని కోల్పోయి రిటైరైన ఒకరిద్దరు ముస్లిం బ్రదర్‌హుడ్ వృద్ధ నేతలను ఇముడ్చుకోవడం ద్వారా ఒక తాత్కాలిక ప్రభుత్వ ఏర్పాటుకై సులేమాన్ ఒక ప్రయత్నం చేశాడు. ఆ నాటకం భంగపడింది. ఇలాంటి ఎత్తులు విఫలమైతే, త్వరలోనే మరో పరమ రక్తసిక్త ఫాసిస్టు కుట్రకు కూడా అవకాశాలు లేకపోలేదు. అయితే నేటి ప్రపంచ పరిస్థితులలో అమెరికాకి అది అంత తేలికైనది కూడా కాదు.

అమెరికాకి ఇటీవలి సంవత్సరాలలో వరసగా అనేక ఎదురు దెబ్బలు తగులుతున్నాయి. అవి బహుళధ్రువ ప్రపంచం వైపు వేసే అడుగులుగా మారుతున్నాయి. లాటిన్ అమెరికా దేశాల మీద క్రమంగా తన ఆధిపత్యాన్ని కోల్పోతున్నది. యూరోపియన్ యూనియన్, షాంఘై-5, బ్రిక్ కూటాల వల్ల కూడా పట్టును కోల్పోతున్నది. ముఖ్యంగా ఆఫ్రికా, గల్ఫ్, అఫ్ఘనిస్తాన్. మధ్యాసియా దేశాలలో చైనా పెట్టుబడుల చొరబాటు అమెరికాకి ప్రత్యేక ఆందోళనను కలిగిస్తున్నది. రెండేండ్ల క్రితం గృహ నిర్మాణ ఆర్థిక సంక్షోభం అమెరికా బలహీనతలను మరింత బహిరంగపరిచింది. ఇవన్నీ ఒక ఎత్తు! ఈ అన్నింటికంటే తాజా అరబ్బు ప్రజావెల్లువలు మరో ఎత్తు! ఇవి మధ్య ప్రాచ్యంలో తన మనుగడనే ప్రశ్నార్థకం చేసే పరిస్థితి ఉంది.

తాజా అరబ్బు ప్రజా ఉద్యమాల రూపంలో పార్లమెంటరీ ప్రజాస్వామ్యం కోసం జరిగే ప్రజాతంత్ర ఉద్యమాలే కావచ్చు. కానీ అవి అంతర్గత విశ్లేషణలో జాతీయ విమోచన లక్ష్యాలను విధిగా ధరిస్తాయి. అదే విధంగా అవి శాంతియుత ఉద్యమాలుగా ప్రచారం జరుగుతుండొచ్చు. కానీ ఆచరణలో అవి సాయుధ ప్రతిఘటనా రూపం

*అరబ్ ప్రపంచంలోని నియంతలకు, సైన్యాలకు వ్యతిరేకంగా బద్దలైన ప్రజా వెల్లువను విశ్లేషిస్తూ, ప్రపంచ పీడిత ప్రజలు ఆ ఉద్యమాల స్ఫూర్తిని అందుకొని ముందుకు సాగాలని అంటున్నారు* **ఎన్. వేణుగోపాల్**

# అరబ్ ప్రజల కదలిక నేర్పుతున్నదేమిటి?

**ఉ**త్తర ఆఫ్రికాలోని చిన్న దేశం టునీషియాలో డిసెంబర్ 18న మొదలై, జనవరి 14న అక్కడి ప్రభుత్వాన్ని కూల్చివేసిన ప్రజాగ్రహపు నిప్పురవ్వ నిజంగా దావానలంగా మారింది. టునీషియాను ఇరవై మూడు సంవత్సరాలు నిరంకుశంగా పాలించిన ఏలిక పారిపోక తప్పలేదు. టునీషియా జాతీయ పుష్పం పేరు మీద 'మల్లెల విప్లవం' గా ప్రఖ్యాతమైన ఈ ప్రజా సంచలనపు మల్లెల పరిమళం ఇప్పటికి కనీసం పది దేశాలలో వీస్తున్నది. ఆ ప్రభావంతోనే ఈజిప్ట్ లో జనవరి 25న మొదలైన ప్రజా అసంతృప్తి ప్రదర్శనలు ఫిబ్రవరి 11న అధ్యక్షుడి పతనానికి దారితీశాయి. అమెరికా అండతో ముప్పై సంవత్సరాలుగా తిరుగులేని అధికారాన్ని చలాయిస్తుండిన ఆ అధ్యక్షుడు ఇవాళ తలదాచుకోవలసిన స్థితిలో ఉన్నాడు. ఇది రాస్తున్న సమయానికి యెమెన్‌లో, బహ్రెయిన్‌లో, లిబియాలో పెద్ద ఎత్తున ప్రజాప్రదర్శనలు జరుగుతున్నాయి. ప్రతిచోటా పాలకులు దిగిపోవాలనే నినాదాలు మార్మోగుతున్నాయి. తమ దౌర్జన్య పాలనకు అడ్డులేదని నిన్నటిదాకా విర్రవీగిన నరహంతక ధరాధిపతులందరూ పేకమేడల్లా కూలిపోతున్నారు. వెయ్యి గొడ్లను తిన్న రాబందు ఒక్క గాలివానకు సఫా అన్నట్టు ప్రజాశక్తి ముందు రాబందులు రాలిపోతున్నాయి.

ఒక కోటి జనాభా గల టునీషియాలో, ఎనిమిది కోట్ల జనాభా గల ఈజిప్ట్ లో జరిగిన పరిణామాలను చూసి, ప్రస్తుతం లిబియాలో జరుగుతున్న ఆందోళనలను చూసి ఆయా దేశాలలో మాత్రమే కాదు, ప్రపంచవ్యాప్తంగానే పాలకవర్గాలు, నిరంకుశ, ఆధిపత్యశక్తులు వణికిపోతున్నాయి. ఈ కార్చిచ్చు తమ దేశానికి అంటుకుంటుందేమోనని భయపడుతున్నాయి. ఈ పాలకుల భయాలను ప్రతిబింబిస్తూ సామ్రాజ్యవాద ప్రచార సాధనాలు గగ్గోలు పెడుతున్నాయి. అరాచకం ప్రబలుతున్నదని అంటున్నాయి. తమ ప్రయోజనాలను కొనసాగించగల ప్రత్యామ్నాయ పాలకుల కోసం అన్వేషిస్తున్నాయి. ఈ ప్రజా ఆగ్రహాన్ని ముందుగా పసిగట్టలేకపోయిన తమ గూఢచార సంస్థల మీద విరుచుకు పడుతున్నాయి. 'ఆర్తనాదములు శ్రవణానందకరముగనున్నవి' అనే ఎస్.వి.రంగారావు సినిమా వ్యాఖ్యలాగ, నియంతల, వారి ప్రచార సాధనాల ఆర్తనాదాలు ప్రజరాశులకు ఆసక్తికరంగా, వీనులవిందుగా ఉన్నాయి. ఆ గగ్గోలును బట్టే ఆ పరిణామాల తీవ్రతను, ప్రభావాన్ని, ఇతర దేశాలకు వ్యాపించే స్వభావాన్ని అర్థం చేసుకోవచ్చు.

ఈ జనాగ్రహ సంచలనాలను పాలకవర్గాలు ఎంత తీవ్రంగా పట్టించుకుంటున్నాయో, ప్రజలు, ప్రగతిశీల శక్తులు, ప్రజాప్రయోజనాల ధరించే అవకాశాలున్నాయి. ఇప్పటికే ఈజిప్ట్ నిరూపించింది. 17 జనవరి 2011న అర్ధరాత్రి తర్వాత మనామా పెర్ల్ స్క్వేర్‌లో నిద్రిస్తున్న ప్రదర్శకుల మీద పైశాచిక సైనిక దాడి అందుకొక నిదర్శనం. ఆరోజు మరణించిన మృతుల భౌతిక కాయాల అంతిమయాత్ర జన సముద్రమైనది. జనం భయపడలేదు. మూడోరోజుకల్లా అంతకు అనేక రెట్లు మంది జనం క్రోధావేశాలతో పురోగమించి తిరిగి పెరల్ స్క్వేర్‌ను పునరాక్రమించుకోగలిగారు. 'దూర్త దేశాల' జాబితా నుంచి లిబియాను నేటికీ అమెరికా తొలగించలేదు. తమ దేశ అస్థిరత వెనక అమెరికా హస్తం ఉందని గఢాఫీ ప్రభుత్వం ఆరోపించింది. అదే విధంగా అరబ్బేతర మధ్య దేశమైన ఇరాన్‌లో కూడా ఉద్యమం తలెత్తింది. వీటిని మరికొంత లోతుగా అంతర్గత కోణాలనుంచి విడిగా విశ్లేషించాల్సి ఉంది. ఏది ఏమైనా, ప్రధానంగా అమెరికా తొత్తు ప్రభుత్వాలన్నీ తాజా ప్రజా ఉద్యమ వెల్లువల నడుమ దిగ్బంధించబడడం ఒక ధోరణిగా మారడం గమనార్హం.

ఇప్పటికే పశ్చిమాసియాలోని మూడు దేశాలలో సాయుధ విమోచనోద్యమాలు సాగుతున్నాయి. ఇరాక్, పాలస్తీనా, లెబనాన్‌లలో జరిగే ఈ సాయుధ విప్లవ పోరాటాల వల్ల అమెరికా చావుదెబ్బలు తింటున్నది. మధ్యాసియాలో అఫ్ఘనిస్తాన్ ప్రజల గెరిల్లా పోరాటం వల్ల మరో చావుదెబ్బ తింటున్నది. ఉత్తరాఫ్రికాలోని అల్జీరియా, సోమాలియాలలో సాయుధ తిరుగుబాటు శక్తులు అమెరికా ప్రయోజనాలను తీవ్రంగా దెబ్బతీస్తున్నాయి. ఈ నేపథ్య పరిస్థితుల్లో తాజా అరబ్బు ఉద్యమాలు ప్రపంచ గమనం మీద తీవ్ర ప్రభావాన్ని కలిగించక తప్పదు. ముఖ్యంగా ప్రపంచ గమనంలో కీలక ప్రాంతమైన మధ్యప్రాచ్యంలో అమెరికా మనుగడను దెబ్బతీసే అవకాశాలున్నాయి.

అటు యూరప్ కార్మిక వెల్లువలూ, ఇటు అరబ్బు ప్రజా వెల్లువలూ అమెరికా, యూరప్ సామ్రాజ్యవాదులను బలహీనపరుస్తాయి. సంపన్న సామ్రాజ్యవాద రాజ్యాలు తమ దేశాల కార్మికవర్గ వెల్లువలకి తలవంచి జీతభత్యాల కోతలను ఉపసంహరించుకున్నాయనుకుందాం! ఆ మేరకు మరింత అదనపు భారాలను మూడో ప్రపంచ దేశాల మీద మోపాలి. కానీ ప్రస్తుతం మధ్యప్రాచ్యాన్ని నియంత్రించాలంటే అరబ్బు దేశాల ప్రజలకు, అనేక రాయితీలనివ్వాలి. దానివల్ల ఆ మేరకు తమ స్వంత దేశాల కార్మికవర్గ జీత భత్యాలలో మరింత కోత పెట్టాల్సి ఉంది. ఆచరణలో ఈ రెండింటి మధ్య అంతఃస్సంబంధం ఉంది. అనివార్యంగా ఉభయ ప్రజావెల్లువల లక్ష్యాలు ఏకమౌతాయి. పరస్పర ప్రయోజనాలు ఒకటౌతాయి. ప్రస్తుత ఏకధ్రువ ప్రపంచ మౌలిక స్థితిగతులనే మార్పులకి గురిచేస్తాయి. అలాంటి ప్రాధాన్యతగల గొలుసుకట్టు ఉద్యమ వెల్లువలను స్వాగతించుదాం. వాటికి అండదండలనిద్దాం. ముఖ్యంగా అరబ్బు ప్రజలకు బాసటగా గొంతెత్తి నినదించుదాం. వీ

*(రచయిత ఇఫ్టూ రాష్ట్ర ప్రధాన కార్యదర్శి)*

కోసం పనిచేస్తున్న శక్తులు అంతకన్న ఎక్కువగా పట్టించుకోవలసి ఉంది. ప్రజాశక్తులు ఈ సంచలనాలను చాల లోతుగా అధ్యయనం చేయవలసిన అవసరం ఉంది. అక్కడ ఏం జరుగుతున్నదో, ఆ పరిణామాలు ఎటు దారితీయనున్నాయో, ఆ పరిణామాలు ఇతర దేశాల ప్రజలకు ఎటువంటి పాఠాలు అందిస్తాయో జాగ్రత్తగా గమనించవలసి ఉంది. నాలుగైదు దశాబ్దాలుగా ప్రజలలో పెరుగుతూ వస్తున్న అసంతృప్తి, పాలక విధానాల పట్ల వ్యతిరేకత ఒక్కుమ్మడిగా ఎట్లా వీధి పోరాటాలకు దారితీశాయో, అందుకు నాయకత్వం వహించిన శక్తులు ఎటువంటి సన్నాహాలు చేశాయో, ఆ పోరాటాల విస్తృతి అంతిమంగా పాలకులను ఎలా కూల్చివేయగలిగిందో, ఇంకా అధికారపీఠాలను అంటిపెట్టుకుని ఉన్న పాలకులకు ఎలా గంగవెర్రులెత్తిస్తున్నదో నిశితంగా అర్థం చేసుకోవలసి ఉంది.

ఈ పరిణామాలు అరబ్ ప్రపంచానికి మాత్రమే కాదు, మొత్తం ప్రపంచానికే 1960ల తర్వాత అంతకంటే తీవ్రమైన ప్రజా సంచలనాల దృశ్యాన్ని ఆవిష్కరిస్తున్నాయని వ్యాఖ్యాతలు అంటున్నారు. 1968 విద్యార్థుల తిరుగుబాటు నాయకుడు, న్యూలెఫ్ట్ రివ్యూ సంపాదకుడు తారిఖ్ అలీ ఈ అరబ్ సంచలనాలను 1848 యూరప్ విప్లవాల వెల్లువతో పోలుస్తున్నారు. ఈ మహా ప్రజా వెల్లువలన్నీ ప్రపంచీకరణకు వ్యతిరేకమైనవేనని, ఆ విధానాలను అమలు చేస్తున్న పాలకులను కూలదోయడానికేనని అంటున్నారు ఈజిప్ట్ కే చెందిన ప్రపంచ ప్రఖ్యాత మార్క్సిస్టు అర్థశాస్త్రవేత్త సమీర్ అమీన్. 'విప్లవం పురోగమించినకొద్దీ అనివార్యమైన వర్గవిభజన జరుగుతుంది. అందుకోసం మనం జాగరూకతతో ఉండాలి. ఇక్కడే ఆగిపోగూడదు. ఒక్క ఈజిప్ట్ కే కాదు, మొత్తం అరబ్ ప్రాంతపు విముక్తికే తాళపుచేతులు మనదగ్గర ఉన్నాయి...' అంటున్నారు ఈజిప్షియన్ సోషలిస్టు, జర్నలిస్టు హొసామ్ ఎల్ హమలవి.

'టునీషియా తర్వాత ఈజిప్ట్ ప్రజా విజయం అరబ్, ముస్లిం దేశాలలో నూతన ప్రజాస్వామిక, భూస్వామ్య వ్యతిరేక, సామ్రాజ్యవాద వ్యతిరేక విప్లవానికి మరొక ముందడుగు. సామ్రాజ్యవాదానికీ, జియోనిజానికీ వ్యతిరేక పోరాటం టునీషియా నుంచి ఈజిప్ట్ కు, ఇరాక్ కు, అఫ్ఘనిస్తాన్ కు, పాలస్తీనాకు, లెబనాన్ కు వ్యాపించింది. ఇక ఇతర దేశాలు కూడ అంటుకుంటాయి. మనం గెలవగలం. మనం గెలవాలి. గెలుపు మనమీదే ఆధారపడి ఉంది' అంటున్నది నవ ఇటాలియన్ కమ్యూనిస్టు పార్టీ. 'ఈ అరబ్ ప్రజల తిరుగుబాటు నూతన ప్రపంచ వేకువకు మేల్కొలుపు గీతం పాడాలి' అంటోంది ఇటలీ, బ్రిటన్ లకు చెందిన ఏడు మావోయిస్టు సంస్థల సంయుక్త ప్రకటన. 'ఈ ప్రజా ప్రజ్వలనాల ద్వారా ప్రజలు తమ సర్వ సత్తాక అధికారాన్ని ప్రకటించుకుంటున్నారు, అమలు చేస్తున్నారు. జాతీయ విముక్తి, ప్రజాస్వామ్యం, అభివృద్ధి, సామాజిక న్యాయం లక్ష్యాలుగా సాగే పోరాటం మరింత పురోగతి సాధించేందుకు, మరిన్ని అవకాశాలు సాధించేందుకు వాళ్లు మార్గాలు తెరుస్తున్నారు. ఈ ప్రజ్వలనాల వల్ల విప్లవశక్తులు తమ బలాన్ని విస్తరించుకోవడానికి, సంఘటితం చేసుకోవడానికి అవకాశం వస్తుంది' అంటున్నారు ప్రజా పోరాటాల అంతర్జాతీయ వేదిక (ఇంటర్నేషనల్ లీగ్ ఫర్ పీపుల్స్ స్ట్రగుల్స్) అధ్యక్షుడు జోస్ మారియా సిజాన్.

అరబ్ దేశాల పరిణామాలు ఇంత ఆశావహమైనవే, ప్రపంచ వ్యాప్తంగా పీడిత ప్రజారాశులకు భవిష్యత్తుపట్ల ఆశను కలిగించగలిగినవే. నిజంగానే ఈ పరిణామాలు కేవలం ఆ ప్రాంతంలోని కొన్ని దేశాలకు మాత్రమే పరిమితమైనవి కావు. కావడానికి అవి చిన్న దేశాలే కావచ్చుగాని, అక్కడ జరిగిన పరిణామాలలో ప్రజాశక్తి రుజువు అవుతున్నది. పాలకులు ఎంత బలవంతులుగా కనబడినప్పటికీ, ఎంత దమననీతిని అమలుచేసి ఎంతకాలం గద్దె మీద కూచున్నప్పటికీ ప్రజలు తలచుకుంటే కూలిపోక, రాలిపోక తప్పదని ఆ దేశాల ప్రజలు రుజువు చేస్తున్నారు. ఆ దేశాల పాలకులకు అమెరికా అండ ఉన్నప్పటికీ పతనం తప్పదని ప్రజలు రుజువు చేస్తున్నారు. ఆ దేశాలన్నిటిలోనూ ప్రపంచీకరణ విధానాలు, దేశ వనరులను బహుళజాతిసంస్థలకు దోచిపెట్టే విధానాలు, ప్రజలమీద దారుణమైన అణచివేత సాగుతున్నప్పటికీ సమయం ఆసన్నమైనప్పుడు ప్రజలు లేచినిలిచారు. ఒక్క మాటలో చెప్పాలంటే ఆ దేశాలలో జరిగిన పరిణామాలకు ప్రపంచవ్యాప్త ప్రాధాన్యత ఉంది. గత రెండు దశాబ్దాలుగా ప్రపంచంలోని అన్ని దేశాలలోనూ అమలవుతున్న పాలక రాజకీయార్థిక విధానాలే ఆ దేశాలలో కూడ అమలవుతున్నాయి. కనుక ఆ దేశాలు ప్రపంచంలోని అన్ని దేశాల భవిష్యత్ చిత్రపటాన్ని చూపుతున్నాయి.

మరీ ముఖ్యంగా ఆ దేశాల ప్రజల స్థితి, పాలనా విధానాలు భారతదేశంలో లాగానే ఉన్నాయి. టునీషియాలోనూ, ఈజిప్ట్ లోనూ, ఇతరదేశాలలోనూ ఉన్న ప్రజాజీవన దుస్థితికీ, భారతదేశంలోని దుస్థితికీ పెద్ద తేడాలేదు. పేదరికం, ఉపాధి అవకాశాల కొరత, నిరుద్యోగం, అవిద్య, అనారోగ్యం, సామాజిక అసమానతలు, ప్రజలమీద మతం ప్రభావం ఒకవైపు, దేశంలోని అపార సంపదలన్నీ పిడికెడు మంది హక్కు భుక్తమైపోవడం, సామ్రాజ్యవాదుల దళారీలూ, స్థానిక పాలకులూ, వ్యాపారులూ తోడుదొంగలుగా దేశాన్ని దోచుకోవడం, వారి అవినీతి కుంభకోణాలు, విదేశీఖాతాలు, దేశ వనరుల దుర్వినియోగం, వనరులనూ మార్కెట్లనూ బహుళజాతి సంస్థలకు దోచిపెట్టడం ఆ దేశాలలోనూ, భారతదేశంలోనూ ఒక్కలాగే ఉన్నాయి. టునీషియా, ఈజిప్ట్ ల గురించి ఇటీవల వెలువడుతున్న ఏ వార్తనూ, వ్యాసాన్నీ చూసినా, అక్కడ ప్రస్తావించిన అరబ్ పేర్లు తీసి, భారత పేర్లు పెడితే ఏమాత్రం తేడాలేని స్థితి ఉంది. మరి అటువంటి పరిస్థితులే ఉన్నప్పుడు, భారతదేశంలో అటువంటి ప్రజా సంచలనాలే ఎందుకు జరగడం లేదు అనే ప్రశ్న ప్రజల అభ్యున్నతి పట్ల ఆసక్తి ఉన్న ఎవరైనా వేసుకోవలసిన ప్రశ్న.

ప్రజా సంచలనాల గురించి, ఉద్యమాల గురించి మార్క్సిస్టు విశ్లేషణలో భౌతిక పరిస్థితులు, స్వీయ మానసిక శక్తులు అనే రెండు కీలకమైన మాటలు ఉన్నాయి. భౌతిక పరిస్థితులు అంటే స్థూలంగా సామాజిక, రాజకీయార్థిక పరిస్థితులు, పాలనా పద్ధతి, కొనసాగుతున్న వ్యవస్థ అనుకోవచ్చు. స్వీయ మానసిక శక్తులంటే ఈ యథాస్థితిని మార్చాలనే ఆలోచనను ఆచరణగా రూపుదిద్ది, నిర్వహించే శక్తులు, అందుకు అవసరమైన సన్నాహాలు చేసే శక్తులు, అవసరమైన వనరులను సమీకరించి ఉపయోగించే శక్తులు. మార్పు సాధ్యమేనని నమ్మి, మార్పు తేవడానికి అవసరమైన వ్యూహాన్ని, ఎత్తుగడలను రచించి, నిర్వహించే సంఘటిత శక్తులనే స్వీయమానసిక శక్తులు అనే పారిభాషిక పదంతో గుర్తిస్తున్నారు. మొదట ఇది ఒక అగ్రగామి సంఘం, పార్టీ, నిర్మాణం కావచ్చు.

భౌతిక పరిస్థితులు మార్పుకు అనుకూలంగా ఉన్నప్పుడు, ఆ మార్పుకు నాయకత్వం వహించి, ఆ మార్పు దిశను నిర్దేశించగల స్వీయ మానసిక శక్తులు కూడ ఉంటేనే, ఈ భౌతిక పరిస్థితుల, స్వీయ మానసిన

శక్తుల సమన్వయం కుదిరితేనే అర్థవంతమైన మార్పు సాధ్యమవుతుందని మార్క్సిస్టు విశ్లేషణ చెపుతుంది. వర్గ వ్యవస్థ సాగినంత కాలం దోపిడీ పీడనలు ఉంటాయి గనుక, మనుషులు తాము అనుభవిస్తున్న దోపిడీ పీడనలు రద్దు కావాలని కోరుకుంటారు గనుక, ఎప్పుడైనా భౌతిక పరిస్థితులు ఏదో ఒక స్థాయిలో అనుకూలంగానే ఉంటాయి. పాలనావిధానాల వల్ల ఒక్కోసారి ఆ భౌతిక పరిస్థితి పరిపక్వమవుతూ ఉంటుంది. అప్పుడు ప్రజలు తమమీద అమలయ్యే దోపిడీ పీడనలు రద్దు కావాలని మరింత ఎక్కువగా కోరుకుంటారు. స్వీయ మానసిక శక్తుల పని ఆ దోపిడీ పీడనలు రద్దయ్యే మార్గం చూపడం. నిజానికి ఇది నాయకత్వం పని మాత్రమే కాదు. స్వీయ మానసిక శక్తులు అన్నప్పుడు అందులో ఆ దోపిడీ పీడనలను అనుభవిస్తున్న మనుషులందరూ కూడ భాగమే. కాని ఆ మనుషులందరికీ తాము ఉన్న భౌతిక పరిస్థితులను కూలదోయడం, మార్చడం సాధ్యమేనని తెలియకపోవచ్చు. తెలిసినా విశ్వాసం కుదరకపోవచ్చు. అటువంటి పని మొదలయితే తాము దానికి నాయకత్వం వహించగలమనే ఆత్మవిశ్వాసం రాకపోవచ్చు. కాని పరిస్థితుల ఒత్తిడి వల్ల యథాస్థితి దుర్భరమని మాత్రం తెలుస్తుంది. అప్పుడే స్వీయ మానసిక శక్తులు తమ అగ్రగామి చైతన్యంతో, అవగాహనలతో, నిర్మాణాలతో ప్రజారాశులకు మార్గదర్శకత్వం వహించవలసి ఉంటుంది. నాయకత్వం అందించవలసి ఉంటుంది. క్రమక్రమంగా ఆ చైతన్యం, నిర్మాణం విస్తరిస్తూ అశేష ప్రజాసామాన్యం స్వీయ మానసిక శక్తులుగా మారుతారు. అనుకూలంగా ఉన్న భౌతిక పరిస్థితులను తమ చేతులలోకి తీసుకుని మారుస్తారు.

సాధారణంగా ప్రజా విప్లవానికి వర్తించే ఈ సూత్రీకరణను అరబ్ ప్రజా సంచలనాలకు అన్వయించేటప్పుడు ఒకటి రెండు పరిమితులు కూడ గుర్తుంచుకోవాలి. ఈ అరబ్ ప్రజా సంచలనాలు పూర్తి అర్థంలో శ్రామికవర్గ విప్లవాలు కావు. పూర్తిగా శ్రామికవర్గ నాయకత్వంలో జరిగినవి కావు. వీటి ధ్యేయం తక్షణమే సమసమాజాన్ని స్థాపించడం కాదు. కాని ఆయా దేశాలలో కొనసాగుతున్న ఆధిపత్య, నిరంకుశ, సామ్రాజ్యవాద దళారీ పాలనల నేపథ్యంలో, అరబ్ సమాజాల మత ఛాందసత్వం గురించి ఉన్న అభిప్రాయాల, అపోహల నేపథ్యంలో చూసినప్పుడు ఈ సంచలనాల నుంచి గ్రహించవలసినదీ, మార్క్సిస్టు విశ్లేషణ సాగించవలసిందీ ఎంతో ఉంది.

అక్కడి భౌతిక పరిస్థితులు భారత సమాజంలోని భౌతిక పరిస్థితులకన్న భిన్నమైనవి కావు. అక్కడ రాచరికాల పేరుతో, సైనిక నియంతృత్వాల పేరుతో, ప్రజాస్వామిక ప్రభుత్వాల పేరుతో ఉన్న పాలనలన్నీ కూడ మన పాలనలాగనే ఉన్నాయి. పార్లమెంటరీ ఎన్నికల ప్రజాస్వామ్యం ఉన్న చోట మనలాగనే ఎన్నికల అక్రమాలు, దొంగ వోట్లు, డబ్బు సంచులను బట్టే ప్రజాప్రతినిధులు గెలవడం, ఆశ్రిత పక్షపాతం, పాలక కుటుంబాల అక్రమ ఆస్తులు వంటి లక్షణాలన్నీ ఉన్నాయి. టునీషియాలోనూ, ఈజిప్ట్ లోనూ జరిగిన ఎన్నికలలో అక్కడి పాలక పార్టీలకు అత్యధిక శాతం ప్రజలు వోట్లు వేసినట్టు, అంటే ప్రజలే వారికి పాలనాధికారం ఇచ్చినట్టు నిన్నటివరకూ చెప్పుకున్నారు. ఆ ప్రజాప్రాతినిధ్యం ఎంత అబద్ధమైనదో టునిస్ నగరవీథుల్లో జనవరి 5 నుంచి 14 వరకూ, కైరో నగరవీథుల్లో జనవరి 25 నుంచి ఫిబ్రవరి 11 వరకూ బయటపడింది.

కాబట్టి ఎన్నికలే ప్రజాస్వామ్యం కాదు. క్రమబద్ధంగా ఎన్నికలు జరగడం, ఎన్నికైన ప్రభుత్వాలు ప్రజాస్వామ్యానికి తామే గుత్తేదారులమని, తామే ప్రజాప్రతినిధులమని చెప్పుకోవడం నిజంగా ప్రజలు లేచి నిలిచే వరకు మాత్రమే చెల్లుతుంది. ఒక్కసారి ప్రజలు లేచి నిలిచి, భయం వదిలి, తమ శక్తి మీద తాము విశ్వాసం తెచ్చుకుంటే, మార్పు సాధ్యమేననీ, సాధించగమనీ అనుకుంటే వారిని ఆపగల శక్తి ఏదీ ఈ ప్రపంచంలో ఇంతవరకూ పుట్టలేదు. బానిస యజమానుల దౌష్ట్యాన్ని ధ్వంసించిన స్పార్టకస్ తిరుగుబాటు నాటి నుంచి ఇవాళో రేపో కర్నల్ గడ్డాఫీని మట్టి కరిపించనున్న లిబియన్ ప్రజల దాకా ఈ చారిత్రక సత్యం అనేక సార్లు రుజువైంది.

ఐతే ఇది ఎంత చారిత్రక సత్యమైనా, చారిత్రక అనివార్యత ఐనా, అది దానంతట అదే జరిగిపోయేది కాదు. ముఖ్యంగా అధికారంలో ఉన్న శక్తులు తమ అధికారాన్ని కాపాడుకోవడానికి సకల ప్రయత్నాలూ చేస్తాయి. ప్రజలను చీలుస్తాయి, అబద్ధాలు ప్రచారం చేస్తాయి, ప్రజలకు తప్పుడు చైతన్యపు, మాదకద్రవ్యాల మత్తెక్కిస్తాయి. సైనికదళాలను ఉసిగొల్పి, ప్రజల తిరుగుబాటు మీద భయంకరమైన నిర్బంధాన్ని ప్రయోగించి, తిరుగుబాటు చేయడానికి భయపడే పరిస్థితి కల్పిస్తాయి. అంటే ప్రజలు ఏకం కాకుండా, తమ శక్తిని గుర్తించకుండా అనేక అవరోధాలను కల్పిస్తాయి. ఆ అవరోధాలను అధిగమించడంలోనే, ప్రజల చేత అధిగమింపజేయడంలోనే స్వీయ మానసిక శక్తుల పాత్ర ఉంటుంది. రకరకాల కారణాల వల్ల చీలిపోయి ఉన్న ప్రజల మధ్య ఐక్యత సాధించాలి. నిరంతర అధ్యయనం, పరిశీలన, బోధన, శిక్షణల ద్వారా ప్రజల మనసులలోంచి అబద్ధాలనూ మత్తునూ తప్పుడు భావజాలాన్నీ తొలగించాలి. ప్రజల శక్తి మీద ప్రజలకు విశ్వాసం కలిగించాలి. ఆ కృషిలో అవి తమను తాము నిరంతరం పదును పెట్టుకోవలసి ఉంటుంది. తమ అవగాహనలను, చైతన్యాన్ని, పరికరాలను, ఆచరణను నిరంతరం అభివృద్ధి చేసుకోవలసి ఉంటుంది. తమ పాత్ర ఉన్నా లేకపోయినా, ఏదో ఒక కారణం మీద ప్రజలు కదిలినప్పుడు ఆ ప్రజాందోళనలలో చేరి, వాటికి దిశానిర్దేశనం చేయవలసి ఉంటుంది. అటువంటి ప్రజావెల్లువ ఎప్పుడు వస్తుందో తెలియదు గనుక ఆ అవకాశం అందుకోవడానికి స్వీయమానసిక శక్తులు ఎప్పుడూ సిద్ధంగా ఉండాలి.

నిజానికి అరబ్ సంచలనాలలో ప్రధానమైన అంశాలలో ఒకటి స్వీయ మానసిక శక్తులు తమ స్థాయిని, నైపుణ్యాన్ని, సమయోచిత భాగస్వామ్యాన్ని పెంచుకున్న తీరు. ఈజిప్ట్ లో జనవరి 25న జరిగిన మహాప్రదర్శనకు ప్రజలను సమీకరించేందుకు వివిధ బృందాలు సాంకేతిక నైపుణ్యాన్ని ఎలా ఉపయోగించుకున్నాయో ఇప్పటికే ఎంతో మంది రాశారు. అతి భయంకరమైన దమననీతి అమలవుతున్న చోట ప్రదర్శనకారులకు సలహాలిస్తూ 'హౌ టు ప్రొటెస్ట్ ఇంటిలిజెంట్లీ' అని నాయకులు తయారుచేసిన 26 పేజీల కరపత్రం చూస్తే వారి నైపుణ్యం అర్థమవుతుంది.

నిజానికి ఈ పనులు ఏ ఒక్కరో, ఏ ఒక్క సంస్థో చేయగలిగినవీ, చేసినవీ కావు. అశేష ప్రజారాశులలో ఈ పనులు సాగించాలంటే అనేక రకాల, అనేక స్థాయిల, అనేక రంగాల కృషి అవసరమవుతుంది. ఆ అన్ని రంగాల కృషిని సమన్వయం చేయగలిగినప్పుడే స్వీయ మానసిక శక్తులు విజయం సాధించగలుగుతాయి. ఇవాళ అరబ్ సంచలనాలలో ప్రధానమైనది ఈ సమన్వయమే. అక్కడ ప్రజా సంచలనాలలో పాల్గొన్న శక్తులను చూస్తే ఎప్పటికైనా వీళ్ల మధ్య ఐక్యత సాధ్యమా అని ఆశ్చర్యం కలుగుతుంది. ప్రధానంగా నిరుద్యోగ యువతరం పాల్గొన్న ఈ

తిరుగుబాట్లకు కార్మికవర్గం పెద్ద ఎత్తున మద్దతు ఇచ్చింది. ముస్లిం బ్రదర్ హుడ్ వంటి అనేక లౌకికమైన, మతపరమైన ఇస్లామిక్ భావజాల సంస్థలు, ఉదార ప్రజాస్వామ్య సంస్థలు, ట్రాట్స్కీ వాదుల నుంచి మావోయిస్టుల వరకు అన్నిరకాల మార్క్సిస్టులు, మొత్తంగా సామ్రాజ్యవాద వ్యతిరేకులు ఈ తిరుగుబాట్లలో పాల్గొన్నారు. నావల్ ఎల్ సాదవి వంటి ఎనభై సంవత్సరాల సుప్రసిద్ధ నవలారచయిత్రి దగ్గరి నుంచి ప్రాథమిక పాఠశాల విద్యార్థుల వరకూ ఆ పద్దెనిమిది రోజులు తహ్రీర్ స్క్వేర్ లో ప్రదర్శనలలో పాల్గొన్నారు. ఒక్క మాటలో చెప్పాలంటే ఈ అరబ్ సంచలనాలలో విశాల ప్రజా రాశులు పాల్గొన్నాయి.

'పెట్టుబడిదారీ విధానం తప్ప మరోదారి లేదు' అని సామ్రాజ్యవాదులు ప్రచారం చేస్తున్న దశలో సామ్రాజ్యవాద కీలుబొమ్మల మీద తిరుగుబాటు చేయడం, వారిని కూలదోయడం సాధ్యమేననీ, విప్లవం అవసరమనీ, సాధ్యమేననీ వాళ్లు రుజువు చేశారు. లక్షలాది మంది పాల్గొన్నప్పటికీ ఎవరి ఇష్టారాజ్యంగా వారు కాక, ఒక సంఘటిత నిర్మాణ కృషిగా ఆ ఆందోళన సాగింది. ఇటువంటి సమన్వయ, సంఘటిత కృషి లేకపోతే ఎంత పెద్ద ప్రజా తిరుగుబాట్లనయినా అణచడానికి, బలహీనపరచడానికి ఆధిపత్యశక్తులు ప్రయత్నిస్తాయి. టునీషియా గురించి కన్న ఈజిప్ట్ గురించి ఎక్కువ సమాచారం అందుబాటులో ఉంది. దాని ప్రకారం అక్కడ కనీసం పది సంవత్సరాలుగా కార్మిక వర్గంలో నిర్మాణ కృషి సాగుతున్నది. కార్మిక సంఘాలు, 'ఏప్రిల్ 6 యువజనోద్యమం', 'మేమందరమూ ఖలీద్ సయీద్‌లమే', 'ముబారక్ వ్యతిరేక కూటమి' వంటి మార్క్సిస్టు సంస్థలు, ముస్లిం బ్రదర్ హుడ్, నేషనల్ అసోసియేషన్ ఫర్ చేంజ్, వఫద్ పార్టీ వంటి ప్రతిపక్షాలు, విద్యార్థులు, న్యాయవాదులు, మేధావులు, సోషలిస్టులు, ఇస్లామిక్ వాదులు, ప్రజాస్వామిక వాదులు అందరూ వేరువేరుగా చేస్తూ వచ్చిన కృషి అంతా, వారు తయారు చేసిన నిర్మాణాలన్నీ ప్రజా వెల్లువకు ఉపయోగపడ్డాయి.

అంటే ప్రజావెల్లువకు, తిరుగుబాటుకు, విప్లవానికి అవసరమైన రెండు అంశాలూ – ప్రజల సంసిద్ధత, నాయకత్వపు సన్నాహక కృషి – సమపాళ్లలో సమకూరినప్పుడు అద్భుతమైన, సంభ్రమాశ్చర్య భరితమైన ఫలితాలు వస్తాయని ఇవాళ అరబ్ ప్రపంచం నేర్పుతున్నది. కొనసాగుతున్న దోపిడీ పీడనల పాలనవల్ల, పాలకుల దుర్మార్గాలు రోజురోజుకూ పెచ్చరిల్లిపోతుండడం వల్ల, ప్రజల ఆకాంక్షలను అణచడానికి పాలకులు తీవ్రమైన దమననీతిని ప్రయోగిస్తుండడం వల్ల ప్రజలలో లోలోపల అసంతృప్తి, వ్యతిరేకత గూడు కట్టుకుంటూ ఉంటాయి. లోలోపల వారి ఆగ్రహం పెరిగిపోతూ, పైకి చూడడానికి మాత్రం నివురు కప్పుకుంటూ ఉంటుంది. లోపల నిప్పు మాత్రం సంసిద్ధంగా ఉంటుంది. నాయకత్వపు సన్నాహక కృషి చేయవలసిందల్లా ఆ నివురును ఊది మంట రాజేయడం, ఒక నిప్పురవ్వ ఎగసినప్పుడు దాన్ని మంటగా మార్చడం, ఆ మంట వ్యాపించడానికి తగిన పరిస్థితిని ఏర్పరచడం, ఒక నిప్పురవ్వను దేశవ్యాపిత దావానలంగా విస్తరించగల నిర్మాణాలను తయారు చేసిపెట్టడం. అరబ్ ప్రపంచంలో, ప్రత్యేకించి ఈజిప్ట్‌లో ఈ పనులు జరిగాయి. భారతదేశంలో ప్రజావెల్లువను కలగనేవారు ఇటువంటి నిర్మాణాత్మక కృషి గురించి ఆలోచించాలి.

అయితే ఒక హెచ్చరిక కూడ ఉంది. ఈ అరబ్ ప్రజా సంచలనాలను చూసి పొంగిపోయి విజయోత్సవాలు జరుపుకుంటే ఫలితం లేదు. ఈ విజయంలో దాగి ఉండే అపజయాలను కూడ గుర్తించ వలసి ఉంది. ఆ అపజయాల అవరోధాలను దాటుకుని ఈ సంచలనాలు నిజంగా ప్రజా విజయంగా మారుతాయా, లేదా మరొక రూపంలోని దోపిడీ శక్తుల చేతుల్లోకి పోతాయా అనేది ఇవాళ పెద్ద ప్రశ్న.

ఇటువంటి ప్రజా ఉద్యమాలలో అన్ని వర్గాల ప్రజలు పాల్గొనే అవకాశం ఉంటుంది గనుక ప్రతి వర్గమూ తన ప్రయోజనాల సాధన కొరకు ప్రయత్నించే అవకాశం కూడ ఉంటుంది. నిరంకుశ పాలకులను, ప్రభుత్వాన్ని పడగొట్టడం వరకూ భిన్న వర్గాల మధ్య, భిన్న ప్రయోజనాల మధ్య కనబడిన ఐక్యత, ఒకసారి విజయం చేకూరగానే ఘర్షణగా మారుతుంది. నిన్నటిదాకా కలిసి పోరాడిన శక్తులే ఇవాళ తమ భిన్న ప్రయోజనాల సాధన కొరకు ఎదురుబొదురుగా నిలబడతాయి. ప్రత్యర్థిని పడదోసి, ఓడించి తామే గెలవడానికి ప్రయత్నిస్తాయి. ఇవాళ అరబ్ దేశాల ప్రజా సంచలనాలకు నాయకత్వం వహిస్తున్న, ఆ ప్రజా సంచలనాలలో పాల్గొంటున్న శక్తుల వైవిధ్యం చూస్తే రానున్న రోజులలో ఈ శక్తుల మధ్య తీవ్రమైన ఘర్షణ జరగవచ్చునని స్పష్టమవుతుంది.

మామూలుగానే ఈ శక్తుల మధ్య వైవిధ్యం, వైరుధ్యాలు ఉండగా ఈ చమురు నిక్షేపాల భూభాగం తన పట్టు నుంచి జారిపోకుండా కాపాడుకోవాలని ప్రయత్నించే అమెరికన్ పాలకవర్గాల పాత్ర కూడ గణనీయంగా ఉంది. పోరాటశక్తులలో కొందరిని ఆకట్టుకోవడానికి, కొనివేయడానికి, తన తైనాతీలను పోరాటంలోకి ప్రవేశపెట్టడానికి, పోరాటశక్తులుగా చూపడానికి అమెరికన్ పాలకవర్గాలు, ప్రచారసాధనాలు ఇప్పటికే ప్రయత్నాలు ప్రారంభించాయి. ఈజిప్ట్ ప్రజా ఉద్యమం తమ వల్లనే సాధ్యమైందని, తమ సాంకేతిక నైపుణ్యం వల్లనే సాధ్యమైందని, తమ ఉదార ప్రజాస్వామిక నమూనానే ఈజిప్ట్ ఆందోళనకారులు ఆమోదిస్తున్నారని అమెరికన్ పాలకవర్గాల ప్రతినిధులు ప్రకటిస్తున్నారు.

అలాగే ఈ దేశాలన్నిటిలోనూ సైన్యం పాత్ర ప్రధానమైనది. గత మూడు నాలుగు దశాబ్దాలుగా ఈ దేశాల ప్రభుత్వాలన్నీ ప్రజలను అణచి ఉంచడంలో భాగంగా సైన్యానికి అత్యధిక ప్రాధాన్యతనిచ్చాయి. ఆ సైన్యంలో పై అధికారులందరికీ అటు అమెరికన్ సిఐఎ, ఇటు ఇజ్రాయెలీ మొసాద్ శిక్షణనిచ్చాయి. ఆ సైన్యపు ఆధునీకరణకు అమెరికా విపరీతంగా నిధులు, అత్యాధునిక ఆయుధాలు అందజేసింది. కనుక ఇప్పుడు సైన్యంలోని కిందిస్థాయి అధికారులు, సాధారణ సైనికులు ప్రజలవైపు నిలబడడానికి ప్రయత్నించినా, పైస్థాయి అధికారులు, విధాన నిర్ణేతలు అమెరికన్ పాలకవర్గాలకో, స్థానిక పాలకవర్గాలకో మద్దతు తెలిపే అవకాశం ఉంది. అదే జరిగితే ఈ వెల్లువలో సాధించిన విజయాలన్నీ రద్దయిపోతాయి. నిజానికి 1986లో ఫిలిప్పైన్స్ ప్రజావెల్లువ అనుభవం, 1998 ఇండొనేషియా ప్రజావెల్లువ అనుభవం ఈ ప్రమాదాన్ని చూపుతున్నాయి. ఆ రెండు దేశాలలో ప్రజాగ్రహం వెల్లువెత్తినప్పుడు, దానికి నాయకత్వం వహించి ప్రజానుకూల మార్గ నిర్దేశనం చేయవలసిన స్వీయ మానసిక శక్తులు సంసిద్ధంగా లేకపోవడంతో, ఆ రెండు చోట్లా ప్రజల చేతికి అధికారం వచ్చినట్టే వచ్చి చేజారిపోయింది.

మొత్తంగా చూస్తే భారత దేశంలో కొనసాగుతున్న యథాస్థితిని మార్చాలని, నిజమైన ప్రజారాజ్యం రావాలని కోరుకునే వారందరూ అరబ్ ప్రజావెల్లువను అధ్యయనం చేసి గ్రహించవలసింది ఎంతో ఉంది. భారత ప్రజా ఆగ్రహం వెల్లువలా ముంచెత్తే సమయం వచ్చినప్పుడు ఆ అవకాశాన్ని జారవిడుచుకోకుండా ఉండడానికి ఏమి చేయవలసి ఉందో ప్రగతిశీల శక్తులు ఆలోచించాలి.

*(రచయిత వీక్షణం సంపాదకులు)* వీ

# తెలుగు ఆలోచనాపరుల అభిప్రాయాలు




వనరులు దోపిడీ చేస్తూ వివిధ దేశాలను పీల్చి పిప్పి చేస్తున్న అమెరికా పెత్తనం కలకాలం సాగదనే విషయం అరబ్ పరిణామాల నుంచి అర్థమవుతోంది. ఇవాళ ప్రపంచ ప్రజానీకానికి అమెరికా దుర్మార్గాలు అవగతమవుతున్నాయి. మొత్తం అరబ్ పరిణామాలు ఆహ్వానించదగ్గవి. మన దగ్గర కూడా గ్రీన్‌హంట్‌తో పాటు, రకరకాల అణచివేతలు ప్రజలపై కొనసాగుతున్నాయి. అక్కడి నుంచి ఆ చైతన్యం దక్షిణాసియాకు అంటే మన దేశానికి ప్రవహించి రాజుకునే అవకాశం లేకపోలేదు. ప్రభుత్వాలను అడ్డం పెట్టుకొని సామ్రాజ్యవాదులు కొనసాగిస్తున్న వనరుల దోపిడీకి వ్యతిరేకంగా, స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కోసం ప్రజలు ఎక్కడికక్కడ ఉద్యమిస్తున్నారు. యుద్ధ ట్యాంకర్లపై కూర్చొని ఊరేగింపుగా బయలుదేరి కొత్త పోరాట రూపాలను ఆవిష్కరిస్తున్నారు. కొత్త తెగువను ప్రదర్శిస్తున్నారు. నియంతల ఆగడాలను 'నిషిద్ధ' సంస్థలు మాత్రమే ఎదుర్కోవడం చూసేవాళ్లం. ఇప్పుడు ప్రజలు మొత్తంగా ప్రతి ఒక్కరు ఒక సైనికుని మాదిరిగా ఎదుర్కోవడం చూస్తున్నాం. ఒక సంస్థో, కొద్ది మందో చేస్తే అయ్యేది కాదనే స్ఫూర్తితో అందరూ పోరు బాట పడుతున్నారు. ప్రతి మనిషి ఒక సైనికుడయ్యే పరిస్థితి సామ్రాజ్యవాదం కలిగిస్తోంది. ఇది మంచి పరిణామం. ఈ పరిణామాలు ఒక క్రమబద్ధమైన శక్తిగా ఎదుగుతాయా చూడాలి. ఆయా దేశాలలో అధ్యక్షులు దిగిపోయినంత మాత్రాన సరిపోదు. సిద్ధాంతకర్తలు, ఆలోచనా పరులు, మేధావులు ప్రజానుకూలంగా ఒక మలుపు తిప్పాలి. ఈ బాధ్యతను వారు తీసుకోవాలి. ఈ సందర్భంలో వారి ప్రమేయం చాలా ఉంది. మన దగ్గర పోస్కో, వేదాంత లాంటి కంపెనీలు అటు ఈశాన్య భారతంలో కావచ్చు, ఇటు తెలంగాణలో కావచ్చు పెద్ద ఎత్తున వనరుల దోపిడీకి పూనుకుంటున్నాయి. అందరూ ఈ పరిణామాల్ని చూస్తున్నారు. ఉక్కు పాదాల్ని, పోలీసు నిర్బంధాల్ని ఎదుర్కొంటున్నారు. అలా ఎదుర్కోవడం, భయం లేకుండా ముందుకు సాగడం తెలంగాణ సందర్భంలోనూ మనం చూస్తున్నాం.

**– సూరేపల్లి సుజాత**

*శాతవాహన విశ్వవిద్యాలయంలో అధ్యాపకులు, సామాజిక కార్యకర్త*

సామ్రాజ్యవాద దేశాలు ఎంత పెత్తనం చేసినప్పటికీ తమ గుప్పిట్లో ఉంచుకున్న దేశాల్లో ప్రజాస్వామ్యిక పోరాటాలు బద్దలవు తున్నాయి. ఈజిప్టు పోరాటం ఈ కోవలోదే. అక్కడ అధికారంలో ఉన్న నియంతలకు అమెరికా, ఇజ్రాయెల్‌ల అండదండలున్నప్పటికీ ప్రజలు పెద్దఎత్తున తిరగబడి విజయం సాధించారు. మొత్తంగా ఇవి వలస దురాక్రమనకు వ్యతిరేకంగా జరుగుతున్నాయనేది ప్రత్యేకంగా చెప్పుకోవాల్సి ఉంది. గతంలో స్వతంత్ర ఉద్యమాలు, విప్లవాలు ఒక దగ్గర బద్దలై ఇంకో చోటికి విస్తరించినట్లే ఇప్పటి ఆత్మగౌరవ, స్వయం పాలన ఆకాంక్ష పోరాటాలు పెల్లుబుకు తున్నాయి. అలాంటిదే టునీషియాలో మొదలైన 'జాస్మిన్ విప్లవం', ఈజిప్ట్ ప్రజల తిరుగుబాటులో కనబడుతుంది. ఉద్యమం పుంజుకోవడం ఈజిప్ట్ కవుల ద్విపద సాహిత్యం ప్రజల నినాదాలై ఉద్యమానికి ఊపిర్లు పోస్తున్నాయి. నేడు తెలంగాణ స్వయం రాష్ట్ర ఉద్యమం కూడ ఈజిప్ట్ ఉద్యమ స్వభావాన్నే సంతరించుకున్నది. నెలల తరబడి తెలంగాణ ప్రజలు శిబిరాలను ఏర్పాటు చేసుకుని పోరాటం చేయడం, అనేక అస్తిత్వాల ప్రజలు దళితులు, ఆదివాసీలు, ఉత్పత్తికులాలు, ముస్లింలు వివిధ రంగాలుగా లాయర్లు, డాక్టర్లు, ఉపాధ్యాయులు, విద్యార్థులుగా ఉద్యమాన్ని కొనసాగించారు. అయితే ఈజిప్టులో నియంతను వెల్లగొట్టేంత ఉద్యమశక్తి ఉండడం తెలంగాణలో కొరవడినట్లనే కోణంలో చూస్తే డా. బి.ఆర్ తన కుల నిర్మూలన గ్రంథంలో చెప్పి మత పరమైన అంశాలను గుర్తించుకోవాల్సి ఉన్నది. ఏమతమైనా ప్రజల ఐక్యతకు తోడ్పడాలి అనిచెపుతూ ముస్లిం, క్రైస్తవ మత భావజాలాలు కొంతవరకు 'మేము' అనేభావాన్ని పెంపొందించ గలుగుతున్నాయి. అంటే ఈ మతాలలో వివిధ కులాల విభజన, వర్ణాశ్రమ ధర్మం లేకపోవడమే కారణం. ఏ దేశంలో ప్రజల తిరుగుబాటు జరిగినా అందులో మతం అంతర్లీన పాత్రను బలంగానే పోసిస్తున్నదనేది అంబేద్కర్ వివరిస్తాడు. ఈనేపథ్యంలోనే ఈజిప్ట్‌లో 18 రోజులో తీవ్రమైన ఉద్యమం చేసి వలస నియంతను వెల్లగొడితే తెలంగాణలో సీమాంధ్ర వలస నియంతలను వెల్లగొట్టడానికి 50 సంవత్సరాల పైగా పడుతుందేమో. దీనికి ప్రధాన కారణం తెలంగాణ ఉద్యమంలో అంతర్గతంగా హిందూ వర్ణాశ్రమ, పితృస్వామ్య భావజాలం కొనసాగి అనిశ్చితి ఏర్పడడం వలనఐక్యత కష్టతరమైంది. గత అర్ధశతాబ్ద కాలంగా జరుగుతున్న ఉద్యమంలో ఆధిపత్య వర్ణాల ద్రోహం అస్తిత్వ సమాజాల ప్రజలకు ఎన్నో అనుభవాలను మిగిల్చింది. ఫలితంగా దళితులు అగ్రవర్ణాలవారిని, ఆదివాసీలు మైదానాల వారిని, ఉత్పత్తి కులాలు ఉత్పత్తేతర వర్ణాలను,

స్త్రీలు పురుష నాయకులను ఒక కంట కనిపెట్టుకొని ఉండాలనే అనుమానాలున్నాయి. ఈ నేపథ్యం నుండే వలస దోపిడివారిపై పోరు నడుపుతున్నారు. తెలంగాణ రాష్ట్రం వస్తే సరిపోదు. అందులో మా బతుకేంది. అనే ప్రశ్నలతో పోరాడుతున్నారు. అందుకే వీరు చాలా మట్టుకు పోరాటం, నాయకత్వంలోకి వస్తామన్నా రానీయరు, మీడియాలో కనిపించ నీయరు. అయినా పోరాడుతూనే ఉన్నారు. ఇక్కడి నాయకత్వాలకు, వలసాంధ్రాధిపత్య వర్గాలకు, మగవాళ్లకు వ్యతిరేకంగా పోరాడాల్సి ఉంది. స్త్రీలు ఎవరికి తోచిన పద్ధతిలో ఎక్కడ అవకాశం దొరికితే అక్కడ పోరాడుతున్నారు. 'వనరుల్లో, రాజకీయ ప్రాతినిధ్యంలో మేమంతమందిమో మాకంత వాట' అనే అకాంక్షనే స్త్రీలను స్వరాష్ట్ర పోరాటంలో నడిపిస్తున్నది. తెలంగాణ పోరాటంలో కేంద్రంగ ఉన్న ఉస్మానియా విద్యార్థులకు బాసటగా నిలిచిన మాణిక్యేశ్వరనగర్ బస్తీలోని స్త్రీల పాత్ర, మలుపు తిప్పిన తెలంగాణ ఉప ఎన్నికలలో ఓట్లు వేసిన మహిళల పాత్ర, పోరాటంలో బిడ్డల ఆత్మ బలిదానాలకు పూనుకుంటే వాటిని దిగమింగుకుని ముందుకు నడుసున్న స్త్రీల పాత్ర ఇవన్నీ గుర్తించాల్సి ఉంది. తెలంగాణ పొలిటికల్ జె.ఎ.సి రాజకీయ ప్రాతినిధ్యం వరకే పరిమితమైంది. ఉద్యమం మాత్రం విస్తృతమయింది. పరిమితులు, బలహీనతలమధ్య ఉద్యమం నడూస్తోంది కాబట్టి విద్యార్థులు, లాయర్లు... ఇలా కొన్ని రంగాలపై వలస ప్రభుత్వం అణిచివేత చేపడుతోంది. ఈజిప్ట్ తరహాలో సాధ్యమైన ఐక్యత ఇక్కడ ఇంకా రావాల్సే ఉన్నది. ప్రజలపై విభజన, అణిచివేత పునాదిగా నడిచే వర్ణాశ్రమ భావజాలాకు అతీతంగా అనేక అస్తిత్వాల ప్రజల ఐక్యతతో తెలంగాణ స్వరాష్ట్ర ఉద్యమం నడవాల్సి ఉంది.

**– గోగు శ్యామల**

*దళిత రచయిత్రి*

**అ**రబ్ ప్రపంచంలో జరుగుతున్న ఉద్యమం, ఇప్పుడు యెమెన్ దాకా విస్తరించింది. యెమెన్ నుంచి ఒక అమ్మాయి నాకు ఫోన్ చేసింది. అక్కడ చాలా పెద్ద ఎత్తున పోరాటం జరుగుతోందనీ, మీడియాలో ఆ విషయాలు పూర్తిగా రావడం లేదనీ తెలియజేసింది. నియంతలకు, రాజులకు వ్యతిరేకంగా అక్కడి ప్రజలు చాలా పెద్ద ఎత్తున తమ నిరసన తెలియజేస్తున్నారు. తెలంగాణలో ఉన్న అవినీతి నాయకత్వం అలాంటి ఐక్యతను సాధించలేకపోతోంది. అక్కడ ప్రజలు పద్దెనిమిది రోజులు తెహ్రిర్ స్క్వేర్ వద్ద కూర్చుండి పోయారు. తమ డిమాండ్స్ చెప్పారు. నియంత గద్దె దిగిపోతే, తాము వెళ్లిపోతామని అన్నారు. అక్కడి ఉద్యమంలో స్త్రీలు చాలా ముఖ్యమైన భూమికను పోషించారు. అరబ్ ప్రపంచమంతటా ఈ రోజు స్త్రీలు ఈ తిరుగుబాట్లలో పెద్ద ఎత్తున పాల్గొంటున్నారు. అక్కడ స్త్రీలను అణచివేస్తారనేది ఒక అపోహగా తేలిపోతోంది. మతపరమైన వెనుకబాట్లు, కట్టుబాట్లు ఉన్నా ఈజిప్ట్ పోరాటంలో స్త్రీల పాత్ర చాలా ఉంది. ఈజిప్ట్‌లో ఒక వార్తా ఛానెల్‌లోని చీఫ్ న్యూస్ రీడర్ అష్రా అనే మహిళ ప్రజల తిరుగుబాటుకు వ్యతిరేకమైన వార్తలు చదవమంటే 'తాను వాస్తవాలే చదువుతాననీ, ప్రజల తిరుగుబాటును తక్కువ చేసే వాస్తవ వ్యతిరేకమైన వార్తలు చదువననీ' చెప్పి ప్రతిఘటించింది. అంతేకాకుండా ఆ ఉద్యోగానికి రాజీనామా చేసి ప్రజల్లోకి వచ్చింది. ప్రజలు ఆమెను తమ నాయకురాలిగా స్వాగతించారు. ఆమె తల్లి కూడా ఆచరణలో భాగమైంది. త్యాగ నిరతితో అక్కడి స్త్రీలు ఉద్యమాన్ని ముందుకు నడుపుతున్నారు. మన తెలంగాణలో స్త్రీలను ఉద్యమంలోకి రానివ్వడం లేదు. ముస్లింల విషయంలోనూ అదే జరుగుతోంది. మార్పు తేవడానికి అన్ని సమూహాల ప్రజలను కలుపుకొని సాగాలి. ఈజిప్ట్‌లో సైన్యం అధ్యక్షునితో కాకుండా ప్రజలకు బాసటగా నిలిచింది. మన దగ్గర పాలకులు, సైన్యం కలిసి ఒకటిగా ఉన్నారు. ఒకే తానులో ముక్కలుగా ఉన్నారు. అక్కడ ఇమాం ఉద్యమ సందర్భంలో ఖురాన్ చదవలేదు. ప్రజల కోసం శుక్రవార ఉపన్యాసం ఇచ్చాడు. మిలిటరీతో కూడా తెహ్రిర్ స్క్వేర్‌కు వచ్చి ప్రజాస్వామిక నిరసనలో పాల్గొనమని సూచించాడు. మేధావులు నిజాయితీతో పనిచేస్తున్నారు. అక్కడ సోషల్ నెట్‌వర్కింగ్ బాగుంది. ఇక్కడి ప్రజలు వివిధ సమూహాలుగా విడిపోయారు. రకరకాల జె.ఎ.సి.లు ఉన్నాయి. అందుకే ఒక ఉర్దూ వార్తా పత్రిక వీటికి 'ఆశిఖోంకి జె.ఎ.సి.' అని పేరు పెట్టింది. ప్రేమ ఒకటే గానీ జె.ఎ.సి.లు వందలు ఉన్నాయి. ఎవరి ప్రేమ తీసుకోవాలో ప్రజలకు కన్‌ఫ్యూజన్ ఉంది. జె.ఎ.సి.ల మధ్య తెలంగాణ కొట్టుకుపోతోంది. సౌదీ అరేబియాలో స్త్రీలు పెద్ద ఎత్తున రోడ్లపైకి వచ్చి పోరాటం చేస్తున్నారు. వారి భర్తలూ, పిల్లలూ జైళ్లలో ఉన్నారు. అరబ్ చరిత్రలో స్త్రీలు ఇలా రోడ్లపైకి రావడం ఇది మొదటిసారి. అక్కడ రాజుకు ఈ పరిణామాలతో గుండెపోటు వచ్చింది. ఈ పరిణామాలతో అమెరికా ఆధిపత్యం పతనమవుతుంది. అమెరికా చేతిలో తిరుగుబాట్లు దెబ్బ తినకుండా ప్రజలు ఒక కంట కనిపెట్టుకొని ఉన్నారు. అమెరికాతో పాటు ఇజ్రాయెల్ ఆధిపత్యం పతనమయ్యే సమయం వచ్చింది. భారత ప్రజలకు కూడా అవినీతికి వ్యతిరేకంగా పోరాడడానికి కావాల్సిన సందేశం ఆ పోరాటాలలో ఉంది. మనం కూడా అవినీతిలో కూరుకుపోయిన పాలకవర్గాలకు వ్యతిరేకంగా పోరాడితేనే విముక్తి సాధించగలం.

**– లతీఫ్ మొహమ్మద్ ఖాన్**

*ప్రధాన కార్యదర్శి, సివిల్ లిబర్టీస్ మానిటరింగ్ కమిటీ*

**ఎ**క్కడైతే అణచివేత ఉంటుందో, అక్కడ ప్రతిఘటన తప్పనిసరి. నిజానికి ఈ ప్రతిఘటన ఆధునికత సంతరించుకుంటున్న సమాజాలలో, దేశాలలో ఎప్పుడో జరిగి ఉండవల్సింది. మొత్తం అరబ్ దేశాల్లో దుబాయ్ ఆధునికంగా ఉన్నా ఎక్కువ దేశాలు పచ్చి ఛాందసత్వంలోనో, భూస్వామ్య భావజాల తొలి దశలోనో ఉండడం వలన ఈ ప్రతిఘటనకు ఇంత జాప్యం జరిగింది. ఒక్క ట్యునీషియా, ఈజిప్ట్‌లలోనే కాకుండా ఈ జ్వాలలు ఉగాండా, నైజీరియా, మొరాకో లాంటి దేశాలకు పాకు తుండడం మనం చూస్తున్నాం. ఇవి నిరసన జ్వాలలు కావు. ఉవ్వెత్తున ఎగిసిపడుతున్న ప్రతిఘటనా మంటలు. ఈ పరిణామాలు ప్రజాస్వామిక వాదులని, హక్కులను ఆపేక్షగా చూసేవారిని ఎంతో ఆనంద పరుస్తున్నాయి. ఈ పరిణామాలు ప్రపంచంలోని అణగారిన జనావళికి ఒక ఊతాన్ని, స్థైర్యాన్ని ఇస్తాయనడంలో ఎటువంటి సందేహం లేదు. ప్రపంచ వ్యాప్తంగా ఉండే ప్రజాస్వామిక వాదులు అక్కడి హత్యాకాండను గొంతెత్తి బలీయంగా నిరసించవలసిన కాలం ఇది. నిరసించడం అంటే ఆయా సమాజాలలో అణగారిన బతుకులు బతుకుతున్న జనావళి తిరగ బడడమే. ప్రాంతీయ, జాతీయ ఉద్యమాల వారికి ఈ ఘటనలు ఎంతో ప్రేరణ కలిగిస్తాయనడంలో ఎటువంటి సందేహం లేదు.

**– ఎస్. భూమన్**

*అధ్యక్షులు, రాయలసీమ అధ్యయనాల వేదిక*

**టు**నీషియా, ఈజిప్ట్ దేశాలలో జరుగుతున్న పరిణామాలు ప్రజాస్వామ్యం కోసం, నియంతృత్వానికి వ్యతిరేకంగా ఉవ్వెత్తున లేచిన ప్రజా ఉద్యమాలుగా ప్రజలు భావిస్తున్నారు. వీటి ప్రభావం వలన జోర్డాన్‌లో, యెమెన్‌లో, అల్జీరియాలో, లిబియాలో ప్రజాస్వామ్యం కోసం పోరాటాలు ప్రారంభమయ్యాయి. వీటన్నిటినీ నిర్దాక్షిణ్యంగా అణచివేసే ప్రయత్నాలు కొనసాగుతున్నాయి. దాదాపు ఈ అన్ని దేశాలలో నియంతృత్వాలకు

అమెరికా సామ్రాజ్యవాదుల మద్దతు ఉండడం గమనార్హం. ఇజ్రాయెల్ కూడా ఈ పరిణామాల పట్ల కలత చెందుతోంది. ఈ ప్రజాస్వామ్య పోరాటాలను హైజాక్ చేసేందుకు మత ఛాందస వాదులు తీవ్ర ప్రయత్నాలు సాగిస్తున్నారు. నియంతృత్వ పరిపాలనను ముగించిన తర్వాత సైనిక పాలనో, లేక మత ఛాందస్సుల పరిపాలనో ప్రత్యామ్నాయం కాజాలదు. ప్రజలు జాగూరుకతతో ఈ అడ్డంకులను అధిగమించి అరబ్బు దేశాలలో సామ్రాజ్యవాద వ్యతిరేక సెక్యులర్ ప్రజాస్వామిక ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసుకునేందుకు చేస్తున్న ప్రయత్నం విజయంవంతం కావాలని ఆకాంక్షిస్తున్నాను. ఈ పోరాటాలు నియంతృత్వానికి వ్యతిరేకంగానే కాక, అసాధారణమైన అవినీతి పాలక కుటుంబాలలో చోటు చేసుకోవడం పట్ల వచ్చిన ఆగ్రహం ప్రతిబింబించింది. భారతదేశంలో పాలకులు అవినీతి కుంభకోణాలు బయట పడిన తర్వాత కూడా గుణపాఠాలు నేర్చుకోకపోతే, ఇక్కడ కూడా అసాధారణ పద్ధతులలో లక్షల సంఖ్యలో ప్రజలు పోరాటాలకు సన్నద్ధమవుతారు.

**– సురవరం సుధాకరరెడ్డి**

*సి.పి.ఐ. జాతీయ నాయకులు*

గత మూడు దశాబ్దాలుగా అరబ్ దేశాలలో ఉన్న నియంతృత్వ పాలనలు అన్నీ మానవ హక్కులనూ, పౌరహక్కులనూ హరించి వేశాయి. అంతేకాకుండా, ప్రజలకున్న సమస్యలు నిరుద్యోగం, దారిద్ర్యం ఏవీ పోలేదు. ముఖ్యంగా ఈజిప్ట్ అమెరికాకు తొత్తుగా ఉండింది. ట్యునీషియాలో కూడా ప్రజలకు ఎటువంటి హక్కులు లేకపోవడం, ఆ తర్వాతి పరిణామాలు ప్రజాస్వామిక హక్కుల కోసం సాగుతున్నవే. 1967లోని యుద్ధం, తర్వాత యుద్ధాలతో అరబ్ దేశాలలో ఉన్న ఐక్యత దెబ్బతిన్నది. ట్యునీషియా, ఈజిప్ట్‌లు మొదలుకొని లిబియా వరకు అనేక మంది ఇప్పటికే చనిపోయారు. ఈ పోరాటాలన్నిటిలో అమెరికా ఆధిపత్యానికి, ఇస్లామిక్ ఆధిపత్యానికి వ్యతిరేకత ఉంది. ఇప్పుడు అధికారం ఎవరి చేతుల్లోకి పోతుందోననే ఆందోళన అమెరికాకు ఉంది. ఎవరు అధికారంలోకి వస్తారో చూడాలి. మొత్తానికి ఇవన్నీ ప్రజాస్వామ్యం కోసం జరుగుతున్న పోరాటాలు. ట్యునీషియాలోని ఒక పళ్లు అమ్ముకొనే యువకుడి ఆత్మహననంతో అక్కడి సామాన్య ప్రజలు ఎన్ని రకాల అవస్థలతో, అణచివేతలతో బాధపడుతున్నారో తెలుస్తుంది. ఇక్కడ కూడా తెలంగాణ కోసం ముస్తఫా అనే సామాన్యుడు ఈ రెండు రోజుల క్రితమే చనిపోయాడు. ఇక్కడ అట్టడుగు ప్రజల్లో కూడా అలాంటి ఆందోళనలే అనేకం గూడుకట్టుకొని ఉన్నాయి. ఇవాళ్టి తెలంగాణ కూడా అలాంటి పోరాటమే. ఏ పార్టీలు లేకుండానే ప్రజా ప్రతిఘటనలుగానే ఇవి ముందుకు వస్తున్నాయి.

**– రమా మెల్కోటె**

*రిటైర్డ్ పొలిటికల్ సైన్స్ ప్రొఫెసర్*

టునీషియా మొదలుకొని అరబ్ దేశాల్లో వస్తున్న ఒక రకమైన విప్లవాలు ఆహ్వానించదగ్గవి. ఇవి 1848 ఫిబ్రవరిలో యూరప్‌ను ముంచెత్తిన విప్లవాలను పోలి ఉంటున్నాయి. ఆనాడు యూరప్‌లో ఆ విప్లవాలను చూసాకే కార్ల్ మార్క్స్ 'పెట్టుబడిదారులు వారి గోతిని వారే తవ్వుకున్నారు. ఇంకెంత మాత్రం కొనసాగడానికి అవకాశం లేదు' అని వ్యాఖ్యానించాడు. అలాగే ఈ మధ్యకాలంలో దాదాపు ఇరవై ఏళ్లుగా ప్రపంచవ్యాప్తంగా ఉద్యమాలు సామ్రాజ్యవాదులను నియంత్రించే పరిస్థితి తలెత్తింది. అవి వెనుకబడ్డ దేశాలలో పాక్షిక ఉద్యమాలు, అస్తిత్వ ఉద్యమాలు కావచ్చు, లేక ప్రపంచీకరణను విమర్శిస్తూ వచ్చినటువంటి ఏషియన్ సోషల్ ఫోరం, వరల్డ్ సోషల్ ఫోరం వంటి క్యాంపెయిన్‌లు కావచ్చు. సామ్రాజ్యవాదమే తనకు వ్యతిరేకంగా తలెత్తే ప్రజా ఉద్యమాలను పద్ధతి ప్రకారంగా పక్కదారి పట్టిస్తున్నది. జార్జియా, ఉక్రెయిన్‌లలో తలెత్తినటు వంటి గులాబి, ఆరెంజ్ విప్లవాలు, రష్యాకు వ్యతిరేకంగానూ, ఉద్యమాలను పక్కదారి పట్టించే విధంగానూ ఉన్నాయి. సామ్రాజ్యవాదం ఆవిర్భవించి నప్పటి నుండి ఈ ప్రయత్నాలు చూస్తున్నాం. అందులో భాగంగానే మన దేశంలోని జాతీయ కాంగ్రెస్ ఏర్పాటు కూడా అమెరికన్ సామ్రాజ్యవాదం తన తాబేదార్లు, ప్రజా విశ్వాసం పూర్తిగా కోల్పోయిన సందర్భాలలో వారిని పక్కన పెట్టడానికి ఫిలిప్పైన్స్, పాకిస్తాన్‌లలో గతంలో చేసినటువంటి ప్రయత్నాల కొనసాగింపే నేటి అరబ్ దేశాల సంక్షోభాలు. ఒబామా వచ్చిన తర్వాత ఇంకెంత మాత్రం పాత పద్ధతిలో అరబ్ దేశాల మీద, అక్కడి చమురు వనరుల మీద, తద్వారా ప్రపంచం మీద తన ఆధిపత్యాన్ని కొనసాగించలేమన్న విషయం అర్థమై, ఉన్నంతలో వ్యవస్థలను కొంతమేరకు మార్చాలనే ప్రయత్నంలో భాగంగానే నేటి అరబ్ ఉద్యమాలను అర్థం చేసుకోవాల్సి ఉంటుంది. దీనికి రష్యా, చైనాలు తదితర సామ్రాజ్యవాద దేశాలు లోపాయకారి మద్దతును అందిస్తున్నాయి. కాని మొత్తం మీద సామ్రాజ్యవాద ప్రపంచీకరణ కారణంగా ప్రపంచ వ్యాప్తంగా తలెత్తుతున్నటు వంటి ఆర్థిక, రాజకీయ, సామాజిక సంక్షోభాలకు పరాకాష్టగా ఈ ఉద్యమాన్ని చూడాల్సి ఉంటుంది. ఇటీవలి సబ్ ప్రైమ్ క్రైసిస్ కారణంగా మొదట దుబాయ్‌లోనే విపత్తు సంభవించింది. నేటి సంక్షోభ కేంద్రంగా అరబ్ దేశాలు ఉన్నాయనే దానికి అదే నిదర్శనం. ఇంత బ్రహ్మాండంగా తలెత్తుతున్న ప్రజల ఆందోళనలను, పోరాట స్ఫూర్తిని సంఘటితం చేయగల శక్తులూ, పార్టీలూ ఆ దేశాలలో లేకపోవడం ఒక విషాదం. ఈ అరబ్ దేశాలలో కొన్ని ఫ్రెంచ్ విప్లవం లాగా కదులుతున్నాయి. మరికొన్ని ఆ ఉద్యమాలకు తెలియకుండానే రిపబ్లికన్ కార్యక్రమం కలిగి ఉన్నాయి. మరికొన్ని దేశాలు స్పష్టంగానే డెమోక్రటిక్ కార్యక్రమం కలిగి ఉన్నాయి. ఆ దేశాలలోని ప్రజాస్వామిక శక్తులకు, రిపబ్లికన్ మద్దతుదార్లకు మనం చేయగల సూచన – దేశాల వారిగా సంఘటితం అయి, అమెరికన్ సామ్రాజ్యవాదాన్ని, దాని తొత్తులను పారదోలుతూ కొత్తగా తలెత్తే దళారీ చేతుల్లోకి ఉద్యమాలు పోకుండా, మత శక్తుల చేతుల్లోకి పోకుండా ప్రజాస్వామిక శక్తులు జాగ్రత్తగా దీర్ఘకాలిక ఉద్యమాలు నడిపించి, ప్రజాస్వామిక విప్లవాలను విజయవంతం చేయాలి. ప్రపంచ సోషలిస్ట్ విప్లవంలో భాగం చేయాలి.

**– ఆకుల భూమయ్య**

*తెలంగాణ ప్రజా ఫ్రంట్ ఉపాధ్యక్షులు*

ఈ మధ్య ఈజిప్ట్‌లో సంభవించిన పరిణామాలు, అదే వరుసలో పరిసర దేశాలలో జరుగుతున్న సంఘటనలు మానవాళికి ఒక స్పష్టమైన సందేశాన్ని ఇస్తున్నాయి. ప్రజాస్వామిక ఆకాంక్షలను ఎవరూ శాశ్వతంగా అణచివేయలేరనేదే ఆ సందేశం. నియంతల నిరంకుశ పాలనకు, అప్రజాస్వామిక వ్యవస్థలకు, అవినీతికి వ్యతిరేకంగా పోరాడుతున్న ఆ దేశాల ప్రజలు, అటువంటి సమస్యలనే ఎదుర్కొంటున్న ఇతర దేశాల ప్రజలకు ఒక విధంగా మార్గదర్శకం అయింద్రు. ఈజిప్ట్‌లో ప్రజల పోరాటానికి మరొక విశిష్టత ఉంది. తాత్కాలికంగా మిలిటరీ ప్రభుత్వాన్నైనా ఓర్చుకుంటాం గానీ, అవినీతిలో కూరుకుపోయిన నియంత పాలనను ఏమాత్రం భరించలేమనీ ఆ దేశ ప్రజలు స్పష్టం చేశారు. ఇటువంటి పరిణామాలు కేవలం నియంతల పాలనలో ఉన్న దేశాలకు మాత్రమే పరిమితం కానక్కర్లేదు. సామాన్యుల జీవితాలను దుర్భరం చేసినపుడు

అది ప్రజాస్వామిక వ్యవస్థ లేక మరో విధమైన వ్యవస్థ అనే విచక్షణ ఉండదు. ఈ ధోరణి ఇపుడు భారతదేశంలో ప్రస్ఫుటంగా ఆవిష్కృతమవుతుంది. మితిమీరిన అవినీతి, అంతులేని కుంభకోణాలు ప్రజలు భరించలేని అసహ్యకరమైన స్థాయికి చేరుకుంది. తెలంగాణ ప్రజల ఆకాంక్షలను అణచివేయడానికి పాలకవర్గాలు అమలు చేస్తున్న విధానాలు నిజాం కాలం నాటి ఫాసిస్టు పద్ధతులను మరిపించే విధంగా ఉన్నాయి. కాశ్మీర్ ప్రజల నిరంతర పోరాటాన్నీ, ఈశాన్య రాష్ట్రాలలో కొనసాగుతున్న అంతులేని అలజడినీ ఏనాడూ, ఏ ప్రభుత్వమూ ప్రజాస్వామిక దృక్కోణంతో పరిష్కరించే ప్రయత్నం చేయలేదు. ఇవన్నీ కలిసి దేశాన్ని తీవ్ర సంక్షోభంలో పడేసే రోజులు దూరంగా ఉండకపోవచ్చనే వాస్తవాన్ని ఎంత తొందరగా గుర్తిస్తే అంత మంచిది. అయితే భారతదేశంలో సంభవించే పరిణామాలు సరిగ్గా ఈజిప్ట్‌లో కానీ, తదితర దేశాలలో కానీ జరుగుతున్న సంఘటనల మాదిరిగానే ఉండకపోవచ్చు. అవి ఏ రూపంలో ఆవిష్కృతమైనా ప్రజల తిరుగుబాటు అనివార్యం అవుతుందనే వాస్తవాన్ని పాలకవర్గాలు గుర్తించి వారి పద్ధతులను సరిదిద్దుకోవాల్సిన తరుణం ఆసన్నమయింది. లేకపోతే అనర్థాలు తప్పవు.

***– ప్రొఫెసర్ కె. జయశంకర్***

*కాకతీయ విశ్వవిద్యాలయం మాజీ వైస్ ఛాన్సలర్*

సామ్రాజ్యవాదాన్ని వ్యతిరేకిస్తున్న అరబ్ దేశాల జాతీయతావాదాన్ని ఏ విధంగా అణచివేయాలనేది ఆంగ్లో–అమెరికన్ సామ్రాజ్యవాదుల లక్ష్యం. పశ్చిమాసియా, సౌదీ, ఇరాన్‌లలో ప్రజా వ్యతిరేక రాజరికాన్ని ప్రవేశపెట్టిందే ఆంగ్లో–అమెరికన్. ఇది ప్రజలు అసంతృప్తితో పోరాటాలు పెల్లుబికిన సందర్భం. ఇరాక్, అఫ్ఘనిస్తాన్‌లలో అమెరికన్ జోక్యంతో ఆంగ్లో–అమెరికన్‌లపై వ్యతిరేకత పెరుగుతూ వచ్చింది. సామ్రాజ్యవాద విస్తరణ కాంక్షలో ప్రజలు బలవుతూ వచ్చారు. ఈ సామ్రాజ్యవాద దేశాలు అక్కడ ప్రజాస్వామ్యం కోసం ఏనాడూ ప్రయత్నం చేయలేదు. ఇరాన్‌లో మొసాదిక్ పెట్రోలియం వనరులను కాపాడుకోవడానికి ఎంతో ప్రయత్నించాడు. ఆయనను కూలదోసి, అక్కడి వనరులను దోచుకోవడానికి ఆంగ్లో–అమెరికన్‌లు తమకు అనుకూలురుని అధికారంలో పెడుతూ వచ్చారు. పశ్చిమాసియాను చీల్చారు. కువైట్ ఇరాక్‌లో అంతర్భాగం. ఇరాక్‌పై ఎటువంటి తప్పుడు సమాచారంతో, అబద్ధాలతో అన్యాయమైన యుద్ధం చేసిందో, ఆక్రమించిందో అందులో పనిచేసిన అధికారే బయటపెట్టాడు. సామ్రాజ్యవాదులు జాతీయ వాదాన్ని దెబ్బతీస్తూ వచ్చారు. ఈజిప్ట్‌లో నాజర్ అనుమతించలేదు. ఇప్పుడు గడ్డాఫీ కూడా ఆ సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా నిలబడ్డాడు. ఈజిప్ట్, బహ్రెయిన్, లిబియాలపై ఒబామా ఉదారంగా మాట్లాడుతున్నాడు. సంస్కరణలతో మన లాంటి దేశాలకు ఏమైందో అందరికీ తెలుసు. ప్రజా వ్యతిరేకతను మళ్లించడం కోసం ఆంగ్లో–అమెరికన్ సామ్రాజ్య వాదులు ప్రయత్నిస్తున్నారు. అక్కడ అసంతృప్తుల్ని, పోరాటాల్ని తమ కనుసన్నులలో ఉంచాలని బ్రిటన్, అమెరికా నాయకత్వాలు ప్రయత్నిస్తున్నాయి. ఇరాక్, అఫ్ఘనిస్తాన్‌లో ఎదురైన వ్యతిరేకతను తగ్గించు కోవడానికి ప్రయత్నిస్తున్నారు. లిబియాపై దాడికి ఇటీవలే అమెరికా ప్రయత్నించింది. నియంతలకు వ్యతిరేకంగా జరుగుతున్న పోరాటాలు అక్కడ స్థానిక ప్రజలు తేల్చుకోవాల్సిన విషయం. ప్రజా చైతన్యాన్ని గమనించి, గౌరవించాలి. ఒబామా మార్గదర్శకత్వం నెరపడానికి, ఆధిపత్యం వహించడానికి ప్రయత్నాలు కొనసాగిస్తున్నాడు. అఫ్ఘనిస్తాన్ బేస్‌గా ఇండియా, పాకిస్తాన్ సమస్యలలోకి దూరుదామనే ప్రయత్నం కూడా అమెరికా చేస్తోంది. తనకి లొంగి ఉండే శాంతిని అమెరికా కోరుకుంటోంది. కాని, స్థానిక ప్రజలు తేల్చుకుంటారు. అక్కడ ప్రతిపక్షాలు సృష్టించే కుట్రల్లోనూ ఆంగ్లో–అమెరికన్‌లు ఉన్నారు. మన ప్రతిపక్షంలోనూ జోక్యం చేసుకుంటున్నారు.

***– ఎ.బి.కె. ప్రసాద్***

*సీనియర్ పాత్రికేయులు*

ఈజిప్ట్ లాగే ఇక్కడా జరిగే అవకాశం ఉందా? నాయకుడులేని ఈజిప్ట్ తరహా విప్లవం స్థానికంగా కొంత అలజడిని రేకెత్తించింది, ఇక్కడి మట్టిమనుషులు వారి పాలకులకు అలాంటి సవాలును ఏమైనా విసరగలరా అని. మనకున్న సంప్రదాయ, సంప్రదాయేతర జ్ఞానంతో అలా ఇక్కడ జరగదని గట్టిగా చెప్పవచ్చు. మనకు పటిష్టమైన ప్రజాస్వామ్యం, క్రమబద్ధ ఎన్నికలు, స్వేచ్ఛాయుత మీడియా, స్పందించే న్యాయవ్యవస్థ – ఇలా ఒక గట్టి సామాజిక కూర్పు ఉందనీ, ఇక్కడ మట్టి మనుషుల అసంతృప్తులను చల్లార్చగలిగే దారులు ఉన్నాయనీ ఒక గుడ్డి అంచనా. ఇదంతా సుఖవంతమైన, సౌకర్యవంతమైన సిద్ధాంతమే కాని దానిని పరీక్షకు పెట్టాలి. ఇదంతా మన ఆత్మతృప్తికి భంగం కలిగించడానికి కాదు, మనల్ని మనం కఠినమైన ప్రశ్నలు వేసుకోవడానికి ఒత్తిడి చేస్తున్నాయి. ఎవరైనా వాదించవచ్చు కూడా, అలాంటిది ఇక్కడ ఎప్పటి నుంచో జరుగుతోందని... తెహ్రీర్ స్క్వేర్ వద్ద తమకు జరిగిన అన్యాయాలను ఎలుగెత్తిన నిరసనకారులు చెప్పిన – అవినీతి, నిరుద్యోగం, పెరుగుతున్న ధరలు, భీతిగొలుపుతున్న పాలన – ఇవన్నీ మన నేల మీద మరింత విశృంఖలంగా ఉన్నాయి. మన ఆదివాసుల జనాభా ఈజిప్ట్‌తో పోలిస్తే మూడురెట్లు, కైరోలో సామాన్యులతో పోలిస్తే పదిరెట్ల కష్టాలతో బతుకులు ఈడుస్తున్నారు. మన దంతేవాడ ఆదివాసుల తలసరి ఆదాయంతో పోలిస్తే ఈజిప్ట్‌లో తలసరి ఆదాయం నాలుగు రెట్లు ఎక్కువ. అంతకు మించి ఇక్కడ దిక్కుమొక్కులేని జనం మావోయిస్టుల ప్రభావంతో ఆయుధాలు చేతబట్టి భారత ప్రభుత్వంతో జీవన్మరణ పోరాటం చేస్తున్నారు. మొత్తం మీద ఈజిప్ట్‌లో ఉన్న పరిస్థితి కన్నా ప్రమాదకరమైన స్థితితో మనం తలపడుతున్నాం. తహ్రీర్ స్క్వేర్‌లో బహిరంగంగా, ఒక ఉత్సవంగా ఉన్న వాతావరణంతో పోల్చి చూసినప్పుడు మన దగ్గర అణగారిన, దీనస్థితిలో ఉన్న ప్రజలు చాలా కఠినమైన, హింసాత్మకమైన పోరాటం చేస్తున్నారు. భారతదేశం ఇప్పటికే తన సొంత ప్రజలతో యుద్ధంలో ఉంది. విల్లు, బాణం చేతబట్టిన స్త్రీ వద్దకు పోయి 'ప్రజాస్వామ్యంఅనే అద్భుతమైన సాధనం మనకుంది. ఆయుధాల అవసరం ఏమిటి, కింద పడేయవచ్చుకదా' అని అడగాలంటే, ఎటువంటి సమాధానం వస్తుందో అనే ఊహకే వణుకుపుడుతోంది. వెలిగిపోతున్న భారతం తను బతుకుతున్న నేల మీద వీధుల్లో వ్యక్తమవుతున్న ఘర్షణలను పట్టించుకోనవసరం లేదేమో కానీ, నిద్రమత్తు వదలకపోతే అరబ్ పరిస్థితి మన దేశాన్నీ చాలా వేగంగా కమ్ముకొస్తుంది. రెండు లక్షల మంది పౌరులు జంతర్‌మంతర్ లోకి కవాతుగా వచ్చి, పాలకుల మార్పు, తమ సమస్యల తక్షణ పరిష్కారం అనే డిమాండ్ చేస్తే భారత పాలకవర్గాలు ఎలా స్పందిస్తాయో?

**– వినోద్ మెహతా**

*ప్రధాన సంపాదకులు, ఔట్‌లుక్ వారపత్రిక*

*(ఔట్‌లుక్ 21 ఫిబ్రవరి 2011 సంచిక నుంచి)*

***కరీంనగర్ జిల్లాలో గ్రానైట్ క్వారీలకు అనుమతిస్తే ప్రజలకూ, పర్యావరణానికీ తీవ్ర నష్టమనీ, దీన్ని ఎదుర్కోవడానికి ఉద్యమమే మార్గమనీ అంటున్నారు*** **తోటపల్లి జగన్మోహనరావు**

# మన గుట్టలను ధ్వంసం చేస్తే...

**రా**జుల సొమ్ము రాళ్లపాలు అని సామెత ఉంది. అయితే ఇప్పుడు రాళ్ల సొమ్ము పాలకుల పాలు అని తిరగేసి వాడుకోవలసిన అవసరం వచ్చింది. కాని అప్పుడైనా ఇప్పుడైనా రాళ్లగుట్టలు పగులగొట్టినప్పుడు అష్టకష్టాల పాలయింది సామాన్య ప్రజలే అన్నది నిజం.

చైనా దేశస్తులు 2400 సంవత్సరాల క్రితమే 6000 కిలోమీటర్ల పొడవున రెండు లారీలు సులువుగా పోగలిగే వెడల్పుతో, 9గజాల ఎత్తున ఉత్తర సరిహద్దులలో గ్రానైటు రాళ్లతో పెద్దగోడ కట్టినారు. దానికై రాయిని వేలాది గుట్టలను పగులగొట్టి తరలించడం వల్లనే ఇప్పటికీ చైనా భూకంపాలతో బాధపడుతూనే ఉంది.

దక్షిణ పసిఫిక్ మహాసముద్రంలోని ఈస్టర్ దీవులలో వందల ఏండ్ల కింద సుమారుగా 10-15 గజాల ఎత్తున వందలాదిగా శిలా విగ్రహాలను, ఆ దీవులలోని గుట్టలనన్నిటిని పగులగొట్టి నిలబెట్టగా ఆనాటి ప్రజలు తీవ్రమైన కరువు కాటకాలకు బలైఒకరినొకరు చంపుకుతిని 'పోలీనేషియన్' జాతికి జాతే అంతరించి పోయింది.

అతి త్వరలో మన కరీంనగరం జిల్లాను కూడా చైనా, ఈస్టర్ దీవులలాగా మార్చనున్నారు.

ఎండాకాలంలో ఏ ఊరికి వెళ్లినా, ఆ ఊరి పక్కన గల చెరువునో, కుంటనో పూడిక తీస్తూ గ్రామీణ ఉపాధి కూలీలు తీరిక లేకుండా పనిచేయడం సామాన్యంగా కనబడుతుంది మంచిదే, కాని అదే సమయంలో సదరు చెరువుకు నీటిని ఇచ్చే గుట్టలను యథేచ్ఛగా పగులగొట్టి రాళ్లను విదేశాలకు తరలించడం కూడా సామాన్యంగా కనబడే దృశ్యం. ఓ వైపు చెరువులను బాగుచేస్తూ, మరోవైపు చెరువులకు నీరు చేరకుండా చేయడం తెలంగాణ ప్రజలను నమ్మించి ఎడారిలో గావు పట్టడమే.

గుట్టలు వర్షాకాలపు మేఘాలకు అడ్డుగా నిలువడం వల్లను, గుట్టల చుట్టు ఉపరితలం ఎక్కువ వైశాల్యం ఉండడం వల్లను మన జిల్లాలో 600 మిల్లిమీటర్ల నుండి 1000 మిల్లిమీటర్ల వర్షపాతం పడుతుంది. గుట్టపైన పడిన వాననీరు మొదటగా గుట్టలోనికి ఇంకిపోగా, మిగిలిన నీరు వరదల రూపంలో సమీపంలోని కుంటలను, చెరువులను నింపుతూ వాగులకు, వంకలకు ఆధారమౌతాయి. ఇక గుట్టలపైన ఇంకిన నీరు గుట్టల కిందకు జాలువారడానికి కొన్ని వందల ఏండ్లు పడుతుంది. అందుకే గుట్టలు సహజ సిద్ధమైన ఓవర్ హెడ్ వాటర్ ట్యాంకు లాంటివి. అందువల్లనే గుట్టల కింద ఊటలుగా మారి బావులలో జలాలు పుష్కలంగా లభిస్తాయి. కొన్ని గుట్టల నుండి జాలులుగా నీరు ఉబికి రావడాన్ని మనం గమనించే విషయమే. ఒక గుట్టను తొలగిస్తే చుట్టు పక్కనున్న గ్రామాలకు కూడా నీరందదు.

సైకిల్ మోటారు ఇంజనుకు గల పిన్‌లు ఎలాగైతో,ఇంజన్ను చల్ల పరుస్తాయో, అలాగే భూమిపైన గల గుట్టలు నిరంతరం సూర్యుడి నుండి వచ్చు ఉష్ణాన్ని తిరిగి వాతావరణంలోకి వెదజల్లి భూమి వేడి కాకుండా కాపాడుతాయి. గుట్టలు లేకపోతే భూమి వేడెక్కి బతకడానికి వీలులేకుండా పోతుంది.

గుట్టలు పిడుగు పాట్లనుండి జంతుజాలాలను రక్షిస్తాయి. సుడిగాలులు రాకుండా అడ్డుకుంటాయి.ఈ క్రమంలోనే క్రమగతిగా వాతతాప క్షయకరణకు గురై సారవంతమైన నేలలుగా మారుతాయి, వాగులకు, వంకలకు ఇసుకను అందిస్తాయి.

గుట్టలపై గల ఖనిజాలతో గాలి కలిసి ప్రాణవాయువును, ఇతర వాయువులను నియంత్రిస్తాయి. గుట్టలపై పెరిగే చిట్టడవులు వాతావరణంలోని గాలిని శుభ్రపరుస్తాయి.

గుట్టలపై గల చిట్టడవులు సీతాఫల చెట్లు, రేగు, పరికి, వెలగ మొదలగు ఫల వృక్షాలకు నిలయాలు. తునికి మోదుగ ఆకులు లభిస్తాయి. గుట్టలపైన అమూల్యమైన వనమూలికలు లభిస్తాయి. గుట్టలపై పెరిగే గడ్డి, గాధాలు, ఆకు అలములు పశువులకు, గొర్రె మేకలకు మేతనిస్తాయి. గుట్ట చిట్టడవులలో కిందపడి కుళ్లిపోయిన ఆకు అలములు పొటాష్‌తో కూడిన బలమైన ఎరువులుగా మారి వాననీటికి కొట్టుకవచ్చి గుట్టకింద గల పంట పొలాలను సారవంతం చేస్తాయి. గుట్టలపై లభించే కట్టెలు చుట్టుపక్కల ప్రజల అవసరాలను తీరుస్తాయి. గుట్టలపై నీటి ఊటలే ఆధరంగా గుట్టల కింది గ్రామాలలో ఈత, తాటి వనాలు పెరుగుతాయి. గుట్టలు తేనెటీగలకు ఆవాసాలు. ఈ విధంగా తెలంగాణలో గుట్టలు లక్షలాది మందికి సహజమైన ఉపాధి వనరులు.

గుట్టలపై అనేక వన్య ప్రాణులు జీవిస్తాయి. అవన్నీ జీవ వైవిధ్యం కలిగి ఉండి వాతావరణ సమతూకాన్ని కాపాడతాయి. గుట్టలు సహజమైన పర్యాటక కేంద్రాలు. గుట్టలు ఎక్కిదిగుతూ పిల్లలు, యువకులు వ్యక్తిత్వాన్ని ధైర్యసాహసాలను సంతరించుకుంటారు. గ్రామీణులు వన భోజనాలకై గుట్టలనే ఆశ్రయిస్తారు. చాలా గుట్టలు గ్రామ దేవతల పేరున ఉంటాయి. గుట్టలు బలమైన మాంసాహారాన్ని గ్రామీణులకు అందిస్తాయి.

గుట్టలు రాబందులు, గుడ్లగూబలు, గద్దలు మొదలగు రకరకాల పక్షులకు ఆవాసాలు. అవి భూమిపైన పడిన ఇతర జంతుజాల కళేబరాలను తిని రకరకాల అంటు వ్యాధులనుండి మనలను రక్షిస్తాయి. అవి నశించినచో మనుషులు రకరకాల అంటు రోగాల పాలవుతారు. ఆ పక్షులే ఎలుకలను పట్టుకొని తిని పైరు పంటలను ఎలుకల నుండి రక్షిస్తాయి.

గుట్టలను పగులగొట్టగా చెలరేగే దుమ్ముధూళులతో కరీంనగర్ ప్రజానీకం భయంకరమైన సిలికోసిస్ వ్యాధి బారినపడనున్నారు. బండరాయి

దుమ్ము కళ్లలో దూరగా అంధత్వం బారిన పడనున్నారు. భూగర్భ జలాల్లో అధిక మొత్తంలో రకరకాల ఖనిజ కాలుష్య కారకాలు చేరి కరీంనగర్ ప్రజానీకం రకరకాల వ్యాధుల భారిన పడనున్నారు. గుట్టలు పగుల గొట్టినప్పుడు వెదజల్లబడె బండపొడి సమీప పంట పొలాల పైన, ఆకు అలములపైన, గడ్డిగాదాలపైనా, పండ్ల తోటలపైనా పేరుకొని దిగుబడి తగ్గుతుంది. వాటినే పశువులు, గొర్రెలు, మేకలు మేసి రోగాల పాలవుతాయి. వీటినే తిన్న మనుష్యులు కూడా రోగాల పాలవుతారు.

మన జిల్లాలోని చెరువులు, కుంటలు ఈ గుట్టల పైన పడిన వర్షాల వల్లనే నిండి, మత్తళ్లుగాను, అలుగులుగాను పారి గుట్టలకు దిగువ ఉన్న ఇతర చెరువు కుంటలకు పడవాటు నీటిని అందిస్తాయి. గుట్టల వల్లనే మిట్టపల్లాలు ఏర్పడగా వాటినే ఆధారంగా అనేక గొలుసు కట్ట చెరువులు కుంటలు కాకతీయ, బహమనీ, నిజాముల పాలనలో నిర్మించ బడినాయి. దాదాపు 800 సంవత్సరాలుగా ఈ చెరువు కుంటలే మన వ్యవసాయానికి సాగునీటిని, పశుపక్ష్యాదులకు, మనకు తాగు నీటిని ఇస్తున్నాయి.

ఇక్కడ గుట్టను పూర్తిగా తొలగించి, భూగర్భంలో కూడా గ్రానైటును తీస్తూ ఉన్న ఒద్యారం గ్రామంలో నీటి మట్టం ఏలా పడి పోయిందో పరిశీలిద్దాం. 1991 మేలో 7.87 మీటర్ల లోతులో నున్న భూగర్భ జలాలు 2000 నాటికి అనగా గుట్టను తొలగించిన 10 సంవత్సరాలలోనే 11.25 మీటర్లకు తగ్గి (11.25 మీటర్లకు తగ్గితే భూగర్భ జల శాఖవారి ప్రమాణాల ప్రకారంగా) పూర్తిగా తగ్గాయి.

ఈ సందర్భాలలో ఆ గ్రామ ప్రజలే కాక చుట్టుపట్ల గ్రామాల ప్రజలు బోరుబావుల మీద బోరుబావులు తవ్వి లక్షలాది రూపాయలు నష్టపడ్డారు. అయినా బోరు బావులు కూడా ఎండి పోయాయి. వారు కేవలం పత్తిపంటకే పరిమితమైపోవలసి వచ్చింది. లేదా అనారోగ్యం (సిలికోసిస్) పాల పడగల గ్రానైటు పనుల్లోకి నెట్టబడినారు.

కరీంనగర్ జిల్లా ప్రజల ప్రయోజనాలను ఫణంగా పెట్టి, మన జిల్లాను ఎడారిగా మార్చే ప్రక్రియను ఆంధ్రా ప్రభుత్వం చేపట్టింది. ప్రజల ఆవాసాలకు, గుడులకు, బడులకు, నీటి వనరులకు (చెరువులు, కుంటలు, నదులకు) పంటపొలాలకు రెండు కిలోమీటర్ల దూరంలోనే క్వారీలు ఉండాలనీ, ముఖ్యమైన రహదారులకు కనీసం ఒకటిన్నర కిలోమీటర్ల దూరంలో ఉండాలనీ, పర్యావరణ చట్టం, సుప్రీం కోర్టు నిబంధనలు విధించింది. చట్టాలనన్నిటిని ఉల్లంఘించి మన జిల్లాలో 550 పైగా గ్రానైటు క్వారీలకు అనుమతులు ఇచ్చారు.

గోరుచుట్టుపై రోకటి పోటన్నట్లు కరీంనగరం మండలంలో 82, గంగాధరలో 61, వెల్గటూరులో 51, శంకరపట్నంలో 36, మాన కొండూరులో 20, తిమ్మాపూరులో 21, రామగుండంలో 24, పెద్దపల్లిలో 21, సుల్తానాబాదులో 27, ధర్మారంలో 32, కమాన్‌పూర్‌లో 24, మల్యాలలో 12, రామడుగులో 14, బోయినపల్లిలో 12, జగిత్యాలలో 12, హుజూరాబాదులో 10, వీణవంకలో 8, ఓదెలలో 7, ఎల్కతుర్తిలో 7, పెగడపల్లిలో 5, భీమదేవరపల్లిలో 5, మిగతా మండలాలో కలిపి 560కి పైగా గ్రానైటు క్వారీలకు అనుమతులు ఇచ్చారు. మరో 150కి పైగా ఇవ్వనున్నారు.

దీనికంతటికి కారణం గ్రానైటు బండలను విదేశాలకు ఎగుమతి చేసి కోట్లు గడించాలన్న కొందరి పెట్టుబడిదారుల అత్యాశే కాక దేన్నైనా సరే అమ్మి సొమ్ముచేసుకుందాం అనుకునే ఆంధ్రా సర్కారు కారణం. ప్రజా సంక్షేమం దృష్ట్యా మద్య నిషేధాన్ని, గనులను, గుట్టలను, అడవులను రక్షించాల్సిన సర్కారు ఆయా శాఖలను ముఖ్యమైన ఆదాయ వనరుగా మార్చడం దారుణమే కాక రాజ్యాంగ ఆదేశిక సూత్రాలను తుంగలో తొక్కడమే కాగలదు. ఈ సందర్భంలో కురిక్యాల, వెదిరల మధ్య గుండా తవ్వబడిన వరద కాలువ వల్లా, ఈ కాలువ చుట్టుపట్ల గల గుట్టలను పగులగొట్టగా రాగల ప్రమాదాన్ని పరిశీలిద్దాం.

ఇటు వరద కాలువ వల్ల భూగర్భ జలాలను, కొచ్చగుట్ట, మాలగుట్ట, బొమ్మలమ్మగుట్ట, వెదిరలోగల నెమళ్ల గుట్ట, మల్లన్న గుట్టలను క్వారీలు చేయడం వల్ల ఇటు ఉపరితల, భూగర్భ జలాలు లేక వెదిరలోని నెమళ్ల చెరువు, కొత్తపల్లి, ఆరెపల్లి, సీతారాంపురం, తీగలగుట్టపల్లి, వల్లంపాడు గ్రామాలకు ఇటు ఉపరితల, భూగర్భ జలాలు అడుగంటనున్నాయి. ఇందులో కొత్తపల్లి, ఆరెపల్లి, సీతారాంపురం, తీగలగుట్టపల్లి, వల్లంపాడు గ్రామాలు కరీంనగర్‌నకు ఆనుకొని ఉండి శీఘ్రంగా పట్టణీకరణ చెందుతున్న గ్రామాలు. ఇకపై ఈ గ్రామాలన్ని కూడా మానేరు డ్యాం నీటిపైనే ఆధారపడవలసి ఉంటుంది.

ఇప్పటికే గోదావరికి నాలుగవ ముఖ్యమైన ఉపనది అయిన మంజీర నది నీటిని తాగునీటి పేరిట హైదారాబాదుకు తద్వారా మూసీనది నుండి కృష్ణా నదికి తరలించగా నిజాంసాగర్ ఎండిపోగా, శ్రీరాంసాగర్‌కు నీరందడంలేదు. అంతే కాక ఎల్లంపల్లి, ప్రాణహిత ఎత్తిపోతల ద్వారా ఉత్తర తెలంగాణకు చెందవలసిన గోదావరి జలాలను హైదరాబాదు పేర ఆంధ్రాకు తరలించే కుట్ర జలయజ్ఞం ద్వారా జరుగుతుంది. నిజానికి ఇంతకన్న తక్కువ ఖర్చుతో చాల చవకగా కృష్ణా పరీవాహక ప్రాంతంలోని నీటిని అదే పరీవాహక ప్రాంతంలోని హైదరాబాదుకు తరలించడం జరగడం లేదు. దీనికి కారణం కృష్ణా నదిలోని తెలంగాణ వాటా నీటిని మనకు దక్కకుండా ఆంధ్రా ప్రాంతానికే కాక, పెన్నా పరీవాహక ప్రాంతాలైన నెల్లూరు, రాయలసీమ, మద్రాసులకు తరలించడమే కారణం.

ఇలా సకల సంపదలకు మూలం అయిన నీటిని మనకు దక్కకుండా చేయడానికే ఆంధ్రా ప్రభుత్వం ఎందుకు సర్వప్రయత్నాలు చేస్తూందో కారణం కనుక్కుందాం.

ఆంధ్రా ప్రాంతంలో ప్రతి సంవత్సరం జూన్ నుండి నవంబరు వరకు రెండు మూడు తుపానులు తీరప్రాంతాన్ని ముంచెత్తుతాయి. ఆ సమయంలోని చేతికి అందిన పంట ముంపుకు గురై నాసిరకంగా ఉండి మనుషులు తినడానికి పనికి రాకుండా పోతాయి. అయితే వాటినే ప్రభుత్వం ఆంధ్ర వ్యవసాయదారుల నుండి అధిక మద్దతు ధరకు కొని తెలంగాణలోని ప్రజలకు కిలో 2 రూపాయలకు అందజేస్తూ అటు నోట్లు, ఇటు ఓట్లు దండుకుంటున్నారు ఆంధ్ర పాలకులు. పశువులకు కూడా పనికిరాని ఈ ధాన్యాన్ని తెలంగాణ ప్రజలకు రేషన్ షాపుల ద్వారాను, బడులలో ఉచిత ఆహారంగా అందిస్తు ప్రజలను తీవ్రమైన సామూహిక అనారోగ్యాల పాలుచేస్తూ ఉన్నారు. ఇట్టి ప్రక్రియల ద్వారా తెలంగాణ జాతికి జాతినే అనారోగ్య పీడిత జాతిగా మార్చుతున్నారు. ఇట్టి ప్రక్రియను తెలంగాణ ప్రజలకు శాశ్వతంగా అంట గట్టాలంటే తెలంగాణలోని అన్ని విధాలైన నీటి వనరులను ధ్వంసం జేయాలనే ఆంధ్రా పాలకుల కుట్రనే కారణం.

రామగుండం, మంథని తాలుకాలో 40 చదరపు కిలోమీటర్ల ప్రాంతంలో బొగ్గు నిక్షేపాలు ఉన్నాయి. ఇప్పటికే రామగుండం ప్రాంతంతో 4 ఓపెన్ కాస్టు బావులు 350 మీటర్ల లోతుల్లో తీస్తున్నారు. దీనితో గోదావరినది నీటి మట్టం దారుణంగా పడిపోవడమే కాక వేసవి కాలంలో పూర్తిగా ఎండి పోతున్నది. ఇక ఇప్పుడు మానేరుకు దిగువన తాడిచర్ల వద్ద తవ్వబోయే ఓపెన్ కాస్టు బావి వల్ల మానేరు నది నీరు 350 మీటర్ల లోతుల్లోకి జారనున్నాయి.

విపరీతమైన ఒత్తిడి పెరిగి భూ ప్రకంపనలకు దారి తీస్తాయి. ఇది చర్వితచర్వణంగా జరిగి మన జిల్లాలో తీయ బడుతున్న బొగ్గుగనుల

ప్రకంపనలతో చేరి పెద్ద భూకంపాలకు దారి తీస్తాయి. అంతే కాక ఉపరి తలంలోని చెరువులు, కుంటలు, ఒర్రెలు, నదులలోని నీరు, భూగర్భ నీటిలో కలగలుస్తాయి. అందువల్ల ఉపరితలంలోని కుంటల, చెరువుల, నదుల, నీళ్ల విషపూరితమై చేపలు, ఇతర జలచరాల వుత్పత్తి తగ్గడమేకాక, పూర్తిగా అంతరించే ప్రమాదం అతి త్వరలోనే జరుగనుంది. దీనితో మన జిల్లా ప్రజలకు బలమైన చేపల ఆహారం కరువౌతుంది. జాలరులకు ఉపాధి దొరకదు. తాగు నీరు కలుషితం అవుతాయి.

దిగువ మానేరు కట్టినప్పుడు అది భూకంప జోనులో ఉందని, అది కట్టడం ప్రమాద భరితం అని ఆనాడే భూగర్భ శాస్త్రవేత్తలు హెచ్చరించారు. వారి హెచ్చరికలను మరచి దిగువ (ఎల్.ఎం.డి) మానేరు, ఇప్పుడు కడుతున్న మధ్య మానేరు ప్రాజెక్టుల చుట్టూ ఉన్న తిమ్మాపూర్, కరీంనగరం, గంగాధర, బెజ్జంకి, ఇల్లంతకుంట మండలాలలోని గుట్టలను బ్లాస్టింగులు చేయగా సదరు చెరువుల భూగర్భంలోని రాతి పొరలు పగులుతాయి. దానితో ఆ చెరువులలోని చేపల ఉత్పత్తి పడిపోగా, పూర్తిగా అంతరించి, చివరగా భూకంపం సంభవించి కరీంనగరం పట్టణంతో సహ జిల్లా మొత్తం తుడిచి పెట్టుకొని పోనుంది.

1999లో అసెంబ్లీలో ప్రభుత్వం 'గ్రానైటు మైనింగ్ డెవలప్‌మెంట్ అండ్ రెగ్యులేషన్ ' అనే చట్టాన్ని ఎలాంటి చర్చకు పెట్టకుండానే (ఆంధ్రా అధికారులు మైనింగ్ పారిశ్రామిక వేత్తలకు అనుగుణంగా తయారు చేసిన చట్టాన్ని) ఆమోదించారు. అందులోనే నివాస సముదాయాలకు గాని, నీటి వనరులకు గాని, గుడులకు, బడులకు గాని కేవలం 45 మీటర్ల దూరం ఉంటే చాలు మైనింగ్‌కు అనుమతులు ఇవ్వవచ్చని ఆమోదించారు. దీనిని మన తెలంగాణ శాసన సభ్యులు ఎలాంటి అభ్యంతరాలు చెప్పకుండా ఆమోదించడం చాలా సిగ్గుచేటే కాక మన తెలంగాణ ప్రజలపట్ల, వనరులపట్ల వారికి ఏమాత్రం శ్రద్ధాశక్తులు లేవని రుజువు చేస్తోంది. పై చట్టాన్ని ఆమోదించిన తర్వాత మరింత తామర తంపరులుగా తెలంగాణ అంతటా గ్రానైటు, క్రషర్ల మైనింగ్ మరింత వేగమంతమైనాయి.

ఆంధ్రా సర్కారు ఆమోదించిన ఈ చట్టం వచ్చిన తర్వాతనే చారిత్రక కట్టడాలకు, గడీలకు, కోటలకు, గుడులున్న గుట్టలకు, బడులకు, జనావాసాలకు, చెరువులకు, కుంటలకు, కాలువలకు, రహదారులకు, భారీ నీటి వనరులకు, కాలువలకు, రైల్వేలైనులకు అతి దగ్గరలోనే మైనింగ్ జరుపుతున్నారు. చాలా చోట్ల గుట్టలను చిన్న కమతాలుగా విడగొట్టి, పర్యావరణచట్టాలనుండి తప్పించినారు. ఇందులో పంచాయతీ వార్డు మెంబరునుండి, మంత్రుల వరకు గ్రామ కార్యదర్శి నుండి ఉన్నతాధికారుల వరకు ప్రజా క్షేమాన్ని గాని పర్యావరణ వినాశనాన్ని గాని పరిగణనలోకి తీసుకోకపోగా, ప్రజాస్వామ్య స్ఫూర్తిని అపహాస్యం చేశారు. గ్రామ సభలను నిర్లక్ష్యం చేశారు.

మన కరీంనగర్ జిల్లాను ఎడారి చేయగల క్వారీల అనుమతులకు మన ప్రజా ప్రతినిధులు తలలు ఊపడమేకాక, కొందరు గ్రానైటు వ్యాపారులే శాసన సభ్యులుగా ఎన్నికై, మిగతా చోటా మోటా నాయకులకు ఆదర్శ నాయకులైనారు. దీనికి అధికార, ప్రతిపక్ష, తరతమ విభేదాలు మరచి సమైక్యంగా అమలు జరిపిస్తూన్నారు కూడా.

ఇలాంటి గ్రానైటు క్వారీలు ఖమ్మం, వరంగల్లు, మెదక్, రంగారెడ్డి, ఆదిలాబాదు, నిజామాబాదు, కరీంనగర్ జిల్లాల్లో విచ్చలవిడిగా జరుపు తున్నారు. దీనితో రాబోవు 10 సంవత్సరాలలోనే మొత్తం తెలంగాణ ఎడారిగా మారనుంది.

1957లో ఆమోదించిన కేంద్ర ప్రభుత్వ మైనింగ్ చట్ట ఉద్దేశాల ననుసరించి పునరుత్పత్తికాని ఖనిజాలను మన కనీస అవసరాలకు పొదుపుగా వాడుకొని, వాటిని భావితరాలకు అందించాలని లక్ష్యంగా పెట్టుకుంది. కాని ప్రపంచీకరణ తర్వాత మరింత వేగంగా మన రాష్ట్రంలోని ఇనుము, అల్యూమినియం, గ్రానైటు, కంకర, ఇసుక, మొదలగు ఖనిజాలను విదేశాలకు ఎగుమతి చేస్తున్నారు. చివరకు మంచినీటి ఎగుమతులు అమెరికన్ బహుళ జాతుల కంపెనీలయిన కొకాకోలా, పెప్సికోలా, కిన్‌లే లాంటి మినరల్ బాటిల్ల కంపెనీలకు అతి చవకగా నీటిని అంటగట్టడం జరిగింది.

ప్రజలకు బలమైన ఆహారాన్ని, ఆరోగ్యాన్ని, విద్యా, వైద్య అవసరాలను, ఆహ్లాదకర పరిసరాలు అందించడం ప్రజాప్రభుత్వాలు చేయవలసిన పని. కాని నేటి పాలకులు అన్నిటిని మరచి అన్నిరంగాలలోను ప్రజలను పీడించడమే కాక, ప్రకృతి ప్రసాదించిన అందమైన గుట్టలను, చిట్టడవులను, చెరువు కుంటలను, ఇండ్లను కూల్చుతూ, తెలంగాణ ప్రజలను అనారోగ్య పీడిత దరిద్రులుగా మార్చుతున్నారు. గుట్టను ధ్వంసం చేయడం ద్వారా తెలంగాణ భూభౌతిక స్వరూపాన్నే ప్రపంచలోనే ఎక్కడ లేని విధంగా మార్చనున్నారు.

ఇది వరకే గ్రామాలకు గ్రామాలనే బొగ్గుగనులు మింగగా, వరద కాలువకు వందల ఎకరాల రైతుల భూములను సేకరించినారు, అట్లాగే ఎల్లంపల్లి, ప్రాణహితలకు కూడా వేల ఎకరాలు సేకరించి గోదావరి నీటిని కరీంనగర్ ప్రజలకు ఇవ్వకుండా హైదారాబాదుపేర, ఆంధ్రాకు తరలించనున్నారు. వరద కాలువను 60 నుండి 100 అడుగుల లోతునకు తవ్వి శ్రీరాంసాగరం నుండి కరీంనగరం వరకు ఒక్క ఎకరానికి కూడా నీరు ఇవ్వలేని పరిస్థితి ఉంది. దానితో పాటు భూగర్భజలాలను నాశనం చేయగల, చట్టానికి విరుద్ధమైన, పర్యావరణానికి హాని కలిగించే క్వారీలు మన కరీంనగర్ జిల్లా ప్రజానీకానికే కాక రాబోవు తరాలకు కూడా హాని చేయగలవు. అందువల్ల మన జిల్లాను క్వారీల బారి నుండి రక్షించుకోవడానికై కొందరు 'తెలంగాణ భూమి రక్షణ సంఘం'గా ఏర్పడినారు. ఇప్పటికే వీరు విస్తృత ప్రచారం ద్వారా ప్రజలను చైతన్య పరచగా బద్దిపల్లి, అన్నారం, నందగిరి, మ్యాడంపల్లి గ్రామాల ప్రజలు గ్రానైటు క్వారీలకు వ్యతిరేకంగా పోరాడుతున్నారు. ఆయా గ్రామాల ప్రజలు కోర్టుల నుండి 'స్టే' ఆర్డరులు తెచ్చుకున్నారు.

నందగిరిలోని తెట్టగుట్టకు 10 ఎకరాలకు అనుమతి తీసుకొని 118 ఎకరాల గుట్టను పగులగొట్టినారు. ఈ గుట్టపై గల పెద్ద సొరికెలో తేనెటీగలు తమ గూళ్లను పెడుతుండేవి. ఆ తేనెను ఆ గ్రామాలలోని 300 ముదిరాజ్ కుటుంబాలు అమ్ముకొని సంవత్సరానికి రెండు లక్షల రూపాయలు, సీతాఫలాలతోటి ఆరు నెలల ఆదాయాన్ని పొందేవారు. వారంతా తమ వారసత్వ శాశ్వత ఉపాధిని కోల్పోయారు. వారు చట్ట విరుద్ధమైన ఆ క్వారీకి వ్యతిరేకంగా హైకోర్టు నుండి 'స్టే' ఆర్డరు తీసుకుని రాగా దానిని మైనింగ్, రెవెన్యూ, పోలీసు శాఖల వారు పట్టించుకోలేదు. స్టే ఆర్డరు ఉన్నా దానిని ధిక్కరించి గ్రానైటు మైనింగ్ జరుపుతున్నారు. ప్రజలు క్వారీలను వ్యతిరేకిస్తూ ఉద్యమాలు చేస్తే కేసులు పెట్టి పోలీసులు, రెవెన్యూ తదితర అధికారులు ఎలా గ్రానైటు యాజమాన్యాలతో మిలాఖతైనారో ఈ ఉదంతం చక్కగా వివరిస్తూంది. ఇట్టి పరిస్థితులే ప్రజలకు చట్టబద్ధ పాలనపై నమ్మకం లేకుండా చేస్తాయి.

ఇలాంటి పరిస్థితులలో మన జిల్లాలో గల క్వారీలను మూసి వేయడానికి ప్రజలంతా తెలంగాణ భూమి రక్షణ సంఘంలో చేరగలరని మనవి. మనమంతా కలిసి ఉద్యమించి మన గుట్టలను రక్షించుకుందాం రండి. మన మౌనం మననే బలి చేస్తూందని మరవకండి.

*(రచయిత తెలంగాణ భూమి రక్షణ సంఘం కో-కన్వీనర్)* వీ

**విద్య, ఆరోగ్య రంగాలలో తీసుకు వస్తున్న పథకాలు నిజంగా ప్రజలకు మేలు చేస్తున్నాయా, లేక వీటిపై వ్యాపారం చేస్తున్న వాళ్లకు లాభాలు చేకూరుస్తున్నాయా అని ప్రశ్నిస్తున్నారు సిలువేరు హరినాథ్**

# ఫీజు రీయింబర్స్‌మెంట్ విద్యార్థుల కోసమా?

**బి.** సి. విద్యార్థుల జీవితాల్లో సంక్షోభం సృష్టించిన ఫీజు రీయింబర్స్‌మెంట్ ప్రభుత్వ పతనానికి కారణమవుతుందా అనే అనుమానం కలుగుతోంది. బి.సి.ల ఓట్లు కూడగట్టడం కోసం వై.ఎస్. రాజశేఖరరెడ్డి ప్రవేశపెట్టిన ఈ పథకం నిజంగా బి.సి.లకు మేలు చేస్తుందా లేక ప్రైవేట్ విద్యా సంస్థల ప్రయోజనాలను నెరవేరుస్తుందా ఇప్పటివరకు ఎవరూ ఆలోచించడం లేదు. వాయిదాల పద్ధతిలో ఫీజు రీయింబర్స్‌మెంట్ నిధులు విడుదల చేసేందుకు సిద్ధపడిన రాష్ట్ర ప్రభుత్వ వైఖరిని ఈసడించుకుంటున్న వారు అసలు వాస్తవాలు గుర్తించ నిరాకరిస్తున్నారు. ఫీజు రీయింబర్స్‌మెంట్ పథకం లేకపోతే విద్యార్థులు చదవలేని పరిస్థితి, యాజమాన్యాలు కళాశాలలను నిర్వహించలేని దుస్థితిని కలిగించింది ఎవరు? నిజంగా ఆయా కాలేజీలు ఫీజు రీయింబర్స్‌మెంట్ పట్ల అంత పట్టుదలతో వ్యవహరించడంలో ఆంతర్యం ఏమిటి? అసలు ఈ మొత్తం వ్యవహారంలో ప్రజా ధనం కొంతమంది కార్పొరేట్ ప్రైవేట్ యాజమాన్యాల జేబుల్లోకి వెళ్లడంలో మతలబు ఏమిటి వంటి అనేక అంశాలు ఎవరూ ఆలోచించడం లేదు. బాధ్యతాయుతంగా ఆలోచించాల్సిన పౌరసమాజం విద్యార్థుల భవిష్యత్తును బలహీనం చేస్తున్న విధానాలను పట్టించుకోవడం లేదు. తార్కిక వివేచన లోపించిన సమాజం నిర్మాణం అవుతుందనేది నిజం. ఇది పౌర సమయాన్ని, సామాన్య ప్రజానీకాన్ని బలహీనం చేసే కుట్ర అని వ్యాఖ్యానిస్తే పొరపాటేమీ కాదు.

రాజశేఖర రెడ్డి ఎస్.సి., ఎస్.టి., బి.సి., మైనారిటీ పేద ప్రజల పక్షపాతి అని నిరూపించేందుకు రెండు అతిపెద్ద పథకాలను చూపిస్తారు. ఫీజు రీయింబర్స్‌మెంట్, ఆరోగ్యశ్రీ అని వ్యవహరించే ఆ పథకాలు వాస్తవానికి ప్రైవేట్ వ్యవస్థను బలపర్చి ప్రభుత్వ వ్యవస్థను బలహీనం చేసేందుకు ఉద్దేశించినవి. అగ్రకుల పెట్టుబడిదారీ వ్యవస్థకు అనుకూలమైన విధానాలు రూపొందించే విషయంలోనూ దూకుడుగా వాటిని అమలు చేసే విషయంలోనూ రాజశేఖరరెడ్డిది ప్రత్యేకమైన శైలి. 2008లో ఫీజు రీయింబర్స్‌మెంట్ పథకం అమలు చేసేందుకు అప్పటి ప్రభుత్వం రాజశేఖర రెడ్డి నాయకత్వంలో నిర్ణయం తీసుకుంది. వెయ్యి కోట్ల రూపాయలతో పథకం జయప్రదంగా నిర్వహించొచ్చు అని భావించారు తప్ప ఈ పథకం వల్ల రాబోయే ఉపద్రవాన్ని ఊహించలేదు. వాస్తవానికి రాజశేఖరరెడ్డిని నమ్ముకొని రాజకీయాల్లో ఉన్న అనుచర గణానికి ఏదో ఒక విధంగా సాయం చేసే ఆపన్నహస్తం ఆయనది కాబట్టి తన అనుయాయులకు తలా ఒక కాలేజీ పెట్టుకొనేందుకు పరోక్షంగానో, ప్రత్యక్షంగానో ఆయన సహకరించారు. ప్రభుత్వమే విద్యార్థుల ఫీజు చెల్లిస్తే ఆయా కాలేజీలకు ఆదాయం దండిగా సమకూర్చ వచ్చని ఆయన భావించి ఉంటార. అయితే ఎస్.సి., ఎస్.టి., ఇ.బి.సి., బి.సి., మైనారిటీలకు మేలు చేసే పథకం అంటే ఎవరూ అభ్యంతరం పెట్టరు కాబట్టి ఈ వర్గాలను టార్గెట్ చేశారు. అంతిమంగా ఈ వర్గాల అభివృద్ధి కొరకు స్థాపించిన కార్పొరేషన్ల స్థిర, చర ఆస్తులను తాకట్టు పెట్టుకొని అప్పులు తెచ్చి బకాయిలు చెల్లించే పరిస్థితి ఏర్పడింది. సొమ్ము ఒకరిది సోకు ఒకరిది అంటే ఇదే. కాలేజీలు అగ్రకుల ప్రైవేట్ యాజమాన్యాలవి, కార్పొరేషన్ల ఆస్తులు అణగారిన, వెనకబడిన వర్గాలవి. ఈ పరిస్థితి ఎందుకు తలెత్తిందో ఆలోచించాలి.

ప్రభుత్వ విద్యా వ్యవస్థను సర్వనాశనం చేసే విధానాలను టి.డి.పి. ప్రారంభించింది. నూతన ఆర్థిక విధానాల పేరుతో అమలు చేసిన విద్యా విధానాలు ప్రైవేట్ విద్యా వ్యాపారానికి పాదులు వేసింది. ప్రాథమిక నుండి ఉన్నత విద్య వరకు రెండు సమాంతర విద్యా వ్యవస్థలు ఆవిర్భవించడానికి టి.డి.పి. రాష్ట్రంలో, కేంద్రంలో కాంగ్రెస్ అనుసరించిన విధానాలే కారణం. ప్రభుత్వ విద్యారంగాన్ని పరిరక్షించాలని విద్యార్థి సంఘాలు, ఉపాధ్యాయ సంఘాలు చేసిన వాదనలను తేలిగ్గా కొట్టిపారేసిన చంద్రబాబు ప్రైవేట్ సంస్థల వికాసానికి నిర్విరామ కృషి చేశాడు. క్రమంగా ప్రభుత్వ విద్యాసంస్థల ప్రాధాన్యం తగ్గి ప్రైవేట్ సంస్థల ప్రాబల్యం పెరిగింది. దానికి కొనసాగింపుగా రాజశేఖరరెడ్డి ముఖ్యమంత్రి కాగానే సెల్ఫ్ ఫైనాన్స్ కోర్సులు ప్రారంభ మయ్యాయి. మేనేజ్‌మెంట్ కోటాలో చేరే విద్యార్థులు సెల్ఫ్ ఫైనాన్స్ చేసుకోవాల్సి ఉంటుంది. వివిధ కోర్సులకు ఇష్టారాజ్యంగా ఫీజులు వసూలు చేస్తున్న క్రమంలో విద్యార్థి సంఘాలు ఫీజుల స్థిరీకరణ డిమాండ్‌ను ముందుకు తెచ్చారు. ప్రభుత్వం కూడా ఫీజుల విషయంలో జోక్యం చేసుకోవడంతో ప్రైవేట్ కాలేజీల యాజమాన్యానికి మంచి అవకాశం దొరికింది. ఎస్.సి., ఎస్.టి. విద్యార్థులకు కేంద్ర ప్రభుత్వమే ఉపకార వేతనాలు, ట్యూషన్ ఫీజులు చెల్లిస్తుండడంతో అప్పనంగా కోట్లాది రూపాయలు కొల్లగట్టవచ్చనే ఆలోచనతో ఫీజుల స్థిరీకరణ విషయంలో ప్రైవేట్ సంస్థలు మెలకువతో వ్యవహరించాయి. ప్రైవేట్ విద్యా వ్యాపారానికి అడ్డు అదుపూ లేకపోవడంతో లాభసాటిగా మారింది. దీంతో విద్యా వ్యాపారంలో తిమింగలాలు అనదగిన కార్పొరేట్ కాలేజీలు ఏర్పడ్డాయి. 2008లో బి.సి., ఇ.బి.సి., మైనారిటీలకు కూడా ఫీజు రీయింబర్స్‌మెంట్ వర్తింపజేస్తూ రాజశేఖరరెడ్డి ఉత్తర్వులు జారీచేశారు. వెయ్యి కోట్లు అనుకున్న సమయానికి విడుదల చేయడంతో తామరతంపరగా వందలాది కాలేజీలు పుట్టుకొచ్చాయి. జాతీయ

స్థాయిలో రాజకీయ పలుకుబడిని ఉపయోగించి ఎ.ఐ.సి.టి.ఇ. నుండి అక్రమంగా అనుమతులు పొందారు. ఇదో పెద్ద స్కాం అని ఆనాడు మీడియా అనేక కథలు వెలువరించింది. దోషులు రక్షింపబడ్డారు. విద్యార్థులు ఇప్పుడు శిక్షింపబడుతున్నారు. అది విషాదం.

2001లో ఇంజనీరింగ్ కాలాజీలు 164 ఉండగా 2004లో 261 వరకు పెరిగాయి. 2006-10లో 657కు పెరిగాయి. అదే విధంగా మెడికల్, ఫార్మసీ కాలేజీలు 2001లో 29 ఉండేవి. 2004-05 విద్యా సంవత్సరం నాటికి 53కు పెరగగా, 2006-10 నాటికి 582కు పెరిగి పెద్దవయ్యాయి. ఎ.ఐ.సి.టి.ఇ. అక్రమ అనుమతుల వల్లే పదేళ్ల కాలంలో ఎన్నో రెట్లు పెరిగాయి. పెరిగిన కాలేజీల వివరాలు ఈ కింది విధంగా ఉన్నాయి.

2001-02 నుండి 2006-10 వరకు ఆంధ్రప్రదేశ్‌లో ఉన్న ఉన్నత కళాశాలల సంఖ్య

| ఇన్‌స్టిట్యూట్ | సంవత్సరం | | | | | |
|---|---|---|---|---|---|---|
| | 2001 -02 | 2002 -03 | 2003 -04 | 2004 -05 | 2005 -06 | 2006 -10 |
| యూనివర్సిటీలు | 16 | 18 | 18 | 18 | 18 | 36 |
| డీమ్డ్ యూనివర్సిటీలు | 4 | 5 | 5 | 5 | 5 | 9 |
| రీసెర్చ్ ఇన్‌స్టిట్యూషన్లు | 5 | 5 | 5 | 5 | 5 | 20 |
| సాధారణ కళాశాలలు | 1080 | 1197 | 1330 | 1340 | 1603 | 1926 |
| ఇంజనీరింగ్ - టెక్నాలజికల్ కాలేజీలు | 164 | 222 | 238 | 261 | 278 | 657 |
| మెడికల్ / ఫార్మసీ కాలేజీలు | 29 | 30 | 53 | 53 | 311 | 582 |
| **మొత్తం** | **1298** | **1477** | **1649** | **1682** | **2220** | **3230** |

మూలం : ఆంధ్రప్రదేశ్ స్టేట్ కౌన్సిల్ ఆఫ్ హైయర్ ఎడ్యుకేషన్

పైన పేర్కొన్న వివరాలు నిర్ధారిస్తున్న వాస్తవం ఏమిటి? ఫీజు రీయింబర్స్‌మెంట్ పథకం అమలు కావడానికి ముందు చాలా తక్కువ కాలేజీలున్నాయి. కానీ ఈ పథకం వల్ల బోగస్ కాలేజీలు, బోగస్ విద్యార్థుల పట్టిక ద్వారా కోట్లాది రూపాయలు ఆర్జించవచ్చని అర్థం చేసుకున్న సంపన్నులు, రాజకీయ నాయకులు కొత్త కాలేజీలు ఏర్పాటు చేసుకున్నారు. సుమారు 24 లక్షల మంది విద్యార్థులు ఈ పథకాన్ని వినియోగించుకుంటున్నారు. నిజం చెప్పాలంటే కాలేజీల యాజమాన్యాలు వినియోగించుకుంటున్నాయనేది అసలు వాస్తవం.

ఇంజనీరింగ్, ఇతర వృత్తివిద్యా కోర్సులు బోధించే కాలేజీలు కనీస ప్రమాణాలు పాటించడం లేదనే ఆరోపణలు చాలా కాలంగా వినిపిస్తున్నాయి. కానీ ప్రభుత్వం వాటిని ఏనాడూ తీవ్రమైన సమస్యగా పరిగణించలేదు. కానీ ఫీజు రీయింబర్స్‌మెంట్ మోయలేని భారం కాగానే ఇప్పుడు రాష్ట్ర ప్రభుత్వం ప్రమాణాల గురించి మాట్లాడుతుంది. అదే విధంగా శిక్షలు పూర్తి చేసుకున్న విద్యార్థుల ఉద్యోగ నియామకాల గురించి మాట్లాడుతుంది. 70 శాతం హాజరు లేని విద్యార్థులకు, తెల్లరేషన్ కార్డు లేని వారికీ, క్రిమిలేయర్ పరిధిలోకి వచ్చే వారికీ, డిటెయిన్ అయిన విద్యార్థులకు ఫీజు రీయింబర్స్‌మెంట్ వర్తించదని షరతులు పెడుతున్నది. ఉపకార వేతనాలను నేరుగా విద్యార్థుల బ్యాంక్ ఎకౌంట్‌లో వేసే ప్రణాళిక కూడా యాజమాన్యాలకే వరంగా మారింది.

రాష్ట్ర ప్రభుత్వం బి.సి. విద్యార్థులకు తీరని అన్యాయం చేస్తుందని ఆందోళన జరిగింది. వెంటనే నిధులు విడుదల చేయాలని చేసిన ఉద్యమానికే ప్రైవేట్ కాలేజీలు యాజమాన్యాలు సంపూర్ణంగా సహకరించాయి. కాలేజీలు సమ్మెకు పిలుపునిచ్చాయి. విద్యార్థుల ఒత్తిడితో దిగొచ్చిన ప్రభుత్వం వాయిదా పద్ధతిలో నిధులు విడుదల చేస్తామని వాగ్దానం చేసింది. 500 కోట్లు విడుదల చేసింది. ఫీజు రీయింబర్స్‌మెంట్ కోసం కేటాయించిన నిధులు, విడుదల చేసిన మొత్తం వివరాలిలా ఉన్నాయి.

| సంవత్సరం | 2004 నుంచి కట్టిన స్కాలర్‌షిప్, ట్యూషన్ ఫీజులు | | | | |
|---|---|---|---|---|---|
| | బడ్జెట్ కేటాయింపు (కోట్లలో) | బడ్జెట్ విడుదల (కోట్లలో) | అవసరమున్న బడ్జెట్ (కోట్లలో) | ఇంకా విడుదల కావాల్సిన మొత్తం (కోట్లలో) | లబ్ధిపొందుతున్న విద్యార్థులు |
| 2004-05 | 374.62 | 309.62 | 439.05 | 65.02 | 8,44,035 |
| 2005-06 | 493.69 | 358.47 | 497.96 | 139.96 | 9,36,473 |
| 2006-07 | 538.5 | 538.5 | 666.11 | 127.61 | 11,00,899 |
| 2007-08 | 791.2 | 791.2 | 865.22 | 74.02 | 13,52,403 |
| 2008-09 | 1697.09 | 1385.5 | 1823.29 | 437.79 | 18,79,928 |
| 2009-10 | 2071.82 | 1468.99 | 3431.41 | 1962.42 | 24,45,332 |

మొత్తం మూడు వేల నాలుగు వందల కోట్లకుపైగా అవసరమైన ఈ పథకం సంక్షోభంలో కూరుకుపోయింది. ప్రభుత్వాన్ని ఆడిస్తున్నది అంటే అతిశయోక్తి కాదు. పథకం అమలు గురించి లబ్దిదారులు పోరాడుతున్నందు వల్ల ఈ పరిస్థితి తలెత్తలేదు. కాని, యాజమాన్యాలు న్యాయస్థానం సహకారంతో పోరాడుతున్నందు వల్ల ఈ పరిస్థితి వచ్చింది. మరే ఇతర పథకం విషయంలోనూ ఇలాంటి పరిస్థితి ఏర్పడలేదు. ప్రభుత్వం బకాయిలను సకాలంలో చెల్లించే విధంగా ఆదేశాలివ్వాలని ప్రైవేట్ కాలేజీల యాజమాన్యాలు సుప్రీంకోర్టును ఆశ్రయించాయి. సర్వోన్నత న్యాయస్థానం వారికి అండదండగా నిలిచింది. సుప్రీం ఆదేశాలను శిరసావహిస్తామని చెప్పిన ప్రభుత్వం చేతులెత్తేసింది. సుప్రీం కోర్టు మరోసారి చివాట్లు పెట్టి బ్యాంకుల నుండి అప్పు చేసి బకాయిలు చెల్లించాలని ఆదేశించింది. ఎస్.సి., ఎస్.టి., బి.సి., మైనారిటీ కార్పొరేషన్ల ఆస్తులు, పేద ప్రజలకు కేటాయించిన భూములు తాకట్టుపెట్టి వేల కోట్లు సేకరించాలని ఉత్తర్వులు జారీచేసింది. ఒకవేళ ఈ పద్ధతిలో తాకట్టు పెట్టినా ఈ విద్యా సంవత్సరానికి సరిపడా నిధులు మాత్రమే సమకూరుతాయి. రాబోయే విద్యా సంవత్సరానికి తాకట్టు పెట్టేందుకు ఇంకేమీ మిగలదు. ఆస్తులు తాకట్టు పెట్టే నిర్ణయం దుర్మార్గమైంది. ప్రజా వ్యతిరేకమైంది. సమస్యకు మూలాలు అన్వేషించకుండా అణగారిన వర్గాల అభ్యున్నతి కోసం రాజ్యాంగ బద్ధంగా ఏర్పాటు చేసిన సంస్థల ఆస్తులు తాకట్టు పెట్టడం చట్టవిరుద్ధం.

సమస్యంతా ఫీ స్ట్రక్చర్‌లో ఉంది. అత్యున్నత విలువల గల విద్యా సంస్థల్లో సైతం లేని ఫీజులు ఆయా కోర్సులకు ఇక్కడ నిర్ణయించారు. బి.ఎడ్., బి.టెక్., బి.ఫార్మసీ వంటి అండర్ గ్రాడ్యుయేషన్ కోర్సులకు వేలాది రూపాయలు ఫీజు నిర్ణయించారు. ఉదాహరణకు సెంట్రల్ యూనివర్సిటీలో పి.జి. ఎం.ఎస్.సి. కోర్సు పూర్తి చేసేందుకు రెండేళ్లకు నాలుగు వేల రూపాయలు ఖర్చవుతాయి. కాని, రాష్ట్ర ప్రభుత్వం ప్రైవేట్ కాలేజీలకు బి.ఎడ్. కోర్సుకు ఒక్కో విద్యార్థికి పద్నాలుగు వేల నాలుగు వందల రూపాయలు చెల్లిస్తుంది. పి.జి. కోర్సు కన్న అండర్ గ్రాడ్యుయేషన్ కోర్సుకు నాలుగు రెట్లు ఎక్కువ చెల్లిస్తుంది. డిగ్రీ కోర్సులైన

*విద్యార్థులు ఇస్తున్న పోరాట స్ఫూర్తితో మరింత ఉధృతంగా ఉద్యమించడమే తెలంగాణ రాష్ట్ర సాధనకు మార్గమని అంటున్నారు* **ఆత్రం రామారావు**

# తెలంగాణకు కావలసింది మిలిటెంట్ పోరాటాలు

ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర సాధన డిమాండ్ యాభై ఏండ్లకు పైగా ఉంది. 1 నవంబర్ 1956న ఏర్పడిన ఆంధ్రప్రదేశ్‌లో తెలంగాణను బలవంతంగానే చేర్చుకున్నారు. వివక్ష, దోపిడీ, ఆత్మగౌరవం, స్వపరిపాలన అనే అంశాల చుట్టూ రాజకీయంగా ప్రత్యేక రాష్ట్ర డిమాండ్ ముందుకు వచ్చింది. ఈ ఉద్యమానికి చారిత్రక నేపథ్యం ఉంది.

2009 డిసెంబర్‌లో ఉద్యమం మలుపు తిరిగి పెద్ద ఉద్యమంగా, ప్రజా వెల్లువగా ముందుకొచ్చింది. ఇది మొత్తం దేశ వ్యాప్తంగా ప్రభావాన్ని వేసింది. ఈ ఉద్యమానికి ఉస్మానియా యూనివర్సిటీ విద్యార్థులు నిలబడినారు. వీరు ప్రత్యేక తెలంగాణ సాధన కోసం జాయింట్ ఆక్షన్‌గా ఏర్పడి బలమైనశక్తిగా ముందుకు వచ్చారు. ఈ యూనివర్సిటీలో విద్యార్థులు ప్రదర్శించిన ఐక్యత, మిలిటెన్సీ రాష్ట్ర ప్రజలందరినీ ఉత్తేజపరిచి రాష్ట్రవ్యాప్త ఉద్యమాన్ని మలుపు తిప్పింది. ఈ ఉద్యమంలో విద్యార్థులు, లాయర్లు, కవులు, కళాకారులు, రచయితలు, టీచర్లు, కార్మికులు, ఉద్యోగస్తులు, మహిళలు, ఆదివాసులు పెద్ద ఎత్తున కదిలారు. ఉద్యమానికి రైతాంగ మద్దతు కూడా విస్తృతంగా లభించింది.

ఈ ఉద్యమాలను ప్రాంతీయతత్వమనీ, ప్రాంతాల మధ్య విభేదాలు సృష్టిస్తున్నాయనీ చెప్పడం అప్రజాస్వామికం. ప్రాంతీయ సమానత్వం ఒక ప్రజాస్వామిక హక్కు. అణచివేతకు, వివక్షతకు గురవుతున్న ప్రాంతాలు అస్తిత్వం కోసం, తమ ప్రాంత అభివృద్ధి కోసం, స్వయం నిర్ణయాధికారం, స్వావలంబన, ఆత్మగౌరవం, తమ సాంస్కృతిక విలువల పరిరక్షణ కోసం, వాటికి గుర్తింపు కోసం జరిగే పోరాటంగా ప్రత్యేక తెలంగాణ ఉద్యమాన్ని గుర్తించాలి. అందుకోసం తెలంగాణ ప్రజలు జీవన్మరణ పోరాటం కొనసాగిస్తున్నారు.

తీవ్రమవుతున్న ప్రత్యేక తెలంగాణ ఉద్యమ నేపథ్యంలో, రాష్ట్రంలో పరిస్థితిని సమీక్షించి పరిష్కార మార్గాలు చూపడం కోసం ఫిబ్రవరి 2010లో నియమించిన శ్రీకృష్ణ కమిటీ 30 డిసెంబర్ 2010న నివేదికను సమర్పించగా, 6 జనవరి 2011న కేంద్ర హోంమంత్రి చిదంబరం అఖిలపక్షాన్ని పిలిచి నివేదికను వెల్లడించారు. కమిటీ తన నివేదికలో తెలంగాణ సమస్యకు ఆరు పరిష్కారాలను సూచించింది. మొట్టమొదటి పరిష్కారంగా సమైక్యాంధ్రనే ఉంచింది. కనుక శ్రీకృష్ణ

---

బి.ఇ., బి.టెక్. కోర్సుకు ముప్పై ఎనిమిది వేల రూపాయలు చెల్లిస్తుంది. నిజంగా డిగ్రీ కోర్సుకు ఇంత మొత్తం అవసరం అవుతుందా అనేది పరిశీలించాలి. అన్ని వసతులున్న అత్యున్నత ప్రమాణాలున్న సెంట్రల్ యూనివర్సిటీలోనే నాలుగువేల రూపాయలతో ఎంటెక్ కోర్సు పూర్తి అవుతుంటే ఏ ప్రమాణాలు లేని ప్రైవేట్ కాలేజీలకు యాభై ఐదు వేల రూపాయలు రాష్ట్ర ప్రభుత్వం చెల్లిస్తుంది. ఎం.ఫార్మసీ కోర్సుకు ఏకంగా ఒక లక్షా నాలుగువేల ఏడు వందల ఎనభై ఐదు రూపాయలు అక్షరాలా చెల్లిస్తుంది. అంటే ఫీ స్ట్రక్చర్ రూపొందించే సమయంలోనే ప్రజాధనం దోపిడీకి కుట్ర జరిగింది. ఈ ఫీజులు నామ మాత్రమైనవి ప్రైవేట్ కాలేజీలు చేసే వాదనలు హాస్యాస్పదం. ఈ ఫీజులు వల్ల ఎలాంటి లాభం లేకపోతే బినామీ పేర్ల మీద అక్రమ అనుమతులతో ఇన్ని కాలేజీలు ఆవిర్భవించేవి కావు. ఎంతో మంది ప్రభుత్వ ఉద్యోగాలు వదిలేసి ఈ విద్యావ్యాపారంలోకి దిగేవారు కారు.

రాష్ట్ర ప్రభుత్వం ఎస్.సి., ఎస్.టి., బి.సి., మైనారిటీ కార్పొరేషన్ల ఆస్తులు తెగనమ్మకుండా ఫీజులు తగ్గిస్తే సమస్యను పరిష్కరించొచ్చు. ప్రతి సంవత్సరం మూడు వేల కోట్ల రూపాయలు ప్రైవేట్ కళాశాలలకు ఏటా చెల్లిస్తే, ఐదేళ్లకు పదిహేను వేల కోట్ల రూపాయలు చెల్లించాల్సి ఉంటుంది. అంటే రాష్ట్ర ప్రభుత్వం పన్నుల రూపంలో ప్రజల నుండి సేకరించే ఆదాయం ప్రైవేట్ కాలేజీల బొక్కసంలోకి చేరుతుంది. దీనికి పరిష్కారం ప్రభుత్వానికి తెలియదనుకోలేం. ప్రతి డిగ్రీ, పిజి కోర్సుకు పదివేలకు మించకుండా ఫీజు నిర్ణయిస్తే వేల కోట్లు చెల్లించే భారం తగ్గుతుంది. కానీ పాలకులు, ప్రభుత్వ ఉన్నతాధికారులు ప్రైవేట్ విద్యా వ్యాపారుల లాబీయింగ్‌కు లొంగిపోయారు కాబట్టి ఫీజులు తగ్గించే యోచన రానేరాలేదు. కానీ బకాయిలు చెల్లించాలనే పేరుతో ఎప్పటి నుండో కన్నేసి ఉంచిన భూములను తాకట్టు పెట్టడమో లేక తెగనమ్మడమో చేసేందుకు సిద్ధపడుతున్నారు. ఫీజుల నిర్ణయంలో శాస్త్రీయ పద్ధతిని అనుసరించాలి. ఏటా మూడు వేల కోట్ల రూపాయలు ప్రభుత్వేతర సంస్థలకు చెల్లించే బదులు అవే నిధులతో ప్రభుత్వ ఇంజనీరింగ్, మెడికల్ తదితర అవసరమైన ప్రొఫెషనల్ కాలేజీలు నిర్మించొచ్చు. అవసరమైన మౌలిక వసతులను ఏర్పాటు చేయొచ్చు. క్వాలిఫైడ్ అధ్యాపకులను నియమించి అత్యున్నత ప్రమాణాలున్న ప్రభుత్వ సంస్థల నిర్మాణంచేసి రాష్ట్ర అభ్యున్నతికి పాల్పడొచ్చు. ఈ కోణం నుండి సర్వోన్నత న్యాయస్థానం ఆదేశాలిస్తే మరింత బాగుండేది. ప్రైవేట్ సంస్థల బకాయిలు అప్పు చేసైనా చెల్లించమనే న్యాయస్థానం ప్రభుత్వ విద్యా సంస్థలను బకాయి సొమ్ముతో నిర్మించమని నిజంగా ఆదేశించగలదా?

*(రచయిత హైదరాబాద్ సెంట్రల్ యూనివర్సిటీ రీసెర్చ్ స్కాలర్)* వీ

కమిటీ అనేది సమస్యను పరిష్కరించకుండా తాత్సారం చేసి ప్రజల పోరాట పటిమను నీరుగార్చడం కోసం వేసిన ఎత్తుగడ అనేది నూటికి నూరు శాతం నిజం.

కమిటీ నివేదిక ఏమిటో ప్రభుత్వానికి ముందే తెలుసు. నివేదిక సమర్పించిన తర్వాత తెలంగాణలో పోరాటం తీవ్రమవుతుందని ముందుగానే అరవై కంపెనీల కేంద్ర బలగాలను దింపారు. ఇందులో ఒక్క పోలీసును కూడా సీమాంధ్ర జిల్లాల్లో ఉంచకుండా మొత్తం బలగాలన్నింటినీ తెలంగాణ జిల్లాల్లోనే మోహరించారు. ఒక పక్క శాంతియుతంగా తెలంగాణ సాధించుకోవాలని, కమిటీ నివేదికను అందరూ శ్రద్ధగా పరిశీలించి, చర్చించి ఒక నిర్ణయానికి రావాలంటూ చిదంబరం హితబోధలు చేస్తున్నారు. మరోపక్క ఉస్మానియా యూనివర్సిటీలో ఆందోళన చేస్తున్న విద్యార్థులపై రబ్బరు బుల్లెట్లతో కాల్పులు జరిపించారు. ప్రత్యేక తెలంగాణ ఉద్యమంపై ఎంతటి అణచివేతకు పూనుకోబోతున్నారో ఈ చర్యలతోనే అర్థమవుతుంది. ప్రత్యేక తెలంగాణ ఉద్యమంలో మిలిటెంట్‌గా పోరాడుతూ ముందు పీఠిన నిలబడుతున్న విద్యార్థులను తీవ్రంగా అణచివేసి ఉద్యమానికి నాయకత్వం లేకుండా చేయడానికి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు నిర్ణయించు కున్నాయి. అందుకే ఉస్మానియా క్యాంపస్‌లో వేలాది పోలీసు బలగాలను దింపి కాన్సెన్‌ట్రేషన్ క్యాంపుగా మార్చాయి. ఈ అణచివేతకు గవర్నర్ ఇ.ఎస్.ఎల్. నరసింహన్, ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్ రెడ్డి, డి.జి.పి. అరవిందరావులు నేతృత్వం వహిస్తున్నారు. రాయలసీమ, కోస్తాంధ్ర పాలకులకు అనుకూలంగా వ్యవహరిస్తున్న ఈ త్రయానికి తెలంగాణ పోరాట ప్రజానీకం తగిన బుద్ధి చెపుతారు.

తెలంగాణలో ఏ ఉద్యమం మొదలైనా దానిని అణచడానికి ప్రభుత్వాలు వాడే మొదటి ఆయుధం ఉద్యమంలో మావోయిస్టులు జొరబడ్డారనేది. ప్రస్తుతం జరుగుతున్న ఉద్యమంలో కూడా అదే విధమైన ప్రచారం మొదలుపెట్టారు. 'శ్రీకృష్ణ కమిటీ ' మొదటి సూచనలో – 'రాష్ట్రంలో యథాతథ స్థితిని కొనసాగించడం వల్ల తెలంగాణలో తీవ్రస్థాయిలో భావోద్వేగాలు, హింసాత్మక ఆందోళనలు చెలరేగే అవకాశం ఉంది. ఈ అనిశ్చితిని మావోయిస్టు ఉద్యమం తనకు అనుకూలంగా మార్చుకునే ప్రమాదముంది' అని వ్యాఖ్యానించింది.

మావోయిస్టులు జొరబడ్డారో లేదో గాని మనం అందరం ఆలోచించాల్సింది మాత్రం వాళ్లు కూడా ఎందుకు మాట్లాడకూడదు అని. మావోయిస్టులకు తెలంగాణ గురించి మాట్లాడే హక్కు ఉండదా? వారిది ఒక రాజకీయ పార్టీ కనుక వారు కూడా మాట్లాడుతారు. వారు కూడా ఉద్యమంలో పాల్గొంటారు. అది తప్పుకాదు.

తెలంగాణ ఉద్యమ భవిష్యత్తుకు సంబంధించి చూస్తే శ్రీకృష్ణ కమిటీ ఏర్పాటు చేసి ఉద్యమాన్ని పక్కదారి పట్టించాలని బూర్జువా పార్టీలు, కేంద్ర ప్రభుత్వం ప్రయత్నించాయి. కాని ఉద్యమం మాత్రం వివిధ సమస్యలపై ఉధృతమవుతూనే ఉంది. ఏప్రిల్ 2010లో మహబూబాబాద్ (మానుకోట ఘటన) ఘటన తదుపరి హైకోర్టు నియామకాల్లో 42 శాతం తెలంగాణ వారికి స్థానాలు కేటాయింపు, హైదరాబాద్ ఫ్రీజోన్‌గా కొనసాగిస్తూ ఎస్.ఐ. పోస్టులను అడ్డుకోవడానికి విద్యార్థులు జరిపిన ఆందోళన, ఎ.పి.పి.ఎస్.సి. పరీక్షను అడ్డుకుంటూ జరిగిన ఆందోళనలు – ఇలా తెలంగాణ సమస్యపై మిలిటెంట్ ఆందోళనలు కొనసాగుతూనే ఉన్నాయి. విశాల ప్రజారాశులు ఉద్యమం ద్వారానే తెలంగాణ సాధ్యమని నమ్ముతున్నారు. అలాగే కేవలం ప్రత్యేక తెలంగాణ ఏర్పడడమే కాకుండా ప్రజల ప్రజాస్వామిక హక్కులు, భూమి కావాలని కోరుకుంటున్నారు. ఆదివాసులు స్వయం ప్రతిపత్తి కావాలని అంటున్నారు. తెలంగాణ ఉద్యమం, బూర్జువా పార్టీల ప్రభావం నుండి ప్రజల చేతుల్లో ముఖ్యంగా విద్యార్థి, ఇతర సెక్షన్ల కిందికి వచ్చింది. ఉద్యమంలో ఇది ఒక పాజిటివ్ అంశం.

శాంతియుతంగా సాగుతున్న ఉద్యమంపై పోలీసులు తీవ్రమైన అణచివేతను ప్రయోగిస్తూ హింసాయుత స్థితికి నెడుతున్నారు. రేపు ఉద్యమం శాంతియుత పోరాటపంథాని దాటి హింసాత్మక రూపం తీసుకుంటే అందుకు ప్రభుత్వానిదే పూర్తి బాధ్యత. తెలంగాణ ఉద్యమం ఇప్పుడు సంధి దశకు చేరుకుంది. తెలంగాణ చరిత్రంతా మోసపోయిన చరిత్ర. ఆయా రాజకీయ పార్టీలు మరోసారి విద్రోహానికి తలపెడుతున్నాయి. 5 జనవరి 2010, తిరిగి 6 జనవరి 2011 నాడు శాంతి ప్రకటనలపై సంతకం పెట్టి ఉద్యమాన్ని తాత్కాలికంగా ఆపినాయి. మరోవైపు శ్రీకృష్ణ లాంటి కాలయాపన కమిటీ వేసి సాచివేతకు పాల్పడడం కేంద్రం ఎత్తుగడ. కనుక తెలంగాణ సాధన కాంగ్రెస్ పార్టీ అధినాయకత్వం అనుమతితోనో, తెలంగాణ కాంగ్రెస్ నాయకుల సిఫారసులతోనో, లాబీయింగ్‌తోనో సాధ్యంకాదు. తెలంగాణ లోని అన్ని సెక్షన్లు, ప్రజలు ఒక్కతాటిపై నిలిచి వెనుకంజలేని మిలిటెంట్ పోరాటం ద్వారానే సాధ్యమవుతుంది. అందుకోసం మహబూబాబాద్, హైదరాబాద్ ఉస్మానియా విద్యార్థుల సమరశీల పోరాట మార్గంలో ఉద్యమాన్ని మరింత ముందుకు తీసుకుపోవాలి. ఆ వైపుగా తెలంగాణ ఉద్యమాన్ని మరింత మిలిటెంట్‌గా ముందుకు నడిపించాలి.

*(రచయిత సామాజిక కార్యకర్త)* వీ

**రాబోయే సంచికలలో...**

- **కృష్ణా జలాల వివాద ట్రిబ్యునల్ తీర్పు**
- **బ్లెయిర్‌కు బహిరంగ లేఖ**
- **అడవి సంపదపై సామ్రాజ్యవాదుల కన్ను**
- **వెనిజులా ప్రజల అధ్యయన ప్రణాళిక**
- **సూక్ష్మ రుణ వడ్డీ వ్యాపారం - ప్రజాస్వామ్య విద్రోహం**
- **నిప్పుల కుంపటిపై అరబ్ ప్రపంచం**
- **రికవరీ కేసులు - స్వర్ణకారుల గోసలు**
- **ఆత్మహత్యలు చేసుకున్న రైతు కుటుంబాలకు ఎక్స్‌గ్రేషియా?**

*సహాయ నిరాకరణతో సహా తెలంగాణలో చోటు చేసుకుంటున్న ఇటీవల పరిణామాలన్నీ ప్రజల ఆకాంక్షను మరింత బలంగా ముందుకు తీసుకువస్తున్నాయంటున్నారు* **యాటెల్లి రామచంద్రం**

# తెలంగాణ - సహాయ నిరాకరణ

రాష్ట్ర శాసనసభలో గవర్నర్ ప్రసంగాన్ని తెలంగాణ ప్రాంత ఎం.ఎల్.ఎ.లు అడ్డుకున్నారు. గవర్నర్ ప్రసంగ పాఠాన్ని 15 నిమిషాల్లో తూతూ మంత్రంగా ముగించారు. గవర్నర్ ప్రసంగ పాఠంలో ఎక్కడా రాష్ట్రంలో జరుగుతున్న పరిణామాల ప్రస్తావనే లేదు. రాజ్యాంగాన్ని అతిక్రమించారన్న కారణంతో ఐదుగురు శాసన సభ్యులను వారం రోజులపాటు సస్పెండ్ చేశారు. శాసన సభలో జరిగిన పరిణామాల వల్ల రాజ్యాంగ ఉల్లంఘన జరిగిందని ఒక వైపు మీడియా, మరోవైపు రాజకీయ నాయకులు అసలు విషయాన్ని తప్పుదోవ పట్టిస్తున్నారు.

అసెంబ్లీలో జరిగిన ఘటనలకు కారణాలను, ఆ ఘటనలకు ముందు జరిగిన పరిణామాలను పరిశీలించకుండా ఘటనకు మాత్రమే పరిమితమై చూస్తే మనకు అర్ధ సత్యాలే మిగులుతాయి. తెలంగాణ ప్రాంతంలో లక్షలాది మంది ప్రజలు తమ ప్రత్యేక రాష్ట్ర ఆకాంక్షను వ్యక్తం చేస్తూ చేసిన ఉద్యమాల ఫలితంగా వచ్చిన 2009 డిసెంబర్ 9 నాటి ప్రకటనను అమలు చేయాలని తెలంగాణ ప్రాంతమంతా వివిధ రూపాల్లో తమ నిరసనలను వ్యక్తం చేస్తూ ఉద్యమిస్తున్నారు. ప్రభుత్వ ఉద్యోగులు తమ విధులను బహిష్కరిస్తూ సహాయ నిరాకరణ చేస్తున్నారు. ప్రత్యేక తెలంగాణ ఏర్పాటు కోసం సాగుతున్న ఉద్యమానికి రాజకీయ నాయకులు చేస్తున్న మోసాలను జీర్ణించుకోలేని యువత నిరాశ నిస్పృహలకు లోనై 600 మందికి పైగా ఆత్మహత్యలకు పాల్పడ్డారు. ఇంత మంది చావులను పక్కదారి పట్టిస్తూ, ఇక్కడ అంతా ప్రశాంతంగా ఉందనే భ్రమలు కల్పిస్తూ, శాసనసభ సమావేశాల్లో ప్రభుత్వం నిర్వహిస్తున్న రచ్చబండ కార్యక్రమాన్ని కీర్తిస్తూ గవర్నర్ చేసిన ప్రసంగం ప్రభుత్వ పక్షపాత ధోరణితో ఉంది. తెలంగాణ ప్రాంత ప్రజా ప్రతినిధులు గవర్నర్ ప్రసంగాన్ని అడ్డుకోవడమైనా, లోక్ సత్తా పార్టీ నాయకున్ని ప్రతిఘటించడమైనా తెలంగాణ ప్రాంతంలో ప్రజా ఉద్యమాల ఒత్తిడి మేరకే జరిగాయనేది అర్థం చేసుకోవాలి.

ఈ ఘటనల వల్ల రాజ్యాంగానికి అపచారం జరిగిపోయిందని గొంతు చించుకుంటున్న వాళ్లు ఇంత మంది ప్రాణాలు పోవడానికి రాజకీయ పార్టీల నాయకులు కారణం కాదా? వాళ్లు ఈ అంశంపై అసెంబ్లీలో చర్చించాల్సిన అవసరంలేదా? ప్రజా సమస్యలను పరిష్కరించాల్సిన ప్రభుత్వం దున్నపోతు మీద వర్షం పడ్డట్లుంటే, ప్రజలు కోరుతున్న సమస్యలను పట్టించుకోని అసెంబ్లీని నడవనీయమన్న ఐదుగురు ప్రజా ప్రతినిధులను వారం రోజులపాటు సస్పెండ్ చేయడం ఏమేరకు న్యాయం? 2009 డిసెంబర్ 9న తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు ప్రక్రియను ప్రారంభిస్తున్నాం అని ప్రకటించి మోసం చేసిన కేంద్ర ప్రభుత్వానిది ఏమేరకు రాజ్యాంగబద్ధమైన నిర్ణయం?

రాజకీయ పార్టీలు ఉద్యమాల పేరుతో చేసే మోసాల చరిత్రను ప్రజలు గుర్తించారు. రాజకీయ పార్టీల మోసాన్ని ఎండగడుతూ విద్యార్థులు, మేధావులు, వివిధ ప్రజాసంఘాలు ఉద్యమాన్ని గ్రామాలకు చేర్చారు. తెలంగాణలోని గ్రామ గ్రామాన రిలే దీక్షలు, ర్యాలీలు, పాదయాత్రలు,లక్షలాది మందితో సభలు, రాజకీయనాయకుల నిలదీతలు కొనసాగిస్తూ ప్రజల్ని చైతన్య వంతుల్ని చేశారు. ఈ క్రమంలోనే 9 డిసెంబర్ ప్రకటనను కేంద్రం విడుదల చేసింది. కేంద్ర ప్రకటనను వ్యతిరేకిస్తూ సమైక్యాంధ్ర ఉద్యమాన్ని రాజకీయ నాయకుల ముసుగులో ఉన్న కాంట్రాక్టర్లు లేవదీసారు. డిసెంబర్ 9 ప్రకటన తదనంతరం జరిగిన పరిణామాలను దృష్టిలో పెట్టుకొని ఈ అంశంపై ఇంకా చర్చించాల్సిన అవసరం ఉందని మరో ప్రకటన విడుదల చేసింది. ఈ నేపథ్యంలో వచ్చిందే శ్రీకృష్ణ కమిటీ.

తెలంగాణలోని హైదరాబాద్ని మేమే అభివృద్ధి చేశామని కోస్తాంధ్ర, రాయలసీమ రాజకీయ నాయకులు మళ్లీ మళ్లీ చెపుతున్నారు. వాళ్లు చేసినామని చెపుతున్న అభివృద్ధి అంతా ఫ్లైఓవర్ బ్రిడ్జిలు, విమాన కేంద్రాలు, సెజ్ల పేరుతో వచ్చిన రియల్ ఎస్టేట్లు, షాపింగ్ మాల్స్, కార్పొరేట్ హాస్పిటల్స్, ఓపెన్కాస్ట్ మైనింగ్లే... ఇవి ఎక్కడా మనిషి అభివృద్ధిని కేంద్రంగా చేసుకుని వచ్చినవి కావు. వ్యవసాయ ప్రధాన రాష్ట్రంలో అభివృద్ధి వ్యవసాయాన్ని అభివృద్ధి చేయడంలో ఉంటుందని, దానికి అనుబంధంగానే పరిశ్రమల అభివృద్ధి జరగాలనే శాస్త్రీయ పద్ధతి కాకుండా వాటితో సంబంధం లేని సేవారంగాన్ని ప్రోత్సహించడం మనం చూస్తున్నాం. గుప్పెడు మందికే వనరులు, లాభాలు అనే పద్ధతిలో సాగుతున్న వృద్ధిని చూస్తున్నాం. ఈ వృద్ధి అంతా కాంట్రాక్టర్లకు, విదేశీ కంపెనీలకు, రాజకీయ నాయకులకు ప్రయోజనాన్ని చేకూర్చేదే తప్ప, ఎక్కడా సామాన్య ప్రజలను కలుపుకుని సాగిందిలేదు. ఇటువంటి తలకిందుల విధానాలు, మనిషిని అభివృద్ధిలో, ఉత్పత్తిలో భాగం చేసుకోలేని విధానాల ఫలితం ఈ రోజు ప్రజలు వ్యక్తం చేస్తున్న అన్ని ఆకాంక్షల్లో ఆరాట, పోరాటాలలో వ్యక్తమౌతోంది. నలభై ఏళ్ల నుంచి తెలంగాణ ఆకాంక్ష మళ్లీ మళ్లీ ఎందుకు వస్తోందో ఆలోచించాల్సిన విషయం. పరిష్కారం చూపాల్సిన సమయం.

ఒక వేళ రాజకీయ నాయకులు చెపుతున్నదే అభివృద్ధి అయితే వందలాది మంది ఏజెన్సీ ప్రాంతంలో ప్రతి సంవత్సరం మలేరియా బారిన పడి ఎందుకు మరణిస్తున్నారు? రాష్ట్రంలోని వివిధ ప్రాంతాల్లో ఉన్న ప్రజలు విద్య, వైద్యం, ఉపాధి కోసం హైదరాబాద్‌కే ఎందుకు రావాల్సి వస్తోంది? ఆయా ప్రాంతాల్లో ప్రజా ప్రతినిధులుగా ఎన్నికయిన నాయకులకు ఆ ప్రాంతాల ప్రజల మౌలిక అవసరాలు తీర్చాల్సిన బాధ్యత లేదా? అభివృద్ధి అనేది నాయకుల, వారి అనుయాయుల ఆస్తులు పెరగడమా? ప్రజల జీవన ప్రమాణాలు మెరుగుపడడమా?

1969లో జరిగిన తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర ఉద్యమంలో 369 మంది విద్యార్థులు పోలీసు కాల్పుల్లో తమ రక్తాన్ని చిందిస్తూ మరణించారు. కాని, నేడు తెలంగాణాలో మనల్ని పాలిస్తున్న రాజకీయ నాయకుల అవకాశవాద విధానాల వల్ల, ప్రభుత్వాలు కాలయాపన కోసం వేస్తున్న కమిటీల వల్ల విసుగు చెంది నిరాశ నిస్పృహలకు లోనై యువత ఆత్మహత్యల పాలయ్యారు. ఉద్యమాన్ని శాంతియుతంగా గాంధీ మార్గంలో సాగిస్తామన్న రాజకీయ నాయకులు ఆరు వందల మంది మరణానికి ఏం జవాబు చెబుతారు? వారి తల్లిదండ్రులు పడుతున్న హింసకు ఎవరు బాధ్యులవుతారు?

ప్రభుత్వాల మోసాల చిట్టాను గనుక పరిశీలిస్తే ఆంధ్ర రాష్ట్రంలో విలీనం కాబోమని 1954లో రాష్ట్రాల పునర్ వ్యవస్థీకరణ కమిషన్ ఎదుట తెలంగాణ ప్రజలు ప్రకటించిన నాటి నుండి మొదలైన చర్చ ఇప్పుడు శ్రీకృష్ణ వరకు మోసాల, కాలయాపనల చరిత్ర కొనసాగుతూనే ఉంది.

ఈరోజు తెలంగాణ ఉద్యమంలో అన్ని రంగాల వారు – పారిశుధ్య కార్మికుల నుండి మొదలుకొని పై ఆఫీసర్ల వరకు ప్రజలు జె.ఎ.సిలుగా ఏర్పడినారు. అన్ని తరగతుల ప్రజలు ముఖ్యంగా విద్యార్థిని, విద్యార్థులు చేసిన ఉద్యమానికి మహిళాలోకం, ప్రభుత్వ ఉద్యోగులు, లాయర్లు వెన్నుదన్నుగా నిలిచి పోరాటాన్ని ముందుకు తీసుకెళుతున్నారు. ఫిబ్రవరి 21,22,23 తేదీల్లో తెలంగాణలో జరిగిన పరిణామాలను గమనిస్తే మొత్తం రాష్ట్ర పాలనా వ్యవస్థ స్తంభించిపోయింది. ప్రభుత్వ ఉద్యోగుల సహాయ నిరాకరణలు కొనసాగుతూనే ఉన్నాయి. ఉద్యమాన్ని అణచివేయడానికి దేశ సరిహద్దుల్లో ఉండాల్సిన భద్రతా దళాలు బస్తీలపై (మాణిక్యేశ్వరి నగర్) ముఖ్యంగా ఉస్మానియా యూనివర్సిటీలో ఆ మూడు రోజులు రాత్రి 12 గంటల వరకు రబ్బరు బుల్లెట్ల శబ్దాలతో ఒక భయానకమైన వాతావరణాన్ని సృష్టించారు. యూనివర్సిటీలో కుప్పలుగా పేల్చిన రబ్బరు బుల్లెట్లు ఉన్నాయి. ఎంతో మంది విద్యార్థులు పోలీసు కాల్పుల్లో గాయపడి ఆస్పత్రుల్లో చికిత్స పొందుతున్నారు. అక్రమ కేసులు పెట్టి జైళ్లలో నిర్బంధించారు. తెలంగాణ ప్రాంతం మొత్తాన్ని పోలీసు క్యాంపుగా మార్చి ఉద్యమాన్ని అణిచి వేయాలనే కుట్రను కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు చేస్తున్నట్లుగా చాలా స్పష్టంగా తెలుస్తోంది.

ప్రత్యేక తెలంగాణ రాష్ట్రం కోసం కొనసాగుతున్న ఉద్యమం కోస్తాంధ్ర ప్రజలకు గాని, రాయలసీమ ప్రజలకు గాని, ఉత్తరాంధ్ర ప్రజలకు గాని వ్యతిరేకమైంది కాదు. సుదీర్ఘ కాలంగా సాగునీటి సమస్య, కరువు తదితర సమస్యల పరిష్కారంకోసం పోరాడుతున్న రాయలసీమ ప్రజలకు తెలంగాణ ప్రజలు ప్రతి సందర్భంలో తమ సంఘీభావాన్ని ప్రకటిస్తున్నారు. వెనుకబడిన ప్రాంతాల వనరులను కొల్లగొట్టి ఒక ప్రాంతం అభివృద్ధి చెందడం ఎలా న్యాయమవుతుంది? మన రాష్ట్రం ఆత్మహత్యల్లో దేశంలోనే రెండవ స్థానంలో ఉంది. దీనికి పరిష్కార మార్గాన్ని కనుగొనాల్సిన అవసరం లేదా? రాయలసీమ సామాన్య ప్రజల తరఫున గొంతెత్తుతున్న రాయలసీమ విద్యావంతుల వేదికకు ప్రేరణ తెలంగాణలో సుదీర్ఘకాలంగా జరుగుతున్న పోరాటాలేననే విషయాన్ని రాయల సీమ ప్రజలే చెపుతున్నారు. సమైక్యాంధ్ర పేరుతో ఉద్యమాలు చేస్తున్న నాయకులను అక్కడి దళిత, వెనుకబడిన వర్గాల ప్రజలు 'కలిసి ఉన్నప్పుడు మీరు మమ్మల్ని కలుపుకున్నదెప్పుడని, ఆత్మగౌరవాన్ని ప్రకటించినందుకే కారంచేడు, చుండూరు, పదిరికుప్పం, వేంపెంటలు మాకు మిగిల్చారు'ని అంటున్నారు. అభివృద్ధిలో భాగం చేసిందెప్పుడని నిలదీస్తున్నారు. రాష్ట్రం విడిపోతేనే దళిత బడుగు వర్గాల మనుగడకు అవకాశాలు పెరుగుతాయని అంటున్నారు. 'ఇలాంటి సమైక్యాంధ్ర మాకు అవసరంలేదు, అట్టడుగు వర్గాలకు న్యాయం జరిగే ప్రత్యేక ఆంధ్ర కావాల'ని కోరుకుంటున్నారు. ఆంధ్ర ప్రాంతంలోని దళిత మైనారిటీలు ప్రత్యేక తెలంగాణ ఉద్యమానికి మద్దతునిస్తూ ప్రజాస్వామికమైన స్ఫూర్తిని వ్యక్తంచేస్తున్నారు.

తెలంగాణలో సుదీర్ఘ కాలంగా ప్రజలు ప్రత్యేక రాష్ట్ర ఏర్పాటు కోసం బలంగా ఉద్యమిస్తున్నారు. ఇది ఒక ప్రజాస్వామిక ఆకాంక్ష తెలంగాణ రాష్ట్ర ఏర్పాటును సమర్థించాల్సిందే. ఎందుకంటే ప్రజలకు పాలన పరమైన సౌలభ్యం ఉంటుంది. స్థానిక వనరులు అక్కడి ప్రజలకు దక్కే అవకాశం కొంత ఉంటుంది. ఇంతకంటే తక్కువ జనాభా కలిగిన, వైశాల్యం రీత్యా కూడ తక్కువ ఉన్న చిన్న దేశాలు ఈ రోజు ఉన్నాయి. కాబట్టి వెనకబడిన ప్రాంతాలు ప్రత్యేక రాష్ట్రాలుగా విడిపోవడాన్ని ఒక ప్రజాస్వామికమైన హక్కుగా గుర్తించాల్సిన అవసరం ఉంది. ప్రజల మధ్య విద్వేషాలు రెచ్చగొట్టి రాజకీయ నాయకులు తమ అధికారాలను, ఆస్తులను కాపాడుకోవాలనుకుంటున్నారు. ఇదంతా పాలకులు సృష్టించిన వైరుధ్యమే కాని ప్రజల మధ్య వైరుధ్యం కాదు.

ఆంధ్రప్రదేశ్ నుండి తెలంగాణ ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పడినా తన రాజకీయ ఆర్థిక విధానాల్లో మౌలికమైన మార్పురానట్లయితే అలాంటి రాష్ట్రం ఏర్పాటువల్ల అట్టడుగు వర్గాలకు ఒరిగేది ఏమిఉండదు. ఆయా ప్రాంతాల్లోని సహజ వనరులు ఆ ప్రాంత వాసుల ప్రమేయంతో, ఆ ప్రాంత వాసుల అవసరాలను తీర్చేలా ఉండాలి. ఈ న్యాయమయిన డిమాండ్ కోసం అన్ని ప్రాంతాల ప్రజలు ఉద్యమించాల్సిన పరిస్థితి ఉంది. వాటికోసమే చరిత్ర పొడవునా జరుగుతున్న ఉద్యమాలను మనం గమనిస్తూనే ఉన్నాం.

గత నాలుగు దశాబ్దాలుగా సాగుతున్న ప్రత్యేక తెలంగాణ ఉద్యమాన్ని ప్రభుత్వాలు కమిటీల పేరుతో కాలయాపన చేస్తూ, ఉద్యమాలు తీవ్రంగా వచ్చినపుడు భద్రతా దళాలను ఉపయోగించి అణిచి వేస్తున్నాయి. ఉద్యమాలను ఎన్నికల ప్రయోజనాలకోసం ఉపయోగించుకుంటున్నాయి. ప్రజల ఆకాంక్షలు నెరవేరడంగాని, అసెంబ్లీ సమావేశాల్లో చర్చకు రావడంగాని లేదనే విషయం మొన్నటికి మొన్న జరిగిన అసెంబ్లీ సమావేశాల్లోనూ చూశాం. ఆలోచించు కోవాల్సింది ప్రజలే కాని మేం కాదనే విషయాన్ని చాలా స్పష్టంగా గత నాలుగు దశాబ్దాలుగా చెపుతూనే ఉన్నాయి మన రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు. ఇక అంతిమంగా తేల్చుకోవాల్సింది ప్రజలే.

*(రచయిత వీక్షణం సర్క్యులేషన్ మేనేజర్)* వీ

*ప్రజల నమ్మకాలు, భయాలు, అజ్ఞానం, అభద్రత, వారి అత్యవసర పరిస్థితులపైననే ఈ వ్యవస్థ మనుగడ కొనసాగిస్తోందనీ, అందులో భాగమే జ్యోతిష్యంపై వచ్చిన తీర్పనీ అంటున్నారు* **డి.వి. రామకృష్ణారావు**

# జ్యోతిష్యం శాస్త్ర విజ్ఞానమట!

**శా**స్త్రీయత, వాస్తవ పరిశీలనతో సంబంధం లేని, కేవలం నమ్మకాలపై ఆధారపడిన తీర్పును ముంబై హైకోర్టు 3 ఫిబ్రవరి 2011న ఒక ప్రజా ప్రయోజన వ్యాజ్యం విషయంలో వినిపించింది.

జ్యోతిష్కులు, తాంత్రికులు, వాస్తు చెప్పే వాళ్లపై చర్యలు తీసుకోవాలని, అటువంటివి అనుమతించకూడదని జనహిత మంచ్ అనే స్వచ్ఛంద సంస్థ తరఫున దాఖలైన ప్రజా ప్రయోజన వ్యాజ్యాన్ని చీఫ్ జస్టిస్ మోహిత్ షా, జస్టిస్ ఎస్.జె. వజీఫ్ దార్‌లతో కూడిన ధర్మాసనం కొట్టివేసింది. దీనిపై జడ్జీలు స్పందిస్తూ, 2004లోనే సుప్రీంకోర్టు జ్యోతిష్యంను శాస్త్రంగా పేర్కొందని అన్నారు. జ్యోతిష్యాన్ని కొన్ని యూనివర్సిటీలు పాఠ్యాంశంగా కూడా చేర్చాయని పేర్కొన్నారు. అత్యున్నత న్యాయస్థానం ఇచ్చిన ఆ తీర్పే మహారాష్ట్ర హైకోర్టుకు కూడా మార్గదర్శకం అని జడ్జీలు పేర్కొన్నారు.

కేంద్ర ప్రభుత్వం ఇప్పటికే జ్యోతిష్యాన్ని నాలుగు వేల సంవత్సరాల పురాతనమైన, నమ్ముతున్న విజ్ఞానంగా పేర్కొంది. ఔషధాలు, తాంత్రిక చికిత్సల (అభ్యంతరకర ప్రకటనల) చట్టం-1954 ఈ వ్యాజ్యం విషయంలో వర్తించదని పేర్కొంటూ, ఆ చట్టం పరిధిలోకి జ్యోతిష్యం, జ్యోతిష్య అనుబంధ శాస్త్రాలు రావని అంటూ, డా. ఆర్. రామకృష్ణ, డిప్యూటీ డ్రగ్ కంట్రోలర్ (ఇండియా), వెస్ట్ జోన్, అఫిడవిట్‌ను దాఖలు చేశారు.

జ్యోతిష్యం శాస్త్రీయతను ప్రశ్నిస్తున్న ఈ ప్రజా ప్రయోజన వ్యాజ్యాన్ని జనహిత మంచ్ కన్వీనర్ భగవాన్ జీ రైయినీ, అతనితోపాటు దత్తారాం కుమ్‌కర్‌లు మహారాష్ట్ర హైకోర్టులో వేశారు. జ్యోతిష్కుల ఊహాగానాలను సవాలు చేస్తూ, వాటిని నిషేధించాలని కోరారు. జ్యోతిష్యాలపై వ్యాసాలు, ప్రకటనలు, టి.వి. కార్యక్రమాలు, జ్యోతిష్యాన్ని పెంపొందించే, ప్రోత్సహించే పనులు, వాటికి అనుబంధంగా ప్రచారంలో ఉన్న వాస్తు, రీకీ, ఫెంగ్ షూ, తరోత్, హస్త సాముద్రికం, రాశీ ఫలాలు మొదలయిన వాటిని నిషేధించాలని కోరారు. తమ వంద పేజీల పిటిషన్‌లో ఇందిరా గాంధీ, చరణ్‌సింగ్‌లు ప్రధాన మంత్రులు అవడానికి సంబంధించి జ్యోతిష్కులు ఇచ్చిన అంచనాలు తప్పాయని, అందుకు భిన్నంగా ఉన్నాయని సోదాహరణంగా పేర్కొన్నారు.

కేంద్ర ప్రభుత్వ ప్రతినిధి, న్యాయవాది అద్వైత్ సేత్నా ఈ విషయంలో సుప్రీంకోర్టు పేర్కొన్నదే అంతిమం అన్నారు. మహారాష్ట్ర ప్రభుత్వ న్యాయవాది భరత్ మెహతా కూడా అదే అభిప్రాయాన్ని సమర్థించారు. 2004 సుప్రీం కోర్టు తీర్పు 'ట్రస్టెడ్ సైన్స్' అని అన్నప్పుడే ప్రముఖ భౌతిక శాస్త్రవేత్త యశ్‌పాల్ బలంగా ఖండించారు.

సందర్భం మహారాష్ట్ర తీర్పు అయినా, స్థూలంగా ఈ తీర్పు రాజ్యానికి మతంతో, మత భావనలతో ఉన్న సంబంధాన్ని వ్యక్తం చేస్తుంది. మన రాజ్యాంగ పీఠికలో 'సెక్యులర్', 'సోషలిస్ట్' వంటి అనేక విలువైన భావనలు పొందుపరుచుకుని 61 ఏళ్లు గడిచిపోయినా, ఆ దిశగా మన పాలకులు ఒక అడుగూ వేసింది లేదు. కుల, మత భావనలపై సమాజాన్ని మళ్లీ మళ్లీ చీల్చడం, ఆ సున్నితత్వాన్ని రెచ్చగొట్టడం, ప్రజల్ని నమ్మకాల ఆధారంగా విభజించి పాలించడం ఒక విధానంగానే కొనసాగుతోంది. మెజారిటీ మతాధిపత్యాన్ని కొనసాగించడంలో, నిలిపి ఉంచడంలో ప్రభుత్వాలు తమ వంతు పాత్ర నిర్వహిస్తున్నాయి. ప్రజాభిప్రాయం, ప్రజల విశ్వాసం అంటూ అశాస్త్రీయతను పెంచి పోషిస్తున్నాయి.

సెక్యులర్ భావన, లేక లౌకిక భావన అంటే ప్రభుత్వాలు పరిపాలనలో మత ప్రమేయం లేకుండా, ఆధ్యాత్మిక భావాల ప్రమేయం లేకుండా పాలన సాగించడం. రాజ్యాంగం శాస్త్రీయత మీద, న్యాయాన్యాయాల విచక్షణ మీద నడుచుకునే ఉద్దేశాన్ని ప్రకటించుకుంది. అన్ని మతాలను సమాన దూరంలో ఉంచాల్సింది పోయి, ఆధిపత్య మతాన్ని నెత్తికెత్తు కోవడంగా మన ప్రభుత్వాల, కోర్టుల పనితీరు ఉంది.

ప్రజల గుడ్డినమ్మకాలనూ, మూఢనమ్మకాలనూ పనిగట్టుకొని ప్రచారం చేయడంలోనూ, వాటిని కొనసాగించడంలోనూ ప్రభుత్వాలకు వెసులుబాటు దొరుకుతుంది. ప్రజలకు కార్యకారణ సంబంధాలు అర్థమై తమను ప్రశ్నించడం మొదలుపెడితే తమ పునాదులే కదిలిపోయే ప్రమాదం ఉంది. వాస్తవానికి మత నమ్మకాల వల్ల ప్రజలకు వారి జీవితంలో సమస్యలు ఏవీ పరిష్కారం కాకున్నా, ఆ మతం సహకారంతో పాలకులకు తమ అధికారం మాత్రం నిలిపి ఉంచుకునే, కొనసాగించుకునే అవకాశం కలుగుతోంది.

దేశ ప్రధాని, అధ్యక్షుల నుంచి మొదలు పెడితే గ్రామస్థాయి సర్పంచ్ వరకు నిత్య జీవితంలో అన్ని అధికార, అనధికార కార్యక్రమాలలో, ప్రభుత్వ, ప్రైవేట్ కార్యాలయాలలో ఆధిపత్య మత విశ్వాసాలు, వాటి ప్రమేయంతోనే కార్యక్రమాల నిర్వహణ జరుగుతోంది. బాబాల, స్వాముల పాదాలు మొక్కడం, గుళ్లు గోపురాల చుట్టూ ప్రదక్షిణలు చేయడం, పసుపు కుంకుమలు అద్దడం, టెంకాయలు పగులగొట్టడం, కోళ్లూ, మేకలూ బలి ఇవ్వడం, పాలాభిషేకాలు, తైలాభిషేకాలు, జలాభిషేకాలు ఇలా ఇవన్నీ అధికారికంగా,

అనధికారింగా జరిగిపోతూనే ఉన్నాయి. చివరికి రోదసిలోకి వదిలే రాకెట్ నమూనాను కూడా వెంకటేశ్వర స్వామి పాదాల వద్ద ఉంచి పూజలు చేయడం వంటివి చూసినప్పుడు మనం, మన సమాజం ఆలోచనల్లో ఎంత పరిణతి చెందామో సూచిస్తాయి.

పాలకవర్గాలు అధికారం మారినప్పుడల్లా వాస్తు ప్రకారం తమ కుర్చీలను, గదులను, వాహనాల నెంబర్లను మార్చడం, వాటికోసం కోట్లాది రూపాయల ప్రజాధనాన్ని వెచ్చించడం మనం చూస్తూ ఉన్నదే. తాము చేపట్టబోతున్న అధికారం, పదవి ద్వారా బోలెడు లాభాలు, కోట్లాది రూపాయల అక్రమ ఆస్తులు (ఎటువంటి సాక్ష్యాలు లేకుండా) సమకూరాలని చేసే పూజలు, ప్రార్థనలు తంతు లాగానే అనిపిస్తాయి.

కాస్త పరిశీలిస్తే మన అసెంబ్లీ చుట్టుపక్కల చెట్లనీడన చిలక జోస్యాలు చెప్పే వాళ్లు ఎప్పుడూ కనబడతారు. అత్యాధునిక సౌకర్యాలతో, అత్యున్నత సాంకేతిక సాధనాలతో ఏర్పాటయిన కార్యాలయాలు, హాస్పిటళ్ల గేటు వద్దే చిన్న చిన్న ప్రార్థనా మందిరాలు ఉంటాయి. ఇటీవల కర్ణాటక ముఖ్యమంత్రి యడ్యూరప్ప తనపై 'చేతబడి' జరిగినట్లు, దానికి తాంత్రిక పరిష్కారాల కోసం ప్రయత్నించినట్లు వార్తలు వచ్చాయి. ఈ ఉదాహరణాలన్నీ మతంతోనూ, నమ్మకాలతోనూ పెనవేసుకుపోయిన వ్యవస్థను సూచిస్తాయి.

శాస్త్రానికి, జీవితానికి సంబంధం లేకుండా చదివిన చదువుకు, నిత్యజీవిత ఆచరణకు సంబంధం లేకుండా, మొత్తంగా ప్రశ్నలు లేకుండా, సామాజిక స్థితి ఇలా ఎందుకు ఉంది అనే ఆలోచన రాకుండా, పకడ్బందీగా ఒక మూస ఆలోచనలో ప్రజలను నిలిపి ఉంచడంలో, కొనసాగించడంలో పాలకుల ప్రయోజనాలు ఇమిడి ఉన్నాయి. విద్యార్థుల పాఠ్యాంశాలను కూడా ఆధిపత్య మతానికి లోబడి మార్చి వేసిన చరిత్ర కూడా మనకు తెలుసు.

పాలనలో మత ప్రమేయం ఏనాటిదని చూస్తే అది అనాదిగా పాలకుల ఆధిపత్యాన్ని కొనసాగించడంలో, ఉత్పత్తిలోని మిగులును రకరకాల రూపంలో సేకరించడంలో ముఖ్యమైన భూమికను పోషించింది. హిందూ మతంలోకి జోక్యం చేసుకోమనే పేరిట కుల, మత నమ్మకాలను బ్రిటిష్ వాళ్లూ మరింతగా ప్రోత్సహించారు, వాటిని తమకు అనుకూలంగా వినియోగించుకున్నారు. సామాజిక పునాదిలోని ఉత్పత్తి శక్తులు, ఉత్పత్తి సంబంధాలను నిలిపి కొనసాగించడానికి ఉపరితలంలో మతం, విశ్వాసాలు, సంస్కృతి, రాజ్యాంగం, మొత్తంగా ఆలోచనా విధానం, ఒక భావజాల చట్రంగా రూపొందుతాయి. తమ శ్రమకు తగ్గ ఫలితం కావాలని శ్రామికులు అడిగితే ఈ జన్మలో రాకున్నా, ఫలితం వచ్చే జన్మ (?)లో రావచ్చనే భరోసాను, విశ్వాసాన్ని ఇస్తూ, కలగజేస్తూ సమస్యల పరిష్కారాలను వాయిదా వేయడమే వాటి ఉద్దేశం.

ముదునూరి భారతి గారు 'ఏడో సారా కథ – ఒక సమీక్ష' అనే వ్యాసంలో జీవితం అంటే ఏమిటి? అని ఒక ప్రశ్న వేసుకొని తాత్విక రంగంలో దానికి జవాబు చెబుతూ, ఒక ఆలోచనా చట్రాన్ని ఇస్తారు– జీవిత గమనాన్ని నిర్దేశించే శక్తులను చూసే పద్ధతిని మూడు రకాలుగా విభజిస్తారు. అవి 1) ప్రకృతి బాహ్యామైన మానవేతర శక్తుల నుంచి చూసే పద్ధతి – అంటే, దేవుడూ, దయ్యాలూ వగైరా జీవితంలోని సమస్యల పరిష్కారాల కోసం, సమాజంలోని మంచి చెడులకు, కష్టనష్టాలకు కారణం అని చూసే పద్ధతి; 2) మానవాతీత వ్యక్తుల వలన సమాజ గతి మారుతుందని చూసే పద్ధతి – అంటే, ఒక బుద్ధుడు, ఒక గాంధీ లాంటి మహనీయుల వల్ల సమాజం మారుతుందని చూసే పద్ధతి; 3) సామాజిక సమస్యలకు పరిష్కారాలు మనుషుల ద్వారానే అంటే మన ద్వారానే సాధ్యమవుతాయని, మనం సమాజాన్ని మార్చగలమని చూసే పద్ధతి. ఈ మూడు పద్ధతుల్లో మనం ఏ చట్రం నుంచి సమాజాన్ని చూస్తాం అనేది మన తాత్విక స్థాయిని బట్టి ఉంటుంది. ప్రభుత్వాలు, పాలకులు మాత్రం మానవ సామాజిక కార్యాచరణ వలన, మానవ శ్రమ వలన వచ్చిన ఫలితాలను, లాభాలను, సౌకర్యాలను, మిగులును తాము అనుభవిస్తూ, ప్రజల సమస్యలకు 'పరలోక పరిష్కారాలు', 'మరుజన్మ పరిష్కారాలు' చూపుతుంటారు. దేవుళ్లూ, దయ్యాలూ, తాయెత్తులూ పరిష్కారంగా చూపుతారు. ఎందుకంటే అందులోనే వారి మనుగడ ఇమిడి ఉంది.

మనిషి మనిషిగా రూపొందడానికి, ఈరోజు ఈ విధంగా పరిణామం చెందడానికి శ్రమ అత్యంత కీలకమని ఎంగెల్స్ సిద్ధాంతీకరించి శ్రమ పాత్రను వివరించాడు. అయితే, ఆ శ్రమను కించపరిచే, హీనపరిచే, మరుగునపరిచే, గుర్తింపు లేకుండా చేసే, ఆ శ్రమ కన్న గొప్పది ఇంకా ఏదో ఉందని చెప్పే ప్రయత్నంలో భాగంగానే మన మొత్తం భావజాలం రూపొందింది. ఉత్పత్తి శక్తులలో (మానవ శ్రమ + ఉత్పత్తి సాధనాలు) మానవ శ్రమ కీలకమనే అంశం నుంచి దృష్టి మరల్చే ప్రయత్నం ఈ మొత్తం క్రమంలో మనం చూడవచ్చు.

సామాజిక నిర్మాణాన్ని మానవ శ్రమ, తద్వారా వచ్చే ఉత్పత్తి, ఉత్పత్తి మిగులు, ఆ మిగులును మళ్లీ ఉత్పత్తిని పెంచడంలో వినియోగించడం, ఆ సమాజాన్ని అభివృద్ధి చేయడంగా కాక, వచ్చిన మిగులును, లాభాలను తరలించుకు పోవడం మనకు కనబడుతుంది.

మహారాష్ట్ర హైకోర్టు తీర్పుకు వస్తే, గతంలో సుప్రీంకోర్టు అయినా, ప్రస్తుతం మహారాష్ట్ర కోర్టు అయినా శాస్త్రీయత మీద కాకుండా, కార్యకారణాల మీద కాకుండా నమ్మకాలను పెంచి పోషించడంలో భాగంగానే, మత విశ్వాసాలను ముందుకు తీసుకెళ్లడంలో భాగంగానే ఇటువంటి తీర్పులు వెలువరిస్తున్నాయి. ఆధిపత్య మత నమ్మకాలను పలురూపాలలో ఉద్ఘాటిస్తున్నాయి.

రాజ్యం సెక్యులర్‌గా పరిణామం చెందడం కాకుండా, మళ్లీ మళ్లీ ఆధిపత్య మత భావజాలానికి, ఆయా వర్గాలకు దాసోహం అంటున్నాయి. ఆ స్వభావాన్ని ఇటీవలి భోపాల్, అయోధ్య తీర్పులలోనూ చూడవచ్చు. ఈ ధోరణి మొత్తం హిందూ ఆధిపత్య అనుకూల, సామ్రాజ్యవాద అనుకూల ధోరణే తప్ప మరొకటి కాదు. దానికి శాస్త్రీయతతో పనిలేదు.

మొత్తంగా మనం ఈ భావజాల చట్రాన్ని అర్థం చేసుకున్నప్పుడు పాలకులకు తమ పరిపాలన కొనసాగించడానికి, ప్రశ్నలు, ఆటంకాలు లేకుండా సజావుగా కొనసాగడానికి ప్రజల నమ్మకాలు, భయాలు, అభద్రత, అజ్ఞానం, వెనుకబాటు, అత్యవసర స్థితులే వారి మనుగడకు తోడ్పడుతున్నాయి. భయాలు విడిచిపెట్టడంతోనూ, ప్రశ్నలు వేయడంతోనూ, ప్రతీది ఇలాగే ఎందుకుందని పరిశీలించడంతోనూ, చొరవతోనూ, సాహసంతోనూ ఈ స్థితిని మనమే మార్చుకోగలం, మార్చుకోవాలి. అంతవరకు ఇలాంటి తీర్పులూ, వాటికి ఊతమిచ్చే భావజాలం కొనసాగుతూనే ఉంటాయి.

*(రచయిత వీక్షణం సహాయ సంపాదకులు)* వీ

మహిళా దినోత్సవం వచ్చిన చారిత్రక నేపథ్యాన్ని, అది తీసుకొచ్చిన ప్రశ్నలను, విలువలను, సాధించాల్సిన లక్ష్యాలను వివరిస్తున్నారు **కాత్యాయనీ విద్మహే**

# మహిళా దినోత్సవం - ఒక ఎరుక, హెచ్చరిక

మార్చ్ 8, అంతర్జాతీయంగా మహిళల కోసం గుర్తించబడిన రోజు. అట్లా గుర్తించబడి వంద సంవత్సరాలైన సందర్భం ఇది. మార్చ్ 8 స్ఫూర్తి ఈ వందేళ్ల ప్రస్థానంలో మహిళల జీవిత చైతన్యంలో తెచ్చిన అభివృద్ధిని గురించి ఆలోచించడం, అంచనా వేసుకోవడం ఇప్పటి అవసరం. ఈ క్రమంలో వ్యవస్థాగత వైఖరులు, విధానాలు ఏ విధంగా రూపొందాయో కూడా అర్థం చేసుకోవచ్చు.

పారిశ్రామిక విప్లవం తరువాత అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ వ్యవస్థ అవసరాలు, ఫ్రెంచ్ విప్లవం తరువాత విస్తృతమైన స్వేచ్ఛా స్వాతంత్ర్య ఆకాంక్షలు స్త్రీలను సామాజిక రంగాలలోకి ఎంతగా నడిపించాయో అంతగా ఉమ్మడి ప్రయోజనాలు కోసం సంఘటిత పడేట్లు కూడా చేశాయి. చట్టపరంగా, సామాజికంగా పురుషులతో పాటు స్త్రీలకు సమానత్వ స్థాయిని కల్పించాలన్న డిమాండ్‌తో స్త్రీల ఉద్యమాలు నిర్మించ బడ్డాయి. మరొకవైపు పరిశ్రమలలోకి కార్మికులుగా ప్రవేశించిన స్త్రీలు పని పరిస్థితులు, వేతనాల గురించి స్వీయ అనుభవాల నుండి చర్చించడం ప్రారంభించారు. స్త్రీల ఆరోగ్యం, లైంగికత, కుటుంబం మొదలైన అంశాలను 19వ శతాబ్దం చర్చకు పెట్టింది. ఈ నేపథ్యంలో సోషలిస్టు పార్టీ ఆఫ్ అమెరికా ప్రకటనను అనుసరించి యూనైటెడ్ స్టేట్స్‌లో 1909 ఫిబ్రవరి 28ని జాతీయ మహిళల రోజుగా గుర్తించి 1913 వరకూ దానిని అలాగే కొనసాగించారు. అదే సమయంలో అంతర్జాతీయ స్థాయిలో మహిళలను కూడగట్టడం గురించి క్లారా జెట్కిన్ చూపిన చొరవ వలన 1907లో స్టుట్‌గార్ట్‌లో అంతర్జాతీయ సోషలిస్టు మహాసభ జరిగింది. ఆ తరువాత మూడేళ్లకు 1910లో 'కోపెన్‌హాగెన్'లో జరిగిన రెండవ అంతర్జాతీయ మహాసభలో 'అంతర్జాతీయ మహిళాదినం' గురించిన ప్రతిపాదన చేసింది క్లారా జెట్కిన్. స్త్రీల హక్కుల కోసం జరుగుతున్న ఉద్యమాలను గౌరవించడానికి, స్త్రీలు సార్వత్రిక ఓటు హక్కును సాధించే విషయంలో తోడ్పడడానికి గుర్తుగా అంతర్జాతీయ మహిళా దినం ఉండాలన్నది ఆంతర్యం. పదిహేడు దేశాలకు చెందిన వంద మంది స్త్రీలు ఉన్న ఆ రెండవ అంతర్జాతీయ సోషలిస్టు మహాసభలో ఈ ప్రతిపాదనకు ఏకగ్రీవ ఆమోదం లభించింది. జాతీయ ప్రాదేశిక హద్దులతో పురా సాంస్కృతిక, ఆర్థిక, రాజకీయ భాషాపర భేదాలతో విడిపోయి ఉన్న స్త్రీ జనాభా సమస్తం ఆధునిక యుగంలో స్వేచ్ఛా సమానత్వాల కోసం, న్యాయం కోసం, శాంతి కోసం, అభివృద్ధి కోసం తమ జాతి భూగోళమంతటా చేస్తున్న పోరాట సంప్రదాయాన్ని గుర్తు చేసుకోవడానికి అందిపుచ్చుకోవడానికి ఒక ప్రతీకాత్మక వ్యక్తీకరణ అంతర్జాతీయ మహిళా దినం.

అంతర్జాతీయ మహిళా దినం మార్చ్ 8 నాడే ఎందుకయింది? న్యూయార్క్ వస్త్ర పరిశ్రమలో పనిచేస్తున్న స్త్రీలు 1857 మార్చ్ 8న పని పరిస్థితులకు, తక్కువ వేతనాలకు వ్యతిరేకంగా వీధులలోకొచ్చి నిరసన ప్రదర్శన జరిపారనీ, పోలీసులు దాడిచేసి దానిని చెదరగొట్టారనీ, ఆ సంఘటన జరిగిన యాభై ఏళ్ల సందర్భంగా 1907లో మార్చ్ 8న మళ్లీ ఒక స్మృతి సమావేశం జరిగిందని - అందుకనే మార్చ్ 8ని అంతర్జాతీయ మహిళా దినంగా ప్రాచుర్యంలోకి తీసుకొని వచ్చారని అంటారు. అంతర్జాతీయ సోషలిస్టు మహిళా సభ (కోపెన్‌హాగెన్) అంతర్జాతీయ మహిళాదినం గురించి ప్రతిపాదన చేసింది. కానీ అది కచ్చితంగా మార్చ్ 8 అని నిర్ధారించడం జరిగిందా అన్న విషయంలో సందేహం ఉంది. ఎందుకంటే 1910 ప్రతిపాదనను ఆమోదించిన తరువాత 1911లో ఆస్ట్రియా, డెన్మార్క్, జర్మనీ, స్విట్జర్లాండ్ వంటి దేశాలలో అంతర్జాతీయ మహిళా దినం లక్షలాది మంది స్త్రీ పురుషులు ఊరేగింపుగా మార్చ్ 19న జరుపుకొన్నది. ఓటు హక్కు, పనిచేసే హక్కు, వృత్తిపర శిక్షణ హక్కులను కోరుతూ ఉద్యోగాలలో వివక్షకు వ్యతిరేకంగా వాళ్లీ కార్యక్రమాలు నిర్వహించారు. వారం తిరగకముందే మార్చ్ 25న న్యూయార్క్ సిటీలో ట్రైయాంగిల్ షర్ట్‌వెస్ట్ ఫ్యాక్టరీ అగ్ని ప్రమాదంలో వస్త్ర పరిశ్రమలో పనిచేసే స్త్రీలు 140 మందికి పైగా మరణించారు. పనిచేసే చోట భద్రతా ఏర్పాట్లు సరిగా లేనందువల్లనే ఇలా జరిగిందన్నది ప్రపంచ మహిళల దృష్టిలో పడింది.

1913-14 మొదటి ప్రపంచ యుద్ధ కాలంలో శాంతి ఉద్యమంలో భాగంగా రష్యన్ స్త్రీలు ఫిబ్రవరిలో అంతర్జాతీయ మహిళా దినాన్ని జరుపుకొన్నారు. యుద్ధంలో రెండు మిలియన్ల సైనికుల మరణంతో ఆందోళన పడిన రష్యన్ స్త్రీలు 1917 ఫిబ్రవరి చివరి ఆదివారం ఆహారం కోసం, శాంతి కోసం (బ్రెడ్ అండ్ పీస్) సమ్మె తలపెట్టారు. రాజకీయ నాయకులు ఆ సమయంలో అది తగదన్నా వాళ్లు లక్ష్య పెట్టక ముందుకే సాగారు. జులియన్ కాలండర్ ప్రకారం ఆ చారిత్రక ఆదివారం ఫిబ్రవరి 23. జార్జియన్ కాలండర్ ప్రకారం అది మార్చ్ 8. సెంట్‌పీటర్స్‌బర్గ్‌లో జరిగిన ఈ ఫిబ్రవరి సమ్మెలో క్లారా జట్కిన్, అలెగ్జాండ్రా కొల్లంటాయ్ పాల్గొన్నారు. సోషలిస్టు విప్లవ విజయానంతరం ఏర్పడిన ప్రభుత్వంలో మంత్రిగా ఉన్న కొల్లంటాయ్ మార్చ్ 8ని కమ్యూనిస్టు పార్టీ అధికారిక సెలవుగా ప్రకటించాలని లెనిన్‌తో సంప్రదింపులు జరిపింది. సోవియట్ ప్రభుత్వ కాలంలో సాహసోపేత శ్రామిక మహిళను గౌరవించడంగా అంతర్జాతీయ మహిళా దినం కార్యక్రమాలుండేవి. ఈ రోజును పురస్కరించుకొని లెనిన్ రాసిన

రాతలు గమనించదగినవి. 'లాంఛనగత సమానత్వం కోసం మాత్రమే కాక స్త్రీలకు ఆర్థిక, సామాజిక సమానత్వం కోసం పోరాడడం శ్రామిక మహిళా ఉద్యమ ప్రధాన కర్తవ్యం' అని లెనిన్ స్పష్టం చేశాడు. సామాజిక ఉత్పాదక శ్రమలో భాగస్వామ్యం, గ్రహ బానిసత్వం నుండి విముక్తి లక్ష్యంగా సాగే దీర్ఘకాలిక పోరాటంగా మహిళా ఉద్యమాన్ని ఆయన గుర్తించాడు. మార్జ్ 8 అంతర్జాతీయ మహిళా దినం సందర్భంగా ఆ అవగాహననే ప్రజలలో పరివ్యాప్తం చేయడానికి ప్రయత్నించాడు. పెట్టుబడి శృంఖలాల నుండి శ్రమ విముక్తి కోసం జరిగే అంతర్జాతీయ స్వభావం గల కార్మికోద్యమంతో కలిపే ఆయన మహిళా ఉద్యమాన్ని దర్శించి చెప్పాడు. ఆ రకంగా మార్చ్ 8 అంతర్జాతీయ శ్రామిక మహిళా దినంగా ఒక రాజకీయ స్వభావంగల వ్యక్తీకరణంగా చరిత్రలో స్థిరపడింది.

సోవియట్ ప్రభుత్వ పతనానంతరం ఆర్మేనియా ప్రభుత్వం మార్చ్ 8న అంతర్జాతీయ మహిళా దినాన్ని రద్దు చేసి ఏప్రిల్ 7ను సౌందర్య మాతృత్వాల సన్మానోత్సవ దినంగా పరిగణిస్తూ జాతీయ సెలవును ప్రకటించింది. అయినా మార్చ్ 8ని అంతర్జాతీయ మహిళా దినంగా గుర్తించి జరుపుకోవడం ప్రజలు మానలేదు. ఈ రెండు మహిళా దినాల మీద ప్రజలలో విస్తృతంగా చర్చ జరిగింది. చివరకు మార్చ్ 8 నుండి ఏప్రిల్ 7 వరకు ఆ నెల కాలం 'మహిళా మాసం'గా గుర్తించబడింది.

మొత్తం మీద శతాబ్దాలుగా పురుషులతో సమానంగా సామాజిక రాజకీయ, ఆర్థిక ఉద్యమాలలో పాల్గొంటూ చరిత్రను నిర్మిస్తున్న సాధారణ స్త్రీల జీవితాల నుండి, అనుభవాల నుండి స్ఫూర్తిని తరువాతి తరాల వాళ్లకు అందించాలన్న అంతర్జాతీయ ఆకాంక్షకు అభివ్యక్తి మార్చ్ 8. మరీ ముఖ్యంగా శ్రామిక మహిళల విమోచన లక్ష్యంగా ఆర్థిక సామాజిక సమానత్వం కోసం పోరాటమే కర్తవ్యంగా ఒక రాజకీయ పదునును సంతరించుకున్నది మార్చ్ 8. సామాజిక అభ్యుదయాన్ని, స్త్రీల జీవితంలో అభివృద్ధిని కోరుతూ సాగే అన్ని రకాల ఉద్యమాలలో సాధారణ స్త్రీలు అత్యంత ధైర్య సాహసాలతో కృతనిశ్చయంతో నిర్వహించిన అసాధారణ పాత్రను స్మరించుకునేందుకు ప్రతి దేశంలో ప్రతి సంవత్సరం అంతర్జాతీయ మహిళా దినంగా నిర్వహించుకునేందుకు ఉద్దేశించబడిన రోజు మార్చ్ 8. జీవితంలో ప్రతి కోణంలో ప్రతి అంశంలో స్త్రీ సమానతను సాధించడానికి కొనసాగింపచేయడానికి అవసరమైన నిరంతర హెచ్చరికగా, నిఘాగా ఉంటూ కార్యాచరణను గురించి గుర్తు చేయడం మార్చ్ 8 లక్ష్యం.

1945లో ఐక్యరాజ్య సమితి ఏర్పడడంతో మార్చ్ 8 లక్ష్యానికి విస్తృత స్థాయిలో అంతర్జాతీయ స్వభావం గల అధికారిక మద్దతు లభించినట్లయింది. జండర్ సమానతను ప్రాథమిక మానవ హక్కుగా గుర్తిస్తూ ఐరాస తయారు చేసిన అంతర్జాతీయ ఒడంబడిక వల్ల అది సాధ్యమైంది. జండర్ సమానత సాధనకు ప్రపంచానికంతా ఒకేరకమైన వ్యూహాలు, ప్రమాణాలు, కార్యక్రమాలు, లక్ష్యాలు ఏర్పర్చడానికి ఇది దోహదపడింది. సమాజానికి ప్రమాదకరంగా, భయావహంగా తయారైన రాజకీయార్థిక, సాంస్కృతిక సమస్యలకు పరిష్కారం స్త్రీల భాగస్వామ్యంతో కూడిన నిర్మాణాత్మక కార్యక్రమాలవల్ల, స్త్రీల సాధికారత వల్ల మాత్రమే సాధ్యమవుతుందన్న సూత్రం పైన యుఎన్ఒ పని విధానం విస్తరించింది. ఆ రకంగా ప్రతిదేశం స్త్రీల స్థితిగతులను మెరుగుపరచడానికి తగిన చర్యలు తీసుకొంటూ ఎప్పటికప్పుడు వాటి ఫలితాలను బేరీజు వేసుకొంటూ ముందుకు సాగడమే కాక ఐక్యరాజ్య సమితికి దేశీయ స్త్రీల అభివృద్ధి విషయంలో బాధ్యత వహించవలసి వచ్చింది. మహిళల స్థితిగతులపై ప్రపంచ వ్యాపిత సమీక్షను ఆశించి 1975ను అంతర్జాతీయ మహిళా సంవత్సరంగా ప్రకటించడం, దానిని దశాబ్దిగా పొడిగించడమూ జరిగింది.

ఇందులో భాగంగానే 1979 డిసెంబర్‌లో ఐక్యరాజ్య సమితి సర్వ సభ్య సమావేశం స్త్రీలకు వ్యతిరేకంగా ఉన్న అన్ని రకాల వివక్షతలను తొలగించేందుకు ఒక విధానాన్ని సూత్రప్రాయంగా ఆమోదించింది. కన్వెంషన్ ఆన్ ది ఎలిమినేషన్ ఆఫ్ ఆల్ ఫార్మ్స్ ఆఫ్ డిస్క్రిమినేషన్ అగెన్స్ట్ వుమెన్ (సిఇడిఎడబ్ల్యు) అనబడే ఆ విధానం ఇరవై దేశాల ఆమోదంతో 1981 సెప్టెంబర్ నాటికి అంతర్జాతీయ ఒప్పంద స్థాయికి చేరుకున్నది. 1989 నాటికి వంద దేశాలు ఈ ఒప్పంద పరిధిలోకి వచ్చాయి. మరి నాలుగు సంవత్సరాలకు భారతదేశం (1993) కూడా ఇందులో భాగమైంది.

ఈ నేపథ్యంలోనే 1975 తరువాత మార్జ్ 8 అంతర్జాతీయ మహిళా దినోత్సవంగా ప్రత్యేక ప్రాధాన్యతను సంతరించుకొంది. స్త్రీలకు అనుకూలమైన చట్టాల గురించి, పౌరహక్కుల గురించి, పునరుత్పత్తి విధుల గురించి, కుటుంబ సంబంధాల గురించి, స్త్రీ పురుష సంబంధాలను ప్రభావితం చేసే పితృస్వామిక సంస్కృతి గురించి స్త్రీ పురుషులలో కొత్త తెలివిని, చైతన్యాన్ని పెంపొందించే రకరకాల కార్యక్రమాలతో మార్చ్ 8ని అంతర్జాతీయ మహిళా దినంగా జరుపుకోవడం అన్ని దేశాలలోనూ ఎక్కువైంది. ఎక్కడికక్కడ స్త్రీలు చిన్న సమూహాలుగా సమీకృతం కావడం, సమస్యల మీద పోరాడడం, చట్టాలలో మార్పుకు, కొత్త చట్టాల ఏర్పాటుకు ప్రభుత్వాల మీద ఒత్తిడి తేవడం, దేశ చరిత్రలో భాగమైంది. దేశాలు స్వతంత్రం కావడం, జాతులు విముక్తం కావడం, సోషలిస్టు ప్రభుత్వాలు ఏర్పడడం ఇవి మాత్రమే స్త్రీ సమస్యకు పరిష్కారం ఇయ్యలేవనీ, సమాంతర స్వతంత్ర ప్రతిపత్తిగల మహిళా ఉద్యమ నిర్మాణం అవసరమనే కొత్త అవగాహన పెరిగింది.

మహిళల ఆకాంక్షలు, అవసరాలు, ఉద్యమాలు, జాతీయ అంతర్జాతీయ మహిళా చట్టాలు, విధానాలు, మార్చ్ 8 పరస్పర కార్యకారణ సంబంధాలతో ప్రవర్తిస్తూ జండర్ వివక్షను తొలగదోసి సమానతా దిశగా సమాజాన్ని నడిపేందుకు చోదకశక్తులవుతున్నాయి. 1995 బీజింగ్ సదస్సులో మహిళా సాధికారతా భావన పొటమరించడం, సాధికారతా స్థాయిని అంచనా వేసేందుకు జండర్ అభివృద్ధి సూచిక, మహిళా సాధికారతా కొలమానం రూపొందడం, 2000 సెప్టెంబర్‌లో ఐక్యరాజ్య సమితి నిర్వహించిన న్యూ మిలీనియం సమ్మిట్ ప్రపంచాన్ని మానవీయ సమాజంగా మార్చడానికి ప్రకటించిన ఎనిమిది లక్ష్యాలలో రెండు ప్రత్యేకించి జండర్ సమానత, మహిళా సాధికారతలకు సంబంధించినవి కావడం, భారతదేశం మహిళా సాధికారతకు సంబంధించిన జాతీయ విధానాన్ని రూపొందించి 2001ని మహిళా సాధికారతా సంవత్సరంగా ప్రకటించడం, ఈ మధ్యకాలంలో జరిగిన అనేకానేక దేశీయ, ప్రాంతీయ మహిళా ఉద్యమాలు ఫలితంగా వచ్చిన గృహహింస నుండి రక్షణ వంటి చట్టాలు – ఇవన్నీ స్థానికతకూ, దేశానికీ, ప్రపంచానికీ మధ్య ఒక ఎడతెగని సంభాషణగా సాగుతున్న మహిళా భ్యుదయాన్ని గురించిన ఆలోచన ఆచరణల క్రమాన్ని సూచిస్తాయి. మార్చ్ 8ని అంతర్జాతీయ మహిళా దినంగా జరుపుకోవడానికి ప్రతి యేడూ ఏదో ఒక సామాన్యాంశాన్ని నిర్ధారించడం ఈ గొలుసులో భాగమే.

జండర్ సమానత, సమాన హక్కులు ప్రపంచ పురోగమనానికి మొదటి షరతులు కనుక వాటి గురించి అనుకూల భావజాల ప్రచారానికి అనువుగా 1998, 2003, 2005, 2010 లలో మార్చ్ 8కి అవే దృష్టి కేంద్రీకరించవలసిన అంశాలయ్యాయి. స్త్రీలు కూడా మానవులే కనుక స్త్రీల హక్కులన్నీ మానవ హక్కులేనన్న అవగాహన కలిగించడం పురుషులతో పాటు పౌరహక్కులన్నీ స్త్రీలు కూడా అనుభవించవలసినవే నన్న జ్ఞానాన్నియ్యడం, ఆ క్రమంలో జరిగే ఉద్యమాలకు మద్దతు కూడగట్టడం పై ప్రపంచమంతా ఏకకాలంలో పనిచేయాడనికి అవకాశం కల్పించింది.

జండర్ సమానతను ఆచరణ వాస్తవం చేసుకోవడానికి, సమాన హక్కులను అనుభవంలోకి తెచ్చుకోవడానికి సమాజంలో పెద్ద అవరోధం స్త్రీల మీద నిత్యం నిరంతరం జరుగుతున్న హింస. అధీన అధికార సంబంధ వ్యవస్థ దీనికి కారణం. దీనిని నిర్మూలించుకోవాలనే జ్ఞాన చైతన్యాలు ఇయ్యడానికి ఐరాస మార్చ్ 8కి దానిని ప్రధానాంశం చేసింది. 1999, 2007, 2009లలో స్త్రీలపై హింసకు మతం, యుద్ధం మొదలైనవన్నీ కూడా కారణాలే. మతాధికారాలు స్త్రీలను అభివృద్ధి అవకాశాల నుండి దూరం చేస్తుంటే, యుద్ధం స్త్రీలపై ఆధిపత్య స్థాపన రూపంలో హింసకు అవకాశం ఇయ్యడమే కాక పరిణామంలో స్త్రీలను ఒంటరివాళ్లను, నిర్వాసితులను కూడా చేస్తుంది. ప్రపంచమంతటా ఇదొక తీవ్ర సమస్యగా మారింది. కనుకనే ప్రత్యేకించి అఫ్ఘన్ స్త్రీల సమస్యను, నిర్వాసిత స్త్రీల సమస్యను, శాంతిని గురించి ఆలోచించడానికి ప్రేరకంగా ఐరాస 1997, 2000, 2001, 2002, 2010 లలో గ్లోబల్ థీములను సూచించింది. విద్య, శిక్షణ, శాస్త్ర సాంకేతిక రంగాలలో ప్రవేశానికి సమాన అవకాశాలుండడం స్త్రీలకు గౌరవకరమైన పని కల్పించడానికి రహదారి అనే అంశం 2011 మార్చ్ 8కి గ్లోబల్ థీముగా ఇయ్యబడింది.

1995 నుండి సాధికారత గురించి ఆలోచిస్తున్నా 2000లలో మానవీయ సమాజ నిర్మాణానికి మహిళా సాధికారత ఒక షరతని గుర్తించినా 1996 నుండి 2011 వరకు పదహారేళ్ల కాలం మీద ఐరాస దీనిని ఒక్కసారైనా గ్లోబల్ థీముగా ప్రకటించకపోవడం గమనించ దగింది. సాధికారత నిర్ణయాధికారం మీద ఆధారపడింది. నిర్ణయాధికారాన్ని గురించి 2006లో మాత్రమే ప్రస్తావించడం జరిగింది. 2011లో కూడా విద్య, శాస్త్ర సాంకేతిక రంగాలలో స్త్రీల ప్రవేశానికి సమాన అవకాశాల కోసం ఆలోచించే స్థితిలోనే ప్రపంచం ఉందంటే సాధికారత ఇంకెంత దూరమో ఊహించవచ్చు.

ఐరాస ఆయా సంవత్సరాలలో మార్చ్ 8కి సూచించే అంశాలు ప్రపంచ వ్యాపిత ఆలోచనల ప్రసారానికి మాత్రమే. అది సూచించిన అంశం కంటే భిన్నమైన, ప్రత్యేకమైన సమస్యలు ఆయా దేశాలలో ప్రాంతాలలో ఉండవచ్చు. ప్రాధాన్యతల క్రమంలో కూడా భేదం ఉండవచ్చు. సందర్భాలు, అవసరాలు మార్చ్ 8 కి ఏ అంశం మీద పనిచేయాలో నిర్దేశిస్తుండవచ్చు. అందువలన 'అంతర్జాతీయంగా ఆలోచించడం స్థానికంగా పనిచేయడం' అనేది మార్చ్ 8 ఇచ్చే సందేశం.

మార్చ్ 8 అంతర్జాతీయ మహిళా దినంగా గుర్తించబడి వంద సంవత్సరాలైనా భారతదేశంలో ఇది 1960వ దశకపు గుర్తింపు ఉద్యమాల అంతర్జాతీయ ప్రభావాల నుండి గత నలభై ఏండ్లుగా ఎక్కువ ప్రాచుర్యంలోకి వచ్చింది. స్వాతంత్ర్యోద్యమంలో, రైతాంగ ఉద్యమాలలో, గిరిజన ఉద్యమాలలో భాగస్వాములై పొందిన అనుభవాల నుండి చైతన్య వంతులైన స్త్రీలు స్త్రీల గురించి ప్రత్యేకంగా నిర్మింపబడవలసిన ఉద్యమాల గురించి ఆలోచించడంతో సంఘటితం కావడంతో, సంఘాలుగా ఏర్పడడంతో తమ ఆశయాల అభివ్యక్తీకరణకు మాధ్యమంగా మార్చ్ 8 అంతర్జాతీయ మహిళా దినాన్ని తమదిగా చేసుకొన్నారు. ఆ రకంగా 1970లలో అంతర్జాతీయ మహిళా దినం సందర్భంగా ఆడపిల్లలను, మహిళలను సమీకరించి స్త్రీల సమస్యలపైన అవగాహన కలిగించే సభలు, సమావేశాలు నిర్వహించడం మొదలైంది. ప్రత్యేకించి ఆంధ్రప్రదేశ్‌లో హైదరాబాద్ కేంద్రంగా పనిచేసిన అభ్యుదయ స్త్రీల సంఘం (1974), స్త్రీ శక్తి సంఘటన (1977), మహిళాభ్యుదయ సంస్థ (1980), ఫెమినిస్ట్ స్టడీ సర్కిల్ (1987), అన్వేషి, అస్మిత (1992), వరంగల్ నుండి పనిచేసిన స్త్రీ జనాభ్యుదయ అధ్యయన సంస్థ (1982) వంటివి స్త్రీ సమస్యలకు కారణమైన పితృస్వామిక అధికార రాజకీయాలను కుటుంబ హింసను, రాజ్యహింసను సంబోధిస్తూ మధ్యతరగతి స్త్రీల చైతన్యాన్ని పెంచే లక్ష్యంతో చర్చలు పెట్టాయి. అదే సమయంలో వామపక్ష పార్టీలు స్త్రీల సమస్యల మీద పనిచేయడానికి ప్రత్యేకంగా స్త్రీల సంఘాలను నిర్మించాయి. ప్రగతిశీల మహిళా సంఘం, ఆంధ్రప్రదేశ్ మహిళా సమాఖ్య, ఆంధ్రప్రదేశ్ మహిళా చైతన్య సమాఖ్య మొదలైన సంఘాలు ఆ రకంగా ఏర్పడి శ్రామివర్గ దృక్పథం నుండి స్త్రీ సమస్యను చర్చకు పెట్టాయి. ఆంధ్రప్రదేశ్‌లో స్త్రీల సంఘాల జాబితా ఈ కాలంలో చాలా పెద్దది. చిన్న సమావేశాలకు, బృందాలకు పరిమితమై స్థానిక అవసరాలను, ప్రజల చైతన్యాన్ని బట్టి అప్పటికప్పుడు ఏర్పడినవి అనేకం. వాటిల్లో కొనసాగుతున్నవీ ఉన్నాయి. ఆగిపోయినవీ ఉన్నాయి. సంఘాలు ఎన్నయినా ఎంతకాలం పనిచేసినా అవి విడివిడిగా పనిచేస్తూనే ఉన్న అవకాశాలను బట్టి, అవసరాలను బట్టి మార్చ్ 8 కార్యక్రమాల నిర్వహణలో ఐక్యం కావడమూ ఉంది. అదే విధంగా దేశ విదేశీ నిధులతో ఏర్పడిన స్వచ్ఛంద సంస్థలు, ప్రభుత్వ విధానాల అమలుకు ఏజెంట్లుగా పనిచేసే నాన్ గవర్నమెంటల్ ఆర్గనైజేషన్స్ (ఎన్.జి.ఒ.)లు కూడా మహిళా సమస్యల మీద కేంద్రీకరించి పనిచేసినవి అనేకం ఉన్నాయి. మార్చ్ 8ని ఏదో ఒక రూపంలో నిర్వహించే పని ఆ సంస్థలు కూడా చేపట్టాయి. ఇక ప్రభుత్వాలు సరే సరి. జాతీయ ఆకాంక్షలు, అంతర్జాతీయ ఒత్తిడిలతో స్త్రీల అభివృద్ధి లక్ష్యంగా ప్రత్యేక పథకాలు రూపొందించిడమే కాదు, మార్చ్ 8ని స్వంతం కూడా చేసుకున్నాయి. స్త్రీ, శిశు సంక్షేమ శాఖ బాధ్యులు, స్థానిక అధికార వర్గం అంతర్జాతీయ మహిళా దినాన్ని పాటిస్తూ మార్చ్ 8న ఏవో కొన్ని కార్యక్రమాలను నిర్వహించడం పరిపాటయింది.

మరొకవైపు పార్లమెంటరీ ప్రజాస్వామ్య ప్రభుత్వాలపై, ప్రజా వ్యతిరేక విధానాలపై ఎక్కుపెట్టిన సాయుధ విప్లవోద్యమంలోనూ మార్చ్ 8న అంతర్జాతీయ మహిళా దినంగా పాటించడం ఉంది. డివిజన్ల వారీగా సభను నిర్వహించడం, పితృస్వామ్యం, మతోన్మాదం, సామ్రాజ్యవాద సంస్కృతి వంటి వాటిమీద చర్చించుకోవడంతో పాటు, స్థానిక తెగలలో పితృస్వామిక పీడన రూపాలను గుర్తించడం, వాటిపై చైతన్యం కలిగించి మహిళా ఉద్యమాలను నిర్మించడం జరుగుతున్నది. మహిళ లేని విప్లవం గెలవబోదు అన్నది వారి అవగాహన. మార్చ్ 8 పోరాట వారసత్వాన్ని కొనసాగిద్దాం అన్నది వారి నిబద్ధత. ఇది ఈనాటి దేశీయ ప్రాంతీయ ముఖచిత్రం.

ఇందువల్ల ఒక మంచి జరిగింది. స్త్రీలు, విద్యార్థులు, ఉద్యోగులు, మేధావులు, ఉద్యమకారులు స్త్రీ సమస్యను ఏకశిలా సదృశ్యంగా కాక చలన చైతన్యాలతో బహుముఖాలతో సంక్లిష్టంగా ఉన్న సంవాదంగా

అర్థం చేసుకోగలిగారు. స్త్రీల ఆశలకు, ఆకాంక్షలకు, అస్తిత్వ చేతనకు స్థలం సమకూరుస్తూ వ్యవస్థలను, ఉద్యమాలను విస్తృతీకరించడం ఇందువల్ల సాధ్యమైంది. విద్యా ఉద్యోగ రంగాలలో, స్థానిక ప్రభుత్వ పాలనలో స్త్రీలకు 33 శాతం సీట్లను కేటాయించడమైనా, రాజ్యహింసతో పాటు ఎదుర్కొనవలసిన ప్రాధాన్యత కల సమస్యగా కుటుంబ హింసను గుర్తించి పౌరహక్కుల ఉద్యమాన్ని విస్తరిండమైనా ఇందులో భాగంగా జరిగిందే. వరకట్నపు హత్యలు, భ్రూణహత్యలు, పనిచేసే చోట లైంగిక వేధింపులు మొదలుకొని ఉత్పత్తి విధానాల వల్ల సంబంధాల వల్ల పీడనకు, దోపిడీకి గురయ్యే మహిళల జీవన్మరణ పోరాటాలు అన్నీ స్త్రీ సమస్యకున్న బహుముఖ పార్శ్వాలన్న అవగాహనను కలిగించడంతో మార్చ్ 8 సభలు, సమావేశాలు, కరపత్రాలు, ప్రత్యేక రచనలు నిర్వహించిన పాత్ర తక్కువదేమీ కాదు. పితృస్వామిక అధికారానికి రాజ్యాధికారానికి ఉన్న అవినాభావ సంబంధాన్ని కూడా రంగం మీదికి తెచ్చాయి ఇవి.

పితృస్వామ్యాన్ని, రాజ్యాన్ని, వాటికి పునాదిగా ఉన్న ఆర్థిక నిర్మాణాలను, అభివృద్ధి నమూనాలను ఏక కాలంలో ప్రశ్నించడం, ఎదుర్కొనడం మహిళా ఉద్యమ కర్తవ్యాలన్న దృక్పథం బలపడడానికి ఈ చరిత్ర అంతా సహాయకారి అయింది.

ఈ నేపథ్యంలో స్త్రీ పురుష అసమానతలకు వ్యతిరేకంగా పనిచేసే వారందరికి తదితర అన్ని రకాల అసమానతల పట్ల వ్యతిరేక వైఖరి ఉండాలన్న దృక్పథం అభివృద్ధి చెందింది. వర్ణ, ప్రాంత, వర్గ అసమానతలపై నిర్మాణమవుతున్న ఉద్యమాల పట్ల సహనం, ఆ ఉద్యమాలతో సంఘీభావం ఒక అనివార్య అంశంగా ముందుకు వచ్చింది. ఫలితంగా స్త్రీ సమస్య వర్ణ, వర్గ, ప్రాంత వ్యత్యాసాలను బట్టి భిన్న భిన్నంగా ఉంటుందన్న చైతన్యం పెరిగింది. భిన్న అస్తిత్వ చైతన్యాల జీవితానుభవాల, సామాజిక అవసరాల, ఒత్తిడుల దృష్ట్యా స్త్రీ సమస్య పరిధి విస్తృతమవుతూ వస్తున్నది. ఆయా సమస్యల గురించి అవగాహనను, అభివృద్ధి పరచడానికి పరిష్కార దిశగా నడవడానికి మహిళా ఉద్యమాలు కొత్త శక్తిని పుంజుకొనడంలోనే సజీవమూ, నిరంతరమూ అవుతాయి. ఉద్యమాలలో స్త్రీ భాగస్వామ్యం గురించి చర్చ మాత్రమే కాదు, ఉద్యమాలు అవి ఏవైనా స్త్రీల ప్రయోజనాలకు ఇచ్చే ప్రాధాన్యతా ప్రాధాన్యతల దృష్ట్యా విమర్శకు గురికావడం, ఈ శతాబ్ది కాలపు మరొక ముఖ్యలక్షణం.

ఈ విధంగా మార్చ్ 8 స్ఫూర్తి బలీయమవుతున్న ఈ వందేళ్ల కాలంలోనే దాని రాజకీయ పదునును అభావం చేసి సారంలేని వట్టి రూపంగా దానిని మిగిల్చిన విషాద సందర్భం కూడా సమకూడింది. స్త్రీ విముక్తి గురించి దృక్పథం పూర్తిగా మరుగునపడి స్త్రీలను ప్రశంసించడానికి, ఆర్థిక, రాజకీయ, సామాజిక రంగాలలో విజయాలు సాధించిన స్త్రీలను సన్మానించడానికి ఒక సందర్భంగా మాత్రమే అది కొనసాగుతున్నది. స్త్రీలకు మార్చ్ 8 సందర్భంగా అభినందలు చెప్పడానికి, పూలు, పండ్లు తదితర చిన్న చిన్న బహుమతులు ఇయ్యడానికి పరిమితమవుతున్నది. స్త్రీలలో ఉన్న శక్తులను బహిర్గతం చేయడం నెపంగా ఆటలు, పాటలు, వంటలు, ముగ్గులు, అందాలు మొదలైన వాటిల్లో పోటీలు పెట్టడంగా ఇది కుంచించబడింది. మార్చ్ 8 స్త్రీల పండుగ అయిపోయింది. స్త్రీలు పార్టీలు చేసుకోవడం అందులో భాగమే. ట్రిచ్చి వంటి చోట్ల గృహిణుల క్లబ్బులు ఏర్పడి మార్చ్ 8ని నిర్వహించడం ఈ ధోరణిలోనే సాగుతున్నది. కంచిపురం సిల్కు చీరలు కట్టుకొని స్త్రీలు ప్రదర్శనలియ్యడం సంప్రదాయ సౌందర్యాతిశయాన్ని తెలుపుతుందని, సైకిల్‌పై ప్రయాణిస్తూ ట్రెజర్ హంట్‌లో పాల్గొనడం, ఆధునిక స్త్రీల ఆశలను, ఆత్మవిశ్వాసాన్ని, శక్తిని తెలియజేస్తుందని ఇక్కడి కార్యక్రమాల గురించి చెప్పబడుతున్న విషయాలు మొత్తంగా మార్చ్ 8 సారాన్ని అపహాస్యం చేసేట్లు ఉండడం గమనించదగింది. ఈ విధమైన మార్చ్ 8 కార్యక్రమాలకు స్థానిక వ్యాపారవేత్తలు ఆర్థిక పోషకులుగా ఉంటారంటేనే మార్చ్ 8 ఒక వినోదంగా మారిపోయిందని అర్థం. ఫ్యాషన్ షోలు, వస్తు ప్రదర్శనలు కార్యక్రమంగా వంట పొయ్యి ప్రాజెక్టుల సహకారంతో సాగే మార్చ్ 8 ఈనాడు ఉత్సవమే కానీ ఉద్యమం కాదు.

కార్పొరేట్ సంస్కృతిలో మార్చ్ 8న బహుళజాతి సంస్థలకు తమ ఆఫీసుల్లో పనిచేసే స్త్రీల కంప్యూటర్ బల్లమీద వాళ్లు వచ్చేసరికి ఒక గులాబీ పువ్వు నుంచి అభినందించడం ఒక సంప్రదాయం అయింది. ఏ మధ్యాహ్నమప్పుడో స్త్రీలకు ఒక సమావేశాన్ని నిర్వహించినా కుటుంబ బాధ్యతలకు భంగం లేకుండా ఉద్యోగ బాధ్యతలను ఎలా నిర్వహించు కోవాలో, అలా నిర్వహించుకోలేక ఒత్తిడికి లోనవుతున్నప్పుడు దాని నుండి విముక్తికి ఏ పద్ధతులు పాటించాలో చెప్పున్న ఉదంతాలున్నాయి. ఇంటి పని నుండి విముక్తి అన్న లక్ష్య సాధన నుండి ఎక్కడో ఎప్పుడో తప్పిపోయి ఒత్తిడులు నుండి విముక్తికి మార్గాలన్వేషించడమంటే మూలాలను విస్మరించడమే.

ఇక ప్రభుత్వాధికారుల నిర్వహణలో మార్చ్ 8 ఒక ఫార్సుగా మారిపోయింది. చిత్తశుద్ధిగానీ చరిత్ర గురించిన అవగాహన గానీ, స్త్రీ విముక్తి గురించిన దృక్పథంగానీ లేని అధికార యంత్రాంగం స్త్రీ సంక్షేమ పథకాలను వల్లె వేయడమే తప్ప వాటి అమలు సాధ్యాసాధ్యాలను గురించి ఆలోచించదు. మాట్లాడదు. ఒక స్త్రీ ఎదుగుదలను స్త్రీల అభివృద్ధిగా మాయచేసి చెప్పడం, పంచాయతీరాజ్య రాజకీయాలలో స్త్రీలను స్వతంత్రంగా ఎదగనీయకుండా చేస్తున్న పితృస్వామ్య అధికార రాజకీయ ధోరణులకు పెడమొగం పెట్టడం ఇవన్నీ మార్చ్ 8 స్ఫూర్తిని అభావం చేసే హీన సంస్కృతినే ప్రదర్శిస్తున్నాయి.

అంతర్జాతీయ శ్రామిక మహిళా దినం కాస్తా అంతర్జాతీయ మహిళా దినోత్సవంగా మారిపోవడం చాప కింద నీరులా చల్లగా జరిగిపోయింది. నూతన ఆర్థిక విధానాలు అమలయిన తరువాత వస్తు వినియోగ సంస్కృతి వ్యాప్తికి, వ్యాపారనికి కూడా మార్చ్ 8 ఒక ఉపకరణం అయింది. దృశ్య మాధ్యమంలో మార్చ్ 8 నాటి కార్యక్రమం ఏదైనా దానిని స్పాన్సర్ చేసే సంస్థ పేరుతో కలిపి అంతర్జాతీయ మహిళా దినం చెప్పబడుతుంది. 'పాండ్స్ అంతర్జాతీయ మహిళా దినోత్సవం' వంటివి అనేకం. ఈ సంవత్సరం జెట్ ఎయిర్‌వేస్ అంతర్జాతీయ మహిళా దినోత్సవాన్ని జరపడంలో భాగంగా మహిళా ప్రయాణికులకు టిక్కెట్టు ధరలో ఐదు శాతం రాయితీ ప్రకటించింది. అంటే మార్చ్ 8 వ్యాపార సరుకుగా ఎలా మార్చబడిందో అర్థం చేసుకోవచ్చు. శ్రామిక మహిళల జీవన ఆరాట పోరాటాల స్మృతిలో మొదలైన అంతర్జాతీయ మహిళా దినం స్త్రీల ఇంటిపని, పునరుత్పత్తి పని గురించిన చర్చతో మధ్యతరగతి మహిళ వరకు వచ్చి మొత్తంగా ఆర్థిక, లైంగిక దోపిడీకి వ్యతిరేకంగా ఎక్కుపెట్టబడిన అస్త్రంగా పదునెక్కింది. కానీ అదిప్పుడు భూమార్గం వదిలి గగనవిహారం చేస్తున్నది. ఆ పరిస్థితిని గురించిన ఎరుక, హెచ్చరికలతో మార్చ్ 8 అంతర్జాతీయ మహిళా దినానికి ఉన్న రాజకీయ, మానవహక్కుల పార్శ్వాన్ని బలోపేతం చేసుకొంటూ విస్తరింప చేసుకోవడం ఇప్పుడు మన ముందున్న కర్తవ్యం.

*(రచయిత కాకతీయ విశ్వవిద్యాలయంలో తెలుగు ప్రొఫెసర్)* వీ

*గంగవరం పోర్టు, సోంపేటలలో తమ బతుకులను బుగ్గిచేసే ప్రాజెక్టులకు వ్యతిరేకంగా ఉద్యమిస్తున్న ఉత్తరాంధ్ర మహిళల పోరాట సంప్రదాయాన్ని వివరిస్తున్నారు* **కె.ఎన్. మల్లీశ్వరి**

# మర్లపోలమ్మ స్ఫూర్తితో ఉత్తరాంధ్ర మహిళ

'ఆధునిక మహిళ చరిత్రని పునర్లిఖిస్తుంది' అని వందేళ్ల కిందట గురజాడ అన్నాడు. ఆధునిక మహిళ అంటే ఎవరు? అన్న ప్రశ్న అపుడు బలంగా రాకపోయి ఉండొచ్చు. ఎందుకంటే వందేళ్ల కిందట సమాజంలో వైరుధ్యాల మధ్య ఉండే విభజనరేఖని స్పష్టంగా గుర్తించడానికి వీలుండేది. కానీ వర్తమానంలో ఆ గుర్తింపు కష్టం. అస్తిత్వాలు, ఉప అస్తిత్వాల స్పృహ పెరిగిన కొద్దీ సంఘర్షణ స్వభావం సంక్లిష్టమౌతోంది. ఇలాంటి సందర్భంలో ఏ మహిళ చరిత్రగతిని మార్చే ఆధునిక స్వభావాన్ని కలిగి ఉంది అన్న చర్చ జరగాలి...

ఆధునికత్వాన్ని స్వభావ వాచిగా తీసుకున్నట్లయితే వివక్షలపై అవగాహన, పోరాడాలనే స్పృహ, పోరాడే చైతన్యం కలిగి ఉండడం కూడా ఆధునికతలో భాగమే...ఆ రకంగా సమాజ స్వభావాన్ని ప్రభావం చేయగలిగిన రీతిలో పోరాటాలు చేస్తున్న ఉత్తరాంధ్ర శ్రామిక వర్గ స్త్రీలను ఈ సందర్భంలో గుర్తు చేసుకోవాల్సిన అవసరం ఉంది.

గత సంవత్సరం జూలై నెలలో సోంపేట కాల్పుల ఘటన తర్వాత అక్కడ వెల్లువెత్తిన ప్రజా చైతన్యం, ముఖ్యంగా మహిళా చైతన్యాన్ని చూసినపుడు భవిష్యత్తు పట్ల ఆశ కలిగింది. సగటు స్త్రీల నుంచి ఉత్తరాంధ్ర స్త్రీలను ప్రత్యేకించి చూపే ముఖ్య గుణం వారు తొంభై శాతం వరకూ శ్రామిక వర్గ మహిళలుగా ఉండడమే... ఉత్తరాంధ్రలో ఎక్కువ మంది ప్రజలు భూమి, సముద్రం, అడవి ఆధారంగా చేసుకుని జీవిస్తున్న వాళ్లే... జనాభాతో పాటు ఈ మూడు వనరుల ఆధారంగా జరిగే ఉత్పత్తి కూడా ఎన్నో రెట్లు పెరిగింది.

ఈ మూడు రంగాల్లోని సంపద సృష్టిలో ఉత్తరాంధ్ర స్త్రీలకి ప్రముఖ పాత్ర ఉంటుంది...1947 తర్వాత ప్రణాళికాబద్ధంగా జరుగుతున్న పారిశ్రామికీకరణ మూలంగా వారి జీవితాల్లో చాలా మార్పులు వచ్చాయి. ప్రభుత్వాలు అభివృద్ధి అని చెప్పే పదం నిజంగా అభివృద్ధిని సూచించేది కాదని, ఏ అభివృద్ధి అయినా ప్రజల సంపూర్ణాంగీకారంతో జరగాలనీ, ప్రజలు వ్యతిరేకించే అభివృద్ధిని ప్రభుత్వాలు బలవంతంగా రుద్దుతున్నాయనీ, అది విధ్వంసానికి దారితీస్తోందన్న అవగాహన ప్రజల్లో కలిగాక ఉద్యమాలు మొదలయ్యాయి...

అభివృద్ధి పేరిట జరుగుతున్న విధ్వంసాన్ని ఉత్తరాంధ్ర స్త్రీలూ తీవ్రంగా వ్యతిరేకించారు.... గంగవరం పోర్టు నిర్మాణం మూలంగా తమ వృత్తులనూ, భూములనూ పోగొట్టుకున్నపుడు, ఎస్.కోటలో జిందాల్ కంపెనీకి వ్యతిరేకంగా సాగుతున్న పోరులోనూ, సోంపేటలో థర్మల్ పవర్‌ప్లాంట్‌కి వ్యతికేకంగా నడుస్తున్న పోరాటంలోనూ ఉత్తరాంధ్ర శ్రామికవర్గ స్త్రీలు నిర్ణయాత్మకంగానూ, వ్యూహాత్మకంగానూ వ్యవహరించారు. ఈ చైతన్యం వెనుక అనేక ఆర్థిక రాజకీయ, సామాజిక కారణాలు ఉన్నాయి.

ఉత్తరాంధ్రలో గ్రామీణ స్త్రీలు తమ జీవిక కోసం చేస్తున్న అనేక వృత్తులు అభివృద్ధి మూలంగా విధ్వంసానికి గురౌతాయి. జీడిపిక్కలు ఒలవడం, పళ్ల వ్యాపారం, చేపల అమ్మకం, కాయగూరల పెంపకం అమ్మకం, చిన్న హోటళ్ల నిర్వహణ, పశుపోషణ, అటవీ ఉత్పత్తుల సేకరణ/అమ్మకం, కొండ ఉత్పత్తుల (కొండ చీపుళ్లు మొదలైనవి) సేకరణ/అమ్మకం, వ్యవసాయం, వ్యవసాయాధారిత పనులు వీటన్నింటినీ ప్రత్యక్షంగా పరోక్షంగా స్త్రీలు కోల్పోవాల్సి వస్తుంది.

దిగువ తరగతిలో కుటుంబాల బాధ్యత ప్రధానంగా స్త్రీలదే... తమ సాంప్రదాయ వృత్తుల్ని నమ్ముకుని ఇంకే ఆసరా లేకపోయినా కుటుంబాల్ని నెట్టుకొచ్చే స్త్రీలు, అవి కోల్పోవాల్సి వచ్చినపుడు... అభద్రతకి లోనవుతారు. అప్పటివరకూ తమకి తెలిసిన చోటులో, తెలిసిన పనుల్లో అంతో ఇంతో ఉందనుకునే సామాజిక భద్రత కూడా ఉండదని గ్రహింపుకి వచ్చినపుడు ఆందోళన చెందుతారు. నిర్వాసిత కుటుంబాల మీద ఈ ఒత్తిడి ఇంకా ఎక్కువ.

ప్రభుత్వం ఇచ్చే నష్ట పరిహారం మీద కూడా పురుషుడి పెత్తనమే ఉంటుంది... ఆ రకంగానూ స్త్రీలకి ప్రత్యామ్నాయం కరువౌతుంది. అంతే కాకుండా నష్టపరిహారం వచ్చిన తర్వాత స్త్రీలకి గృహ హింస పెరగడం, నిర్వాసితులైన స్త్రీలు వేరే ఆధారం లేక పడుపు వృత్తిలోకి దిగడం జరుగుతోందని అనేక సర్వేల మూలంగా తెలుస్తోంది.

నష్ట పరిహారం భూముల్ని కోల్పోయిన వాళ్లకి తప్ప, భూముల మీద ఆధారపడిన ఇతర వృత్తుల వాళ్లకి కాక పోవడంతో తప్పనిసరై వలసలు వెళ్లాల్సి వచ్చినపుడు కొత్త చోట్ల, కొత్త వృత్తుల్లో మళ్లీ కొత్త నైపుణ్యాన్ని సంపాదించడం అంత సులభం కాదు. దీంతో మానసికంగా కూడా కుంగిపోవడం జరుగుతుంది.

ఇక స్వదేశంలో విదేశాల్లాంటి సెజ్‌ల్లో అమానవీయమైన పరిస్తితుల మధ్య స్త్రీలు పని చేస్తున్నారు. దోపిడీ వ్యవస్థ కొత్త రూపాలను గుర్తించే శక్తి లేకపోవడం మూలంగా పని చోట్ల మోసానికి గురైతున్నారు. ఇలాంటి చోట్ల స్త్రీలు అనార్గనైజ్డ్ సెక్టార్ ఉండడం మూలంగా తక్కువ వేతనాలు, కనీస సదుపాయాల కొరత, అమర్యాదగా వ్యవహరించడం లాంటి సమస్యలను ఎదుర్కుంటున్నారు. వీటితో పాటు వారికి ఇచ్చే పనులు అత్యంత జాగరూకతతో, ఎక్కువ శ్రద్ధ పెట్టి చేయాల్సి వచ్చే

*అనాదిగా మహిళలు ఎదుర్కొంటున్న వివక్ష, అణచివేత, అసమానతలను, మహిళల ఆరాట పోరాటాల చరిత్రను వివరిస్తున్నారు* **డా. నళిని**

# అంతర్జాతీయ మహిళా దినోత్సవ కర్తవ్యాలు

**అం**తర్జాతీయ మహిళా దినోత్సవానికి నూరేళ్లు నిండినా స్త్రీల స్థితిగతుల్లో చెప్పుకోదగ్గ మార్పు మాత్రం రాలేదు. ప్రతి స్త్రీ ప్రతిరోజూ ఏదో ఒక విషయంలో వివక్షకు గురవుతూనే ఉంది. జెండర్ ఇండికేటర్లుగా, లైంగిక సమానత్వ సూచికలుగా చెప్పుకునే ఐదు ప్రామాణికాంశాలలో ఆమె వెనుకబడే ఉంది. ఆమె ఉనికిని ప్రశ్నిస్తూ భ్రూణ హత్యలు, 'మాయమవుతున్న మహిళలు', విద్యలో కనీసం హైస్కూలు చదువుకు నోచుకోని ఎందరో ఆడపిల్లలు! ఆహారం, ఆరోగ్యం చూస్తే, ఆహార కొరత ఎక్కువగా వేధించేది స్త్రీలనే. రక్తహీనత, అనారోగ్యాలతో కాన్పులో మరణించడం పరిపాటి. ఉపాధి చూస్తే, సమాన పనికి సమాన వేతనం ఎలాగూ లేదు. వ్యవసాయంలో ఎక్కువ పని వారిదైనా ఎలాంటి హక్కులూ లేవు. భద్రత, భావ ప్రకటనల విషయానికి వస్తే, స్త్రీలపై అనేక రకాల అత్యాచారాలు చూస్తున్నాం. రాజకీయ సాధికారత ఎంత ఉందో చూస్తూనే ఉన్నాం. అలా ఈ లైంగిక సూచికలన్నీ ఇప్పటికీ పురుషాధిక్యత వైపే మొగ్గుతున్నాయి. అందుకే లెనిన్ చెప్పినట్టు, ఈ దినోత్సవాన్ని మనం 'వసపిట్టల గుంపుగా కిచకిచమంటూ' జరుపుకోకూడదు. యోధుల లాగా బిగ్గరగా, స్పష్టంగా మాట్లాడాలి. ఇది స్త్రీల లావణ్య ప్రదర్శన వేదిక కాదు. విప్లవ స్ఫూర్తితో మన జ్ఞానం కోసం, కార్యాచరణ కోసం పోరాడే యుద్ధరంగం.

అలాంటి స్ఫూర్తితో, శ్రామిక మహిళల ఆకాంక్షల వేదికగా, పోరాడే యోధుల గొంతుకగా అంతర్జాతీయ మహిళా దినోత్సవాన్ని

---

డైమండ్ కట్టింగ్ లాంటివి కావడంతో ఆరోగ్యమూ దెబ్బ తింటుంది. విశాఖలో బ్రాండిక్స్ లాంటి సెజ్‌ల పనితీరు పట్ల ప్రజా సంఘాలు ఎప్పటి నుంచో ఆందోళనలు చేస్తూనే ఉన్నాయి.

ఇంత విధ్వంసకర వ్యూహంలో దేశమంతా చిక్కుకుని విలవిల్లాడుతున్నపుడు పోరాడి ఓడిన గంగవరం స్త్రీలూ,పోరాడుతున్న ఎస్.కోట, అరకు ప్రాంతాల స్త్రీలూ, పోరాడి గెలిచిన సోంపేట మహిళలూ, యావత్ మహిళా ప్రపంచానికే స్ఫూర్తినిస్తున్నారు.

2010 జూలై లో రెండు సార్లు ప్రజాస్వామిక రచయిత్రుల వేదిక తరపున నిజ నిర్ధారణకు సోంపేట వెళ్లినపుడు అక్కడి స్త్రీల పోరాట చైతన్యం చాలా భరోసానిచ్చింది. అంత మంది మహిళలు సంఘటితం కావడానికి డ్వాక్రా సంఘాలు, పర్యావరణ, మత్స్యకార సంఘాలు చాలా కృషి చేసాయి. సోంపేటలో సంవత్సరం పైగా నిరవధికంగా సాగుతున్న రిలే నిరాహార దీక్షల్లో రోజుకి ఒక్కో గ్రామం నుంచి ఒక్కో పొదుపు సంఘం మహిళలు పాల్గొంటున్నారు. ముఖ్యంగా మత్స్యకార మహిళలు 4000 ఎకరాల బీలని, సముద్ర తీరప్రాంతాన్నీ కాలుష్యం నుంచి తప్పించడం ద్వారా తమ జీవనాధారాన్ని నిలబెట్టుకోడానికి ప్రాణాలు కోల్పోయినా ఫర్వాలేదన్న తెగింపులో ఉన్నారు.

అక్కడి స్త్రీలని కలిసినపుడు వారి భావోద్వేగాలు జానపద ప్రదర్శక కళల్ని తలపింపజేసాయి. వారి ఆవేశం, ఆక్రోశం, ఉద్వేగాలు, ఉద్రేకాలు, వ్యంగ్యం, నిష్కపటత్వం, పట్టుదల అసంకల్పితంగా కళాత్మకతని సంతరించుకోవడం కన్పించింది... పోలీసు కాల్పుల్లో మరణించిన గున్నా జోగారావుకి ప్రభుత్వం 5 లక్షలు నష్టపరిహారం ప్రకటించింది. ఈ విషయం జోగారావు భార్య జగదాంబ వద్ద ప్రస్తావనకి వచ్చినపుడు, ఆమె ఉద్వేగంగా 'లచ్చలూ కోట్లూ నాతో మాటాడవు గదా నా పక్కన కూకోని నాకు కబుర్లు సెప్పవు గదా' అంది.

పోలీసులూ, పవర్ ప్లాంట్ గూండాల దౌర్జన్యాన్ని ఎదిరిస్తామని చెపుతూ 'ఆళు మూడు వేల మంది వత్తే మావు ముప్ఫై వేల మంది ఒత్తాం... ఆళు పొగ బాంబులేత్తే మాం బురద మట్టితో కప్పెడతాం... ఆళు అగ్గి బాంబులతో వత్తే... మాం పెట్రోల్ జల్లడానికైన సిద్ధం' అని మత్స్యకార మహిళ బట్టి మోయినమ్మ ఆవేశంగా అంది...పలాసపురం మహిళలయితే 'భుక్తికోసం భూమి కోసం నిలబడ్డామని మా మీద నక్సలైట్లని ముద్రేత్తే మరేటి సేస్తాం....మావు అదే అవుతాం' అని తేల్చి చెప్పేశారు.

పోలీసు కాల్పుల ఘటన రోజు భూమి పూజని ఆపడానికి గొల్లగండి గ్రామంలోని స్త్రీలంతా వెళ్తున్నపుడు 85 ఏళ్ల రాజమ్మ కూడా వంగిన నడుముని నిటారు చేసి ధైర్యంగా ముందుండి వారిని నడిపించింది. రాజమ్మని కలిసినపుడు ఆమె తన చేతి కర్రని తిప్పుతూ, ఉద్రేకంగా అక్కడ జరిగినవి వివరిస్తుంటే.....ఉత్తరాంధ్ర పోరాట స్త్రీలకి ప్రతినిధిలా, ఏడుగురు రాజులతో పోరాడి గెలిచిన మర్ల పోలమ్మ యుద్ధ జయకేతనంలా కనిపించింది.

ఈ రోజు.... సోంపేట ఘటన తర్వాత అభివృద్ధి విధ్వంసం లో చిక్కుకున్న మిగతా ప్రపంచం సోంపేట వైపు ఆశగా చూస్తోంది...ఇంతటి స్ఫూర్తిదాయకమైన పోరాటం చేస్తున్న ఉత్తరాంధ్ర మహిళలకూ, యావత్ మహిళా లోకానికీ అంతర్జాతీయ శ్రామిక మహిళా దినోత్సవానికి వందేళ్లు నిండుతున్న సందర్భంగా శుభాకాంక్షలు.

*(రచయిత కథా, నవలా రచయిత్రి, తెలుగు లెక్చరర్)* వీ

మార్చ్ 8న జరుపుకోవడం 1913లో ఆరంభమయింది. సామాన్య స్త్రీలు చరిత్రను సృష్టించడానికి ఈ రోజు ఒక ప్రతీక. పురుషులతో సమానంగా సామాజిక కార్యకలాపాల్లో పాలుపంచుకోవాలని ఆకాంక్షించే స్త్రీలు శతాబ్దాల తరబడి చేస్తున్న పోరాటానికి ఇది ఒక ప్రతిబింబం. స్త్రీలకు లాంఛన ప్రాయమైన సమానత్వం కాక, ఆర్థిక సామాజిక సమానత్వం కావాలని పోరాడుతున్న శ్రామిక మహిళోద్యమ కేతనం ఈ దినం.

స్వంత ఆస్తి పుట్టుకతో మాతృస్వామ్యం త్వరితగతిన పితృస్వామ్యంగా మార్పు చెందింది. తరతరాలుగా మహిళల అణచివేతకు కారణభూతమయింది. అందులోంచి బయటపడడానికి స్త్రీలు సామూహికంగా చేస్తున్న పోరాటానికి ప్రతిరూపమే మార్చ్ ఎనిమిది.

ఫ్రెంచ్ విప్లవ కాలంలో 'స్వాతంత్ర్యం, సమానత్వం, సౌభ్రాతృత్వం' పేరుతో ఓటు హక్కు కోసం మహిళలు వర్‌స్పెయిల్స్‌కి దండుగా కదిలి వెళ్లారు. అప్పటికే 1869లో జాన్ స్టువర్ట్ మిల్ అనే బ్రిటిష్ ఎం.పి. మహిళల ఓటు హక్కుని మొదటిసారిగా పార్లమెంట్‌లో ప్రస్తావించారు. 19 సెప్టెంబర్ 1893న న్యూజిలాండ్ మొదటగా మహిళల ఓటు హక్కుని ఆమోదించింది.

1908లో న్యూయార్క్‌లో బట్టల మిల్లు కార్మికులు వీరోచితంగా పోరాడుతూ వీథుల్లోకి వచ్చారు. తమ పనికి సరైన వేతనం చెల్లించాలనీ, పని గంటలు తగ్గించాలనీ, 'రొట్టె, గులాబులు' కావాలనే డిమాండ్‌తో పోరాటాలు జరిపారు. ఈ అతి సామాన్య నిరుపేద స్త్రీలు సృష్టించిన చరిత్రే అంతర్జాతీయ మహిళా దినం - మార్చ్ 8.

అమెరికాలో ఇరవై వేల మంది మహిళలు 1909లో యూనియన్ ఏర్పాటు చేసుకునే హక్కు కోసం, తక్కువ పని గంటలు, మెరుగైన వేతనం, ఓటింగ్ హక్కుల కోసం డిమాండ్ చేస్తూ సమ్మె చేశారు. 13 వారాల పాటు గడ్డ కట్టించే చలిలో సాగిన మహిళల ఈ దీర్ఘకాలిక జనరల్ సమ్మెతో మహిళలు అనేక హక్కులు సాధించుకున్నారు.

మహిళల సాధికారత కోసం అమెరికన్ సోషలిస్టు పార్టీ 28 ఫిబ్రవరి 1909న మొదటి జాతీయ మహిళా దినోత్సవాన్ని జరుపుకుంది. 1913 వరకు అక్కడ ఫిబ్రవరి ఆఖరి ఆదివారాన్ని మహిళా దినోత్సవంగా జరుపుకునేవారు.

కోపెన్‌హెగెన్‌లో 1910లో జరిగిన శ్రామిక మహిళల సోషలిస్టు ఇంటర్‌నేషనల్ రెండవ అంతర్జాతీయ సదస్సులో - మహిళల హక్కుల కోసం, సార్వజనీన ఓటు హక్కు కోసం పోరాడే విధంగా ఒక అంతర్జాతీయ మహిళా దినోత్సవం ఆవశ్యకతని ప్రతిపాదించారు. జర్మనీ సోషల్ డెమోక్రటిక్ పార్టీ మహిళా విభాగ నాయకురాలు క్లారాజెట్కిన్ చేసిన ఈ ప్రతిపాదనని 17 దేశాలకు చెందిన వంద మంది మహిళలు ఏకగ్రీవంగా ఆమోదించారు.

ఈ ప్రతిపాదనని ఆమోదించిన వారానికే, మార్చ్ 25న న్యూయార్క్ పట్టణంలో 'త్రికోణ అగ్ని ప్రమాదం' జరిగింది. అందులో 140 మంది శ్రామిక మహిళలు చనిపోయారు. వారంతా జూయిష్ కార్మికులు, ఇటాలియన్ వలస కార్మికులు. దీని ప్రభావం వల్ల కార్మికుల జీవన పరిస్థితులపై, చట్టాలపై అమెరికాలో చాలా చర్చ జరిగింది. ప్రమాదానికి దారితీసే పని పరిస్థితులపై మహిళా దినోత్సవం సందర్భంగా అనేకసార్లు ఇదే ఉదాహరణగా చర్చలు జరిగాయి.

## ఈజిప్ట్‌లో ఉద్యమానికి ఊపిరులూదిన అస్మా మెహఫౌజ్ పిలుపు...

- ఈ దేశంలో ఒక్కనిజం చెప్పినా పోలీసుల అణచివేతకి గురికాక తప్పదు.
- దేశాన్ని రక్షించే పేరుతో ప్రదర్శకులపై ఈ అణచివేత సాగుతుంది.
- అందుకే, ప్రజలకి రక్షణివ్వలేని ఆంతరంగిక మంత్రినీ, జైళ్లలో ఖైదీలను చిత్రహింసలకు గురిచేసే అందరినీ బర్తరఫ్ చేయాలి.
- పార్లమెంట్‌ను రద్దు చేయాలి.
- మాకు 'స్వేచ్ఛాయుత జీవితం, ఆత్మగౌరవం' కావాలి.
- ఈ దేశంలో ఎక్కడయినా రక్షణ ఉందా? స్వేచ్ఛ ఉందా? ప్రమాదమయితే అది ఎక్కడయినా ఉంటుంది. ఆ మాటకొస్తే మనమెవ్వరమూ సురక్షితంగా లేం. నాతో కలిసిరండి. చేయి చేయి కలపండి. నా హక్కూ, మీ హక్కూ, మనమందరి హక్కుల్నీ కాపాడుకుందాం. అవినీతికి వ్యతిరేకంగా, ప్రభుత్వానికి వ్యతిరేకంగా గొంతెత్తి నినదిద్దాం. రండి.
- ఈ దేశం బాగుని కోరేవారంతా మాతో చేతులు కలపండి. ఇంట్లో కూర్చొని విద్రోహులకు చేయూతనివ్వకండి. అలా మమ్మల్ని చిన్న చూపు చూడకండి.
- ఆత్మాహుతి చేసుకున్న వారంతా మనల్ని మేల్కొల్పుతున్నారు. కార్యోన్ముఖుల్ని చేస్తున్నారు.
- ముప్పయేళ్ల అవినీతి ప్రభుత్వంతో విసిగి వేసారిపోయిన నా దేశవాసులారా మేల్కొనండి.
- మాతో గొంతు కలపండి. మీరు ముందుకు రండి. మీతోపాటు పదిమందిని ముందుకు నడిపించండి.
- ఆశని కోల్పోవద్దు. ఎటువంటి ఆశా లేదనడమే ఆశను కోల్పోవడం అవుతుంది.
- రేపు (25 జనవరి 2011న) ఒక్క రోజులో విప్లవం రాదు. అంతా ఒక్కసారిగా మారిపోదు. కానీ ఇది అంతానికి ఆరంభం. మార్పు వైపుగా మనం వేసే బలమైన అడుగు.
- తన ప్రజలని తానే నిర్బంధించే వాడు నిలువెల్లా విద్రోహి.
- ముబారక్, మా డబ్బుని ఏమి చేశావు?
- మాకు మా హక్కులు కావాలి. మానవ హక్కులు కావాలి.
- హోస్నీ ముబారక్ నశించాలి!

మొదటి ప్రపంచ యుద్ధానికి ముందు - 1913-14 మధ్యకాలంలో - రగులుతున్న శాంతి ఉద్యమంలో భాగంగా రష్యన్ మహిళలు 1913 ఫిబ్రవరి ఆఖరి వారాన్ని మొదటి అంతర్జాతీయ మహిళా దినోత్సవంగా జరుపుకొన్నారు. ఆ సందర్భంగా మహిళలు అనేక ర్యాలీలు, ప్రదర్శనలు జరిపారు. యుద్ధాన్ని వ్యతిరేకిస్తూ నినదించారు. తమ తోటి స్త్రీలకు మద్దతు తెలుపుతూ గొంతు కలిపారు.

తర్వాత మొదటి ప్రపంచ యుద్ధంలో రెండు మిలియన్లకు పైగా రష్యన్ సైనికులు అసువులు బాయడంతో రష్యన్ మహిళలు 'రొట్టె కోసం, శాంతి కోసం' సమ్మె చేయడానికి మళ్లీ ఫిబ్రవరి ఆఖరి ఆదివారాన్ని ఎంచుకొన్నారు. ఈ సమ్మె చాలా వ్యతిరేకతను ఎదుర్కోవాల్సి వచ్చింది. కానీ, నాలుగు రోజుల తర్వాత జారు చక్రవర్తి తప్పుకోక తప్పలేదు. తాత్కాలిక ప్రభుత్వం మహిళల ఓటు హక్కుని ప్రకటించింది. ఆ చారిత్రాత్మక ఆదివారం అప్పట్లో అమల్లో ఉన్న రష్యన్ జూలియన్

క్యాలెండర్ ప్రకారం ఫిబ్రవరి 23న వచ్చింది. ఆ తర్వాత గ్రెగోరియన్ క్యాలెండర్ ప్రకారం అది మార్చ్ 8గా మారింది.

ఈ నేపథ్యంలో, 1945లో ఐక్యరాజ్య సమితి లైంగిక సమానత్వాన్ని ఒక ప్రాథమిక మానవ హక్కుగా ప్రకటిస్తూ మొదటి అంతర్జాతీయ ఒప్పందంపై సంతకం చేసింది. అప్పటి నుంచి అది మహిళా స్థాయిని పెంచడం కోసం అనేక అంతర్జాతీయ ఒప్పందాలను, ప్రమాణాలను, ప్రణాళికలను రచించింది. అలానే, ప్రతి సంవత్సరం అంతర్జాతీయ మహిళా దినోత్సవానికి ఒక థీమ్‌ని, ఒక అంశాన్ని ప్రతిపాదిస్తారు. ఈ సంవత్సరం 'విద్య, శిక్షణ, శాస్త్ర పరిజ్ఞానం, సాంకేతిక పరిధిలో సమాన అవకాశాలు, మహిళలకు సవ్యమైన పనికి దారిని సుగమం చేయడం' అనేది థీమ్.

అయితే, నేటి మహిళల స్థితిగతులను పరిశీలిస్తే, ఈ అంతర్జాతీయ మహిళా దినోత్సవ సృష్టికర్తలు సామాన్య నిరుపేద స్త్రీలే అయినా, అది నేడు చాలా కొద్దిమందికి మాత్రమే సంతోషదాయకమైన దినంగా ఉంటోంది. అందుకే ఈ దినోత్సవాలు మేళాలుగా మారరాదు. వాటికి ఒక ప్రయోజనం ఉండాలి. ఒక సందేశం ఉండాలి.

ఈనాడు మన దేశంలో మహిళ గతి అధోగతిగానే ఉంది.

- మన దేశంలో మాతృత్వ మరణాల రేటు (ఎం.ఎం.ఆర్.) లక్ష కాన్పులకి 301గా ఉంది. అంటే, ప్రతి సంవత్సరం అర మిలియన్ మహిళలు కాన్పు సమయంలో మరణిస్తున్నారు. ప్రపంచంలో చనిపోతున్న మహిళల్లో 20 శాతం మన దేశానికే చెందుతారు. అంటే, మన దేశంలో ఐదు నిమిషాలకు ఒక మహిళ చనిపోతోంది.
- గర్భిణీ స్త్రీల పరిరక్షణ లోపభూయిష్టంగా ఉండడం వల్ల ప్రతి వెయ్యి కాన్పులకి 44 మంది శిశువులు మరణిస్తున్నారు.
- ఇరవై వేల మంది పెళ్లి కూతుళ్లు మంటలకి ఆహుతవుతున్నారు.
- ఆడ శిశు హత్యల రేటు 49.2 శాతంగా ఉండడం వల్ల జనాభాలో ప్రతి వెయ్యి మంది పురుషులకి 927 మంది మహిళలు మాత్రమే ఉంటున్నారు.
- పేదరికంలో మగ్గుతున్న ప్రజల్లో ప్రపంచవ్యాప్తంగా 70 శాతం మంది మహిళలే.
- ప్రపంచంలో 67 శాతం పని గంటలు మహిళలవే. కానీ ప్రపంచ ఆదాయంలో పది శాతం మాత్రమే మహిళలది. ప్రపంచ ఆస్తిలో ఒక్క శాతం మాత్రమే మహిళలది.
- అభివృద్ధి చెందుతున్న దేశాల్లో 60-80 శాతం ఆహారాన్ని స్త్రీలే పండిస్తున్నారు. కానీ భూమిపై హక్కు ఆమెకి లేదు.
- సమానమైన పనికి సమాన వేతనం ఆమెకి లేదు. పురుషుల కంటే 30 - 40 శాతం తక్కువ వేతనం ఆమెది.
- ఒక స్త్రీకి రోజుకి 2,200 కేలరీలు అవసరమైతే, సగటున ఆమె తీసుకునేది 1,400 కేలరీలు మాత్రమే.
- పురుషుల అక్షరాస్యత 76 శాతం అయితే, స్త్రీలది 54 శాతం మాత్రమే.
- పెళ్లయిన స్త్రీలలో 40 శాతం మంది ఇంట్లో ఏదో ఒక రకమైన అవమానానికి గురవుతూనే ఉన్నారు - శారీరకంగా, లైంగికంగా, మానసికంగా, ఆర్థికంగా.
- ప్రతిరోజు సుమారు 45 మంది మహిళలపై అత్యాచారాలు జరుగుతున్నాయి.
- మన దేశంలో ఎచ్.ఐ.వి. కేసుల్లో 38 శాతం స్త్రీలే.
- యుద్ధంలో అత్యాచారాన్ని ఆయుధంగా వాడుతున్నారు. అది ప్రజాయుద్ధం కావచ్చు, రెండు దేశాల యుద్ధం కావచ్చు.

మన దేశం ఆర్థికంగా ఎంతో అభివృద్ధిని సాధించిందంటూ, 'ఆర్థిక అగ్రరాజ్యం'గా పేర్కొంటూ డబ్బా కొడుతుంటే, ప్రపంచంలోకెల్లా ధనికులైన వ్యక్తుల్లో మన దేశవాసుల పేరు చూసుకొని సంబరపడుతుంటే – నూతన సృష్టిలో భాగంగా, బిడ్డకి జన్మనిస్తూ వేలాది మంది మహిళలు అతిహీనంగా జన్మనిస్తున్నారు. రక్తహీనత, అధిక రక్తస్రావం, ఇన్‌ఫెక్షన్‌తో, అరకొర వైద్య సదుపాయంతో అసువులు బాస్తున్నారు.

స్కానింగ్‌లు, భ్రూణహత్యలతో అనారోగ్యం పాలవుతున్నారు. ఆహార లేమి, అందని వైద్యం, ప్రాథమిక విద్య మాత్రమే అందడం, బాల్య వివాహాలు, కట్నం వేధింపులు, ఈవ్ టీజింగ్, అత్యాచారాలు, ప్రేమ పేరుతో దాడులు, వివాహ విచ్ఛిత్తి, అనాథలుగా మిగిలిపోవడం... ఇలా పుట్టిన దగ్గర నించి గిట్టే వరకు 'ఆడదై పుట్టే కంటే అడవిలో మానై పుట్టడం మేలు' అనుకుంటూ అలమటించి, కన్న కూతుళ్లనే హత్య చేసే స్థాయికి దిగజారిపోతున్నారు.

అందుకే, అన్ని విధాలుగా అణచివేతకు గురవుతున్న అట్టడుగు వర్గాల మహిళను 'పేదరికపు ముఖం'గా చెప్పుకోవచ్చు. ఇంటిపని, కట్టెల పొయ్యితో తంటాల వంట పని, రెక్కలు ముక్కలయ్యే పొలం పని, భర్త, పిల్లల సేవలనే భారాల కింద ఆమె నలిగిపోతోంది. ఆరోగ్యం, చదువు, ఉపాధి లేక నిత్యం ఇంటా బయటా అవమానాలకు, అత్యాచారాలకు, హింసలకు గురవుతున్న అట్టడుగు వర్గాల పేద స్త్రీలు అన్ని దేశాల్లో అత్యధిక సంఖ్యలో ఉన్నారు.

ఏ దేశమయినా సామాజికంగా, ఆర్థికంగా అభివృద్ధిని సాధించడానికి, తన దేశంలో స్త్రీ జాతి పట్ల అవలంబించే వైఖరికీ మధ్య ప్రత్యక్షమైన సంబంధం ఉందని చాలా మంది సామాజికవేత్తలు నిర్ద్వంద్వంగా అంగీకరిస్తారు. ఏ సమాజమైనా పరిఢవిల్లాలంటే అక్కడ స్త్రీ జాతి అభ్యున్నతిని సాధించాలి. సమాజంలో ఒక భాగం క్షీణించి పోతుంటే, బలహీనపడుతుంటే, మరొక భాగం ఎలా ఎదగగలదు? ఎలా వర్ధిల్లగలదు?

'మహిళల స్థితిగతులను బట్టి ఆయా దేశాల పరిస్థితి అంచనా కట్టవచ్చని' నెహ్రూ వ్యాఖ్యానించారు. వలిమూరి రామలింగస్వామి వేదన చూడండి, – 'ఏ స్త్రీ అయినా, తన పిల్లల్ని ఎంత ప్రేమించినా – తను పేదరికంలో మగ్గిపోతూ, అణచివేతకు గురవుతూ, నిరక్షరాస్యతలో కూరుకుపోయి, రక్తహీనత, అనారోగ్యంలతో మూలుగుతూ, మరికివాడల్లో ఉంటూ, సరైన నీరు, పరిసరాల శుభ్రత లేకపోతే, అన్నింటినీ మించి నమ్మిన భర్త తోడు లేకపోతే – తన పిల్లలని ఎలా తీర్చిదిద్దగలదు? భావితరాల భవిత ఏమవుతుంది?

'ఆకాశంలో సగం'గా ఉన్న మహిళ నేడు సమానత్వం లోపించి, గౌరవం లోపించి, అర్థరహితంగా జీవితం వెళ్లదీస్తోంది. ఒకే భూమి మీద నివసిస్తున్నా ఆడమగ ప్రపంచాలు వేరు. కష్టాల కడగండ్లను మోసే భారం ఎక్కువగా స్త్రీలదే. ఆమె రెండు వేపులా మండుతున్న కొవొత్తి. ఆశా కిరణం కోసం నిరీక్షిస్తున్న సగటు జీవి.

ఆలోచనలు కలిగి ఉండడం, ప్రచారం చేయడం, ఆ ఆలోచనలకు సరిపడే సంస్థలో సభ్యత్వం ఉండడం దానికదే నేరం కాదని తీర్పు చెప్పిన **సుప్రీంకోర్టు**

# నిషిద్ధ సంస్థ సభ్యుడు కావడం నేరం కాదు!

**యు**నైటెడ్ లిబరేషన్ ఫ్రంట్ ఆఫ్ అస్సాం (ఉల్ఫా) అనే నిషిద్ధ సంస్థ సభ్యుడుగా అరూప్ భుయాన్ మీద తీవ్రవాద, విచ్ఛిన్నకర కార్యకలాపాల (నిరోధ) చట్టం (టాడా) కింద అస్సాంలోని డిజిగ్నేటెడ్ కోర్టు విధించిన శిక్షను సవాల్ చేస్తూ ఆయన సుప్రీంకోర్టుకు పిటిషన్ దాఖలు చేసుకున్నారు. 28 మార్చ్ 2007న విధించబడిన ఆ శిక్షను రద్దు చేస్తూ 3 ఫిబ్రవరి 2011న సుప్రీంకోర్టు న్యాయమూర్తులు జస్టిస్ మార్కండేయ కట్జు, జస్టిస్ జ్ఞాన్ సుధామిశ్రా ఒక చరిత్రాత్మకమైన తీర్పు ఇచ్చారు. నిషిద్ధ సంస్థలో సభ్యులని రుజువు చేసినంత మాత్రాన ఎవరూ శిక్షార్హులు కారని ఈ తీర్పులో వారు నిర్ధారించారు. ఆ తీర్పు పాఠం.

'1991 టాడా సెషన్స్ కేస్ నెం. 13కు సంబంధించి అస్సాంలోని గౌహాతిలో డిజిగ్నేటెడ్ కోర్టు 2007 మార్చ్ 28న వెలువరించిన తీర్పును సవాల్ చేస్తూ ఈ వ్యాజ్యం దాఖలయింది.

ఇప్పుడు సవాలుకు గురయిన తీర్పులో వ్యాజ్యానికి సంబంధించిన వివరాలన్నీ ఉన్నాయి గనుక, అవసరమైన చోట్ల తప్ప ఆ వివరాలు ఇక్కడ మేం పునరుక్తి చేయబోవడం లేదు.

దరఖాస్తుదారు ఉల్ఫా సభ్యుడనే నేరారోపణ జరిగింది. ఈ నేరారోపణకు మద్దతుగా ప్రాసిక్యూషన్ సమర్పించిన ఏకైక ఆధారం పోలీసు సూపరింటెండెంట్ ముందర ఈ దరఖాస్తుదారు చేశాడని చెపుతున్న ఒప్పుదల ప్రకటన మాత్రమే. ఆ ఒప్పుదల ప్రకటనలో హతుడి ఇల్లు తాను గుర్తించానని దరఖాస్తుదారు ఒప్పుకున్నాడని ఉంది.

భారత సాక్ష్యాధారాల చట్టం సెక్షన్ 25 ప్రకారం ఒక పోలీసు అధికారి ముందు చేసిన ఒప్పుదల ప్రకటన ఆమోదయోగ్యం కాదు. కానీ, 1987 తీవ్రవాద, విచ్ఛిన్నకర కార్యకలాపాల (నిరోధ) చట్టం సెక్షన్ 15 ప్రకారం టాడా కేసులలో మాత్రం అది ఆమోదయోగ్యం

---

లైంగిక అసమానతలు కేవలం శారీరక తేడాల వల్ల సంభవించ లేదు. సామాజిక పరిణామ క్రమంలో, స్వంత ఆస్తి ఉద్భవించడంతో, వివిధ సమాజాల్లోని ఆర్థిక, రాజకీయ, సామాజిక శక్తుల ప్రభావంతో ఈ అసమానతలు నెలకొన్నాయి. ఈ అసమానత వ్యక్తుల ఎదుగుదలనే కాక, దేశాల అభివృద్ధిని, ప్రపంచ అభ్యున్నతిని కూడ దెబ్బతీస్తోంది. సగం జనాభా వెనుకబడిపోతే ఇక అభివృద్ధి ఎక్కడిది?

'కుటుంబమనేది ఒక ఆర్థిక యూనిట్‌గా అదృశ్యమైతే, దాని స్థానంలో ఒక నైతిక యూనిట్ ఏర్పడుతుంది. అప్పుడు పురుషునితో పాటు స్త్రీ కూడా సమాన హక్కులు, సమాన సృజనాత్మకత, సమాన లక్ష్యాలు కలిగి ఉంటుంది. ఆమె వ్యక్తిత్వం వికసిస్తుంది' అని క్లారా జెట్కిన్ స్పష్టీకరిస్తుంది.

అలానే, 'శ్రామిక మహిళలు పాల్గొనకుండా మానవజాతి చరిత్రలో పీడిత ప్రజల ఉద్యమం సాగలేదు. పీడితులందరిలోకి ఎక్కువగా పీడించబడే శ్రామిక స్త్రీలు విముక్తి ఉద్యమాలకు ఎన్నడూ దూరంగా ఉండలేరు. మహిళా విమోచనను సాధించేది, దాని గొప్ప భవిష్యత్తును కొనివచ్చేదీ అయిన కార్మికవర్గ ఉద్యమ అజేయతకు అంతర్జాతీయ మహిళా దినోత్సవం ఒక చిహ్నం' అంటూ కార్మికవర్గ మహోపాధ్యాయులు కొనియాడారు.

సాధించవలసింది ఎంతో ఉన్న ఈ నేపథ్యంలో, ప్రతి సంవత్సరం జరిగిన అభివృద్ధిని అంతర్జాతీయ మహిళా దినోత్సవం నాడు బేరీజు వేయాలి. మార్పుని ఆహ్వానించాలి. మహిళల హక్కుల కోసం పోరాడి చరిత్ర సృష్టించిన సామాన్య స్త్రీల ధైర్య సాహసాలను కొనియాడాలి. వారి దృఢత్వాన్ని, లక్ష్యం పట్ల ఏకాగ్రతని పొగడాలి.

అలా ప్రతి అంతర్జాతీయ మహిళా దినోత్సవం నాడు నిరుపేద స్త్రీల సమస్యలపై కేంద్రీకరిద్దాం. సామాన్య స్త్రీల సాహస గాథలను స్మరించుకుందాం. ఏ అసమానతలు లేని సుందరనందనవనం లాంటి భవిష్యత్తు కోసం పోరాడుదాం. కర్మభూమిలో పూసిన పూవులను పరిమళించనిద్దాం, వికసింపచేద్దాం.

నియంత, అమెరికా తొత్తు, ఇజ్రాయెల్‌కు వంత పాడే జాతి ద్రోహి అయిన హోస్నీ ముబారక్‌ని ఇటీవల ఈజిప్ట్‌లో 18 రోజుల మహా ప్రతిఘటనతో ప్రజలు తొలగించగలిగారు. ఈ ఉద్యమానికి ఊపిరి ఒక స్త్రీ. అస్మా మెహ్‌ఫౌజ్ అనే యువజనోద్యమ కార్యకర్త. ఫేస్‌బుక్‌లో ముప్ఫై ఏళ్ల నియంతృత్వ పాలనకు చరమగీతం పాడించే విధంగా పిలుపునిచ్చింది. తహ్రీర్ స్క్వేర్‌పై సమరశంఖం ఊదింది. అలా రాజుకున్న నిప్పురవ్వ దావానలమై ముబారక్‌ను గద్దె దింపింది. ఈ ఉద్యమమిప్పుడు ఇతర అరబ్ దేశాలకు విస్తరిస్తోంది. అలా ఒక జాతీయ సమరాన్ని ఒక అంతర్జాతీయ సంగ్రామంగా మార్చడంలో ముందు నిలిచిన అస్మా వంటి ధీరోదాత్తురాలైన అరబ్ స్త్రీలకు జేజేలు పలుకుతూ ఈ నూరేళ్ల అంతర్జాతీయ మహిళా దినోత్సవాన్ని జరుపుకుందాం.

*(రచయిత వైద్యులు, 'స్త్రీవాద సాహిత్యం-ఒక పరిశీలన' రచయిత్రి)* వీ

అవుతుంది.

ఒప్పుదల అనేది చాలా బలహీనమైన సాక్ష్యాధారం. నిందితులుగా ఆరోపించబడిన వారిని చిత్రహింసలకు గురిచేసి, ఒప్పుదల ప్రకటనలు రాబట్టే అలవాటు భారతదేశంలో పోలీసులకు విస్తృతంగా ఉన్నదని అందరికీ తెలిసిన విషయమే. అందువల్ల ఆరోపణలకు గురవుతున్న నిందితులు పోలీసుల ముందు చేశారని చెప్పే ఒప్పుదల ప్రకటన పట్ల న్యాయస్థానాలు జాగ్రత్తగా ఉండవలసి ఉంటుంది.

దురదృష్టవశాత్తూ మన దేశంలో పోలీసులు పాశ్చాత్య దేశాలలో పోలీసుల లాగా శాస్త్రీయ పద్ధతిలో, దర్యాప్తు జరపడంలో తగిన శిక్షణ పొందడం లేదు. అలాగే, శాస్త్రీయమైన దర్యాప్తు జరిపే సాంకేతిక పరికరాలు కూడా వారికి అందుబాటులో లేవు. అందువల్ల నిందితులకు శిక్షలు విధించాలంటే, చిత్రహింసల ద్వారా ఒప్పుదల ప్రకటనలు సంపాదించడమనే సులభ మార్గాన్ని వారు అనుసరిస్తున్నారు.

మనిషిని చిత్రహింసలకు గురిచేయడమనేది ఎంత భయంకరమైన విషయమంటే, చిత్రహింసలకు గురయిన మనిషి ఎంత పెద్ద నేరం చేశానైనా ఒప్పుకుంటాడు. చిత్రహింసలకు గురయి జోన్ ఆఫ్ ఆర్క్ కూడా తాను మంత్రగత్తెగా పనిచేసానని ఒప్పుకుంది. అందువల్ల నిందితులు పోలీసులకు ఇచ్చిన ఒప్పుదల ప్రకటన మీద మాత్రమే ప్రాసిక్యూషన్ కేసు ఆధారపడినప్పుడు, దాన్ని సమర్థించే ఇతర ఆధారాలు లేనప్పుడు ఇటువంటి చట్టవ్యతిరేక ఒప్పుదల ప్రకటనలను అంగీకరించే విషయంలో న్యాయస్థానాలు సందేహించవలసి ఉంటుంది.

ప్రస్తుతం మాముందున్న కేసులో ప్రాసిక్యూషన్ వాదన అంతా కూడా పోలీసు సూపరింటెండెంట్ ముందు దరఖాస్తుదారు ఇచ్చిన ఒప్పుదల ప్రకటన మీద మాత్రమే ఆధారపడి ఉంది. అది, ఒక చట్ట వ్యతిరేక ఒప్పుదల ప్రకటన. దానికి మద్దతుగా నిలిచే ఇతర ఆధారాలేమీ లేవు. అందువల్ల ఆ ఒప్పుదల ప్రకటన పునాదిగా శిక్ష విధించడం సరైనది కాదని మేం అభిప్రాయపడుతున్నాం...

అయితే టాడా కోర్టు టాడా సెక్షన్ 3 (5) ప్రకారం దరఖాస్తు దారుకు శిక్ష విధించింది. ఆ సెక్షన్ ప్రకారం ఒక వ్యక్తికి ఒక నిషిద్ధ సంస్థలో సభ్యత్వం ఉండడమే శిక్షార్హత అవుతుంది. ఉల్ఫా అనే నిషిద్ధ సంస్థలో తాను సభ్యుడిని కానని దరఖాస్తుదారు వాదిస్తున్నాడు. అయితే, అతను ఉల్ఫా సభ్యుడే అనుకున్నప్పటికీ అతను క్రియాశీల సభ్యుడని, ఊరికే సభ్యత్వం ఉన్నవాడు కాదని రుజువు కాలేదు.

2011లో కేరళ ప్రభుత్వానికీ, రనీఫ్‌కూ మధ్య జరిగిన కేసులో మేం 1966 నాటి ఎల్ఫ్‌బ్రాంట్ వర్సెస్ రస్సెల్ అనే కేసులో అమెరికా సుప్రీంకోర్టు ఇచ్చిన తీర్పును గౌరవంగా ఉటంకించాం. ఆ తీర్పు 'సభ్యత్వం వల్లనే శిక్షార్హత' అనే సూత్రాన్ని తిరస్కరించింది. ఒక నిషిద్ధ సంస్థలో కేవలం సభ్యుడుగా ఉండడం మాత్రమే ఒక వ్యక్తిని శిక్షార్హుడిని చేయదనీ, అతను స్వయంగా హింసకు పాల్పడినప్పుడో, లేదా హింసకు పాల్పడమని ప్రజలను రెచ్చగొట్టినప్పుడో, లేదా హింసకు పాల్పడడం ద్వారా ప్రజా భద్రతను, శాంతిని చెదరగొట్టినప్పుడో మాత్రమే శిక్షార్హుడనీ అమెరికన్ సుప్రీంకోర్టు చెప్పింది. ఈ అంశాన్నే కేదార్‌నాథ్ వర్సెస్ బీహార్ ప్రభుత్వం 1962 అనే కేసులో భారత సుప్రీంకోర్టు రాజ్యాంగ ధర్మాసనం కూడా చెప్పింది.

1969లో జరిగిన క్లారెన్స్ బ్రాండెన్‌బర్గ్ వర్సెస్ స్టేట్ ఆఫ్ ఒహైయ్యో అనే కేసులో అమెరికా సుప్రీంకోర్టు మరింత ముందుకు సాగి, ఒక రాజకీయ, పారిశ్రామిక సంస్కరణను సాధించడానికి హింస ఒక సాధనం అనే విషయాన్ని 'కర్తవ్యంగా, అవసరంగా, ఉచితమైన పనిగా ప్రచారం చేయడం, బోధించడం' నేరాలు కావని తీర్పు చెప్పింది. ఆ పనినే అచ్చువేసి పంపిణీ చేసినా, పుస్తక రూపంలోగానీ, పత్ర రూపంలో గానీ ఆ ప్రచారాన్ని నిర్వహించినా, ఉదాహరణ ప్రాయంగా కొన్ని హింసాత్మక సంఘటనలను తీసుకొని సమర్థించినా, సంఘటిత హింసా రూపాల ఔచిత్యం గురించి ప్రచారం చేసినా, 'సంఘటిత హింసా రూపాల గురించి బోధనలను, ప్రచారాన్ని' నిర్వహించడానికి ఏర్పడిన బృందంతో స్వచ్ఛందంగా జమకూడినా చట్టవ్యతిరేకం కాదని తీర్పు చెప్పింది. ఈ పనులన్నీ చట్టవ్యతిరేక చర్యలను రెచ్చగొట్టినప్పుడు మాత్రమే అవి చట్టవ్యతిరేకం అవుతాయని ఆ తీర్పు చెప్పింది. అమెరికా రాజ్యాంగంలోని మొదటి సవరణ, పద్నాల్గవ సవరణల స్ఫూర్తికి ఆ కేసు భంగకరంగా ఉన్నదని కొట్టివేసింది.

అలాగే యూనైటెడ్ స్టేట్ వర్సెస్ యూజిన్ ఫ్రాంక్ రోబెల్ అనే కేసులో ఒక దేశ రక్షణ శాఖలో ఉద్యోగం సంపాదించినంత మాత్రాన ఒక కమ్యూనిస్టు సంస్థకు చెందిన సభ్యుడిని చట్టవ్యతిరేక కార్యకలాపానికి పాల్పడ్డాడని శిక్షించవద్దని కూడా సుప్రీంకోర్టు చెప్పింది.

ఈ పై తీర్పులన్నిటితో మేం సగౌరవంగా ఏకీభవిస్తున్నాం. ఇవన్నీ భారతదేశానికి కూడా వర్తిస్తాయని మేం భావిస్తున్నాం. ఎందుకంటే అమెరికన్ రాజ్యాంగంలోని బిల్ ఆఫ్ రైట్స్‌కూ మన రాజ్యాంగంలోని ప్రాథమిక హక్కులకూ పోలిక ఉంది.

మా అభిప్రాయంలో టాడా చట్టంలోని సెక్షన్ 3 (5)ను ఉన్నది ఉన్నట్టుగా అక్షరాలా చదవడానికి వీలులేదు. అలా చదివినట్టయితే అది రాజ్యాంగంలోని 19, 21 అధికరణాలను ఉల్లంఘించినట్టు అవుతుంది. ఆ సెక్షన్‌ను మేం పైన వెలిబుచ్చిన అభిప్రాయాల వెలుగులో చదవవలసి ఉంది. అంటే, ఒక నిషిద్ధ సంస్థలో కేవలం సభ్యత్వం ఉండడం అనేది ఒక వ్యక్తిని నేరస్తుడుగా మార్చదు. అతను స్వయంగా హింసకు పాల్పడి ఉన్నా, ప్రజలను హింసకు ప్రేరేపించినా, హింస ద్వారా గానీ, హింసను ప్రేరేపించడం ద్వారా గానీ ప్రజాభద్రతకు భంగం కలిగించినా నేరస్తుడు అవుతాడు.

అందువల్ల దరఖాస్తుదారుపై టాడా చట్టం సెక్షన్ 3 (5) కింద విధించిన శిక్ష చెల్లదని ప్రకటిస్తున్నాం. వీ

వీక్షణం పత్రికను ప్రతి నెల 29-30 తేదీల్లో పోస్టు చేస్తాం. పత్రిక 7వ తేదీలోగా అందకపోతే మాకు తెలియపర్చండి.
చందా రెన్యువల్ చేసుకున్న వారికే పత్రికను పంపించడం జరుగుతుంది.
కార్యాలయం ఫోన్ : 040 - 66843495 (ఉ. 10.30 నుండి సా. 5.30 లోపు)
**చందా మనీ ఆర్డర్ ద్వారా పంపేవారు వారి చిరునామాతో పాటు ఫోన్ నంబర్ తప్పకుండా రాయండి.**

*సంప్రదాయ మత్స్యకారుల జీవితాన్ని చిన్నాభిన్నం చేస్తూ, బడా కంపెనీల నావలు, ట్రేలర్లు చేస్తున్న విధ్వంసాన్ని, పాల్పడుతున్న ఉల్లంఘనల్ని వివరిస్తున్నారు* **నక్కా హేమా వెంకట్రావ్**

# కన్నీరొలుకుతున్న కరవాక

అటు భూమి, ఇటు సముద్రానికి మధ్య తెరచాప లాంటి తీరప్రాంతాన్నే 'కరవాక' అంటారు. రెక్కలు తప్ప ఆస్తులు లేని ఈ మత్స్యకారులు అనంతమైన సముద్రాన్ని నమ్ముకుని బతుకు పోరులో కష్టాల్ని దిగమింగుతూ ఎన్నో తరాలుగా జీవితాల్ని నెట్టుకొస్తున్నారు. ప్రతి సంవత్సరం 80 మిలియన్ టన్నుల మత్స్య సంపదను వేటాడి వెలికి తీస్తున్నారు. మత్స్య పరిశ్రమ ద్వారా సమాజానికి ఆర్థిక, ఉపాధి ఉద్యోగ కల్పనతో పాటు ప్రపంచ జనాభాలో 40 శాతం జనాభాకు ఆహార భద్రత కల్పిస్తున్నారు. సెంట్రల్ మెరైన్ ఫిషరీస్ రీసెర్చ్ ఇనిస్టిట్యూట్ ప్రకారం 12 మిలియన్ల మంది మత్స్యకారులు తీరప్రాంతాలలో జీవిస్తున్నారు. దేశంలో 8118 కి.మీ. తీరప్రాంతం ఉండగా రాష్ట్రంలో 974 కి.మీ. విస్తరించి ఉంది. మన రాష్ట్రంలో 498 చేపల రేవులు 2278 మరబోట్లు, 9735 మీటరు బిగించిన నావలు, 13083 సాంప్రదాయ నావలు ఉన్నాయి. ఏప్రిల్16 నుండి జూన్15 వరకు చేపల వేట నిషేధం.

ప్రకృతి పరంగా తమకు లభించిన సహజ వనరులను మత్స్యకారులు ఉమ్మడిగా పొందుతూ ఉమ్మడి జీవన విధానానికి ఈనాటికి మారుపేరుగా ఉన్నారు. దానికి కారణం వారి బతుకు తెరువు వారి జీవనవిధానంపై ఆధారపడి ఉండటమే. ఇప్పటికి తీరంలో ఉన్న వనరులపై, వాటి వినియోగంలో కట్టుబాట్లు పాటిస్తారు. గ్రామాన్ని యూనిట్‌గా తీసుకొని వలకట్లను కేటాయిస్తారు. నీటిలో దిగకున్నా, ఒడ్డున ఉన్నా వాటా లభిస్తుంది. మత్స్యకారులు చేపల వేటలో వనరుల పరిరక్షణ, పర్యవేక్షణను దృష్టిలో ఉంచుకొని అవసరాల మేరకు వేటచేసి మత్స్యసంపద పరిరక్షణకు చర్యలు తీసుకొంటారు. అలాగే సముద్ర తీరంలోని బంజరు భూములను సాగు చేసుకుంటారు. అయితే ఈ భూములు గ్రామానికి చివర్న ఉండడం వలన నీటి సరఫరా కొరకు అగ్రకుల వర్గాల మీద ఆధారపడడం జరుగుతుంది. ఆక్వాకల్చర్ వలన భూముల విలువ పెరగడంతో ఆధిపత్య కులాలవారు నయానా భయానా వారి భూములు ఆక్రమించుకుంటున్నారు.

మత్స్య పరిశ్రమలో పట్టిన చేపలను రేవులలో గ్రేడింగ్ చేయడం, వేలం పాడడం, శుభ్రపరచడం, ఎండబెట్టడం, నిల్వ చేయడం అమ్మకం తదితర అన్ని పనులు మహిళలు చేస్తారు. వీటితో పాటు కుటుంబ బాధ్యతలను తీర్చే మరో కర్తవ్యం మహిళపై ఉంది. వలలు తయారు చేయడం వేటకు అవసరమైన వనరులు సమకూర్చడం, నావ తదితర పరికరాలను శుభ్రపరచడం వగైరా పనుల్లో ప్రధాన పాత్ర వహిస్తారు. గతంలో స్త్రీలు చేపల వేటలో పాల్గొనేవారు కాదు. కాని ఇప్పుడు అడవి వేటలో పాల్గొంటున్నారు. వేటకు వెళ్లకపోయినా తమ పురుషులతో పాటు నావలపై వలను లాగడానికి సహాయపడతారు. వ్యవసాయ ఉత్పత్తిలో స్త్రీల భాగస్వామ్యం విషయమై ఓ మేరకు లెక్కలు ఉన్నా కరవాక మహిళ దగ్గరకు వచ్చేటప్పటికి ఆమె శ్రమశక్తి, ఉత్పత్తిలో ఆమె భాగం గురించి గణాంకాలు ఏమీ లేవు. ఇన్ని చేసినా పితృస్వామ్య భావజాలం ఈ మహిళల జీవితాలపై ప్రభావాన్ని చూపుతూనే ఉంది. ఇంట్లో పురుషుని పెత్తనం, అధిక పని, బయటకు వెళితే బి.సి. కులానికి చెందిన వీరిపై ఆధిపత్యకులాల పెత్తనం, లైంగిక దోపిడీ ఇంకా కొనసాగుతూనే ఉన్నాయి. ప్రస్తుతం బి.సి. వర్గీకరణలో ఉన్న ఈ పల్లెకారులు తమను ఎస్.టి.లలో చేర్చాలని కొన్ని దశాబ్దాలుగా పోరాడుతున్నా ఫలితం శూన్యం.

సంవత్సరానికి రు. 7000 కోట్లకు పైగా విదేశీ మారక ద్రవ్యాన్ని దేశానికి అందిస్తున్న మత్స్యకారులపై ప్రపంచీకరణ చావు దెబ్బకొట్టింది. ప్రైవేటీకరణ కారణంగా ప్రభుత్వ మద్దతుతో యాంత్రీకరించబడిన పెట్టుబడిదారీ రంగం వేళ్లూనుకోగా ప్రభుత్వ మద్దతు లేక సాంప్రదాయ మత్స్యకార రంగం నానాటికి కునారిల్లుతున్నది. దాని ప్రభావం కరవాక జీవులపై కూడా పడింది. సరళీకరణ, ప్రైవేటీకరణలో భాగంగా పెట్టుబడుల ఆకర్షణ పేరుతో మత్స్యకారేతర వర్గం సహజవనరులతో పాటు మత్స్యకారుల జీవన విధానంపై కూడా దెబ్బతీసింది. పెట్టుబడిదారీ వర్గం ఉత్పత్తితోపాటు వ్యయాన్ని పెంచి కనీస ప్రమాణాలకు నీళ్లొదిలేసింది. సంప్రదాయ మత్స్యకారులు చేపల వేటకు వాడే వలను అర అంగుళం వలకన్ను నిడివి ఉండేటట్లు తయారు చేసేవారు. కాని లాభాలే లక్ష్యంగా ప్రవేశించిన పెట్టుబడిదారీ వర్గానికి ఇవేవి పట్టవు. మరబోట్లలో లోతట్టు జలాల్లో ప్రవేశించి మత్స్యసంపద పరిరక్షణ, పర్యావరణ నియమ నిబంధనలకు విరుద్ధంగా భవిష్యత్తు తరాల సంపదనూ దోచేస్తున్నారు. నావల తయారీ, వలల తయారీ పెద్ద పెద్ద కాంట్రాక్టర్ల చేతులలోకి వెళ్లిపోయింది. ఫైబర్ వాడకం, ఇంజన్ వినియోగం ఎక్కువైంది. ప్రభుత్వం కాంట్రాక్టర్లు, డీలర్ల నుండి వచ్చినంత దండుకోవడం, వారికి కొమ్ముకాయడం వలన రెట్టింపు ధరలకు తమ వస్తువులను అమ్మకానికి పెడుతున్నారు. దాని వలన మత్స్యకారులు నష్టాలపాలవుతున్నారు. వలల తయారీ స్థానికంగా ఉన్నప్పుడు స్త్రీలు, పిల్లలకు ఉపాధి దొరికేది. విదేశాల నుండి దిగుమతి చేసుకున్న ఫిషింగు నౌకలకు కస్టమ్స్ సుంకం మినహాయింపు, ఉత్పాదక పరికరాలు, విడిభాగాలు, ముడిపదార్థాల దిగుమతిపై వందశాతం కస్టమ్స్ ఎక్సైజు మినహాయింపు, వినియోగిస్తున్న డీజిల్ ధరలో 10 శాతం రాయితీ

ఇస్తున్నారు. అదే డీజిల్ ఆయిల్‌పై సబ్సిడీ ఇచ్చినా సాంప్రదాయ మత్స్యకారులకు 200 లీటర్లకే పరిమితం చేస్తున్నారు. ప్రభుత్వం ఆర్డర్ చేసే నావలు వలలు సరఫరా ధరలు మార్కెట్ ధరకంటే ఎక్కువే. ప్రభుత్వమే దోపిడీకి పూనుకుంటే ఇంక తిరుగేముంది?

ఇక స్థానిక వ్యాపార వ్యవస్థ స్థానంలో కమిషన్ ఏజెంటు వ్యవస్థ మొదలయింది. కష్టించే వర్గం ఒకటైతే పెట్టుబడుల పేరుతో కమిషన్ల పేరుతో ఇతర వర్గాలవారు వేళ్లూనుకున్నారు. వ్యాపార దృష్టితో ఈ వృత్తిలో ప్రవేశించిన వారందరిని మత్స్యకారులుగా గుర్తించి అన్ని రకాల ప్రయోజనాలను వారికి కల్పించడం ప్రభుత్వ దమన నీతికి పరాకాష్ట. ప్రభుత్వ పర్యవేక్షణలో ఏర్పాటు చేసే ఫిషరీస్ ఫుడ్ ఫెస్టివల్‌లో మత్స్యకారుల కంటే ఇతర వర్గాల వారి స్టాల్స్ ఎక్కువగా ఉండడం గమనించవచ్చు. ప్రభుత్వం మత్స్యకారులకు కల్పిస్తున్న రాయితీలతో ప్రపంచీకరణ ప్రభావం పడి సాంప్రదాయ మత్స్యకారుల స్థానిక సాంకేతిక పరిజ్ఞానం చిన్నబోయింది. పెద్ద కంపెనీలు తమ పలుకుబడితో ప్రభుత్వ విధానాలనే మార్చివేసాయి. ఉపాధిపరంగా పెరిగిన పెట్టుబడి వ్యయంతో సాంప్రదాయ మత్స్యకారులు అప్పులపాలై మరబోట్లలో కూలీలుగా, కాంట్రాక్టు కూలీలుగా మిగిలారు. మార్కెట్‌ను శాసిస్తున్న వర్గాలు అత్యాధునిక పరిజ్ఞానంతో ప్రాసెసింగ్, గ్రేడింగ్ ప్యాకింగ్ చేయడం వలన స్థానికులకు ఉపాధి మృగ్యం అయింది. దీనితో సాంప్రదాయ మత్స్యకారులు అనేకమంది ఇతర ప్రాంతాలకు వలసపోతున్నారు. వీరు కుటుంబాలను స్థానికంగా వదిలివేయడంతో స్త్రీలు, పిల్లలు అనేక రకాల దోపిడీకి గురవుతున్నారు. కోట్ల రూపాయల ఉత్పత్తిని దేశానికి అందిస్తున్న మత్స్యకారులు తమ వనరుల సమీకరణకై వడ్డీ వ్యాపారులపై, మధ్య దళారులపై ఆధారపడి తమ ఆదాయంలో 60 శాతం వారికే ధార పోస్తున్నారు. 82 శాతం మత్స్యకారులకు స్వంత నావలు, వలలు లేవు. సరైన రుణ, మార్కెట్ సౌకర్యం, శీతలీకరణ, రవాణ సౌకర్యాలు, గిట్టుబాటు ధరలు లేక రోడ్డుపాలవుతున్నారు. అందుకే మత్స్యకారులకు సంవత్సరానికి 200 రోజులు కూడా చేపలవేట సాగడం లేదు. ప్రస్తుతమున్న పరిజ్ఞానంతో సాంప్రదాయ మత్స్యకారులు సముద్రంలో రాత్రిళ్లు వలలను వదిలి ఉదయం లాగేస్తారు. నీటి ఎద్దడి ప్రవాహాన్ని బట్టి ఆ వలలు 4, 5 గంటలలో 60, 70 కి.మీ. దూరం వెళ్లిపోయే అవకాశం ఉంది. ఆ పరిస్థితులలో నియంత్రణ రేఖ దాటారని కోస్టు గార్డులు వారిని కస్టడీలో తీసుకొని వేధిస్తూ ఉంటారు.

అంతర్జాతీయ కార్మికసంస్థ అంచనా ప్రకారం ప్రపంచవ్యాప్తంగా లక్ష మంది మత్స్యకార్మికులలో సాలీనా ప్రమాదవశాత్తూ 80 మంది మరణిస్తున్నారు. సగటున 2,40,000 మంది ప్రాణాపాయం కాని ప్రమాదాల బారిన పడి అంగవైకల్యం పొందుతున్నారు. ఈ కార్మికులు ఎటువంటి సామాజిక భద్రత, హక్కులు లేని అసంఘటిత కార్మిక రంగంలో పనిచేస్తున్నారు. గుర్తింపు లేని అసంఘటిత కార్మిక రంగంలో పని చేస్తున్నందున కార్మిక చట్టాలు వర్తించడం లేదు. 1920 నుండి 2007 వరకు జరిగిన వివిధ సదస్సులలో అంతర్జాతీయ సంస్థ ఎన్నో తీర్మానాలను చేసింది. నౌకల పైన, మత్స్య పరిశ్రమలో పనిచేసే కార్మికులకు ఎనిమిది గంటలు లేదా వారానికి నలభై ఎనిమిది గంటలు పని ప్రామాణికంగా ప్రతిపాదించింది. 15 సంవత్సరాలు ఉన్నవారినే కార్మికులుగా నియమించాలని, వాణిజ్యపరమైన నౌకలలో ఉద్యోగ నియామకాలలోని నియమ నిబంధనలపై యజమాని, కార్మికుడు పరస్పర అంగీకార పత్రంపై సంతకాలు చేయాలని, ఇంకా భద్రతా, ఆరోగ్యంపై విధివిధానాలు రూపొందించారు. వినోదపు వేట మినహాయించి సంప్రదాయ మత్స్యకారులలో సహ భద్రత, ఆరోగ్యం, సౌకర్యాల కల్పనకు తీర్మానాలు చేయడం జరిగింది. అయినప్పటికీ కూడా జాతీయ ప్రభుత్వాలు అమలు చేస్తున్న చట్టాలు, యంత్రాంగం కూడా మత్స్యకారులకు పనిగంటల పని ఒప్పందాలు, పని ప్రదేశాలలో సురక్షితమైన పారిశుద్ధ్య వసతులు, సామాజిక భద్రత వంటి విషయాలపై దృష్టి సారించలేదు. మత్స్య పరిశ్రమాభివృద్ధికి జాతీయ మత్స్యాభివృద్ధి మండలి ఏర్పాటు చేసినా అది నిధుల కేటాయింపు తదితర విషయంలో సంప్రదాయ మత్స్యకార్మికులను పూర్తిగా విస్మరించింది. సముద్ర తీర ప్రాంతంలో ఉన్న వనరుల వినియోగంలో సంప్రదాయ మత్స్యకారులను భాగస్వాములను చేయటానికి ఎలాంటి కార్యక్రమాలు రూపొందించలేదు. అక్వా కల్చర్ అభివృద్ధికి నిధులు కేటాయిస్తూ సముద్ర జలాల్లో సముద్ర జీవరాశి ఉత్పత్తి చేయడానికి ఆయా నీటి వనరులపై హక్కులు కల్పించడానికి ఎలాంటి చర్యలు తీసుకోవడంలేదు. పైగా మత్స్యకారులకు విడుదలవుతున్న నిధులలో 10 శాతం కూడా మత్స్యకారులకు చేరడం లేదు. ఎక్కువ భాగం ఉద్యోగుల జీతభత్యాలకే సరిపోతుంది. ఈ శాఖలో అగ్రకులాల వారిదే పెత్తనం. ఇక మత్స్యకార కో–ఆపరేటివ్ సొసైటీలు మత్స్య కార్మిక వ్యతిరేక విధానాలతోను, అవినీతితోను నిండిపోయి రాజకీయ జోక్యంతో పనికి రాకుండా పోయాయి. స్వచ్ఛంద సంస్థల విషయానికి వస్తే తీర ప్రాంతంలో వైపరీత్యాలు, సునామీ, తుఫాను లాంటివి వచ్చినపుడు కొన్ని కోట్ల రూపాయలు ప్రభుత్వం నుంచి విదేశీ సంస్థల నుంచి నిధులను పొంది వారు లాభపడ్డారే తప్ప మత్స్యకారులకు ఒరిగింది ఏమీ లేదు.

ప్రపంచ పెట్టుబడిదారీ వర్గం 60, 70, 80 దశాకాలలో సముద్ర వనరులపై త్వరితగతిన లాభాలు గడించడం చూసింది. చేపల వేటలో అనైతిక విధానాలు, కాలుష్యం వల్ల వార్షిక చేపల వేట 8.5మిలియన్లకు పడిపోయింది. సముద్రతీర పర్యావరణం దెబ్బతినడంతో ఆయా దేశాలు అట్లాంటిక్, పసిఫిక్, మధ్యధరా సముద్రజలాలో చేపల వేట నియంత్రణ చట్టాలు చేసాయి. 60 వ దశకంలో ఐక్యరాజ్య సమితి తీర్మానాల ప్రకారం అభివృద్ధి చెందిన దేశాలు ప్రత్యేక చట్టాలు చేసాయి. చాలా చోట్ల చేపల వేట ప్రదేశాలు రక్షిత ప్రదేశాలుగా మలచబడ్డాయి. ఇలాంటి దశలోనే భారత సరళీకృత విధానం సామ్రాజ్యవాద పెట్టుబడిదారీ వర్గానికి తలుపులు బార్లా తెరిచింది. నగరీకరణ, పారిశ్రామికీకరణ, ఓడరేవుల అభివృద్ధి, ఆధునీకరణ పర్యాటకాభివృద్ధి పేరిట కరవాక కార్మికుల జీవితాలలో సునామి సృష్టించింది. అభివృద్ధి చెందిన దేశాలలో మూలపడ్డ ఫిషింగ్ వెస్సల్స్ భారత ప్రత్యేక వాణిజ్య మండలిలోకి చొచ్చుకువచ్చాయి. సబ్సిడీలు, వందశాతం ఎగుమతుల అనుమతి, విదేశీ పోర్టులను వాడుకోవడానికి అనుమతులు, భారత తీరంలో ఆగి తీరాలన్న నిబంధన సడలింపులతో మరింత దోచుకున్నాయి. తరతరాలుగా సంపాదించు కున్న పరిజ్ఞానంతో పర్యావరణం, మత్స్య సంపద దెబ్బ తీయకుండా వేట కొనసాగించిన మత్స్యకారుల స్థానంలో బడా కంపెనీల నావలు, ట్రాలర్స్ పుట్టుకొచ్చాయి. ఇందులో టాటా, మహీంద్రా, ఐ.టి.సి. హిందుస్థాన్ లీవర్, డన్‌లప్ వారి స్వదేశీ, అమెరికా, జర్మనీ, జపాన్‌వారి విదేశీ నౌకలు తీరంలో కొన్ని వందల అనుమతులు సంపాదించాయి. వారి వేటలో సగానికి పైగా పరిణతి చెందని జీవరాశులే. అభివృద్ధి చెందిన దేశాలు సముద్రంలో నిక్షిప్తమైన ఖనిజ సంపదపై కూడా కన్ను వేశాయి. ప్రత్యేక ఆర్థిక మండళ్లు, కోస్టల్ కారిడార్‌ల కోసం రాజ్యాంగ

స్ఫూర్తికి విరుద్ధంగా చట్టాలు చేసి, నీరు, భూమి, అడవుల్ని విదేశీ గుత్త పెట్టుబడిదారులకు అతి చౌకగా అప్పగిస్తూ దేశ సారభౌమత్వాన్ని తాకట్టుపెడుతున్న పాలకవర్గాలు సాంప్రదాయ మత్స్యకారుల ప్రాథమిక హక్కులను కూడా కాలరాసాయి.

సాంప్రదాయ మత్స్యకారులు తమ సాంప్రదాయ ఉమ్మడి హక్కుల కోసమే కాకుండా యాంత్రీకరణ, సామ్రాజ్యవాద పెట్టుబడిదారీ వర్గానికి వ్యతిరేకంగా పోరాడారు. 70వ దశకంలో చాలా చోట్ల హింసాత్మక సంఘటనలు చోటు చేసుకున్నాయి. వీరు ప్రధానంగా తీరంలో 20 కి.మీ. మేర మరబోట్లు రాకూడదని, వలకన్ను చిన్నదిగా ఉండకూడదనే డిమాండ్లతో పోరాడారు. రాత్రిపూట ట్రాలర్లు వేట చేయరాదని, తమ ప్రాంతాల్ని ఖాళీ చేయించరాదని, టూరిజానికి వ్యతిరేకంగా పోరాడారు. ఎడతెగని పోరాటాల ఫలితంగా 1979లో తీర ప్రాంత ప్రాదేశిక జలాల చేపల వేట నియంత్రణ నియమావళి రూపొందించారు. కేరళ, గోవాలు 1980లో చట్టాలు చేసాయి. ఆ తరువాత అన్ని రాష్ట్రాలు కూడా చట్టాలు చేసాయి.

1990 సంవత్సరంలో లోతట్టు సముద్ర జలాలలో చేపల వేట విధి విధానాలను ప్రకటించి విదేశీ పారిశ్రామిక నౌకలు, దేశ విదేశాల సంయుక్త ఆధ్వర్యంలో నిర్వహించే నౌకలకు చేపల వేటకు అనుమతి ఇచ్చారు. దేశవ్యాప్త ఆందోళన ఫలితంగా కేంద్రం మురారి కమిటీని నియమించింది. కమిటీ అనుమతులు ఇవ్వరాదన్న కమిటీ సిఫార్సులకు ప్రభుత్వం తూట్లు పొడిచింది. 1991 లో కోస్తాతీర ప్రాంత నియంత్రణ ప్రకటనను కేంద్ర ప్రభుత్వం విడుదల చేసింది. దీని ప్రకారం 500 మీటర్ల లోపల ఎలాంటి కట్టడాలు కట్టకూడదు. బహుళజాతి సంస్థలు, బడా పెట్టుబడిదారుల ప్రయోజనాల కోసం కోస్టల్ మేనేజిమెంట్ జోన్ నోటిఫికేషన్ ఇచ్చినా మత్స్యకార ప్రజాసంఘాల ద్వారా ప్రభుత్వం విరమించుకుంది. అయినప్పటికీ టూరిజం పేరిట, ప్రాజెక్టుల పేరిట పర్మినెంటు కట్టడాలు కడుతూనే ఉన్నారు.

ఆ తర్వాత కేంద్ర ప్రభుత్వం తీరప్రాంత ప్రాదేశిక జలాలలో చేపల వేట సంబంధిత కార్యకలాపాలను నియంత్రించడం, మత్స్య సంపదను కాపాడడం, చేపల వేటకు ఉపయోగించే అన్ని పడవలు, బోట్లు, నౌకలను నియంత్రించడం, సముద్ర ప్రాంతంలో జాతీయ భద్రతా ప్రయోజనాలను కాపాడాలనే లక్ష్యంతో 'ది మెరైన్ ఫిషరీస్(రెగ్యులేషన్ అండ్ మేనేజిమెంట్) చట్టం 2009 పేరుతో పార్లమెంట్‌లో బిల్లు ప్రవేశపెట్టి చట్టం చేయడానికి ప్రయత్నం చేస్తున్నది. పేరయితే మత్స్యకార జాతీయ ప్రయోజనాలు కాని ఇప్పటికే తీర ప్రాంతాన్ని బహుళ జాతి కంపెనీలకు ధారాదత్తం చేసింది. నిన్న మొన్నటి వరకు తీరంలోని ఇసుక తిన్నెలు, సముద్ర తీర జలాలు, నీటి కయ్యలు, చింకలు, ఆల్చి, గడ్డి గోదాములు నిండిన ఉప్పునీటి పరీవాహక ప్రదేశాలు, మడ అడవులు మొదలైన వాటిని పరులకు ధారాదత్తం చేసాయి. ఈ చట్టం అంటే మత్స్యకారుల దృష్టిలో నావలు, తెప్పలు రిజిస్ట్రేషన్, లైసెన్స్ ఫీజులు కట్టడమే. ఈ బిల్లు ప్రకారం మత్స్యకారులు 24 కి.మీ. పరిమితులు లేకుండా వేట చేసుకోవచ్చు. కానీ సరిహద్దుల నియంత్రణలో శాస్త్రీయత లోపించడం, మరబోట్లు, ట్రాలర్లు ఇష్టానుసారంగా మత్స్యకారులకు కేటాయించిన ప్రాంతంలో జొరబడి ఇప్పటికే వేట చేయడంతో పాటు వారి వలలను, నావలను ధ్వంసం చేయడం పరిపాటిగా మారింది. కాకినాడ దగ్గర హోప్ ఐలాండ్ ప్రాంతాలలో ఇసుక తవ్వకాలు, అమలాపురం దగ్గర ఓ.ఎన్.జి.సి. వదులుతున్న కాలుష్యం లాంటి సంఘటనలు తీరప్రాంతాన సర్వ సాధారణమయ్యాయి. కోస్టల్ కారిడార్ ప్రాంతంలో విశాఖకు దగ్గరగా కాలుష్యం వలన చనిపోయిన మత్స్యజీవరాశులెన్నో. వివిధ రకాల, పరిమాణాలతో నిర్మించబడే నావలు, నౌకలపై, వాటి సంఖ్యను పరిమితి చేయడం చట్టం లక్ష్యం అయినా అది కేవలం సాంప్రదాయ మత్స్యకారులకే పరిమితం అవుతుంది. చట్టం ప్రకారం రాష్ట్రాలలో ప్రకటించబడిన ప్రాదేశిక జలాల సరిహద్దు (ఆంధ్ర తీరం నుండి 8 కిలోమీటర్లు ఒడిశా నుండి 5 కిలోమీటర్లు, కర్నాటక 10 కిలోమీటర్లు సరిహద్దులుగా ఆ రాష్ట్రాలు ప్రకటించాయి) లలో వేట చేసుకోవడానికి రాష్ట్ర మత్స్యశాఖ వారి నుంచి అనుమతి తీసుకోవాలి. ఈ పరిధి దాటి 24 కిలోమీటర్ల లోపల వేట చేసుకోవడానికి కేంద్రం నుంచి అనుమతి తీసుకోవాలి. అతిక్రమించి నట్టయితే బోటును స్వాధీనం చేసుకోవచ్చు. దానితో పాటు 9 లక్షల రూపాయలు లేదా బోటు విలువ కాని వాటిలో ఏది ఎక్కువ ఉంటే దానిని జరిమానాగా చెల్లించాలి. లేదా మూడేళ్ల జైలుశిక్ష కూడా విధించవచ్చు. లేదా జరిమానాతో పాటు జైలు శిక్ష విధించే నిబంధనలు ఈ కొత్త చట్టం ద్వారా అమలయ్యే అవకాశం ఉంది. ఈ నియమ నిబంధనలన్నీ యూరోపియన్ యూనియన్ ప్రమాణాలకు అనుగుణంగా చేయబడ్డవే. ఈ చట్టం లక్ష్యం సాంప్రదాయ మత్స్యకారుల హక్కులకు పరిమితులు విధించి, బహుళజాతి కంపెనీలకు సర్వహక్కులను కట్టబెట్టడమే. అంతేకాక భారతదేశ సార్వభౌమాధికారం కింద ఉన్న ప్రత్యేక వాణిజ్య మండలాల పరిధిలో గల సముద్రజలాల్లో విదేశీ నౌకలకు ప్రవేశాన్ని చేపల వేట పేరుతో లైసెన్సు అందచేయడం దేశభద్రతకే ముప్పు.

గిరిజనులు అడవిని నమ్ముకున్నట్టే మత్స్యకారులు కడలిని నమ్ముకున్నారు. అయితే మహిళలు, కార్మికులు తమ దోపిడి, అణచివేతపై పోరాడి మార్చి 8, మే 1 తేదీలను తమ హక్కుల దినంగా ప్రకటించు కున్నారు. కాని మత్స్యసంపద, తీరప్రాంత పర్యావరణ రక్షణ ఆయా ప్రాంతాలలోని సహజ వనరులపై ఆధారపడిన సాంప్రదాయ మత్స్యకారు లను, పశుపక్ష్యాదులను రక్షించుకోవడానికి అంతర్జాతీయ ఆహార సంస్థ నవంబరు 21న ప్రపంచ మత్స్యకారుల దినోత్సవాన్ని ప్రకటించినా దానిపట్ల అవగాహనను, ఆచరణను గ్రామస్థాయిలోకి ప్రభుత్వం తీసుకెళ్ల లేకపోయింది. అది కేవలం కొన్ని ప్రభుత్వ కార్యక్రమాలకే పరిమితమైంది.

అయినప్పటికి గడిచిన దశాబ్దకాలంలో తీరంలో పరిశ్రమలకు వ్యతిరేకంగా, పర్యాటక కేంద్రాల స్థాపన, దేశ సార్వభౌమత్వాన్ని తాకట్టు పెడుతున్న పాలకుల కుట్రలకు వ్యతిరేకంగా తమ తీరాల పరిరక్షణ కోసం, సాంప్రదాయ ఉమ్మడి హక్కుకోసం ప్రజలు పిడికిలెత్తుతున్నారు. వారి ఆక్రందనల అలల హోరు, తాకిడి సోంపేట, గంగవరం, వాన్‌పిక్, కాకినాడ, మహాముంబయి సెజ్, మంగుళూరు, ముంద్రా తదితర ప్రాంతాల ఉద్యమాలను తాకింది. తమ హక్కులకై ఉవ్వెత్తున లేచిన మత్స్యకారులు తమపై దోపిడి ఏ రూపాన ఉన్నా సునామీలా ముంచేస్తారని చరిత్ర చెప్పిన సత్యం. పోటెత్తిన సంద్రపు అలలపై వెండి జలతారులా మెరిసే వెన్నెల్లాగా వారి స్ఫూర్తి, చైతన్యాన్ని మన ఆలోచన ఆచరణలో భాగం చేసుకొని వారి పోరాటానికి బాసటగా ఉంటామని బాస చేస్తూ మనం కూడా వారితో కలిసి నడుద్దాం.!

(సాంప్రదాయ మత్స్యకారుల సేవా సమితి ప్రధాన కార్యదర్శి, రాష్ట్ర నాయకులు నాయుడు వెంకటేశ్వర రావు సహకారంతో...)

*(రచయిత సామాజిక కార్యకర్త)*

వీ

*భూమికీ, మనిషికీ సంబంధాన్ని నిర్దేశించే రెవెన్యూ పాలన ప్రారంభం, పూర్వాపరాల చరిత్రను వివరిస్తున్నారు*

**ఎస్. సరళా వందనం**

# ఆంధ్రప్రదేశ్‌లో రెవెన్యూ పరిపాలన - 3

*(గత సంచిక తరువాయి...)*

ఔరంగజేబు సుబేదారుగా ఉన్న కాలంలో కింది స్థాయిలో జీతం ఇచ్చే పద్ధతిపై గ్రామ స్థాయి నుంచి రెవెన్యూ వసూలుకు ఉద్యోగులను నియమించేవారు. వీరు పట్వారీ (గ్రామాధికారి), ముఖద్దమ్ (గ్రామ పెద్ద), కుల్‌కర్ణి (గ్రామంలోని రైతులు, ఇతరులు ప్రభుత్వానికి ఎంత పన్ను కట్టాలో ఆ వివరాలు నమోదు చేసే ఉద్యోగి), తహవిల్దార్ (క్యాషియర్), ముహరిర్ (సీళ్లు లేదా స్టాంపులు భద్రపరిచేవాడు), కారుకున్ (క్లర్క్, మేనేజర్ లేదా ఏజంట్‌గా పనిచేస్తూ రెవెన్యూ వసూలు, ఇతర ఆర్థిక సంబంధ వసూళ్లకు నియమింపబడిన ఉద్యోగి), ముష్రిఫ్ (లెక్కలను పరీక్షించేవాడు (ఆడిటర్)), తహసిల్దార్ (ప్రభుత్వానికి వచ్చే పన్నులను వసూలు చేసే ఉద్యోగి) మొదలయినవారు.

క్రీ.శ. 1652లో మొఘలుల ప్రత్యక్ష పరిపాలన రాష్ట్రంలో మొదలు కాక ముందు భూమిపై పన్ను వసూలు చేసే అధికారం జమీందారులకు ఉండేది. వీరు ఎక్కువగా మొఘలుల పరిపాలనకు ముందు చిన్న చిన్న స్వతంత్ర రాజ్యాలకు రాజులుగా ఉన్నవాళ్లు. ఈ జమీందార్లు ప్రజల దగ్గర నుంచి ఎంత పన్ను వసూలు చేస్తుందీ చక్రవర్తికి తెలియనిచ్చేవారు కారు. ప్రజలను విచారించినా కూడా స్థానికంగా ఉన్న వీళ్లకు భయపడి ఏం చెప్పేవారు కాదు. అందుకే నిజమైన రెవెన్యూ వసూలు తెలుసుకోవడానికి, ఈ జమీందార్ల దగ్గర 'కానుంగో' పేరుతో రెవెన్యూ లెక్కలను తయారు చేసే ఒక ఉద్యోగిని తమ ప్రతినిధిగా మొఘలులు నియమించేవారు. వీరిని దేహ్‌లకు (సాగుచేసే భూమితో పాటు కలిపిన ఒక గ్రామం), మౌజా (చిన్న గ్రామం), పరగణా (కొన్ని గ్రామాల సముదాయం)లకు ఒకరిని కాని, పెద్ద విస్తీర్ణాలకు ఒకరికంటే ఎక్కువ మందిని కాని నియమించేవారు. కానుంగోలు జమలెక్క (వసూలు మొత్తం), జమాబంది (వాస్తవంగా వసూలు చేయాల్సిన భూమి శిస్తు), జమ - ఎ - కమాల్ (భూమి శిస్తు ద్వారా వచ్చే ఆదాయం), జమ-వసూల్-బాకీ (కట్టాల్సిన భూమి శిస్తు వివరాలు), వసూల్ (వసూలు చేయాల్సిన మిగిలిన మొత్తం) (తమకు కేటాయించిన జమీందారి ఆధీనంలో ఉన్న భూమి పరిధిలో) తో కూడిన వివరాలను తయారు చేసేవారు. వీరు ప్రతి సంవత్సరం పాత పట్టికలలోని వివరాలు బట్టి కొత్త లెక్కలను తయారు చేసేవారు.

రకరకాల పద్ధతులలో శిస్తు వసూలు చేసే అధికారం కలిగిన వ్యక్తులను మొఘలులు నియమించారు. సర్‌దేశ్‌ముఖ్ (పన్ను వసూలు చేసి అందులో 10 శాతం మొత్తాన్ని తీసుకునే అధికారం కలిగినవారు), దేశ్‌ముఖ్ (వంశపారంపర్యంగా ప్రభుత్వం తరఫున రెవెన్యూ వసూలు చేసే హక్కును పొందినవారు) లను నియమించారు. సహజంగా ఈ సర్ దేశ్‌ముఖ్‌లు, దేశ్‌ముఖ్‌లుగా జమీందార్లే ఉండేవారు. వీరు రెవెన్యూ డిమాండ్‌గా నిర్దేశించిన మొత్తంలో కొంత మొత్తాన్ని ముందుగానే చెల్లించి (పేష్‌కష్ అంటారు) భూమి శిస్తు వసూలు చేసుకొనే అధికారాన్ని మొఘలుల దగ్గర పొందేవారు. వీరికే చక్రవర్తి భూమి పన్నుల వసూలుకు సంబంధించిన అన్ని లావాదేవీల ఫర్మానాలు (ప్రభుత్వ ఉత్తర్వులు) పర్‌వాణాలు (అధికారం ఉన్నవారు తమపై ఆధారపడిన, తమ దగ్గర పనిచేసే వారికి ఇచ్చే ఉత్తర్వులు) ఢిల్లీ నుంచి పంపించేవారు. సాధారణంగా వీరికి తాము వసూలు చేసిన పన్నులో 100 భీగాల భూమికి వసూలయిన శిస్తును తమ ఖర్చులకు ఉంచుకొనే ఆనవాయితీ ఉండేది. కొన్నిసార్లు వీరికే భూములను పన్ను చెల్లించనవసరం లేకుండా ఇనాముగా కూడా మొఘలులు ఇచ్చేవారు.

ఔరంగజేబు పరిపాలనకు రాకముందు, తరువాత కూడా మరాఠావీరులు మంచి ఆయుధ సంపత్తి కలిగిన సైన్యంతో ముఖాముఖి గానూ, గెరిల్లా యుద్ధం ద్వారానూ, తిరుగుబాటుల ద్వారానూ పఠానులను గాని, ఆఫ్ఘన్‌లను గాని ఎదిరించి పోరాడి గెలుస్తుండే వారు. తరచూ వీరు బొంబాయి నుండి గోల్కొండ వరకూ రెవెన్యూను వసూలు చేసుకుంటూ గ్రామాలకు గ్రామాలనే ప్రజల ఆస్తులతో సహా స్వాధీనం చేసుకుంటూ ఉండేవారు. వీరిని అదుపు చేయడంతోపాటు మొఘలులు వారి రాజ్య విస్తరణ, పరిపాలనా సౌలభ్యం కోసం పరిపాలనను మిలిటరీతో చాల చోట్ల కలపడం జరిగింది. ఇందులోని భాగమే 'మునసబుదారీ' పద్ధతి. 'మునసబు'గా నియమింపబడిన వ్యక్తికి సైన్యాన్ని తయారు చేసుకొని యుద్ధాలు చేయాల్సిన పరిస్థితులతోపాటు చాలాసార్లు పరిపాలనా బాధ్యత, రెవెన్యూ వసూలు బాధ్యత కూడా అప్పగించేవారు. ఈ మునసబుదార్లకు వీరు తమ ఆధీనంలోని సైన్యాన్ని పోషించడానికి, ఇతర పరిపాలనా సంబంధ ఖర్చులకు, తమ స్వంత ఖర్చులకు జీతం ఇచ్చేవారు. కొన్నిసార్లు వీరికి భూమిని జాగీరుగా ఇచ్చి అందులో మొత్తం పన్నులు వసూలు చేసుకొని తమ ఆధీనంలోనే ఉంచుకునే విధంగా కూడా ఇచ్చేవారు. గ్రామ రెవెన్యూ ఉద్యోగి దగ్గర నుంచి వీరి ఆధీనంలోని జాగీరులో పనిచేసే రెవెన్యూ యంత్రాంగం యావత్తూ వీరికే పన్నులు వసూలు చేసి ఇచ్చి తమ జీతం తీసుకొనేవారు. ఈ మునసబుదార్లు

విశేష అధికారాలు కలిగి, పరిపాలన, సైన్యాన్ని ఒకేసారి చూసుకోవడం కుదరక వీరి కింద 'నాయబ్' (సహాయకులు) లను పరిపాలన చేయడానికి నియమించుకొనేవారు.

ఎన్నిరకాల యంత్రాంగాలను నియమించినా, మొఘల్ చక్రవర్తి దూరంగా ఉండడం వలన రాష్ట్రంలో స్థిరమైన పాలన అందించే శక్తులు కరువైనాయి. ప్రజలను కొల్లగొట్టి దోచుకొనే కొత్త శక్తులు ఔరంగజేబు పాలన తరువాత ఎక్కువగా ఉద్భవించాయి. పాలక కుటుంబాలలోని వారే కాకుండా, ఇతరులు కూడా రాజ్యాల కోసం పోరాటం చెయ్యడం కొత్తగా మొదలయి రాజకీయ గందరగోళ పరిస్థితులేర్పడినాయి. వీటితోపాటు పాలకులూ, ప్రభువులూ, శక్తి సంపన్నులూ తమ ఆధీనంలోని భూభాగం గుండా ప్రయాణించే వర్తకుల దగ్గర నుంచి సుంకాలూ, ఇతర పన్నులూ గుంజేవారు. ప్రయాణికులకు రహదారుల మీద రక్షణ లేకుండా పోయింది. వీరి బారి నుంచి ప్రజలను రక్షించడానికి, వర్తకుల సరుకులకు రక్షణ కల్పించడానికి మొఘల్ పాలకులు క్రీ.శ. 1707 నుంచి 'చౌత్', 'సర్ దేశ్‌ముఖ్' అనే పేరుతో పిలిచే రెండు రకాల పన్నులను ప్రజల వద్ద నుండి వసూలు చెయ్యడం ప్రారంభించారు. ఈ పన్నులను వసూలు చేయడానికి మొఘల్ చక్రవర్తి 'ఖమాయిష్‌దారులు' అనే పేరుతో పిలిచే సైన్యం కలిగిన ఉద్యోగులను నియమించేవారు.

'చౌత్' – గ్రామాలను దాడుల నుంచి, ఆస్తుల స్వాధీనం నుంచి తప్పించడం కోసం ప్రజలు వాళ్లు పండించిన పంటలో భూమి శిస్తుకు అదనంగా 25 శాతం పన్ను కట్టాల్సి ఉంటుంది. గుర్రాల మీద వచ్చి రైతులు పంట కోసుకొనే వరకూ ఈ ఖమాయిష్‌దారులు గ్రామాలలోనే ఉండి చౌత్‌ను బలవంతంగా రైతుల దగ్గర నుంచి వసూలు చేసేవారు. ఒకపక్క మరాఠా వీరులు, క్రూరమైన స్థానిక జమీందార్లు ప్రజల నుంచి బలవంతంగా భూమి శిస్తును వసూలు చేయడమే కాకుండా, మరాఠీ వీరులు పంట కోసే సమయంలో పశువులను తోలి పంటలను పాడు చెయ్యడం, గ్రామాలకు గ్రామాలే పూర్తిగా తగుల బెడుతుండడం చేస్తుండేవారు.

'సర్ దేశ్‌ముఖ్' – మొఘల్ చక్రవర్తి చాలా దూరంలో ఉండడం, సుల్తానులు ఇతర జమీందార్లు, చిన్న చిన్న స్వతంత్ర రాజులు తరచుగా మారుతూ ఉండేవారు. స్థిరమైన పరిపాలన లేకపోవడం వలన ప్రయాణాలలో వ్యాపారులకు, ఇతర ప్రజలకు భద్రత లేకుండా పోయింది. వ్యాపారులను దోచుకొనే, రహదారులు కొల్లగొట్టే దొంగలను అణచివేయడానికి, రక్షణ కల్పించడానికి గాను వ్యాపారుల దగ్గర నుంచి 10 శాతం రహదారి పన్ను వసూలు చేసేవారు. కాకపోతే సర్ దేశ్‌ముఖ్‌ను చౌత్‌లా క్రమబద్ధంగా కాకుండా పాలకులు మారినప్పుడల్లా వీరికి ధనం అవసరమైనప్పుడు తరచుగా వసూలు చెయ్యడం వలన దక్షిణ భారతదేశం అంతా కూడా వ్యాపారం స్తంభించడం ప్రారంభం అయింది. మహారాష్ట్రలో లభ్యమయిన రికార్డుల ఆధారంగా హైదరాబాద్ రాష్ట్రం నుంచి ఒక్క సంవత్సరానికి చౌత్, సర్ దేశ్‌ముఖ్ పన్నుల రూపంలో రు. 6,48,67,483 వసూలు చేశారు. ప్రజలను ఎంతగా దోచుకుంటేనో ఎంత ఎక్కువగా పీడించడం వలనో మాత్రమే అప్పటి మరాఠా వీరులు ఇంత పన్నును భూమి శిస్తు కాకుండానే వసూలు చేయగలిగారు.

క్రీ.శ. 1707లో ఔరంగజేబు చనిపోయిన తరువాత ప్రజల పరిస్థితి మరీ దిగజారింది. అధికారం పొందిన వాళ్లు, తమంతట తాము అధికారాన్ని స్వంతం చేసుకున్న వాళ్లు, గ్రామాలకు గ్రామాలనీ పన్నుల రూపంలో దోచుకోవడం, ప్రజల సంపదను లాక్కోవడం చాలా ఎక్కువయింది. దీనితో గ్రామాలకు గ్రామాలనే ఖాళీ చేసి ప్రజలు కొంత మంచి పరిస్థితులు ఉన్న చోట్లకు వలస వెళ్లిపోవడం వలన వ్యవసాయం కుంటుపడి పొలాలు బీడు భూములుగా మారిపోయాయి. గ్రామ రెవెన్యూ యంత్రాంగంపై ఖడ్గాలు, ఆయుధాలు ధరించిన వాళ్ల పెత్తనంతో శతాబ్దాల నుండి ప్రజల అవసరాలకనుగుణంగా పనిచేస్తున్న రెవెన్యూ పరిపాలన దాదాపుగా కనుమరుగయింది. ఇదే సమయంలో ముఖ్యంగా దక్షిణ రాష్ట్రాలలో ఫ్రెంచ్ వాళ్ల ప్రాబల్యం బాగా పెరిగింది.

**నిజాముల్ ముల్క్ (అసఫ్ జాహి) పరిపాలన**

దక్షిణ భారతంలోని అరాచక పరిస్థితులను సరిదిద్దడానికి, ఆధీనంలో లేని ప్రాంతాలను తమ సామ్రాజ్యంలో కలుపుకోవడానికి మొఘల్ చక్రవర్తి నిజాముల్ ముల్క్‌ను క్రీ.శ. 1713లో దక్కన్‌ను సుబేదారుగానూ, కర్ణాటకకు ఫౌజ్‌దారుగాను నియమించాడు. నిజాం ముందుగా అరాచకవాదులను అణచివేశాడు. తరువాత చౌత, సర్ దేశ్‌ముఖ్‌లను వసూలు చేసే కమాయిష్‌దారుల వ్యవస్థను రద్దు చేశాడు. భూమి శిస్తు వసూలు చేసి ఖజానాకు జమ చేయకుండా ఉన్న వారిని కఠినంగా శిక్షించాడు. ప్రజలపై కొత్తగా పన్నులు విధించకుండా, వారు వ్యవసాయం చేసుకోవడానికి కావలసిన పరిస్థితులను, శాంతిని నెలకొల్పాడు. దానితో వ్యవసాయం బాగా అభివృద్ధి చెందే పరిస్థితులు వచ్చాయి. క్రీ.శ. 1713 నుంచి 1715 వరకు తిరిగి క్రీ.శ. 1720 నుంచి 1722 వరకూ మొఘల్ చక్రవర్తి కింద దక్కన్ సుబేదారుగా ఉంటూ రెవెన్యూను ఖజానాకు జమ చేయడమే కాకుండా స్థిరమైన పరిపాలనకు బీజం వేశాడు. తరువాత క్రీ.శ. 1724లో తనంతట తనే తిరుగుబాటు చేస్తున్న జమీందారులను, మరాఠా యోధులను అణచివేయడమే కాకుండా, మొఘల్ ప్రతినిధులతో యుద్ధం చేసి, భయపెట్టి దక్కన్ సుబేదారుగా ప్రకటించుకుని రాష్ట్రాన్నంతటినీ తన పాలనలోకి తెచ్చుకున్నాడు.

నిజాం తన పరిపాలన కింద ఉన్న సామ్రాజ్యంలోని భూములను మూడు రకాలుగా విభజించాడు –

1) పాయెగా భూములు – మహమ్మదీయులకు, వాళ్లు పోషించే సైన్యానికి, మందుగుండు సామాగ్రి తయారీకి, గుర్రాలను పోషించడానికి, ఇంకా ఇతర ఖర్చులకు 1/3 వంతు భూమిని కేటాయించాడు.

2) సర్ఫ్ – ఎ – ఖాస్ భూములు – తన స్వంత ఖర్చులకు గాను 1/3 వంతు భూమిని నిజాం కేటాయించుకున్నాడు. ఈ భూమిపై పన్నులేని సంపూర్ణ హక్కును నిజాం కలిగి ఉంటాడు.

3) దివాని – ప్రభుత్వ ఖర్చుకు 1/3 వంతు భూమిని తమ ఆధీనంలో ఉంచుకొని వాటిపై వచ్చే పన్ను, ఇతర ఆదాయాన్ని ప్రభుత్వ పరిపాలనకు వినియోగించే విధంగా విభజించాడు.

*(ఇంకావుంది)*

*(రచయిత రాష్ట్ర ప్రభుత్వ రెవెన్యూ అధికారి)*

*saralareddy007@gmail.com*

# వీక్షణం రచయితల సమావేశం

వీక్షణం రచయితల ఐదవ సమావేశం జనవరి 30న హైదరాబాద్‌లోని ఎమెస్కో కార్యాలయంలో జరిగింది. ఈ సమావేశానికి వీక్షణం గౌరవ సంపాదకులు వి. హనుమంతరావు, వకుళాభరణం రామకృష్ణ, కాకరాల, విద్యాభూషణ్, ఎ. నర్సింహరెడ్డి, ఎం. రాఘవాచారి, అనిశెట్టి శంకర్, చలసాని శ్రీనివాస్, చిమ్మె జాన్ బర్మబాస్, ఘంటా చక్రపాణి, ఇంకా రచయిత, పాఠక మిత్రులు టి. రమేష్, డి. వెంకట్‌రావు, వి. వంశీచరణ్, కె.సి. వెంకటేశ్వర్లు, కె. కనకయ్య, వి. చలపతిరావు, పి. ప్రసాద్, ఎం. సురేష్, కె. లక్ష్మీనారాయణ, పి. శివలక్ష్మి, కె. రామ్‌రెడ్డి, వై. వేణుగోపాల్‌రెడ్డి, వై. వెంకటేశ్వరరావు, వై. నర్సింలు, అసహజ మరణాల సూచి సేకరణకర్తలు డి. విజయభాస్కర్, ఎ. కుమార్, బి. అంజమ్మ, మొహమ్మద్ ఇక్బాల్, జి. వెంకటేశ్వర్లు, ఎన్. భగవాన్‌రెడ్డి, ఎస్.నీలాదేవి, సి.ఎచ్. శ్రీమన్నారాయణ ఈ సమావేశంలో పాల్గొన్నారు.

వీక్షణం సర్క్యులేషన్ మేనేజర్ వై. రామచంద్రం రచయితలకు స్వాగతం చెప్పారు. సమావేశానికి వకుళాభరణం రామకృష్ణ అధ్యక్షత వహించారు. ఈ సందర్భంగా, గత సమావేశంలో అనుకున్న లక్ష్యాలలో కొన్నిటిని నెరవేర్చామని, ఇంకా చేయాల్సిన పనులు, సాధించాల్సిన లక్ష్యాలు చాలానే ఉన్నాయని అన్నారు. వీక్షణం పది కాలాలు నడవడానికి మూలనిధి ఏర్పాటు చేసుకోవడం చాలా అవసరం. ఆ ప్రయత్నం మనం కొనసాగిస్తుండాలని, ఈ సమావేశం కూడ అర్థవంతమైన చర్చతో, ఆచరణయోగ్యమైన సూచనలతో జరుగుతుందని ఆశను వ్యక్తం చేశారు.

సమావేశాన్ని ప్రారంభిస్తూ వకుళాభరణం రామకృష్ణ తెలుగు సమాజం గణనీయమైన మార్పులకు గురవుతోందన్నారు. యాభై ఏళ్లుగా రాజకీయ స్పృహతో, వామపక్ష భావజాలంతో పని చేశాం. భవిష్యత్ ఎలా ఉండబోతోందనే ఒక ఆందోళన ఉందనీ, అయితే నిరాశ ఏమి లేదనీ అన్నారు. 1990 ల తరువాత వచ్చిన ఉదారవాద ఆర్థిక విధానాలు, వ్యతిరేకంగా వచ్చిన ఉద్యమాలు ఇలా మారిన పరిస్థితులలో వీక్షణం ప్రారంభం నాటికంటే ఇప్పుడు మరింత బాధ్యత పెరిగిందన్నారు.

గౌరవ సంపాదకులు వి. హనుమంతరావు మాట్లాడుతూ వీక్షణంను ఎ.బి.కె. ప్రసాద్, వేణుగోపాల్‌తో కలిసి ప్రారంభించానని అన్నారు. పత్రికను ఇన్నాళ్లు నడిపించడం, దానికదిగా ఒక విజయంగా భావిస్తున్నానని అన్నారు. మరిన్ని కాలాలు నడిపించాలన్నారు. ఆదాయం కన్న ఖర్చు బాగా పెరిగింది. అంతర్జాతీయ పరిస్థితులపై, కుంభకోణాలపై ప్రత్యేక దృష్టి సారించాలని అన్నారు. పేజీలు పెంచాలన్నారు. డిసెంబర్‌తో సహా వీక్షణంలో అచ్చయిన రచనల సూచి జనవరి సంచికలో ఇస్తే బాగుంటుందన్నారు.

రచయితల సమావేశ ప్రారంభంలో రచయితలను ఉద్దేశించి సంపాదకులు చదివిన రిపోర్ట్ :

వీక్షణం రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక నిర్వహిస్తున్న వార్షిక రచయితల సమావేశంలో పాల్గొనడానికి వచ్చిన ఆత్మీయ మిత్రులందరికీ హృదయపూర్వక కృతజ్ఞతలు. స్వాగతం.

పత్రికకూ రచయితలకూ మధ్య ఏకముఖ సంబంధం కాకుండా నిరంతర సంభాషణ, చర్చ, అభిప్రాయాల ఆదానప్రదానాలు ఉండాలనే అవగాహనతో వీక్షణం ఈ వార్షిక సమావేశాలను గత ఐదు సంవత్సరాలుగా నిర్వహిస్తున్న సంగతి మీకు తెలుసు. పత్రికకు ఒక రచన చేయడంతో రచయిత పని అయిపోదని, పత్రిక బాగోగులను చర్చించి తీర్చిదిద్దడంలో, లోపాలను సవరించడంలో, పత్రిక అభివృద్ధికి సహకరించడంలో రచయితలు కూడ పాలు పంచుకోవాలని ఈ సమావేశాలు ఏర్పాటు చేస్తున్నాం. మీ నుంచి మాకు అందుతున్న ఇతోధిక సహకారానికి పాఠకుల తరఫునా, సంపాదక, నిర్వాహక బృందం తరఫునా ధన్యవాదాలు.

ఈ సారి సమావేశంలో మన చర్చను సులభతరం చేయడం కొరకు కొన్ని ప్రాతిపదికలను సూచించడమే నా ఈ స్వాగతోపన్యాస లక్ష్యం.

**వీక్షణం సాధించిన విజయాలు**

వీక్షణం రచయితల నాలుగో సమావేశం సరిగ్గా సంవత్సరం కింద 2010 ఫిబ్రవరి 7న హైదరాబాదులో జరిగింది. ఈ సంవత్సరంలో వెలువడిన పన్నెండు వీక్షణం సంచికలలో 12 సంపాదకీయాలు, 24 సంపాదకీయ వ్యాఖ్యలు కాక, 220కి పైగా రచనలు వచ్చాయి. ఇందులో దాదాపు ముప్పై రచనలు అనువాదాలు అనుకున్నా, మిగిలిన 190 వ్యాసాలు సమకాలీన రాజకీయార్థిక, సామాజిక, సాంస్కృతిక, చారిత్రక అంశాల పైన స్వతంత్ర రచనలే. ఈ 190 రచనలకు కనీసం వంద మంది రచయితలు ఉండి ఉంటారు. వారిలో కనీసం ఇరవై, ముప్పై మంది వీక్షణం ద్వారానే తొలిసారిగా రచయితలుగా పరిచయం కావడం వీక్షణంకు గర్వకారణం.

అలా కొత్త రచయితలను తయారుచేయడం, ప్రోత్సహించడం మాత్రమే కాక, పాఠకులు కోరుకుంటున్న, అవసరమైన రచనలు అందిస్తున్న పత్రికగా వీక్షణంకు ప్రాధాన్యత పెరుగుతున్నది. అనేక సామాజిక, రాజకీయార్థిక అంశాల మీద మొదటి స్పందనలు, వివరమైన, సమాచార సహితమైన, అవగాహనను పెంచే వ్యాసాలు వీక్షణంలోనే చదివామని పాఠకులు చెపుతూ ఉండడం మా కృషికి సార్థకతను

ఇస్తున్నది. ఇలా ప్రాంతీయ, దేశీయ, అంతర్జాతీయ విషయాలపైన తెలుగు పాఠకులకు అవసరమైన సమాచారాన్ని, విశ్లేషణను ఇస్తున్న పత్రికగా వీక్షణంకు గుర్తింపు రావడానికి దోహదం చేస్తున్న రచయితలందరికీ మా కృతజ్ఞతలు.

వీక్షణం ద్వారానే పరిచయమైన రచయితలకు కొన్ని ఉదాహరణలు చెప్పుకోవాలంటే ఉస్మానియా, కాకతీయ, ఉస్మానియా విశ్వవిద్యాలయాల పరిశోధక విద్యార్థులు ఎంతోమంది ఉన్నారు. అలాగే గత సంవత్సరం వీక్షణం రచయితల సమావేశానికి హాజరయి, వ్యాసాలు రాయడం మొదలుపెట్టి ఈ సంవత్సరంలో నాలుగైదు వ్యాసాలు రాసిన సరళా వందనం ఉన్నారు. సోంపేటలో తమ భూములను విద్యుత్ కేంద్రానికి ఇవ్వబోమంటూ ప్రతిఘటించిన ప్రజలపై కాల్పులు జరగగానే అక్కడికి వెళ్లి బాధితులతో మాట్లాడివచ్చి వ్యాసం రాసిన సంపాదకవర్గ సభ్యుడు రామచంద్రం ఉన్నారు. అనువాదాలలో 'నేర్చుకుందాం' శీర్షిక కింద వేసిన వ్యాసాలు చాల మంది పాఠకులను ఆకర్షించాయి. కాశ్మీర్ పై జాహిద్ రఫిక్ వ్యాసం అనువాదం చాలమంది పాఠకులలో ఆసక్తిని రేకెత్తించింది. ఒక దృక్పథాన్ని ఏర్పరచుకోవడానికి ఉపయోగపడే ఆర్ ఎస్ రావు, ముదునూరి భారతి వ్యాసాలు ప్రచురించడం వీక్షణం గర్వకారణంగా భావిస్తుంది.

అలాగే అసహజ మరణాల సూచి తొలిసారిగా ప్రవేశపెట్టినది వీక్షణమే. అసహజంగా, అకాలంగా ఎంతమంది మరణిస్తున్నారో చూపే సూచిక మన సమాజ దుస్థితికి ఒక నిదర్శనంగా ఉంటుందని, తద్వారా ఈ దుస్థితిని మార్చవలసిన అవసరం గురించి పాఠకులు ఆలోచిస్తారని మా అభిప్రాయం.

తెలుగులో వ్యాసరచనా ప్రక్రియ చాల ప్రాచుర్యంలో ఉన్నప్పటికీ, నాణ్యతా ప్రమాణాలు ఉండవలసినంత లేవనే గుర్తింపుతో వీక్షణం వ్యాసరచనా ప్రక్రియ మీద అధ్యయన తరగతులు నిర్వహించడం ఈ సంవత్సరమే ప్రారంభించింది. ఇప్పటికి నాలుగైదు సార్లు ఈ అధ్యయన తరగతులు జరిగాయి. వ్యాసరచన గురించి చర్చించి, ఆ ప్రక్రియను మెరుగుపరచే ఆలోచనతో పాటు వీక్షణంకు కొత్త రచయితలను తయారు చేసుకోవడం కూడ మా లక్ష్యం. నిజంగానే కొందరు కొత్త రచయితలు తయారు కావడం, పాత రచయితల రచనల నాణ్యత పెరగడంతో, ఈ అనుభవం వీక్షణం సంపాదవర్గానికైతే విలువైన పాఠాలు నేర్పింది. ఈ అనుభవాన్ని ఇంకా పటిష్టం చేయవలసి ఉంది.

కేవలం పత్రికగా మాత్రమే కాక, ఒక ఆలోచనా, చర్చా వేదికగా వీక్షణంను తీర్చిదిద్దాలనే కోరికతో వీక్షణం కార్యాలయంలో అప్పుడప్పుడు చర్చా సమావేశాలను ఏర్పాటు చేయడం కూడ జరుగుతున్నది. సి డి ఆర్ సి తలపెట్టిన సోషలిజం పనితీరు అధ్యయన ప్రణాళిక సమావేశాలు ఇందులో భాగమే. వీక్షణం విస్తరణ, ప్రచార కృషిలో భాగంగా ఖమ్మం, హైదరాబాదు, విజయవాడలలో జరిగిన పుస్తక ప్రదర్శనలలో కూడ పాల్గొని వీక్షణం గురించి వేలాది మంది పాఠకులకు పరిచయం చేయడం జరిగింది.

అలాగే వీక్షణం పాఠకుల, అభిమానుల, శ్రేయోభిలాషుల సంఖ్య కూడ నానాటికీ పెరుగుతున్నది. కొత్త బృందాలలోకి, సామాజిక వర్గాల లోకి వీక్షణం విస్తరిస్తున్నది. ఈ సంవత్సరం తూర్పుగోదావరి, వరంగల్ జిల్లాల గ్రంథాలయ సంస్థలు ఆ జిల్లాల శాఖాగ్రంథాలయాలకు వీక్షణం తెప్పించడం ప్రారంభించాయి. మిగిలిన జిల్లా గ్రంథాలయ సంస్థలకు అభ్యర్థనలు పంపుతూ ఉన్నాం.

ఇలా కొన్ని రంగాలలో వీక్షణం సాధించిన విజయాలు ఉన్నప్పటికీ, వీక్షణం సాధించలేకపోతున్న అంశాలు కూడ ఉన్నాయి.

**వీక్షణం సాధించలేకపోతున్న అంశాలు**

రచనలు ఎక్కువగానే వస్తున్నప్పటికీ అవసరమైన అన్ని రంగాల మీద రావడం లేదు. అప్పటికప్పుడు అవసరమైన సమకాలీన అంశాలపైన రచనలు రాక, రాయించడానికి తగిన రచయితలు దొరకక, మొత్తంగానే ఆ అంశాలను విస్మరించడం జరుగుతున్నది. ఒకవైపు పాఠకులు ఆయా అంశాలమీద వీక్షణంలో వ్యాసం వస్తుందని ఎదురుచూస్తుండగా, మాకు ఆ విషయం చెపుతుండగా, మేం వారి కోరికలను నెరవేర్చలేకపోతున్నాం. ప్రతినెలా మొదటివారంలో అప్పటికప్పుడు రాయవలసిన, రాయించవలసిన విషయాలు ఏమున్నాయో జాబితా వేసినప్పుడు, ఆ జాబితాకు తగిన రచయితల సంఖ్యను సాధించలేకపోతున్నాం. ఇక తక్షణ, సమకాలీన అంశాలు మాత్రమే కాక, తెలుగు సమాజానికీ, మొత్తంగా ప్రగతిశీల ఆలోచనాధారకూ అవసరమైన దీర్ఘకాలిక సైద్ధాంతిక అవగాహనల మీద రాయవలసిన, రాయించవలసిన వ్యాసాలు అలాగే ఉండిపోతున్నాయి. ముఖ్యంగా మహిళా సమస్యల గురించి, మహిళల జీవన స్థితిగతుల గురించి, మహిళల పోరాటాల గురించి వీక్షణంలో రావలసినంతగా వ్యాసాలు రావడం లేదు.

అలాగే ఇంగ్లిషులో, ఇతర భాషలలో వచ్చిన, వస్తున్న మంచి వ్యాసాల అనువాదాలు వేయడం వీక్షణం తన బాధ్యతగా పెట్టుకున్నది. దాదాపు ప్రతి సంచికలోనూ కనీసం రెండయినా అనువాదాలు ఉంటున్నాయి. కాని వీక్షణంకు తగినంతమంది అనువాదకులు లేరు. అందువల్ల చాల ముఖ్యమైన వ్యాసాలు కూడ అనువాదం కోసం ఎదురుచూస్తూ మాదగ్గర అలాగే ఉండి పోతున్నాయి.

వీక్షణం వంటి పత్రికలో తప్పనిసరిగా ఉండవలసిన శీర్షిక పుస్తక సమీక్షలు, పరిచయాలు. పాత పుస్తకాలలో గాని, కొత్త పుస్తకాలలో గాని తప్పనిసరిగా అందరూ చదవవలసిన వాటిని పరిచయం, సమీక్ష చేయడం, ప్రమాదకరమైన అవగాహనలను ఇచ్చే పుస్తకాల గురించి హెచ్చరించడం తప్పనిసరిగా జరగవలసిన పనులు. నిజానికి వీక్షణంకు సమీక్ష కోసం వస్తున్న పుస్తకాలు నెలకు కనీసం పదిహేనయినా ఉంటున్నాయి. వీటిలో ఒకటి రెండు పుస్తకాల పరిచయాలు, సమీక్షలు, విమర్శలు అవసరం. కాని మాకు తగినంతమంది సమీక్షకులు లేరు. ఉన్న సమీక్షకులు, ఆసక్తి చూపిన సమీక్షకులు కూడ సమయానికి తమ సమీక్షలు ఇవ్వడం లేదు. రెండు సంవత్సరాల కింద రచయితల సమావేశంలో సమీక్ష కోసం పుస్తకాలు తీసుకున్న మిత్రులలో కొందరు తమ సమీక్షలను ఇప్పటిదాకా ఇవ్వలేదంటే పరిస్థితి తీవ్రత మీరు అర్థం చేసుకోగలరు.

వీక్షణం ఎదుర్కొంటున్న సమస్యలలో ముఖ్యమైనది పంపిణీ సమస్య. నిజానికి ఇటువంటి పత్రికలు ఎక్కువగా చందాదారుల మీదనే ఆధారపడవలసి ఉంటుంది. కాని మనకు చందాదారుల సంఖ్య విడికాపీల కొనుగోలుదార్ల సంఖ్య సమానంగా ఉన్నాయి. దానివల్ల వచ్చే ఆర్థిక సమస్య గురించి తర్వాత వివరిస్తాను గాని, వీక్షణంకు దొరుకుతున్న

| వీక్షణంకు చేయూతలో భాగంగా విరాళాలు ప్రకటించినవారు | |
|---|---|
| వి. హనుమంతరావు | రు. 5,000 |
| చలసాని శ్రీనివాస్ | రు. 5,000 |
| చిమ్మె జాన్ బర్నబాస్ | రు. 10,000 |
| ఘంటా చక్రపాణి | రు. 5,000 |
| వై. వేణుగోపాల్ రెడ్డి | రు. 3,000 |

ఆదరణను బట్టి చూస్తే చందాదార్ల సంఖ్య ఇప్పుడున్నదానికన్న అనేక రెట్లు ఉండడానికి అవకాశం ఉన్నదని భావిస్తున్నాం. రాష్ట్రంలో ప్రతి జిల్లాలోనూ వీక్షణం చందాదార్లు కనీసం మూడు వందల మంది అయినా ఉండడానికి వీలుంది. కాని చిత్తూరు, అనంతపురం, కడప, ప్రకాశం, పశ్చిమగోదావరి, విజయనగరం, రంగారెడ్డి వంటి కొన్ని జిల్లాలలో ఇరవై కన్న తక్కువ, మిగిలిన జిల్లాల్లో కూడ చాలచోట్ల 50 కన్న తక్కువ చందాదార్లు ఉన్నారు. వంద చందాదారులను దాటిన జిల్లాలు వరంగల్, ఖమ్మం, కరీంనగర్, హైదరాబాద్ మాత్రమే. వీక్షణం రచయితలుగా, శ్రేయోభిలాషులుగా మీరు ఈ విషయం ఆలోచించవలసి ఉన్నదని అనుకుంటున్నాను.

ఎక్కడైనా ఒక పత్రిక కేవలం దాని చందాదారుల మీద, అమ్మకాల మీద మాత్రమే ఆధారపడి ఆర్థికంగా నిలదొక్కుకున్న దాఖలాలు లేవు. పత్రిక అమ్మకం ధర ఎప్పుడూ దాని ఉత్పత్తి వ్యయం కన్న తక్కువగానే ఉండవలసిన స్థితిలోనే మనం ఉన్నాం. సాధారణంగా ఏ పత్రికయినా ఆ లోటును వ్యాపారప్రకటనలద్వారా పూడ్చుకుంటుంది. లాభాలు కూడ చేసుకుంటుంది. వీక్షణంకు లాభాలేమీ అవసరం లేదు గాని ఆదాయ వ్యయాలు సరిగ్గా సరిపోయేలాగానైనా వ్యాపార ప్రకటనలు రావడం లేదు. పత్రిక విడిప్రతి వెల, చందారేట్లు కూడ ఐదు సంవత్సరాల తర్వాత ఇటీవలనే అనివార్యమైన స్థితిలో పెంచడం జరిగింది. ప్రస్తుతం వీక్షణం ఒక కాపీ ఉత్పత్తి వ్యయం రు. 18 కాగా చందాదారులనుంచి తిరిగి వచ్చేది రు. 12.50, విడికాపీ కొనుగాలుదార్ల నుంచి (ఏజెంటు కమిషన్ పోగా) తిరిగివచ్చేది రు. 9. అంటే ప్రతి కాపీ మీద చందాదారుల విషయంలోనైతే రు. 5.50, విడికాపీ కొనుగోలుదార్ల విషయంలోనయితే రు. 9 లోటు అన్నమాట. ఈ భారాన్ని పూర్తిగా పాఠకుల మీదనే వేయాలంటే పత్రిక ధర పెంచాలి. అది సాధ్యం కాదు. కనీసం ప్రతినెలా మూడు వ్యాపార ప్రకటనలు వస్తేనే ఈ లోటు పూడుతుంది. కాని అదీ సాధ్యం కావడం లేదు.

పత్రిక నాణ్యత విషయంలో కూడ వీక్షణం తగిన ప్రమాణాలతో రావడం లేదని మీ దగ్గర అంగీకరించవలసి ఉంది. అచ్చుతప్పులు, ఎడిటింగ్ లోపాలు ఉంటున్నాయి. కాగితం నాణ్యత, అచ్చు నాణ్యత ఉండవలసినట్టుగా ఉండడం లేదు. ఈ ప్రమాణాలలో మెరుగుదల సాధించడానికి నిరంతరం ప్రయత్నిస్తూ ఉంటామని, త్వరలోనే సాధించగలమని వాగ్దానం చేస్తున్నాను.

మీరు ఏం చేయవచ్చు? వీక్షణం మీ పత్రిక. వీక్షణం ప్రజల పత్రిక. వీక్షణం తన విజయ వైఫల్యాలను మీతో అరమరికలు లేకుండా విప్పి చెప్పుకుంటున్నది ఎందుకంటే ఈ విజయాలను మరింత పెంచడంలో, ఈ వైఫల్యాలను తగ్గించడంలో మీ సహాయ సహకారాలు అందుతాయనే ఆశతోనే. వీక్షణం పదికాలాలపాటు నిలిచేలా, తెలుగు సమాజానికి తన వంతు సేవను మరింత మెరుగ్గా చేసేలా మీరు సహకరిస్తారనే ఆశతోనే.

**ముఖ్యంగా**

- మీరందరూ వీక్షణంకు రచనలు చేసే, సేకరించే, రాయించే బాధ్యతను మరింత ఎక్కువ తీసుకోవాలని కోరుతున్నాను.
- ఏదయినా రాజకీయార్థిక, సామాజిక పరిణామం జరగగానే దానిమీద వీక్షణంకు ఒక వ్యాసం రాయడం గురించి, రాయించడం గురించి ఆలోచించండి.
- ఇతర భాషలలో వచ్చిన రచన ఏదయినా వీక్షణం పాఠకులు, తెలుగు పాఠకులు చదవలసి ఉందని అనిపిస్తే వెంటనే అది అనువాదం చేసి, చేయించి పంపండి.
- పుస్తక సమీక్షలు, పరిచయాలు, విమర్శలు పంపండి.
- పాఠకుల వీక్షణంకు ఉత్తరాలు రాయండి, రాయించండి.
- మీ స్నేహితులకు, బంధువులకు, పరిచయస్తులందరికీ వీక్షణం పరిచయం చేయండి. వీక్షణంకు చందా చెల్లించేలా చూడండి. వీలయితే దశాబ్ది చందాలు సేకరించండి.
- మీ గ్రామంలో, పట్టణంలో ఉన్న కళాశాలల, సంస్థల గ్రంథాలయాలు, ప్రజాసంఘాల కార్యాలయాలు వీక్షణంకు చందాదారులయ్యేలా చూడండి.
- మీ జిల్లా గ్రంథాలయ సంస్థల బాధ్యులను కలిసి వారు వీక్షణంకు చందా చెల్లించేలా ప్రయత్నించండి.
- మీ గ్రామంలో, పట్టణంలో దాతల దగ్గరినుంచి, శ్రేయోభిలాషుల దగ్గరినుంచి, వ్యాపార సంస్థల దగ్గరినుంచి వీక్షణంకు ప్రకటనలు సేకరించండి.
- మీ గ్రామంలో, పట్టణంలో ఉన్న పత్రికల ఏజెంటు వీక్షణం తెప్పిస్తున్నారో లేదో కనుక్కుని వీక్షణం తెప్పించేలా చూడండి.

నిజానికి ఈ పనులన్నీ ఇప్పటికే తమ బాధ్యతగా మొదలుపెట్టిన, కొనసాగిస్తున్న మిత్రులు ఎంతోమంది ఉన్నారు. వారి సహాయమే లేకపోతే వీక్షణం మనుగడ ఇంకా కష్టమయ్యేది. ఈ సందర్భంలో వారందరినీ పేరుపేరునా తలచుకుని కృతజ్ఞతలు తెలియజేస్తున్నాం. చందాలు చేర్పించడంలో, చందాలను కానుకగా ఇవ్వడంలో, విరాళాలు, ప్రకటనలు సేకరించడంలో, వీక్షణం విస్తరణకు తోడ్పడడంలో సహకరిస్తున్నవారిలో కె సుబ్బనాచారి (నెల్లూరు), ఎల్ సుబ్బయ్య (కర్నూలు), టి రమేశ్, ఎల్ రాజ్ పవన్, ఎల్ సంతోష (కరీంనగర్), ఎ. నరసింహారెడ్డి, ఎస్ నాగేశ్వర్, కె. శ్యాంరావు, టి సుదర్శనం, ఎం వెంకటేశ్వర్లు (వరంగల్), సి ఎచ్ శ్రీమన్నారాయణ, సాయన్న (ఆదిలాబాద్), ఎస్ రఘు, కె. దుర్గాప్రసాద్ (ఖమ్మం), ఎస్ కిశోర్ కుమార్, ఆర్ సుబ్బారావు, విద్యాభూషణ్ (హైదరాబాద్), జి వెంకటేశ్వర్లు, కె ప్రభాకర్, ఎ పున్నయ్య, సతీష్ (నల్లగొండ), ఎనిశెట్టి శంకర్, పి శంతన్ కుమార్ (నిజామాబాద్), పి వి రమణ, జి అచ్చిబాబు (విశాఖపట్నం), ఎం రాజేందర్ రెడ్డి (సిద్ధిపేట), డి. రవికుమార్, పి కృష్ణారావు (శ్రీకాకుళం), ఎ. రంగారెడ్డి, సుంకోజి దేవేంద్రచారి (తిరుపతి), పలమనేరు బాలాజీ (పలమనేరు) కె బాల్ రెడ్డి, జి దేవీప్రసాద్,

జి ఎస్ వాసు, ఎస్ విశ్వేశ్వరరావు, ఎస్ సరళావందనం, ఘంటా చక్రపాణి, రావెలసోమయ్య, టి వివేక్ (హైదరాబాద్) గార్లకు ప్రత్యేక కృతజ్ఞతలు. జైలులో ఖైదీగా ఉన్న కొండయ్య తన బంధుమిత్రుల ద్వారా వీక్షణంకు ఎన్నో చందాలు కట్టించారు. ఆయనకు ప్రత్యేక కృతజ్ఞతలు.

ఈ సమావేశానికి హాజరయి మీ విలువైన సమయాన్ని, ఆలోచనలను పంచుకుంటున్న మీ అందరికీ మరొకసారి ధన్యవాదాలతో సెలవు.

**వీక్షణం రచయితల నుంచి వచ్చిన కొన్ని సూచనలు, ఆలోచనలు:**

– వీక్షణం పరిచయ సభలు, వీక్షణంతో ఒకరోజు వంటి కార్యక్రమాలు, వ్యాస రచనపై ఉపన్యాసం కలిపి నిర్వహిద్దాం.

– జిల్లాల వారీగా సాధ్యమయ్యే చోట్ల వీక్షణం పరిచయ సభలు పెడదాం.

– వీక్షణం ప్రతి సంవత్సరం రచయితల సమావేశం ఏర్పాటు చేయడం ఒక మంచి ప్రయత్నం. వీక్షణం పత్రిక కోసం ఎదురు చూసే పాఠకుల సంఖ్య పెరుగుతోంది. విస్తరింపజేయడానికి మావంతు కృషి చేస్తాం.

– కుల, మత, ప్రాంతాలకతీతంగా పత్రిక ఎదగాలి.

– సమకాలీన విషయాలు, పర్యావరణ సంబంధ విషయాలు ఇంకా రాయాలి.

– యువతరం వద్దకు పత్రిక చేరాలి. విద్యార్థులు పుస్తకం చదవడం మరచిపోతున్నారు.

– సభలు, సమావేశాల్లో పత్రికను పరిచయం చేయాలి.

– పత్రిక తాలూకాలోని ఎన్.జి.ఒ. హోంలకు వెళితే ఎక్కువ మంది చదవడానికి ఉపయోగపడుతుంది.

– ఇంటర్నెట్ పేజీ మొదలుపెట్టాలి.

– అంతర్జాతీయ విషయాల మీద అనువాదాలు చేస్తాం.

– వీక్షణం విస్తృతికి జిల్లాల్లో ఉన్న స్నేహితుల సహకారం తీసుకోవాలి.

– జర్నలిస్టు మిత్రులు సహకరిస్తే స్థానిక సమస్యలపై సభలు పెట్టి వీక్షణం ప్రచారం కూడా చేయవచ్చు.

– వీక్షణం చాలా సీరియస్‌గా ఉంటోంది. మధ్య మధ్యలో సమకాలీన సమస్యలపై కార్టూన్స్ ఏమైనా వేయిస్తే బాగుంటుంది.

– లక్షల కోట్ల రూపాయల ప్రజల సొమ్ము స్విస్ బ్యాంకులకు తరలాయి. వాటి మీద, అలాంటి సత్యాలను వెలికితీసే ప్రయత్నం బాగా జరగాలి.

– నిత్య జీవితంలో విదేశీ దోపిడీపై ముప్పై ఏళ్ల క్రితం 'జీవనాడి' పత్రికలో వచ్చినట్లు వీక్షణంలో వస్తే బాగుంటుంది.

– డైరక్టర్ ఆఫ్ స్కూల్ ఎడ్యుకేషన్ ద్వారా వీక్షణం చందాలకు ప్రయత్నించాలి.

– మార్చ్ – ఏప్రిల్ లలో జరిగే స్పాట్ వాల్యుయేషన్‌లకు వచ్చే ఉపాధ్యాయులకు పత్రికను పరిచయం చేయాలి. చందాలు కట్టించాలి.

– వీక్షణంను ఒకసారి పరిచయం చేస్తే రెండవసారి చందాలు వారంతటవారే కడుతున్నారు.

– వ్యక్తిగత స్థాయిలో ఎవరికి వారు వీక్షణంకు చందాలు కట్టించడానికి పూనుకుందాం.

– వీక్షణంను కాలేజీ స్థాయి విద్యార్థులకు పరిచయం చేస్తే బాగుంటుంది.

– లెక్చరర్‌గా, టీచర్‌గా పనిచేస్తున్న మాలో కొందరం రోజువారీ మా బస్సు ప్రయాణంలో తోటి ప్రయాణీకులకు వీక్షణం పరిచయం చేస్తున్నాం. చందాలు కట్టిస్తున్నాం.

– మనది వ్యవసాయ దేశం. భూమి ఆధారంగా సమస్యలు ఉన్నాయి. భూమి ఎక్కడ నుంచి ఎక్కడకు మారుతోంది. కౌలుదారీ మరణాలు ఎందుకు జరుగుతున్నాయి. మొత్తంగా భూమి ఆధారంగా సమాజంలో ఎట్లాంటి మార్పులు వస్తున్నాయో చర్చా గోష్ఠి నిర్వహిస్తే బాగుంటుంది.

– అంతర్జాతీయంగా యూరో, డాలర్ పోటీలో భాగంగా కూడా చాలా పోరాటాలు వస్తున్నాయి. వాటి మీద కూడా వ్యాసాలు వస్తే బాగుంటుంది.

– మహిళలు ఎదుర్కొంటున్న సమస్యలపై రచనలు రావాలి.

– ప్రజలు ఎదుర్కొంటున్న సమస్యలపై క్షేత్ర పరిశోధనలు చేసి నివేదికలు ప్రచురించాలి.

– రైతుల సమస్యలపై రెగ్యులర్‌గా క్షేత్ర పరిశోధనతో కూడిన వ్యాసాలు రావాలి.

– మహిళా డిగ్రీ కాలేజీలకు వెళ్లి వీక్షణం పరిచయ వేదికలు ఏర్పాటు చేసి ప్రోత్సహించాలి.

– మతం, మూఢ నమ్మకాలపై వ్యాసాలు రావాలి.

– ట్రేడ్ యూనియన్ నాయకుల పేరిట చందాలు కట్టి వీక్షణంను పరిచయం చేసే బాధ్యతలు తీసుకుంటాం. ఉద్యోగులందరూ ఈ పత్రిక చదవాల్సిన అవసరం ఉంది.

– ఎస్.సి., ఎస్.టి. అత్యాచారాలపై ఒక పేజీ ఉండాలి.

– పోలీసు, న్యాయవ్యవస్థ, రెవెన్యూ వ్యవస్థలకు సంబంధించిన వ్యాసాలు విరివిగా రావాలి.

– రచయితల సమావేశాలు 3–4 నెలలకు ఒకసారి నిర్వహిస్తే బాగుంటుంది.

– విద్యారంగంపై మరిన్ని వ్యాసాలు రావాలి.

– ఉపాధ్యాయుల సమస్యలపై వ్యాసాలు రావాలి.

– ప్రజా ఉద్యమాలకు సంబంధించి, ప్రజల సమస్యలకు సంబంధించి మరిన్ని వ్యాసాలు రావాలి.

– న్యాయవ్యవస్థపై, న్యాయవ్యవస్థలో వస్తున్న ప్రజా వ్యతిరేక ధోరణులపై వ్యాసాలు రావాలి.

వీక్షణం సంపాదకులు ఎన్. వేణుగోపాల్ స్పందనతో సమావేశం ముగిసింది. సహాయ సంపాదకులు డి.వి. రామకృష్ణారావు వచ్చిన రచయితలకూ, మిత్రులకూ, సహకారం అందించిన, అందిస్తున్న వారందరికీ పేరు పేరునా కృతజ్ఞతలు తెలపడంతో సమావేశం ముగిసింది.

అసహజ మరణాల సూచి సేకర్తల సమావేశం మధ్యాహ్నం 3 గంటల నుంచి ఒక గంటసేపు జరిగింది. వీ

నమ్మకాలకూ, భయాలకూ వాటి వెనక ఉండే భౌతిక పునాది, ప్రేరణలు ఎలా కారణమవుతాయో వివరిస్తున్నారు

డా. కొడవటిగంటి రోహిణీప్రసాద్

# మంత్రాలూ, చింతకాయలూ

మన దేశంలో ప్రాచీన కాలం నుంచీ మంత్రాలకు చాలా ప్రాముఖ్యత ఉంది. గురూ, పండిత్ వగైరా పదాల్లాగే మంత్రా అనే మాట కూడా ఇంగ్లీష్ డిక్షనరీల్లో కెక్కింది. హిందూ దేవాలయాల్లోనూ, పూజా పునస్కారాల్లోనూ నిత్యమూ వినబడే మంత్రాలేకాక నేపాల్, టిబెట్ వంటి ప్రాంతాల్లో మంద్రస్థాయిలో బౌద్ధఅర్చకులు ఉచ్చాటన చేసేవీ, చర్చ్‌లూ, మసీదుల్లో ఉచ్చరించే పవిత్రశబ్దాలూ అన్నీ మొత్తంమీద ఒకే రకం వైఖరికి సంకేతాలు. మనవాళ్లకి మంత్రాలేకాక వాక్కులోనూ, శబ్దాల్లోనూ కూడా చాలా నమ్మకం ఉంది. వేదపనస కలిసి చదివేది ఇద్దరైనా ఒక్క అక్షరం కూడా, ఒక్క స్వరంకూడా పొల్లు పోకుండా శ్రద్ధగా ఉచ్చరించడం చూస్తాం. మన ప్రాచీనవాఙ్మయమంతా మౌఖికమే. మునులూ, బ్రాహ్మణులూ నోటి మాటగా శాపాలిచ్చేవారు. విశ్వామిత్రుడు రాముడి చెవిలో చెప్పినా, వేములవాడ భీమకవి కోపం వచ్చి తిట్టినా శబ్దాలకు అంతులేని శక్తి ఉందని అనుకోవడం మన సంస్కృతిలో పరిపాటి. రాలని చింతకాయలని చూపించి ఇలాంటి నమ్మకాలని ఎద్దేవా చెయ్యడం సంగతి ఎలా ఉన్నా అసలు ఇలాంటి భావనలకు మూలం ఎక్కడుందో తెలుసుకోవడం అవసరం.

సుదీర్ఘమైన మన చరిత్రలో మతం ఒక బలమైన శక్తిగా ఎదిగింది. అధిక సంఖ్యాకులను అల్ప సంఖ్యాక వర్గం అణచి ఉంచడానికి మతాన్ని బాగా ఉపయోగించుకుంది. మతం గురించీ, ఆధ్యాత్మిక విషయాల గురించీ అలౌకికమైన భావాలను పొందేవారు తమ మెదళ్లలో ఎలాంటి మార్పులు దేని వల్ల కలుగుతున్నాయో తెలుసుకోలేరు. పుస్తకాలూ, ప్రవక్తల బోధలూ, పెరిగిన వాతావరణమూ అన్నీ మనుషులను మత పరంగా లొంగదీసుకోవటానికి సిద్ధంగా ఉంచుతాయి. వీటికి తోడుగా గుళ్లలో మోగే గంటలూ, మంత్రోచ్చారణలూ, కలిసి పాడే భజనలూ, తప్పెటలూ అన్నీ ఒకరకమైన హిప్నోసిస్‌కు గురిచేస్తాయి.

ఇవన్నీ తరవాతి పరిణామాలు. మానవజాతి చరిత్రలో మొట్టమొదటిది ఒక అమాయకదశ. అతీతశక్తులను గురించి రకరకాల అపోహలు మొదలైన దశ. ఈ అపోహలకు ఎన్నో భౌతిక కారణాలుండేవి. అందులో చెవులద్వారా వినబడి మెదడుకు విభ్రాంతి కలిగించే శబ్దాల మాయాజాలం ఒకటి. ప్రకృతిని గురించి ఎక్కువగా తెలియని తొలి మానవులను మభ్యపెట్టే అంశాలు ఎన్నో ఉండేవి. అడవి మృగాల అరుపులూ, కూతలూ, తుఫాను గాలుల రొదలూ, ఉరుముల గర్జనా ఇలా ఒక్కొక్కదాన్నీ పసికట్టడం వారికి అత్యవసరంగా ఉండేది. ప్రకృతిలో సహజంగా వినిపించే ఇలాంటి శబ్దాలకు అలవాటుపడ్డ తొలి మానవులకు అరుదుగా వినిపించే ప్రతిధ్వనులవంటివి అసహజంగానూ, భయం కలిగించేవిగానూ ఉండేవి. ఇవి ముఖ్యంగా కొండ కనుమల్లోనూ, గుహల్లోనూ వినిపించేవి. వీటివల్ల బెదిరిన మనుషులు చాలా ప్రభావితం అయినట్టుగా అనిపిస్తుంది.

సుమారు 30 వేల ఏళ్ల క్రితంనుంచి 10 వేల ఏళ్ల క్రితందాకా జీవించిన మానవులు ఫ్రాన్స్ తదితర ప్రాంతాల్లోని గుహల గోడల మీద అద్భుతమైన బొమ్మలు గీశారు. వీటిలో ఎక్కువగా అప్పట్లో వారు వేటాడిన దున్నలూ, దుప్పులూ, గుర్రాలూ మొదలైనవాటి చిత్రాలు. వీటి సంగతి మొదటగా పంతొమ్మిదో శతాబ్దం చివరి రోజుల్లో తెలిసింది. ఈ బొమ్మలు గీయడానికి కారణాలేమిటో సరిగ్గా తెలియదుకాని ఇటువంటి గుహలు పూజలూ పునస్కారాలూ జరిపేందుకు తొట్టతొలి ఆలయాలుగా ఉపయోగపడ్డాయనే ప్రతిపాదనలున్నాయి. ఈమధ్య వీటిమీద శబ్దపరమైన పరిశోధనలు జరిగాయి. వాటివల్ల ఈ గుహల్లో కొన్ని ప్రాంతాల్లో శబ్దాలు బాగా ప్రతిధ్వనిస్తాయని రుజువయింది. ఇవేకాక క్రీ.పూ. మూడు వేలఏళ్ల నాటి స్టోన్‌హెంజ్ మొదలైన ఇతర ప్రాచీన ప్రార్థనాస్థలాల్లోకూడా శబ్దాలు మారు మోగుతాయని తెలిసింది. దీని ప్రాముఖ్యత ఏమిటో తెలుసుకోగోరిన పరిశోధకులు వెనకబడిన ఆదిమ తెగల్లోనూ, "పురోగమించిన" కొన్ని ఆధునిక సంస్కృతుల్లోనూ ఈనాటికీకూడా కనబడుతున్న కొన్ని తంతులూ, పూజలనుబట్టి ప్రాచీన యుగంలో ఏం జరిగిందో కొంతవరకూ ఊహించగలుగుతున్నారు.

గిట్టలు కలిగిన జంతువుల బొమ్మలన్నీ శబ్దాలు మారుమోగే ప్రాంతాల్లోనే ఉన్నాయి కనక బొమ్మలకూ, శబ్దాలకూ సంబంధం ఉండి ఉండాలి. అక్కడ నిలబడి చేతులతో చప్పట్లు చరిచినా, రెండు రాతిముక్కలతో ఒకదాన్నొకటి కొట్టినా ఆ ధ్వనులు మారుమోగి సరిగ్గా పరిగెత్తే జంతువుల గిట్టల చప్పుడులాగే వినిపిస్తాయి. ఇది కనిపెట్టిన మొదటి గణాచారి ఎవడో తెలియదుకాని దీని ప్రాముఖ్యత వారికి అర్థమై ఉంటుంది. తలవని తలంపుగా ఇటువంటి గుహల సంగతి తెలిశాక అక్కడ మారుమోగిన శబ్దాలు వారికి జంతువుల కాలి గిట్టలను తలపించి ఉంటాయి. అందుకని వారు సరిగ్గా ఇటువంటి ప్రదేశాలనే ఎంచుకుని అక్కడ బొమ్మలు గీశారని అనుకోవచ్చు.

గుహలో గుమిగూడి, తమకు ఆహారం అయిన, లేదా కానున్న మృగాలను తలుచుకుంటూ, సామూహికంగా తంతును నిర్వహిస్తున్న ఆదిమానవులకు ఇటువంటి చప్పుళ్లు వింతగా, మాయా జాలంగా, అతీతశక్తులను తలపించేట్టుగా ఉండిఉంటాయి. ఇది మతానికి అతి ప్రాథమికమైన స్వరూపం. సకాలంలో తగినంత ఆహారం దొరకడం చావుబతుకుల సమస్య అని తెగలోని జన మందరికీ తెలుసు గనక ఇటువంటి ఆచారాలకు ఎంతో ప్రాముఖ్యత ఉండి ఉంటుంది.

కులపెద్దలూ, గణాచార్లూ ఇటువంటి వ్యవహారాలను ముందుండి నడిపేవారని మనం ఊహించవచ్చు. పూనకాలూ, గారడీవంటి విద్యల ద్వారా తెగలోని వారందరినీ ఈ ఆదిమఅర్చకులు ప్రభావితం చేసేవారు.

వేట అప్పటివారికి చాలాముఖ్యం కనక ఇవన్నీ వేటకు సంబంధించిన తంతులు గానే ఉండేవి. ఒకడు దుప్పి వేషమో, దున్న వేషమో వేసుకుని అభినయిస్తే మరికొందరు వాణ్ణి వేటాడినట్టు అభినయించేవారు. ఇటువంటి తంతులు ముఖ్యంగా తెగనంతటినీ ఏకం చేసేవి. కలిసి వేటాడ్డంలోనూ, కలిసికట్టుగా జీవించడంలోనూ ఉన్న లాభాల దృష్ట్యా ఇవన్నీ జాతి కొనసాగడానికి తోడ్పడే సంఘటనలే. స్వయంగా వేటలో పాల్గొనలేని చిన్న కుర్రాళ్లకు ఈ అభినయం పాఠాలు నేర్పేదేమో. తెగలోని స్త్రీలను ఆకర్షించడానికి వేట అభినయం చేస్తున్న యువకులకు అవకాశం లభించేదేమో. మొత్తంమీద తెగలోని వారిని సంఘటితం చెయ్యడానికి ఇటువంటి సమావేశాలు సహాయపడి ఉంటాయి.

చీకటిగుహలో కాగడాల వెలుగులో కదులుతున్నట్టుగా అనిపించే జంతువుల బొమ్మలూ, గిట్టలను పోలిన శబ్దాలూ మరింత భ్రాంతిని కలిగించి ఉంటాయి. అలాగే ఒకే శ్రుతిలో మోగే గణాచారి గొంతు ప్రతిధ్వనివల్ల మరింత బలంగా వినిపించి ఉంటుంది. లయబద్ధంగా మోగే దప్పులూ, మళ్లీ మళ్లీ ఉచ్చరించే శబ్దాలూ అన్నీ ఒకరకమైన హిప్నోసిస్‌ను కలిగిస్తాయనడంలో సందేహంలేదు. అందరూ కలిసి ఇలాంటి తంతులో పాల్గొంటున్నప్పుడు ఈ వాతావరణం వారి మనసుల్లో ప్రగాఢమైన అనుభూతిని కలిగించి ఉంటుంది. ఇప్పటికీ నలుగురూ చేరి ఏ సత్యసాయిబాబా భజనలో బృంద గానంగా పాడుతున్నప్పుడు పూనకం వచ్చినట్టుగా ప్రవర్తించడం మామూలే కనక ఇది ఊహించడం ఏమంత కష్టంకాదు.

నోటివెంట మంత్రాలను ఉచ్చరించడం మొదలవక ముందే ఆటవిక పూజల్లో దప్పుల మోతలు చేసేవారు. లయను అనుసరిస్తూ ఎడతెగక మోగే శబ్దాల కంపనాలు మెదడుపై ఎలాంటి ప్రభావం కలిగిస్తాయో ఆధునిక పరిశోధకులకు తెలుసు. ఇవి వింటూ ఆటవిక పూజలు చేసే గణాచారులూ, షామాన్లూ ఒక సుప్త చేతనావస్థలోకి వెళతారు. సెకండుకు నాలుగైదుసార్లు మోగే చప్పుళ్లూ, టిబెటన్ బౌద్ధ శ్రమణకులు చేసే ఉచ్చాటనలవంటివన్నీ మెదడును ధ్యాన సమాధి వంటి స్థితిలోకి తీసుకెళ్ల గలవు. ఈ స్థితిలో మెదడును జోకొట్టే 'తీటా' తరంగాలు ఉత్పన్నం అవుతాయి. సెకండుకు 4–7 కంపనాలు కలిగిన ఈ తరంగాలు నిద్రావస్థకూ, మెలకువగా ఉండటానికీ మధ్యస్థమైన భావనను కలిగిస్తాయి. ఈ స్థితిలో మనని ఎంతో గాఢంగా ప్రభావితం చేసే సంఘటనలు జరిగినట్టుగానూ, అతీంద్రియశక్తులు ఆవహించి నట్టుగానూ, అస్పష్టమైన భావాలన్నిటికీ అకస్మాత్తుగా రూపం ఏర్పడినట్టు గానూ విచిత్రభావాలు కలుగుతాయి. 'పరలోకం'తో సంపర్కం ఏర్పడినట్టు అనిపించడం ఈ స్థితిలోనే జరుగుతుంది. ఇంత గొప్ప 'అతీత' భావనలన్నిటినీ కేవలం సెకండుకు నాలుగైదు కంపనాలు కలిగిన శబ్దాల ద్వారా సాధించవచ్చునంటే ఆశ్చర్యమే.

అలాగే సెకండుకు 7–12 కంపనాలు కలిగిన ఆల్ఫా తరంగాలు ఎంతో విశ్రాంతిని కలిగిస్తాయి కాని ధ్యానంలో ఉన్నట్టుగా అనిపించదు. మనలోని పూర్తి చైతన్యస్థాయికి దిగువనుండే క్రియాత్మక వైఖరికి ఇవి దారితీయగలవట. సెకండుకు 13–40 కంపనాలు కలిగిన బీటా తరంగాలవల్ల మనస్సు బాగా కేంద్రీకృతం కావడం, దృష్టి నిశితమైనట్టుగా అనిపించడం మొదలైన ప్రభావాలు కలుగుతాయి. సెకండుకు 4 కంపనాలకన్నా తక్కువ ఉండే డెల్టా తరంగాలు గాఢమైన నిద్రకు దారి తీస్తాయి. శరీరం కోలుకోవడానికి ఈ స్థితి బాగా ఉపయోగపడుతుంది.

ఆల్ఫా, బీటా స్థితుల్లో ఉన్నప్పుడు అయోమయంగా అనిపించిన విషయాలన్నీ తీటా స్థితిలోకి వచ్చినప్పుడు అర్థమైపోయినట్టుగా అనిపిస్తుంది. మెదడు కణాలపొరల (మెంబ్రేన్ల) గుండా స్రవించే సోడియం, పొటాసియం పదార్థాల నిష్పత్తిని నిగ్రహించడం తీటా స్థితిలోనే సాధ్యమైనట్టుగా అనిపిస్తుంది. కంప్యూటర్‌ద్వారా రకరకాల కంపనాలను సృష్టించి, మెదడుపై ఏది ఎటువంటి ప్రభావం కలిగిస్తుందో శాస్త్రవేత్తలు ఖచ్చితంగా అంచనా కట్టగలరు. రేడియోరిసీవర్‌ను ట్యూన్ చేసినట్టుగా ఒక్కొక్క ధ్వనిని బట్టి మెదడులో రకరకాల పరిణామాలు కలిగించగలరు. మెలకువ తీవ్రతరం కావడం, ఆలోచనలు కేంద్రీకృతం కావడం, విశ్రాంతిగా ఉన్న భావనలూ, దృశ్యాలు కనబడడం, విషయాలు జ్ఞప్తికి రావడం, గాఢమైన నిద్ర, నిరాసక్తమైన భావనలూ ఇలా ఎన్నెన్నో మార్పులను అనుకున్నట్టుగా కలిగించే శబ్దాలున్నాయి.

స్టీరియో హెడ్‌ఫోన్లద్వారా ఒక్కొక్క చెవికీ వేరువేరు కంపనాలు కలిగిన శబ్దాలను వినిపించి నప్పుడు అవి రెండూ కలిసిపోయి మూడో రకమైన శబ్దం వినిపిస్తుందని పరిశోధనల్లో తేలింది. మెదడులోని రెండు భాగాలు తమకు వినిపిస్తున్న శబ్దాలను కలిపి మరొకరకంగా అన్వయించు కుంటాయి. అనుకంపనంవల్ల మెదడులోని కణాలన్నీ ఈ మూడోశబ్దానికి రెసొనేట్ అవుతాయి. వాటివల్ల రకరకాల ప్రక్రియలు మొదలై, ఊహల్లో వివిధ భావనలు కలిగిస్తాయి. మెదడులో రెటిక్యులర్ ఆక్టివేటింగ్ సిస్టమ్ అనే వ్యవస్థ ఒకటి ఉంటుంది. మెదడు కాండంలో ఇది ఒక వలలాగా పరుచుకుని ఉంటుంది. మన చైతన్యాన్నీ, జాగ్రదావస్థనూ, ఏకాగ్రతనూ నిర్ణయించేది ఇదే. శబ్దాలవంటి బాహ్య ప్రేరణలకు మనం స్పందించే పద్ధతీ, మన అవగాహనా, నమ్మకాలూ అన్నీ దీనిమీదనే ఆధారపడతాయి. శబ్దాలవల్ల మెదడు కణాల్లో కలిగే మార్పులన్నిటినీ ఈ వ్యవస్థ మామూలు మెదడు తరంగాల రూపంలోనే స్వీకరించి అన్వయించుకుంటుంది.

ఈ వ్యవస్థకు సంబంధించినంతవరకూ ప్రేరణలు ఎటువంటివైనా ఒకటే. సహజంగా మెదడులో కలిగే అనుభూతికీ, కృత్రిమంగా శబ్దాలూ, దృశ్యాల మూలంగా అందే ప్రేరణలకూగల తేడాలను ఈ వ్యవస్థ గుర్తించలేదు. ఈ వ్యవస్థవల్ల ప్రభావితం అయే థాలమస్ గ్రంథీ, మెదడుపైన ఉండే కార్టెక్స్ పొరా వగైరాలన్నీ మెదడులో కృత్రిమంగా ఉత్పత్తి అయిన భావాలను నిజమైనవిగానే గుర్తిస్తాయి. అందుకనే మతపరమైన అతీంద్రియ, అలౌకిక భావనలు పొందినవారికి అవి ఎంతో గాఢంగానూ, తీవ్రంగానూ, స్పష్టంగానూ అనిపిస్తాయి. ఆధునిక విజ్ఞానం ఇంతగా అభివృద్ధి అయిన ఈ రోజుల్లోనే అందరూ ఇలాంటి భ్రమలకు లోనవుతున్నారంటే ఆటవికదశలోని ప్రజలు ఎలా స్పందించి ఉంటారో ఊహించుకోవచ్చు.

కేవలం భౌతిక ప్రేరణలవల్ల ఇంతటి మార్పులు జరగగలవని చాలా మందికి తెలియదు. అందుచేత ఆలోచనలన్నీ స్వతంత్రంగా మన మనసులో ఉత్పన్నమౌతాయని అనుకునేవారికి ఇది ఆశ్చర్యకరంగా అనిపిస్తుంది. ఆదిమయుగంలో ఏ చీకటిగుహలోనో కళ్లు మూసుకుని కూర్చుని, తప్పెటల మోతలు వింటూ, మంత్రాలవంటి శబ్దాలను ఉచ్చరిస్తూ, వీటివల్ల కలిగే ప్రతిధ్వనులనుకూడా వింటూ ఊగుతున్న గణాచారి మెదడులో ఎన్నెన్ని విచిత్రభావనలు కలిగేవో మనం చెప్పలేం. 'ఓం' కారంలోనే సర్వమూ ఇమిడి ఉందని నమ్మబలికే ఆధునిక గణాచారులకూ ఆటవికులకూ ఏమైనా తేడా ఉందా? దొంగస్వాముల సంగతి ప్రస్తుతానికి వదిలేసినా యాంత్రికంగా మెదడుమీద పనిచేసే శబ్దాల ప్రభావాలను గుర్తించలేక "అలౌకికఆనందం" పొందుతున్నా మనుకునే అమాయకులను చూసి ఏమనాలి? మతపరమైన భావాలు ఉత్పన్నం కావడానికి శబ్దాలు అనేక కారణాల్లో ఒక అంశం మాత్రమే. దేవుడున్నాడని వాదించేవారికి సమాధానం చెప్పాలంటే దేవుడు లేదని వాదిస్తే సరిపోదు. వారికి ఆ అపోహ ఎప్పుడు, ఎందుకు, ఎలా కలిగిందో కూడా చెప్పాలి.

*(రచయిత అణుధార్మిక శాస్త్రవేత్త)* వీ

## జార్ఖండ్‌లో మావోయిస్టుల మృతి

జార్ఖండ్ రాష్ట్రం లతేహార్ జిల్లాలోని లుహూర్‌లో జనవరి 27న జరిగిన ఎన్‌కౌంటర్‌లో సబ్ జోనల్ కమాండర్‌తో సహా 9 మంది మావోయిస్టులు మరణించారు. జనవరి 27 తెల్లవారు జామున లుహూర్ అటవి ప్రాంతంలోని ఓ ఇంట్లో మావోయిస్టులు ఉన్నట్లు అందిన సమాచారంతో సిఆర్‌పిఎఫ్, జిల్లా పోలీసులు వారిని చుట్టుముట్టారని, పోలీసులను చూసిన నక్సల్స్ కాల్పులు ప్రారంభించడంతో, ఇరు వర్గాల మధ్య జరిగిన కాల్పుల్లో 9 మంది మావోయిస్టులు మృతిచెందారని, భద్రతా సిబ్బంది ఎవరు గాయపడలేదని లతేహార్ ఎస్పీ కుల్‌దీప్ ద్వివేది పిటిఐకి తెలిపారు.

## అవినీతిపై దండయాత్ర

అవినీతికి వ్యతిరేకంగా వేలాది మంది బయటకు వచ్చి అవినీతి నిర్మూలన ర్యాలీలో పాల్గొన్నారు. అందులో మాజీ ఐపిఎస్ అధికారిణి కిరణ్‌బేడి, సామాజిక కార్యకర్త స్వామి అగ్నివేష్, ప్రముఖ సంఘసేవకుడు అన్నాహజారే, న్యాయవాదులు ప్రశాంత భూషణ్, శాంతి భూషణ్ సహా వేలాది మంది బాపూజీ వర్ధంతి సందర్భంగా దేశ రాజధానిలో భారీ ర్యాలీ నిర్వహించారు. అవినీతి అరికట్టాలని, ప్రభుత్వ కార్యాలయాల్లో సామాన్యులపై అఘాయిత్యాలు ఎక్కువైపోయాయని బ్యానర్లు పట్టుకుని నినదించారు. లోక్‌పాల్ బిల్లుకు తగిన సవరణలు చేసి పార్లమెంట్ బడ్జెట్ సమావేశాల్లో ప్రవేశపెట్టాలని ఇండియా ఎగైనెస్ట్ కరప్షన్ అనే ఉద్యమంలో భాగంగా ఈ ర్యాలీ నిర్వహించారు.

## బినాయక్‌సేన్‌ను విడుదల చేయాలి

బినాయక్‌సేన్‌ను విడుదల చేయాలని దేశ వ్యాప్తంగా వివిధ హక్కుల సంఘాలు మేధావులు జనవరి 30న ధర్నాలు, ర్యాలీలు, సదస్సులు నిర్వహించారు. కోల్‌కతాలో నిర్వహించిన ప్రదర్శనలో సేన్ తల్లి 84 ఏళ్ల అనసూమా సేన్ పాల్గొన్నారు. సేన్‌ను విడుదల చేయాలని న్యూఢిల్లీలో పెద్దఎత్తున ర్యాలీ నిర్వహించారు. జైపూర్‌లో ప్రముఖ సామాజిక కార్యకర్త అరుణారాయ్ ఆధ్వర్యంలో 250 మందికి పైగా కార్యకర్తలు నిరసన తెలుపగా అరెస్ట్ చేశారు. ఇక్కడ జరిగిన సభలో రాయ్ మాట్లాడుతూ 'సేన్ అరెస్టు...ఫాసిస్టు నాజీ పాలనను తలపిస్తోంది. ఆ పాలనలో హక్కులు కాలరాయబడ్డాయి. భయాందోళనలో ప్రజలు జీవించారు' అని అన్నారు.

## మహా సెజ్ రద్దు

దేశంలోనే అతి పెద్ద సెజ్ పథకానికి మహారాష్ట్ర ప్రభుత్వం అడ్డుకట్ట వేసింది. ముంబాయి పరిసరాలలోని పది వేల ఎకరాలతో ముఖేష్ అంబానీ నిర్మించ తలపెట్టిన మహాసెజ్‌కు మహారాష్ట్ర ప్రభుత్వం భూసేకరణ ప్రక్రియను నిలిపివేసింది. నిర్ణయించిన నిర్ణీత సమయంలో భూసేకరణ జరగకపోవడంతో ఈ సెజ్ నోటిఫికేషన్‌ను రద్దు చేసినట్లు మహారాష్ట్ర ఆర్థిక మంత్రి బాల్‌సాహెబ్ తోరట్ తెలిపారు. మహారాష్ట్రలోని రాయ్‌గడ్ జిల్లాలోగల చుట్టు పక్కల తాలూకాలో ఈ మహాసెజ్‌ను నిర్మించ తలపెట్టారు. కాగా అక్కడి రైతుల నుంచి తీవ్ర ప్రతిఘటన ఎదురుకావడంతో ప్రభుత్వం భూసేకరణ ప్రక్రియను నిలిపివేస్తున్నట్లు ప్రకటించింది.

## మారిషస్ దీవుల్లో స్పెక్ట్రమ్ సొమ్ము

2జి స్పెక్ట్రమ్ కుంభకోణంలో దోచిన సొమ్మును మారిషస్ దీవుల్లో దాచినట్లు సిబిఐ దర్యాప్తులో వెల్లడయింది. టుజి స్పెక్ట్రమ్ లైసెన్సుల జారీలో అక్రమాలకు పాల్పడ్డారని సిబిఐ దర్యాప్తులో వెల్లడయింది. వెల్లడయిన వాస్తవాల ఆధారంగా టెలికాం మాజీ మంత్రి ఎ. రాజా, ఆ శాఖ మాజీ కార్యదర్శి సిద్ధార్థతోపాటు రాజా వ్యక్తిగత కార్యదర్శి చందోలియాలను ఫిబ్రవరి 1న అరెస్టు చేశాం అని సిబిఐ పేర్కొంది. మారిషస్, మడగాస్కర్‌లలో రాజా పేరిట 32 వేల కోట్ల పెట్టుబడులు ఉన్నాయంటూ సిబిఐ వర్గాలు పేర్కొన్నాయి.

## మోడీని తప్పుబట్టిన సిట్

గోద్రా ఘటన అనంతరం జరిగిన అల్లర్లపై గుజరాత్ సిఎం వ్యవహరించిన తీరును సిట్ తప్పుపట్టింది. గోద్రా ఘటనపై కోపాన్ని వెళ్లగక్కే అవకాశం హిందువులకు కల్పించాలని అధికారులకు ఆదేశాలు జారీ చేశారు. గోద్రా ఘటన అనంతరం మైనారిటీలపై తీవ్ర వివక్షను ప్రదర్శించారు. ముస్లింలపై దాడులను ప్రోత్సహించడమే కాకుండా.. 'ప్రతి ఒక్క చర్యకూ సమానమైన ప్రతిచర్య ఉంటుందంటూ అల్లర్లు మరింత పెంచడానికి మోడీ యత్నించాడని సిట్ పేర్కొంది. గుజరాత్‌లో మత కల్లోలాలు తీవ్రంగా ఉన్న సమయంలో పక్షపాతంతో వ్యవహరించారని, ఆ సమయంలో శాంతిభద్రతలపై రాష్ట్ర ప్రభుత్వం జరిపిన సమీక్షా సమావేశాలకు సంబంధించిన రికార్డులు, పత్రాలు వేటినీ ప్రభుత్వం భద్రపరచలేదని సిట్ వెల్లడించింది.

## గూర్ఖాలాండ్ ఉద్యమం

గూర్ఖాలాండ్‌ను ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పాటు చేయాలని సాగుతున్న ఉద్యమంపై ఫిబ్రవరి 8న పోలీసులు జరిపిన కాల్పుల్లో గూర్ఖాలాండ్ ఉద్యమకారులు ముగ్గురు ప్రాణాలు కోల్పోయారు. పోలీసు కాల్పులకు నిరసనగా గూర్ఖా జనముక్తి మోర్చా(జిజెఎం) ఇచ్చిన బందు పిలుపు మేరకు డార్జిలింగ్‌లో ఫిబ్రవరి 11న బంద్ పాటించారు. 1980లో గూర్ఖా లిబరేషన్ ఫ్రంట్ ఆధ్వర్యంలో ఘీషింగ్ నాయకత్వాన సాగిన ఉద్యమంలో 1200 మంది ప్రాణాలు కోల్పోయారు. ఆ ఉద్యమం ఫలితంగా గూర్ఖాలాండ్ స్వయంప్రతిపత్తి కౌన్సిల్ ఏర్పడింది. ఇప్పుడు జరుగుతున్న ఉద్యమం గూర్ఖాలాండ్ ప్రత్యేక రాష్ట్ర ఏర్పాటే ఏకైక లక్ష్యంగా, లొంగుబాటుకు తావులేకుండా నిర్వహిస్తామని జిజెఎం నాయకుడు బిమల్ గురుంగ్ తెలిపారు.

## ఒడిశాలో కలెక్టర్ కిడ్నాప్

ఒడిశాలోని మల్కన్‌గిరి జిల్లా కలెక్టర్ రావెళ్ల వినీల్ కృష్ణను మావోయిస్టులు ఫిబ్రవరి 16న కిడ్నాప్ చేశారు. కలెక్టర్‌తో బాటు ఇంజనీర్ పవిత్ర మాఝీని కూడా కిడ్నాప్ చేశారు. ఒడిశా ప్రభుత్వం ముందు 14 డిమాండ్లు పెట్టారు. ప్రొ. జి. హరగోపాల్, ప్రొ. ఆర్.ఎస్. రావు, దండపాణి మహంతీలను మధ్యవర్తులుగా పెట్టాలని మావోయిస్టులు డిమాండ్ చేశారు. ఒడిశా ప్రభుత్వం మధ్యవర్తుల సహకారంతో మావోయిస్టుల డిమాండ్‌లను ఒక కాలపరిమితిలో పరిష్కరించడానికి ఒప్పుకోవడంతో ముందుగా పవిత్ర మాఝీని ఫిబ్రవరి 23న, వినీల్ కృష్ణను ఫిబ్రవరి 24న విడుదల చేశారు. వీ

## నేపాల్ ప్రధానిగా ఝలనాథ్ ఖనల్

నేపాల్‌కు కొత్త ప్రధానిగా ఝలనాథ్ ఖనల్ ఫిబ్రవరి 3న ఎన్నికయ్యారు. మొత్తం 601 మంది సభ్యులున్న పార్లమెంట్‌లో 557 ఓట్లు పోలవ్వగా, కమ్యూనిస్టు పార్టీ ఆఫ్ నేపాల్ నేత ఖనల్‌కు 368 ఓట్లు వచ్చాయి. మావోయిస్టు పార్టీ నుండి మద్దతు లభించడంతో ఖనల్ ప్రధానిగా ఎన్నికయ్యారు. ఫిబ్రవరి 6న ప్రధానిగా ప్రమాణ స్వీకారం చేశారు. గత ఏడాది జూన్ 30న ప్రధాని పదవికి మాధవ్ కుమార్ నేపాల్ రాజీనామా చేయడంతో నేపాల్‌లో గత ఏడు నెలలుగా ఏర్పడ్డ, కొనసాగుతున్న అనిశ్చితికి తెరపడింది.

## గద్దె దిగిన ముబారక్

ఈజిప్ట్‌లో జనవరి 25న మొదలైన ప్రజాందోళన 18 రోజుల పాటు కొనసాగింది. మూడు దశాబ్దాల నియంత హోస్నీ ముబారక్ పాలన అంతమయింది. ఫిబ్రవరి 11న అధ్యక్ష పదవికి రాజీనామా చేసి పాలనాధికారాలను సైన్యానికి అప్పగించాడు. ముబారక్ దేశం వదిలి పారిపోయాడు. ఈజిప్ట్ రాజధానిలోని తెహ్రీర్ స్క్వేర్ ప్రజా ఆందోళనకు కేంద్రంగా నిలిచింది. ఫిబ్రవరి 1న పది లక్షల మందితో 'మిలియన్‌మమెన్ మార్చ్'తో ఈజిప్ట్ ప్రభుత్వానికి హెచ్చరిక చేసింది. ఈ ఆందోళనను అణచివేయడానికి సాయుధ బలగాలు జరిపిన దాడిలో మూడు వందల మందికి పైగా మరణించారు. ముబారక్ పాలన అంతమయినా ప్రజల ఆకాంక్షలు నెరవేరే వరకూ ఉద్యమం కొనసాగుతుందని ఈజిప్ట్ కమ్యూనిస్టు పార్టీ తెలిపింది.

## లిబియాలో ప్రజా ఉద్యమం

ఉత్తర ఆఫ్రికా దేశమైన లిబియాలో నాలుగు దశాబ్దాలుగా నిరంకుశ పాలన సాగిస్తున్న గఢాఫీకి వ్యతిరేకంగా ప్రజలు పెద్ద ఎత్తున ఉద్యమిస్తున్నారు. నిరసనలు తెలుపుతున్న ప్రజలపై గఢాఫీ సైన్యం, కిరాయి దళాలు తీవ్ర అణచివేత ప్రయోగిస్తున్నాయి. రాజధాని ట్రిపోలీతో సహ పశ్చిమ ప్రాంత నగరాలలో జరిపిన దమనకాండలో రెండు వేల మందికి పై మరణించినట్లు తెలుస్తోంది. గఢాఫీకి రోజురోజుకూ తన ఆంతరంగిక సైన్యం నుంచి మద్దతు తగ్గిపోతోంది. సైన్యం ప్రజల పక్షాన చేరడంతో గఢాఫీ పాలన ఇక అంతం అయినట్లే. మరోవైపు అధ్యక్ష పదవి నుంచి గఢాఫీ తక్షణమే దిగిపోవాలని ప్రపంచ దేశాల నుంచి తీవ్ర హెచ్చరికలు వస్తున్నాయి.

## అల్జీరియాలో ఆందోళనలు

గత రెండు దశాబ్దాలుగా మిలిటరీ పాలనలో మగ్గుతున్న ఆల్జీరియాలో ప్రజా వెల్లువలు ప్రారంభమయ్యాయి. టునీషియా, ఈజిప్ట్ ఉద్యమాల స్ఫూర్తితో ప్రజలు వేలాదిగా వీధుల్లోకి వచ్చి నిరసన ప్రదర్శనలు జరుపుతున్నారు. నిరుద్యోగం, పెరిగిన ధరలకు నిరసనగా ప్రజలు ఉద్యమిస్తున్నారు. ఈ ఆందోళనలో అన్నివర్గాల ప్రజలు పాల్గొంటున్నారు. విద్యార్థులు, కార్మికులు, మహిళలు ముఖ్య భూమిక పోషిస్తున్నారు. ఈ ఉద్యమాల ప్రభావంతో 19 ఏళ్లుగా కొనసాగుతున్న ఎమర్జెన్సీని ఎత్తివేస్తున్నట్లు అల్జీరియా అధ్యక్షుడు అబ్దెలజీజ్ బౌటెఫ్లీకా ప్రకటించాడు.

## యెమెన్‌లో ప్రజాందోళనలు

యెమెన్‌లో దేశాధ్యక్షుడు అలీ అబ్దుల్లా సలేహ్ గద్దె దిగాలని ప్రజలు చేపట్టిన ఉద్యమం క్రమంగా తీవ్రరూపం దాల్చుతోంది. అవినీతి, ఆశ్రిత పక్షపాతం, మానవ హక్కుల ఉల్లంఘనలతో సలేహ్ మూడు దశాబ్దాలుగా నిరంకుశ పాలన సాగిస్తున్నాడు. ప్రజలు ప్రజాస్వామ్య సంస్కరణలు జరిపాలనీ, అధ్యక్షుడు వెంటనే రాజీనామా చేయాలని డిమాండ్ చేస్తున్నారు. 2013లో తన పదవీ కాలం ముగుస్తుందనీ, అప్పుడే వైదులుగుతాననీ సలేహ్ ప్రకటించాడు. తన కుమారునికి అధికారాన్ని బదలాయించబోననీ చెప్పాడు.

## అట్టుడుకుతున్న బహ్రెయిన్

బహ్రెయిన్‌లో రాజకీయ సంస్కరణలు జరగాలని పౌరులు పోరాటానికి దిగారు. రాజధాని మనామాలో నిరసన ప్రదర్శనలపై పోలీసులు దాడికి దిగడంతో ప్రజలు కూడా తిరగబడ్డారు. ఈ ఘటనలో ఇద్దరు మృతి చెందారు. నలభై సీట్లతో ఉన్న పార్లమెంట్‌లో ఇస్లామిక్ నేషనల్ అకార్డ్ అసోసియేషన్‌కు చెందిన 18 మంది సభ్యులు పార్లమెంటరీ సభ్యత్వం రద్దు చేశారు. నిరసనలలో విద్యార్థులూ, యువకులూ, బురఖాలు ధరించిన మహిళలూ పెద్ద సంఖ్యలో పాల్గొంటున్నారు. రాజకీయ సంస్కరణలు జరగాలనీ, షియాలపై వేధింపులు ఆగిపోవాలనీ, మానవ హక్కులు కాపాడాలనీ, రాజకీయ భాగస్వామ్యానికి సంబంధించిన హక్కులు కావాలనీ ప్రజలు పోరాడుతున్నారు. బహ్రెయిన్ రాజు హమద్ బిన్ ఇసా అల్ ఖలీఫా ఈజిప్ట్ పరిణామాలతో బెదిరిపోయి ప్రజలందరికీ వెయ్యి దినార్లు సబ్సిడీగా ఇస్తామని ప్రకటించాడు. కానీ, ప్రజలు దీన్ని పట్టించుకోకుండా ఆందోళనలు కొనసాగిస్తున్నారు.

## గ్రీస్‌లో ఆందోళనలు

గ్రీస్ రాజధాని ఏథెన్స్‌లో ప్రభుత్వ పొదుపు చర్యలకు వ్యతిరేకంగా 23 ఫిబ్రవరిన ముప్ఫై వేల మందికి పైగా ప్రజలు నిరసన ప్రదర్శన చేశారు. ఈ ప్రదర్శనను అడ్డుకోవడానికి పోలీసులు ప్రయత్నించడంతో ప్రజలు ఘర్షణకు దిగారు. ఈ ఘర్షణలో పలువురికి గాయాలయ్యాయి. ప్రజలు శాంతియుతంగా పార్లమెంట్ వైపుకు ర్యాలీ చేపట్టారు. ఈ సమ్మెలో ఉపాధ్యాయులు, లాయర్లు, పన్ను వసూలుదార్లు, ప్రభుత్వ ఆస్పత్రుల డాక్టర్లు, అంబులెన్స్ డ్రైవర్లు, జర్నలిస్టులు, వేలాది మంది చిన్న వ్యాపారులు పాల్గొన్నారు.

## జోర్డాన్‌లో ప్రభుత్వం రద్దు

పెరుగుతున్న ధరలూ, నిరుద్యోగంతో విసుగు చెందిన ప్రజలు ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఆందోళనలు చేపట్టారు. 'తిండి–స్వేచ్ఛ' అన్న నినాదంతో ప్రజలు తిరుగుబాటు ప్రారంభించారు. జోర్డాన్ పాలనాధికారాలన్నీ రాజు వద్దనే ఉంటాయి. తొంభై ఏళ్లుగా హాషిమైట్ వంశీకులే జోర్డాన్‌ను పాలిస్తున్నారు. ప్రజల తిరుగుబాటు నేపథ్యంలో రాజు రెండవ అబ్దుల్లా వెంటనే సమీర్ రిఫాయ్ ప్రభుత్వాన్ని రద్దు చేశాడు. వీ

# అసహజ మరణాల సూచి

సంకలనం : **రాంకి, వై. రామచంద్రం**

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్ధాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషులకోసం ఇంకాస్త బాధ్యతగానూ, జాగ్రత్తగానూ వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(21 జనవరి 2011 నుండి 20 ఫిబ్రవరి 2011 వరకు 20 జిల్లాలలో అసహజ మరణాల పాలైన వారి సంఖ్య – 1426)**

| జిల్లా | ఆకలి | ఆత్మహత్యలు | | | | చికిత్స అందక, అనారోగ్యం | | | గుర్తు తెలియని | | హత్యలు | | ప్రమాదాలు | | | | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు | | | | | | | | | పనిచేసే స్థలంలో | కరెంట్ | రహదారి | ఇతరాలు | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| | | | | స్త్రీ | పు. | స్త్రీ | పు. | పి. | స్త్రీ | పు. | స్త్రీ | పు. | | | | | | | | | |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) | (11) | (12) | (13) | (14) | (15) | (16) | (17) | (18) | (19) | (20) | (21) | (22) |
| ఆదిలాబాద్ | 1 | 4 | – | 19 | 22 | 4 | 7 | 2 | 1 | 2 | 2 | 2 | 2 | 1 | 22 | 30 | – | – | – | 2 | 1 |
| హైదరాబాద్ | – | – | – | 13 | 13 | – | – | – | 1 | 8 | 6 | 7 | – | – | 28 | 14 | – | – | – | 4 | – |
| కరీంనగర్ | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | | | | |
| ఖమ్మం | 0 | 7 | 3 | 19 | 24 | 0 | 20 | 0 | 0 | 0 | 4 | 8 | 4 | 4 | 52 | 10 | 0 | 0 | 0 | 0 | |
| మెదక్ | 2 | 3 | – | 14 | 19 | 5 | 9 | – | 1 | 3 | 1 | 6 | – | 9 | 35 | 11 | – | – | – | – | – |
| మహబూబ్‌నగర్ | – | 8 | – | 24 | 25 | 1 | 4 | 2 | 1 | 2 | 12 | 13 | 10 | 12 | 48 | 21 | – | – | – | – | – |
| నల్గొండ | – | 7 | 3 | 24 | 18 | 1 | 5 | 1 | – | 6 | 2 | 8 | 4 | 2 | 55 | 18 | – | – | 1 | 4 | – |
| నిజామాబాద్ | – | 2 | – | 12 | 19 | – | – | – | 1 | 2 | 5 | 3 | 2 | 1 | 20 | 7 | – | – | – | – | – |
| రంగారెడ్డి | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | | | | |
| వరంగల్ | – | 5 | – | 9 | 8 | 12 | 9 | 7 | 2 | 2 | – | – | 2 | 16 | 20 | 5 | – | – | – | – | 3 |
| అనంతపూర్ | – | 12 | – | 7 | 8 | 2 | 4 | – | 1 | 4 | 3 | 7 | 5 | 4 | 34 | 6 | – | – | – | – | – |
| చిత్తూరు | – | – | – | 8 | 6 | – | 6 | 3 | 4 | 4 | 3 | 9 | 10 | – | 47 | – | – | – | – | – | – |
| కర్నూలు | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | | | | |
| గుంటూరు | – | 15 | – | 4 | 12 | 3 | 2 | – | 2 | 3 | 3 | 9 | – | 4 | 15 | 15 | – | – | – | – | – |
| నెల్లూరు | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | | | | |
| కడప | – | 10 | 1 | 7 | 5 | 3 | 1 | – | 1 | 3 | 3 | 4 | 3 | 4 | 25 | 8 | – | – | – | – | – |
| ప్రకాశం | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | | | | |
| శ్రీకాకుళం | – | 2 | – | 4 | 6 | 4 | 3 | 6 | 1 | 2 | 4 | 5 | 3 | – | 12 | 5 | – | – | – | – | – |
| విజయనగరం | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | | | | |
| తూర్పు గోదావరి | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | | | | |
| **మొత్తం** | **3** | **75** | **7** | **164** | **185** | **35** | **70** | **21** | **16** | **41** | **48** | **81** | **45** | **57** | **413** | **150** | **–** | **–** | **1** | **10** | **4** |

అందిస్తున్నవారు : ఆదిలాబాద్ – సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; హైదరాబాద్ – డి. విజయభాస్కర్; కరీంనగర్ – ఎల్. సంతోష్; ఖమ్మం – సి.ఎచ్. గిరిజ;
మెదక్ – ఎన్. భగవాన్‌రెడ్డి; మహబూబ్‌నగర్ – మహమ్మద్ ఎక్బాల్; నల్గొండ – గొడిశాల వెంకటేశ్వర్లు; నిజామాబాద్ – ఎం. నర్సయ్య; వరంగల్ – ఎ.కుమార్;
అనంతపూర్ – కె. నాగేశ్వరచారి; చిత్తూరు – పలమనేరు బాలాజి; కడప – దస్తగిరి; కర్నూలు – జి.వి. సుధాకర్ రెడ్డి; తూర్పు గోదావరి – మహమ్మద్ ఇబ్రహీమ్ సాహెబ్;
గుంటూరు – బి. అంజమ్మ ; నెల్లూరు – బాలగురువయ్య; శ్రీకాకుళం – జి. సుధీర్; ప్రకాశం – ఎల్. సాంబశివరావు, విజయనగరం – డి. సుధాకర్

వీక్షణంకు రాష్ట్రంలోనేకాదు, దేశమంతటా, విదేశాలలోనూ విస్తృతంగా పాఠకులున్నారు

మేధావులు, విద్యార్థులు, పరిశోధకులు, ఉపాధ్యాయులు,
పత్రికా రచయితలు, ఉద్యమాల కార్యకర్తలు, సామాజిక, రాజకీయ కార్యకర్తలు,
ప్రజా నాయకులు, విధానకర్తలు...
ఒకరేమిటి తెలుగు సమాజంలో ప్రభావశీల వ్యక్తులందరికీ
కరదీపిక వీక్షణం

## ప్రపంచానికి మీ మాట అందాలంటే
## వీక్షణంలో ప్రకటించక తప్పదు

### వీక్షణంలో మీ ప్రకటనలకై చెల్లించాల్సిన రుసుం

| | | | |
|---|---|---|---|
| చివరి కవర్ (కలర్‌లో పూర్తి పేజీ) | : | రు. | 25,000 |
| రెండవ కవర్ (కలర్‌లో పూర్తి పేజీ) | : | రు. | 20,000 |
| మూడవ కవర్ (కలర్‌లో పూర్తి పేజీ) | : | రు. | 20,000 |
| లోపలి పేజీ (బ్లాక్ అండ్ వైట్‌లో పూర్తి పేజీ) | : | రు. | 15,000 |
| లోపలి పేజీ (బ్లాక్ అండ్ వైట్‌లో అర పేజీ) | : | రు. | 8,000 |
| లోపలి పేజీ (బ్లాక్ అండ్ వైట్‌లో పావు పేజీ) | : | రు. | 4,000 |

'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు, డి.డి లు పంపాల్సిన చిరునామా

వీక్షణం

మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3 హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495,
ఇమెయిల్ : veekshanam2003@gmail.com, www.veekshanam.wordpress.com

**VEEKSHANAM** Telugu Monthly Journal of Political Economy and Society - 116 - March 2011
• RNI Regn.No.APTEL/2003/11482• Published on 28/02/2011 • Postal Regn. No. L II/RNP/HD/1100/2011-13

# వీక్షణం విస్తరించడానికి సహకరించండి!
# మీ మిత్రులందరికీ పరిచయం చేయండి!!
# మీ వంతుగా చందాలు చేర్పించండి!!

వీక్షణం రాజకీయార్థిక, సామాజిక మాసపత్రికకు ఎనిమిది సంవత్సరాలుగా మీరు అందిస్తున్న ఆదరాభిమానాలకు కృతజ్ఞతలు. మీ నిత్యజీవితంలో, కుటుంబ సభ్యులతో, పని స్థలంలో, స్నేహితులతో, భిన్నాభిప్రాయాలున్న వారితో మాట్లాడుతున్న ప్రతి సంధర్భంలోనూ వీక్షణంలోని వ్యాసాలు, అభిప్రాయాలు మీకు ఉపయోగపడతూనే ఉన్నాయి. ఈ పత్రిక నిలదొక్కుకుని పది కాలాలపాటు నిలబడాలని మీరు కోరుకుంటున్నారని మాకు తెలుసు. తెలుగు సమాజానికి అవసరమయిన విభిన్న ఆలోచనలను అందించే పత్రికగా వీక్షణం ఇంకా విస్తరించాలని కూడా మీరు కోరుకుంటూ ఉంటారు. కాని, వీక్షణం ఆర్థిక పరిస్థితి సుస్థిరంగా లేదు. వీక్షణంను నిలబెట్టడానికి మీరు తక్షణమే పూనుకుని చేయవలసిన పనులు కొన్ని ఉన్నాయి.

- మీ బంధుమిత్రుల దగ్గర, మీ పనిస్థలంలో, మీరు మాట్లాడే ప్రతిచోటా, సామాజిక రాజకీయ విషయాల చర్చ వచ్చిన ప్రతిచోట ఆ విషయాల మీద వీక్షణం అవగాహన కలిగిస్తుందని ప్రస్తావించండి. వీక్షణం చదవడం ఎంత అవసరమో చెప్పండి.
- మీ చందా చెల్లించడంతోపాటు, మీ మిత్రుల కొరకు కానుకగా చందా చెల్లించండి. వారిని చందా చెల్లించమని కోరండి.
- మీ గ్రామంలో, పట్టణంలో ఉన్న గ్రంథాలయానికి వీక్షణం వస్తుందో లేదో కనుక్కుని తెప్పించడానికి ప్రయత్నాలు చేయండి.
- మీ గ్రామంలో, పట్టణంలో ఉన్న విద్యాలయాలలో, కళాశాలలో, ముఖ్యమైన ప్రభుత్వ, ప్రభుత్వేతర కార్యాలయాలలో, స్వచ్ఛంద సంస్థల, యువజన సంస్థల కార్యాలయాలలో వీక్షణం వస్తుందో లేదో కనుక్కుని వారిచేత చందాలు కట్టించండి.
- మీ గ్రామంలో, పట్టణంలో ఉన్న వీక్షణం శ్రేయోభిలాషులు, విద్యా సంస్థల నిర్వాహకులు, వ్యాపారవేత్తల దగ్గర వీక్షణంకు ప్రకటనలు సేకరించండి.
- మీ గ్రామంలో, పట్టణంలో ఉన్న పత్రికల ఏజెంటు వీక్షణం తెప్పిస్తున్నారో లేదో కనుక్కుని తెప్పించేలా చూడండి.

## చందా వివరాలు

| | సంస్థలకు/లైబ్రరీలకు | వ్యక్తులకు | విద్యార్థులకు |
|---|---|---|---|
| విడి ప్రతి | రు. 15 | రు. 15 | రు. 15 |
| సంవత్సరం | రు. 180 | రు. 150 | రు. 120 |
| మూడు సంవత్సరాలు | రు. 500 | రు. 400 | రు. 350 |
| ఐదు సంవత్సరాలు | రు. 800 | రు. 650 | – |
| పది సంవత్సరాలు | రు. 1500 | రు. 1300 | – |

**వీక్షణం అకౌంట్ నెంబర్ – 013911011002175, ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్**

**'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు, డి.డి లు పంపాల్సిన చిరునామా**

**వీక్షణం**
మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3 హిమాయత్‌నగర్
హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495
ఇమెయిల్ : veekshanam2003@gmail.com, www.veekshanam.wordpress.com

Edited, printed, published and owned by N. Venugopal Rao, Printed at Deccan Press for Charitha Impressions, Azamabad, Hyderabad - 500 020 and Published at 3-6-394, Mythri Residency, Street No. 3, Himayatnagar, Hyderabad 500 029. Editor : N. Venugopal Rao